ప్రథమ ముద్రణ : 1976
ప్రతులు : 1,000

వెల : రూ. 40-00
ప్రకాశం శతజయంత్యుత్సవప్రతి రూ. 35-00

ప్రతులకు :

(1) కె. పద్మావతి,
18-1-699, భవానీ నగర్,
తిరుపతి.

(2) నవోదయ పబ్లిషర్స్,
ఏలూరు రోడ్డు,
విజయవాడ-2.

(3) విశాలాంధ్ర బుక్ హౌస్,
బజారు వీధి,
తిరుపతి.

(4) బంగోరె బుక్స్,
నెల్లూరు-4.

ముద్రణ :
ఫ్రీడమ్ ప్రెస్,
138-ఏ, టి. హెచ్. రోడ్డు,
మద్రాసు-600021.

కడపజిల్లా ప్రకాశం శతజయంత్యుత్సవ సమితి
ఋణసహాయంతో

ఈ నవ్యపరిశోధక ప్రచురణ



(1872-1957)

# క్రమం

# ముందుమాట

ఊర్ల పేర్లు వాడుకలో కేవలం గుర్తులు మాత్రమే కావచ్చు. పన్నుల వసూళ్లు, పంటల రాబడి గణింపు, జనాభాసేకరణ, విద్యా వైద్య సౌకర్యాలు, ఓటర్ల గుర్తింపు మొదలయిన వాటిలో ఊర్ల పేర్లు కేవలం పరిపాలనా ప్రమాణాలు (Administrative Units) కావచ్చు. కానీ ఒక చరిత్రకారుడో, పురాతత్వశాస్త్రవేత్తో భాషాతత్వజ్ఞుడో వాటిని తమశాస్త్ర దృక్పథాలనుండి పరిశీలించి వివరిస్తే, అవి ఒక సమాజం భాషను, నాగరికతను, సంస్కృతిని, వెల్లడించే అపూర్వ సాధనాలుగ గోచరిస్తాయి. అందుకే పూర్వచరిత్రను దాచుకొన్న శిలాజాలు (Fossils)గా శాస్త్రజ్ఞులు వాటిని పరిగణిస్తారు.

ఊర్ల పేర్ల పరిశీలన అనేది, స్థలనామ విజ్ఞానం (Topouymy) అనే కొత్తశాస్త్రానికి సంబంధించిన అంశం. ఈ పరిశీలన జిల్లాలవారిగా జరిగినపుడు ప్రధానంగా మూడు విధాలైన ప్రయోజనా లున్నాయి :

1. రెవెన్యూ గ్రామాలు, మజరాగ్రామాలు కలిపిన మొత్తం ఊర్ల పేర్ల సేకరణ జరుగుతుంది.

2. ఈ నాటి పేర్ల లేఖనాల (Spelling) ప్రామాణికతకు వుపకరిస్తుంది.

3. స్థానికచరిత్ర రచనకు సహాయపడుతుంది.

కడపజిల్లాలలోని మొత్తం ఊర్ల పేర్లను సమగ్రంగా సేకరించడం, వాటి లేఖనాలను ప్రామాణికం చేయడం, పరిపాలనా నిర్వాహణలో ఎంతో వుపయోగపడతాయి. వాటి భాషాసామాజిక పరిశీలన జిల్లా సమగ్ర చరిత్ర రచనకు దోహదకారి అవుతుంది. ఇటువంటిపరిశీలన సిద్ధాంతస్థాయిలో తెలుగులో యింతకు ముందు జరగలేదు. ప్రప్రథమంగా కడపజిల్లాతోనే మొదలవడం హర్షణీయం. ఇతరజిల్లాల స్థలనామాల సర్వేకూడ యీ పద్ధతిలో కొనసాగించవలసిన అవసరం

ఎంతయినా వుంది. ఎంతో ప్రాచీనత కలిగిన యీ జిల్లాల చరిత్రను ప్రామాణికంగా పునర్నిర్మించడం, సమగ్రాంధ్ర చరిత్ర రచనకు దోహదం అవుతుంది.

ఎన్నో వ్యయప్రయాసలకోర్చి కడపజిల్లాలోని వూర్ల పేర్లను వాటి శాసన రూపాలను సేకరించి, వాటిని నిశితంగా పరిశీలించి, సిద్ధాంత వ్యాసాన్ని రచించి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి డాక్టరేటు పట్టాన్ని పొందిన డా॥ కేతు విశ్వనాథరెడ్డి అభినందనీయుడు. అతడిదివరకే చక్కని కథానికా రచయితగా ఆంధ్రపాఠకులకు పరిచితుడు. ఇటువంటి వివిధ వైజ్ఞానిక రంగాలలో కృషిచేసి మన సామాజిక సాంస్కృతిక పరిశీలనకు, వికాసానికి దోహదం చేయవలసిన గొప్పకర్తవ్యం శ్రీ విశ్వనాథరెడ్డివంటి భాషా, సాహిత్యకారులమీద ఎంతైనావుంది.

కడపజిల్లా సామాజిక సాంస్కృతిక వికాసానికి తోడ్పడే రచనల ప్రచురణ, ప్రకాశం శతజయంత్యుత్సవ సమితి ఉద్దేశాలలో ఒకటి.

యీ వుద్దేశంతో వివిధ ఉపయుక్త గ్రంథాల ప్రచురణకు సమితి నిధులనుండి ఋణసహాయం చేసేపథకం రూపొందించబడింది. యీ పథకంనుండి యీ గ్రంథ ప్రచురణకు రు. 5000/–లను మొట్ట మొదటి సారిగా మంజూరు చేయడమైంది. ఈ పథకంక్రింద అప్పుడే రెండు పుస్తకాలు వెలువడినాయి. ఇది మూడవది. విశిష్టమైన యీ పరిశోధక గ్రంథాన్ని సహృదయ పాఠకులు ఆదరించి ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను.

కడప,
23–9–1976

పి. ఎల్. సంజీవరెడ్డి, ఐ.ఏ.ఎస్.,
జిల్లా కలెక్టరు, కడప.

# ప్రస్తావన

మన విశ్వవిద్యాలయాల్లో తెలుగుభాషా సాహిత్యాలను గురించి ఇటీవల పరిశోధనలు ముమ్మరంగా జరుగుతున్నాయి. వివిధ అంశాలమీద పరిశోధకులు సిద్ధాంత వ్యాసాలు సమర్పిస్తున్నారు. ఈ పరిశోధనలను సమీక్షించి నట్లయితే తెలుగులో సాహిత్యపరంగా జరుగుతున్న పరిశోధన ఎక్కువ, భాషా విషయక పరిశోధన తక్కువ అనిపిస్తుంది. ఇంతవరకు వచ్చిన సిద్ధాంతవ్యాసాల్లో నాలుగింట మూడు భాగాలకు మించినవి సాహిత్యపరమైనవే. అందులోనూ ప్రాచీన సాహిత్యానికే ప్రాధాన్యం ఎక్కువ. వాస్తవానికి తెలుగులో వెలసిన తొలి సిద్ధాంత వ్యాసం భాషా పరమైంది. అదే చిలుకూరి నారాయణ రావుగారి 'ఆంధ్రభాషా చరిత్రము' (ఆంధ్ర విశ్వవిద్యాలయం. 1937). కానీ భాషాశాస్త్రపరంగా యిట్లా ప్రారంభమైన తెలుగు పరిశోధన భాషా విషయక పరిశోధనలో వెనకబడడం కొంత విడ్డూరంగానే కన్పిస్తుంది.

తెలుగుభాషా రంగంలో జరగవలసిన పరిశోధన ఎంతోవుంది. పాశ్చాత్య దేశాల్లో జరుగుతున్న పరిశోధనలతో పోల్చిచూస్తే మనం ఇంకా శైశవాస్థలోనే ఉన్నాం. భాషా నిర్మాణం, చరిత్ర, అర్థతత్వం. తులనాత్మక సమీక్ష, మాండలికాల పరిశీలన మొదలైనవి కేవలం భాషా విజ్ఞానానికి సంబంధించిన అంశాలు. భాషా విజ్ఞానానికి చరిత్ర, పురాతత్త్వ శాస్త్రం, మానవశాస్త్రం, సాంఘికశాస్త్రం, మానసిక శాస్త్రం మొదలైన సామాజికశాస్త్రాలతో సన్నిహిత సంబంధం ఉన్నది. అట్టి సన్నిహిత సంబంధాన్ని అధికంగా కలిగినట్టి భాషా విజ్ఞాన విభాగం సంజ్ఞానామశాస్త్రం (**Onomastics**).

ఈ విజ్ఞానంలో ప్రధానంగా రెండు శాఖలున్నాయి. ఒకటి వ్యక్తినామ విజ్ఞానం (**Anthroponymy**); రెండవది స్థలనామ విజ్ఞానం

(Toponymy). ఈ రెండుశాఖలకు సంబంధించిన పరిశీలన కేవలం భాషాశాస్త్రజ్ఞులకే కాక ఇతర సామాజికశాస్త్రజ్ఞులకూ, సామాన్యులకూ కూడా ఆసక్తికరమైన విషయం.

పాశ్చాత్యదేశాల్లో వ్యక్తినామ, స్థలనామ పరిశీలనలు ప్రారంభమై ఒక శతాబ్దం కావస్తున్నది. ఈశతాబ్దకాలంలో ఆ పరిశీలన అతి శాస్త్రీయంగా రూపొందింపబడి విద్యారంగంలోనూ, విశ్వవిద్యాలయాల్లోనూ అధ్యయన విషయంగా గుర్తింపబడింది. సంజ్ఞానామాలకు సంబంధించిన ప్రత్యేక సంఘాలు కూడా పాశ్చాత్యదేశాల్లో ఏర్పడి తీవ్రంగా కృషిచేస్తున్నాయి. నామ విజ్ఞానసంబంధ ప్రచురణలూ, పత్రికలూ చాలా వస్తున్నాయి. వివిధ దేశాల్లో స్థలనామాల సర్వేలుకూడా జరుగుతున్నాయి. అంతర్జాతీయ స్థాయిలో నామ విజ్ఞానానికి సంబంధించిన ఒక ప్రత్యేకసంస్థ 1949 లో బెల్జియంలో స్థాపించబడింది. ఇట్టి ప్రాధాన్యాన్ని గడించుకొన్న నామవిజ్ఞానం మన దేశంలో ఇంకా గుర్తింపును రాకపోవడం శోచనీయం. అతిపురాతనమైన చరిత్ర, వివిధభాషా సంస్కృతుల సమ్మేళనం కలిగినట్టి భారత దేశం నామవిజ్ఞాన పరిశీలనకు ఒక 'స్వర్ణభూమి.'

భారతదేశంలో స్థలనామాలకు సంబంధించి ప్రోత్సాహక దృష్టితో తొలి కృషిచేసినవారు పాశ్చాత్యులు. దక్షిణ దేశంలో మెకంజీ, బ్రౌన్ ఫిల్, కాల్డ్వెల్, సి. పి. బ్రౌన్ మొదలైన పాశ్చాత్యులు స్థలనామాలకు సంబంధించిన వ్యాసాలను 19 శతాబ్దిలోనే ప్రచురించినారు. స్థలనామ పరిశీలనకు వారిచ్చిన ప్రోత్సాహాన్ని దేశీయులు ఇటీవలి వరకు స్వీకరించక పోవడంకూడా నింతాగానే కన్పిస్తుంది. స్థలనామాలన్నప్పుడు కేవలం ఊర్ల పేర్లేకాదు, నాడులూ, నదులూ, వాగులూ, కొండలూ, కోనలూ, అడవులూ మొదలైన భౌగోళిక రూపాలకు ఆయాభాషల్లో అనాదిగా ఉన్న పేర్లన్నీ కూడా స్థలనామ విజ్ఞానానికి ముడిపదార్థమవుతాయి. ఇట్టి స్థలనామాలు ఆంధ్ర దేశానికి సంబంధించి లక్షదాకా వుంటాయి. ఇక వీధులపేర్లను చేర్చుకున్నట్ల

యితే మరో లక్ష కావచ్చు. పరిశోధనాత్మక పరిశీలనకు ఇంతటి విస్తారమైన సామగ్రి ఉన్నప్పుడు పరిశోధక విద్యార్థులూ, పండితులూ స్థలనామ పరిశీలనకు పూనుకోక పోవడం పెద్ద కొరత. ఇది పరిశోధనాంశాలపట్ల మనకున్న అవగాహనలో ఒక లోపాన్ని చాటుతున్నది. ఇట్టి లోపాన్ని తెలుగులో కొంతవరకు తీర్చడానికి ప్రథమ ప్రయత్నం చేసిన పరిశోధకుడు విశ్వనాథరెడ్డి. కడపజిల్లా గ్రామ నామాలకు సంబంధించిన ఈ పరిశోధక గ్రంథంలో ప్రధానాంశాలు రెండు: ఒకటి కడపజిల్లా గ్రామనామాలను వివిధ దృక్కోణాల నుండి పరిశీలించడం; వివరించడం. రెండు గ్రామనామ పరిశీలనకు అనువైనటువంటి ఒక శాస్త్రీయచట్టాన్ని రూపొందించడం. విశ్వనాథరెడ్డి శాస్త్రీయంగా రూపొందించిన ఈ చట్టం ఒక్కొక్క జిల్లాకు సంబంధించిన గ్రామగ్రామ నామ పరిశీలనకు మార్గదర్శి కాగలదని నా విశ్వాసం. తెలుగుదేశం లోని అన్ని జిల్లాల గ్రామ నామాల సమగ్ర పరిశీలనకు ఈ ప్రచురణ దోహదకారి కాగలదని కూడా నా నమ్మకం.

తెలుగునాడు లోని స్థలనామాలను సమగ్రంగా సేకరించి పరిశీలించడం ఒకటి రెండేళ్లలో జరిగే పనికాదు. అనేకుల కృషితో దీర్ఘకాలంగా జరగవలసిన కార్యమిది. ఇట్టి కృషికి ప్రాతిపదికగా శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగుశాఖ రాయలసీమ జిల్లాల గ్రామ నామ పరిశీలనకు పరిమితంచేసుకొన్న ఒక ప్రణాళికను యు. జి. సి. సహాయంతో నిర్వహించడానికి ప్రయత్నిస్తున్నది. భారతీయ స్థలనామ సంఘస్థాపనకూ, ఒక ప్రత్యేక పత్రికా నిర్వహణకూ కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ ప్రయత్నాలు ఫలించి కార్యరూపాన్ని పొందినపుడు తెలుగు గ్రామనామాల పరిశోధన త్వరితగతిలో ముందుకు సాగగలదని ఆశించవచ్చు.

జి. ఎన్. రెడ్డి,
ఆంధ్రశాఖాధ్యక్షులు,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం.

తిరుపతి,
14-10-1976.

# భూమిక

భాషాశాస్త్ర సంబంధమైన విషయంపై పరిశోధన చేయాలని కుతూహల పడుతున్నప్పుడు గురువర్యులు ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు తెలుగు ఊర్ల పేర్లను గురించి పరిశోధిస్తే బావుంటుందన్నారు. పరిశోధనలో కొత్త పుంతలు చూపే మార్గదర్శకత్వం ఆయనది. ఊర్ల పేర్లు ఎక్కడ దొరుకుతాయో తెలీకుండానే, అవి ఏ రకమైన పరిశోధనా సామగ్రో అర్థం కాకుండానే, తెలుగు పరిశోధనా రంగంలో ఈ రకం కృషి అపూర్వం కాబట్టి, తెలుగులో ఒక కొత్త విషయంమీద పరిశోధన చేసే అవకాశం లభిస్తోంది కదా అనే ఉత్సాహంతోనూ, గురువుగారి ప్రేరణతోనూ గ్రామనామారణ్యంలో చొరబడినాను.

ఈ రంగంలో ఔత్సాహికంగా నా మొదటి ప్రవేశం 1966 లో. తెలుగు ఊర్ల పేర్లమీద 1945 ప్రాంతాల్లో శ్రీ ఎ. ఎస్. త్యాగరాజుగారేవో వ్యాసాలు రాసినారని ఆచార్య రెడ్డిగారు తిరుపతిలో వారి వద్దకు నన్ను తీసుకవెళ్లినారు. త్యాగరాజుగారు వెన్ను తట్టినారు. తమ వ్యాసాలతోపాటూ, ఇసాక్ టెయిలర్ 'Words and Places' అనే పుస్తకాన్ని యిచ్చి వుపయోగించుకోమన్నారు. (చూడండి. పు. 60) ఇదే రోజుల్లోనే తమిళంలో ఆర్. పి. సేతుపిళ్లై రాసిన వ్యాసాలున్నాయని, వాటిని ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు నాకు పంపినారు. ప్రముఖ పురాతత్త్వ శాస్త్రవేత్త హెచ్. డి. సంకాలియా "Studies in the Historical and cultural Geography and Ethnography of Gujarat (1949) అనే గ్రంథాన్ని పరిచయం చేసినారు. పూనానుంచీ ఆ గ్రంథాన్ని తెప్పించుకున్నాను. ఈ దశలోనే శ్రీమతి నాయని కృష్ణకుమారిగారి "తెలుగు ఊర్ల పేర్లు" అనే భారతిలో అచ్చయిన (1957) వ్యాసాన్ని కూడా చూడడం తటస్థించింది. తెలుగు ఊర్ల పేర్లమీద ఒకవ్యాసాన్ని రాసి ప్రచురిస్తేకానీ పరిశోధనా విద్యార్థిగా తీసుకోవడం బావుండదని ఆచార్య రెడ్డిగారు ప్రోత్సాహకాంక్ష పెడితే నాదగ్గరున్న కొద్దిపాటి సమాచారంతో, వివిధ ఆంగ్ల విజ్ఞాన సర్వస్వాల్లోని వ్యాసాలతోడ్పాటుతో, భాషా విజ్ఞాన గ్రంథాల్లో స్థాలీ పులాక న్యాయంగావున్న స్థలనామ ప్రస్తావనలతో, ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయంనుంచీ రెడ్డిగారు తెప్పించిన "Alphabetical List of villages in the Taluks and Districts of Madras Presidency" సాయంతో "తెలుగు ఊర్ల పేర్లయందలి అనుబంధ రూపములు-

ఒక నమూనా పరిశీలన" అనే ప్రోత్సాహిక వ్యాసాన్ని రాసి S. V. University Oriental Research Institute Journal వారికి యిచ్చినాను. వారు గ్రాంథికంలో ప్రచురించినారు. అప్పటికింకా చిలుకూరి నారాయణరావుగారి అనంతపురం జిల్లా గ్రామనామాలపై అపూర్వ మీమాంసను కూడా చూడలేదు. (వివరాలకు చూడు పు. 57-60)

నా ఉత్సాహాన్ని దారిలో మళ్ళించేందుకు 1963 లో Full time research scholar గా చేర్చుకోడానికీ, పర్యవేక్షణ చేయడానికీ ఆచార్య రెడ్డిగారు ఒప్పుకున్నారు. 1963-70 మధ్యకాలానికి నెలకు రు. 250/- యు. జి. సి. స్కాలర్ షిప్‌ను శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం మంజూరు చేసింది. ఆ స్కాలర్ షిప్‌ను జీతం నష్టంమీద తీసుకోవడానికి ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖవారు ఒప్పుకొని రెండేళ్లు సెలవు మంజూరు చేసినారు. 1963 నవంబర్ 15, తెలుగు శాఖలో పరిశోధక విద్యార్థి గా చేరినాను. చేరినాకగానీ ఈ పరిశోధనలోని సమస్యలు అర్థంకాలేదు. ఈ విషయం లోతు అవగతం కాలేదు. ఊళ్లపేళ్లు పరిశోధనాంశమేమిటి అనే చిన్న చూపు చూసేవాళ్లమధ్య ఈ విషయంమీద వచ్చిన గ్రంథాలనూ, వ్యాసాలనూ దొరికిన మేరకు తిరగవేసినాను.

ఎస్. కర్ల్ ఉత్తర్ ప్రదేశ్‌లోని షహ్రాన్‌పూరు స్థలనామాలమీద పరిశోధన చేసినాడని, అతని సిద్ధాంత వ్యాసం ఆగ్రా విశ్వవిద్యాలయంలో వుందని డా. జాస్తి సూర్యనారాయణగారు తెలిపితే దాన్ని తెప్పించుకొని చూసినాను.

ఊర్లపేర్ల పరిశోధనలో మూడు ప్రధాన సమస్యలున్నాయని తెలిసింది. నానారకాల ప్రభుత్వ రికార్డులూ, జిల్లా గెజిటీర్లూ, మాన్యువల్లూ, సర్వేమ్యాపుల నుంచీ వూర్లపేర్లను సేకరించడం ఒక సమస్య అనీ, శాసనాలూ, మెకంజీ కైఫీయతులవంటి చారిత్రక పత్రాలలోని ఈనాటి ఊర్లపేర్ల చారిత్రక రూపాలను సేకరించడం, గుర్తించడం, ఎడిట్ చేయడం, పరిశోధనకు సామగ్రిని సిద్ధంచేయడం (వివరాలకు చూడండి పు. 15) రెండో సమస్య అనీ, ఊర్లపేర్ల వివరణకు సంబంధించిన రచనా ప్రణాళికను(Methodology)రూపొందించుకోవడం మూడవ సమస్య అనీ తెలిసింది.

మొదట రాయలసీమ జిల్లాలలోని ఊర్లపేర్లన్నిటిని సేకరించి పరిశీలిస్తే బావుంటుందని అనుకున్నాము. నమూనాకు కడపజిల్లాని ఆయా తాలూకా కేంద్రాలు చెడతిరిగి, కలెక్టరు కార్యాలయం ప్రదక్షిణచేసి వివిధ రికార్డులనుండీ రెవెన్యూ

గ్రామాల లిస్టులు సంపాదించి, వాటికి మజరా గ్రామాలుకూడా వున్నాయని తెలుసుకొని వాటి సేకరణకు దిగేవేళకు ఒక జిల్లాలోని ఊర్ల పేర్లను నిర్దుష్టంగా, సమగ్రంగా సేకరించడమే బ్రహ్మప్రళయమని తెలిసింది. కడపజిల్లాకు పరిమితం చేసుకోమని ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు ఈ దశలో సలహా యిచ్చినారు.

కడప జిల్లా ఊర్లపేర్ల సేకరణ యజ్ఞంలో ఎదురయిన సమస్యలు వొకటి రెండూ కావు (వివరాలకు చూడండి పు. 12-14. గ్రామనామ సేకరణ: కొన్ని సమస్యలు). దురదృష్టం కొద్ది బ్రిటిష్ పరిపాలనా పద్ధతులే యింకా కొనసాగుతూ వుండడంవల్ల సర్వవ్యవహారాలకూ ప్రమాణం రెవెన్యూ గ్రామమే. ఒక రెవెన్యూ గ్రామం నేడు నిర్మానుష్యమైనా (బేచరాకు); 50 లోపు జనాభా మాత్రమే కలిగి వున్నా, వాటికింద వుండే మజరా గ్రామాలకంటే సర్వవిధాలా చిన్నవైనా, పరిపాలనా వ్యవస్థలో రెవెన్యూ గ్రామాలకు ప్రతిపత్తి వుంది; మజరా గ్రామాలకు అస్తిత్వం లేదు. నిజానికి గణాంక వివరాల దృష్ట్యా ప్రతి వూరూ ముఖ్యమైందని గుర్తించినపుడే, నైసర్గిక స్థితిగతులూ, పౌర వ్యవహారాలూ, విద్యావైద్య సాంస్కృతిక విశేషాలూ, వ్యాపార వాణిజ్య పారిశ్రామిక బేంకింగ్ సౌకర్యాలూ, మతకుల వృత్తి విభజనకు సంబంధించిన జనాభా వివరాలూ, అభివృద్ధి కార్యక్రమాలూ - వీటి విషయంలో ప్రతి వూరును పరిగణనలోనికి తీసుకోవలసిన అవసరం గుర్తించినపుడే, వూర్లపేర్లను వేటినీ వదలకుండా ప్రాంతీయ భాషలో ప్రాంతీయోచ్చారణకు అనుగుణంగా రాసి, ఇంగ్లీషులో లేఖన చిహ్నాలతో గుర్తించి ఊర్లపేర్ల పట్టికలు ప్రతి జిల్లాకూ తయారుచేసి నప్పుడే, వూర్లపేర్లకు పరిపాలనలోనూ, పరిశోధనలోనూ ఒక గౌరవం ఏర్పడుతుంది. ఒక జిల్లాలోని రెవెన్యూ గ్రామాలనూ, వాటి కింద వుండే మజరా గ్రామాలనూ నిర్దుష్టంగా, సమగ్రంగా సేకరించి ప్రచురించడం పరిపాలనా నిర్వహణకూ, ప్రతి గ్రామాభివృద్ధి పర్యవేక్షణకూ, గ్రామ సామాజిక ఆర్థిక పరమైన సర్వేలకూ (Village Socio - Economic Surveys) ఎంత సహాయమో చెప్పలేము. వుదాహరణకు షెడ్యూల్డు కులాలూ, తెగలూ నివసించే మాలవాడలూ, మాదిగపల్లెలూ, కురవపల్లెలూ, ఎరికెలబిడాలూ, సుగాలీ పల్లెలూ ఏ ఏ రెవిన్యూ గ్రామాలకింద ఎన్నెన్ని వున్నాయో, ఒక్కొక్క తాలూకాలో ఎన్నెన్ని వున్నాయో, మొత్తం జిల్లాలో ఎన్నెన్ని వున్నాయో, అవి ఏవేవో, స్పష్టంగా వాటికి చెందిన అధికారికమైన రికార్డు వున్నప్పుడే వాటి అభివృద్ధి పర్యవేక్షణ సులభతరమవుతుంది. వాటిసామాజికార్థికపరమైన సర్వేలు నిర్దుష్టంగా, సమగ్రంగా జరుగుతాయి. ప్రభుత్వ విధానాల అమలు సమర్థవంతంగా ఊరూరా జరుగుతుంది.

ఈ విధమైన దృష్టి వూర్ల పేర్ల పట్ల యింతవరకు లేకపోవడం వల్లనే వాటి సేకరణ నేడు భగీరథ ప్రయత్నంగా తయారయింది.

వూర్ల పేర్ల సేకరణ ఒక ఎత్తయితే వాటి ఎడిటింగ్ మరొక ఎత్తు. అది జరిగాక రచనా ప్రణాళిక రూపొందించుకోవడం మరొక ఎత్తు. కడప వూర్ల పేర్ల సేకరణకు రెండేళ్లు పడితే, ఎడిటింగ్‌కు ఏడాది పట్టింది. రచనా ప్రణాళిక రూపొందించుకోవడానికీ, గ్రంథరచన చేయడానికీ మరో మూడేళ్లు పట్టింది. 1974 సెప్టెంబరుకు గానీ గ్రంథరచన పూర్తి కాలేదు. **English Place Name Society (London) American Name Society (Potsdam. U.S.A); International Onomastic Institute (Leuven, Belgium)** లతోనూ పాశ్చాత్య స్థలనామవేత్తలతోనూ వుత్తర ప్రత్యుత్తరాలు జరిపిన తర్వాత గానీ, వారి నుంచీ స్థలనామ పరిశోధనా పద్ధతులు తెలుసుకొన్న తర్వాతగానీ, పూనా దక్కన్ కళాశాల గ్రంథాలయం, మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయం, కెనెమరా గ్రంథాలయం, మైసూరు ఎపిగ్రఫీ డిపార్ట్‌మెంట్ – వీటిలో ఈ పరిశోధనకు సంబంధించిన వివరాలూ, గ్రంథాలూ, పత్రికలూ గాలించిన తర్వాతగానీ ఈ నాటి వూర్ల పేర్లకు శాసనాల్లో వుండే వూర్ల పేర్లేవో సేకరించిన తర్వాత గానీ, వూర్ల పేర్ల విజ్ఞాన సర్వస్వాలైన వేలాది పుటల మెకంజీ కైఫీయతుల్లోని వూర్ల పేర్ల పుట్టు పూర్వోత్తరాలనూ, స్థలపురాణాలనూ పట్టుకొన్న తర్వాత గానీ, ప్రొ. కేల్కర్, డా. బూదరాజు రాధాకృష్ణ, డా. చేకూరి రామారావు; ప్రొ. దోణప్ప వంటి భాషా విజ్ఞానులతో సముఖంలో చర్చించడానికి ఆచార్య జి. ఎన్. రెడ్డి గారు అవకాశాలు కల్పించిన తర్వాతగానీ, అన్నిటికి మించి అడుగడుగునా సేకరించిన విషయాన్ని పరిశోధనలో శాస్త్రీయంగా వుపయోగించు కోవడంలో పరమచోదకశక్తిగా ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు నిల్చిన తర్వాతగానీ ఒక రచనా ప్రణాళిక రూపొందించు కోవడం జరగలేదు; ఈ విషయం మీద ఒక స్థూలమైన శాస్త్రీయావగాహన ఏర్పరచుకోవడం సాధ్యం కాలేదు.

అప్పటికి తెలిసి వచ్చింది – ఏ పేర్లయినా ఆకాశం నుంచీ హఠాత్తుగా వూడి పడ్డవి కావనీ, మనుష్యుల పేర్లయినా, ఇంటిపేర్లయినా, స్థలాల పేర్లయినా, వూర్ల పేర్లయినా, వేల వందల సంవత్సరాల వివిధ సామాజిక స్థితిగతులకూ, అవసరాలకూ అనుగుణంగా యేర్పడినవనీ, ఒక భాష మాట్లాడే ప్రాంతంలోని భౌగోళిక నైసర్గిక పరిస్థితులనూ, ప్రజల మానసిక ప్రవృత్తులనూ, భాషా వ్యవస్థనూ, నాగరికతనూ, సాంఘిక రాజకీయ చరిత్రలనూ, సంస్కృతినీ పేర్లు ప్రతిబింబిస్తాయనీ, వాటి శబ్దార్థ పరిశీలనం ఒక శాస్త్రమనీ.

తెలుగు నిఘంటు రచనా ప్రణాళికలో ఊర్ల పేర్ల విలువను గుర్తించడం వల్లనే కీ. శే. వేదం వేంకటరాయశాస్త్రి వంటి సాహిత్యవేత్త కూడా "గ్రామనామములను వివరించినవాడే సర్వజ్ఞుడు" అని అన్నారు (ఆంధ్రభాషా సర్వస్వ నియమ కతిపయములు, 1948, పు. 2) సర్వజ్ఞుడయినా కాకపోయినా భాషా విజ్ఞానం భూగోళ విజ్ఞానం, పురాతత్వ విజ్ఞానం, జానపదవిజ్ఞానం, చరిత్ర వంటి వివిధ సామాజిక శాస్త్రాలలో అంతో ఇంతో పరిచయం వున్నవాడు తప్ప వూర్ల పేర్లను వివరించలేడు.

పాశ్చాత్య దేశాల్లో వూర్ల పేర్ల సేకరణ వివరణే కాదు, మొత్తం పేర్ల సేకరణా, వివరణా బహుముఖంగా సాగుతున్నాయి. నామవ్యాకరణాలూ; నామ వ్యుత్పత్తి నిఘంటువులూ వెలువడుతున్నాయి. ప్రాచీన చరిత్ర పునర్నిర్మాణం జరుగుతోంది. అయితే ఇంతవరకు ఏ భారతీయ భాషల్లో కూడా నామవ్యాకరణాలు కానీ, వ్యుత్పత్తి నిఘంటువులు కానీ వెలువడలేదు.

భారతదేశంలో ఇంతవరకు ప్రత్యేకంగా స్థలనామాలపై వచ్చిన సిద్ధాంత వ్యాసాలు రెండు మూడుకు మించిలేవు. శబ్దపరిశీలనకూ అర్థ పరిశీలనకూ సమ ప్రాధాన్యం ఇచ్చి, సామాజిక సాంస్కృతిక పరిశీలనకు సముచిత ప్రాధాన్యాన్ని యిచ్చిన సిద్ధాంతవ్యాసాలు కావు అవి. వ్యాకరణ భాగానికీ, వ్యుత్పత్తి నిఘంటు భాగానికీ సమన్వయ పథకం రూపొందించినవి కావు అవి. విశిష్టమూ, ప్రాచీనమూ అయిన మన చరిత్రను ప్రతిబింబించే వూర్ల పేర్ల పరిశోధనలో, వూర్ల పేర్ల నిష్పత్తీ, వ్యుత్పత్తీ ప్రధానమైనవి. అందుకే ప్రథమ ప్రయత్నంగా ఇటువంటి రచనా ప్రణాళిక రూపొందించబడింది. భారతీయ భాషల్లోనే ఈ ప్రణాళిక సమగ్రం కాకపోయినా, అపూర్వమైందనుకుంటాను.

## గ్రంథరచనా ప్రణాళిక :

ఈ గ్రంథంలో రెండు భాగాలున్నాయి. మొదటిభాగం కడప జిల్లా ఊర్ల పేర్లకు సంబంధించిన వర్ణనాత్మక వ్యాకరణం. రెండవభాగం వ్యుత్పత్తి పరిశీలనాత్మకమైన ఊర్ల పేర్ల నిఘంటువు.

## మొదటిభాగం: కడపజిల్లా గ్రామనామవర్ణనాత్మక వ్యాకరణం.

ఈ భాగంలో 9 అధ్యాయాలున్నాయి. మొదటి మూడు అధ్యాయాలైన 1. గ్రామనామ పరిశీలన – పరిమితీ ప్రయోజనాలు, 2. సంజ్ఞానామతత్వ సమస్య –

వర్గీకరణ, 3. స్థలనామ పరిశోధనా ప్రయోజనం - వికాసం, ఈ పరిశోధనకు పూర్వ రంగంగా ప్రతిపాదింపబడినాయి. డా. చేకూరి రామారావు వంటి వారు సంజ్ఞానామతత్వ సమస్య పరామర్శ చాదస్తమన్నా, ఆ విషయం మీద కూడా పరిశోధనావకాశాలున్నాయని తెల్పడానికీ, సంజ్ఞానామాల్లో పూర్ల పేర్ల ప్రసక్తిని నిరూపించడానికీ ఆ అధ్యాయం వ్రాయడం జరిగింది. తర్వాతి నాల్గు అధ్యాయాలూ కడప ఊర్ల పేర్ల వివరణాత్మక వ్యాకరణానికి సంబంధించినవి. అవి: 4. వర్ణ సమామ్నాయ పరిశీలన 5. సంధి పరిశీలన 6. రూప నిర్మాణపరిశీలన 7. వాక్య నిర్మాణపరిశీలన 8. అర్థ పరిశీలన. 9 వ అధ్యాయంలో కడప ఊర్ల పేర్లను బట్టి తెలియవచ్చిన భాషేతర విశేషాలు - నైసర్గిక, సాంస్కృతిక, చారిత్రక విశేషాలు - స్థూలంగా చర్చింపబడినాయి. ఒక ప్రత్యేక గ్రంథంగానే వ్రాయదగిన అధ్యాయం ఇది.

## రెండవభాగం: కడప జిల్లా గ్రామనామ నిఘంటువు - వ్యుత్పత్తి పరిశీలనాత్మకం.

ఆంగ్లభాషలో స్థలనామ నిఘంటువులు రెండు మూడు వెలసినాయి. కాని యింత వరకు ఏ భారతీయ భాషల్లోనూ స్థలనామ నిఘంటువులు కాని, గ్రామనామ నిఘంటువులు కాని వెలువడ లేదు.

ఈ నిఘంటు నిర్మాణంలో ఆరోపాల నిర్ణయం ఒక ఎత్తైతే, వాటి వ్యుత్పత్తి వివరణ మరొక ఎత్తు. వ్యుత్పత్తి సహిత గ్రామనామ నిఘంటు నిర్మాణానికి భారతీయ భాషల్లోనే ఇది ప్రథమ ప్రయత్నం. ఆంగ్లభాషా స్థలనామ నిఘంటువులోని ఆధునిక కోశ నిర్మాణ సూత్రాలను సాధ్యమైనంత వరకు గ్రహించి, కడప వూర్ల పేర్ల వరకే పరిమితమైన ఈ నిఘంటువులో వాటిని సమన్వయించడం జరిగింది. ఇటువంటి సమన్వయంతో రూపొందించబడిన ఈ నిఘంటు నిర్మాణ పద్ధతి కొంత వరకు అపూర్వం కాబట్టి, ఇక ముందు తెలుగులో కానీ, ఇతర భారతీయ భాషల్లో కానీ కూర్పబడే గ్రామనామ నిఘంటువులకు లేదా స్థలనామ నిఘంటువులకు ఇది సహాయకారి కావచ్చు.

కడప ఊర్ల పేర్ల వ్యుత్పత్తి నిర్ణయంలో ప్రధానంగా ఈ క్రింది సూత్రాలను పాటించడమైంది.

1. వ్యుత్పత్తి నిరూపణలో నేటి పేర్లకు లభ్యమైన శాసనస్థ, గ్రంథస్థ రూపాలను కాలక్రమానుగతంగా సేకరించడం (ముఖ్యంగా 1790 ప్రాంతాలకు చెందిన

మెకంజీ కైఫీయతుల్లో పేజీలకు పేజీలున్న వూర్ల పేర్ల పుట్టుపూర్వోత్తరాలను, స్థలపురాణాలను సంక్షిప్తంగా ఇవ్వడం జరిగింది.)

2. వ్యుత్పత్తి నిర్ణయానికి చారిత్రక రూపాల ప్రాధాన్యం యెంతయినా వుంది. కానీ వాటిలో లేఖక ప్రమాదాలు, కృతక ప్రామాణికాలు, కురూపాలూ, లోకనిరుక్తికి అనువైన శాబ్దిక వ్యభిచారమూ వుండవచ్చు.

(అ) లేఖక ప్రమాదానికి ఉదా: చూ. ఆగో. అగుదూరు శా. రూ. అచుడూరు. 1544 AR 1945-46, B 111.

(ఆ) కృతక ప్రామాణికానికి ఉదా: ఇబ్రహీంపురం F. F. విభరాంపురం.

(ఇ) కురూపానికి ఉదా: మా. ఆగో. కొమంతరాజపురం.

(ఈ) లోక నిరుక్తికి ఉదా: మా. ఆగో. అత్తిరాల: మెకం. హత్యరాల. ఈ విధమైన ప్రభావాలకు లోనైన వూర్ల పేర్ల వ్యుత్పత్తి నిర్ణయంలో చారిత్రక రూపాలను బహు జాగ్రత్తగా గ్రహించవలసి వుంటుంది.

3. చారిత్రక రూపాల ప్రమేయం లేకుండానే కేవలం ఈనాటి వాడుకలోవున్న వూర్ల పేర్ల రూపాలనుబట్టి వ్యుత్పత్తి నిర్ణయం చేయవచ్చు. కడప, కమలాపురం, రాజంపేట; కృష్ణాపురంవంటి ఊర్ల పేర్ల వ్యుత్పత్తి నిర్ణయం కష్టమేమీకాదు. కానీ - అపి; - ఊరు; ఓలు; కొమెర్ల; - దెన; మడక; - మెల; - మళ్ళ; - యం; - రాల వంటి ద్వితీయావయవాలతోవున్న పొత్తపి; చిలంకూరు; తక్కోలు; చిన్నకొమెర్ల; అలిదెన; ఇడమడక; అనిమెల; కలమళ్ళ; పెద్ద ముడియం; అత్తిరాల వంటి ఊర్ల పేర్లకు అర్థం చెప్పాలంటే నాటి ఒకప్పటి వాడుక రూపాలు అంటే చారిత్రక రూపాలు తప్పనిసరిగా అవసరమవుతాయి. అయితే ప్రాచీన శాసన సంపదను పరిరక్షించుకోలేని మనం; దొరికిన శాసన సంపదను ఇంకా ప్రచురించలేని మనం అన్ని గ్రామాలకూ చారిత్రక రూపాలను సంపాదించలేము. ఈ నిఘంటువులోని 3403 ఊర్లలో 752 ఊర్లకుమాత్రమే చారిత్రక రూపాలు లభించినాయి. కడపజిల్లాలోని వందలాది శాసనాలూ ప్రచురితమైతే మరికొన్ని చారిత్రక రూపాలు లభించవచ్చు.

4. అయితే చారిత్రక రూపాలున్నా కొన్నిచోట్ల వాటి వ్యుత్పత్తి నిర్ణయం సులభంకాదు. అటువంటి సందర్భాల్లో వ్యుత్పత్తి నిర్ణయానికి సగోత్ర రూపాల (Cognate forms) తులనాత్మక పరిశీలనయే శాస్త్రీయం. ఈ

గ్రంథంలో సగోత్ర రూపాలను దాదాపు అన్ని వూర్ల పేర్ల పదాల వివరణకూ ఇవ్వడమైంది. ముఖ్యంగా సగోత్ర రూపాల అవసరాన్ని అనిమెల, పొడదుర్తి; హనుమనగుత్తి వంటి వూర్ల పేర్ల వ్యుత్పత్తి నిరూపణలో చూడవచ్చు.

5. వ్యుత్పత్తి నిర్ణయంలో ఆయా వూర్లకు సంబంధించిన నైసర్గిక పరిజ్ఞానంకూడా అవసరమవుతుంది. సర్వే మ్యాపులవల్ల ఒక వూరి భౌగోళిక పరిసరాలు తెలుస్తాయి. ఒక వూరు ఏటిగట్టున వుందో, కొండపక్కన వుందో, అడవిమధ్య వుందో మొదలైన పరిసరాల వివరాలు వూర్ల పేర్ల పుట్టుకను నిరూపించేందుకు తోడ్పడతాయి. ఉదాహరణకు వెలుదుర్తి; పొడదుర్తి; పోట్లదుర్తి; హనుమనగుత్తి గ్రామాల్లోని తుర్తి అనే మాటకు కొండవాగు అని అర్థం. ఈ వూర్లన్నీ నదిగట్టునే వుండడం అర్థ నిర్ణయానికి సాయపడుతుంది. కోడూరులోని కోడు అనే పదానికి కొండకొన, ఊరిదరి నీటిపల్లమూ అనే అర్థాలున్నాయి. సరైన అర్థం నిరూపించడానికి అవి వున్న నైసర్గిక పరిసరాలు పరిశీలించడమే. కోడూరు అనే పేరుగల ఊర్లన్నీ వాగులపక్క వూర్లే. (చూడండి ఖ). 246• ఆరో. 945 నుండి 948.)

6. నిఘంటువులో అస్పష్ట నామబంధాలుగా పేర్కొనబడిన దాదాపు 90 వూర్ల పేర్ల వ్యుత్పత్తులను ఊహించడం సాహసమే కానీ, శాస్త్రీయంకాదు కాబట్టి అటువంటివాటిని వివరించలేదు. ముఖ్యంగా – ఆల; – ఏల; – ఊట్ల ద్వితీయావయవంగా కలిగిన మల్లేల, దుద్యాల; కల్వటాల; పైడేల, కల్లుట్ల వంటి వూర్ల పేర్లకు చారిత్రక రూపాలు తగినన్ని లభించకపోవడమే, సగోత్ర రూపాలు మృగ్యం కావడమే వాటిని అస్పష్టంగా పేర్కొనడానికి కారణాలు.

## నిఘంటు నిర్మాణ విధానం :

1. ఇది కడప జిల్లాలోని 3403 గ్రామాలకు అకారాది నిఘంటువు. గ్రామ నామాలు ప్రధానారోపాలు. అవి సంఖ్యాక్రమ పూర్వకాలు.

2. గ్రామనామ ద్వితీయావయవాలైన – అగ్రహారం; అబాదు; –ఊరు; –పల్లె మొదలైనవాటిని ప్రధానారోపాలనుంచి ప్రత్యేకించి నిఘంటువులో అనుబంధ భాగంగా అకారాది క్రమంలో 1 నుండి 89 వరకు సంఖ్యాక్రమ పూర్వకంగా కూర్చడమైంది.

3. ప్రధానారోపమైన గ్రామనామానికి పరంలో సంక్షిప్త సంకేతంలో తాలూకా పేరు; దాని పక్కన జనాభాశాఖ (census department) వారి తాలూకా పటాల్లో (Taluk maps) గుర్తించబడ్డ గ్రామ సంఖ్యా సంకేతం (Village code number).

వరుస సంఖ్య ఊరిపేరు సంఖ్యాసంకేతం.
ఉదా : 67. అనంతరాజుపేట రాజం. 134

తాలూకాపటాల్లో సంఖ్యాసంకేతాలు ప్రధానగ్రామాల (Main Villages/ Revenue Villages) కేగాని, మజరా గ్రామాలకు లేవు. ఒక ప్రధాన గ్రామానికి చెందిన మజరా గ్రామాల (Hamlets) ను ఆ ప్రధాన గ్రామ సంఖ్యా సంకేతానికి పైభాగంలో + గుర్తుతో ఈ నిఘంటువులో సూచించడమైంది.

వరుససంఖ్య ఊరిపేరు మజరాసంఖ్యాసంకేతం
ఉదా: 294. ఎగువపల్లె రాజం.134+ (అనంతరాజపేట కింది మజరాగ్రామం
1659. తూర్పుపల్లె రాజం. 134+ ...

4. గ్రామసంఖ్యా సంకేతం తర్వాత నిలువుగీత కుండలీకరణాల్లో (Square brackets) ప్రధానారోపానికి సంబంధించిన లభించిన శాసన రూపాలు లేదా మెకంజీ కైఫీయతులు (మెకం.) మొదలైన వాటిలోని గ్రంథస్థ రూపాలు ఇవ్వడమైంది. శాసన రూపాల పక్కన సంఖ్యలు, శాసనకాలాన్ని (క్రీ.శ.లో) శాసనాకర (Source of the inscription) పరంగా శాసనకాలం, శాసన సంపుటి, శాసనసంఖ్య, శాసనంలోని వాక్యసంఖ్యల వివరాలను తెలియజేస్తాయి. మెకం. పక్కనున్న సంఖ్యలు మెకంజీ సంపుటాలకు చెందిన స్థానిక చరిత్ర నెంబరును (Local Record number) పుట సంఖ్యలను సూచిస్తాయి.

ఉదా: అత్తిరాల రాజం. 42 అత్తిరేవుల 971 EXVIII-12-70-3, అరతు రేవుల 1279 SII.X. 448—31......... అరతురేవుల మెకం. 1134_169.

5. పై వివరణ తర్వాత ప్రధానారోపానికి ఏవైనా పర్యాయనామాలు / నామాంతరాలు (పర్యా. / నామా.), కృతకవ్యుత్పత్తి / లోకనిరుక్తి (Folk-etymology) రూపాలు ఉంటే వాటిని కూడా ఇవ్వడమైంది.

6. ప్రధానారోపం యొక్క కారక నిర్మాణ వర్గీకరణను సూచించే ఈ కింది మూడు సంక్షిప్త సంకేతాల్లో ఏదో ఒకటి తర్వాత ఉంటుంది. సంబ. నామ బం; స్థలా. నామబం; వి. బం.

7. ప్రధానారోపమైన గ్రామం అర్థదృష్ట్యా ఏ విభజనకు చెందుతుందో – వృక్ష సూచి; జంతుసూచి;వ్యక్తినామసూచి మొదలైనవి తెలిపే మాట (**Semantic category**) కారక నిర్మాణ వర్గీకరణ తర్వాత ఉంటుంది.

నిఘంటు భాగంలో సామాన్యనామ సూచకంగా పేర్కొన్న గ్రామనామా లను అనుబంధ భాగంలో ఆయా ద్వితీయావయనాల కింద అర్థదృష్ట్యా వర్గీకరించి వాటి ఆవృత్తి కూడా తెల్పడమైంది.

8. పై వివరాలను అనుసరించి ప్రధానారోపం యొక్క అవయవవిభజన, వ్యుత్పత్తి వివరణ ఉంటాయి.

9. గ్రామనామ చరిత్ర, లోకనిరుక్తి, ఇతర సాంస్కృతిక విశేషాలు ఏవైనా ఉంటే వాటిని చివర వివరించడమైంది.

10. ఈ నిఘంటువుకు అనుబంధంగా ఉన్న గ్రామనామ ద్వితీయావయవాలలో ఆరోపానికి పరంలో అర్థదృష్ట్యా చేసిన వర్గీకరణ, వ్యుత్పత్తి వివరాలు, శాసనరూపాలు (శా.రూ) ఉంటే కాలక్రమంలో వాటి ఏర్పాటు, ఆ అనుబంధం ఆరోపాల ఆవృత్తి (**frequency**), వాటి వర్గీకరణ, మొద లైన వివరాలు ఉదాహరణంగా ఉంటాయి. ఈ పరిశోధనా గ్రంథ ప్రణా ళికకు, రచనకు సంబంధించి చివరగా ఒక్కమాట!

ఈ గ్రంథం అచ్చులో వుండగా ఆప్తుడూ, ప్రాచీన పత్రాల పురాతత్త్వ వేత్తా 'బంగోరె', బ్రాన్‌ఫిల్ (**R. B. Branfill**) వ్యాసం మాకాపీ యిస్తూ **On the Name of Places in Tanjore** అనే 1879 లో **Madras journal of Literature and Science** లో అచ్చయిన యాభై పుటల వ్యాసం **Xerox** ప్రతిని తెచ్చి యిచ్చినారు. స్థలనామ పరిశోధనపై ఇంతవరకు ప్రమురితమైన వుపయుక్త గ్రంథాలనూ, వ్యాసాలనూ దాదాపు క్షుణ్ణంగా పరిశీలించినాననుకుంటున్న నేను (చూ. **Bibliography on onomastics**) ఆ వ్యాసాన్ని బంగోరె ఆవిష్కరిం చేంతవరకు చూల్లేదు. బహుశా చూచివుంటే ఈ గ్రంథ రచనకు ఆరేళ్లు పట్టివుండేది కాదు; 9 వ అధ్యాయాన్ని – మరింత విపులంగా, లోతుగా రాయడం జరిగి

వుండేది. తంజావూరు జిల్లాలో 1877-78 మధ్యకాలంలో "Madras coast Series of the Great Trignometrical Survery of India" లో పాల్గొంటూ, జిల్లాలోని స్థలనామాలను ప్రాంతీయ భాషోచ్చారణా విధేయంగా ఇంగ్లీషులో లేఖన చిహ్నాలతో రాసుకొని, కావేరీతీర స్థలనామాల ద్వారా వెల్లడయ్యే నీటి పారుదల; వ్యవసాయం; భౌగోళిక స్థితిగతులూ; పర్వత ప్రాంతాలూ, తటాకాలూ లేని స్థితి; బ్రాహ్మణ కులాధిక్యతా, నాగపూజ, వృక్షపూజ, రాజకీయ చరిత్రా, వృక్ష జంతుసంపదా మొదలైన సాంస్కృతిక విశేషాలను వివరించడమే కాకుండా వాటి వ్యుత్పత్తి పరిశీలన జాగ్రత్తగా చేస్తూ వ్యాసం రాయడం నిజానికి ఆ రోజుల్లో అపూర్వమైన విషయం. ఆ వ్యాస ప్రభావమే తర్వాతి పరిశోధకులపై బలీయంగా పడివుంటే దాక్షిణాత్య భాషల్లో స్థలనామ పరిశోధన లేదా వూర్ల పేర్ల పరిశోధన యింతటి బాల్యావస్థలో వుండివుండేదికాదు. మనవాళ్లు ఇటీవల ప్రచురించిన తాలూకా సర్వేపటాల్లో ఇంగ్లీషులోవున్న వూర్ల పేర్లు తప్పుల తడకలతో వుండివుండేవికావు. నిర్దుష్టమైన సమగ్ర స్థలనామ సేకరణకూడా జరిగివుండేదేమో!

పేర్ల సేకరణలో లేఖన ప్రామాణికతనుగూర్చి; వాటి అర్థ వివరణనూ గూర్చి బ్రాన్‌ఫీల్ అభిప్రాయాలూ ఈనాటికీ ఎంత ఆలోచనాత్మకంగా, ఆచరణీయంగా వున్నాయో ఊర్ల పేర్లను వాడే పరిపాలనా సిబ్బంది, పరిశోధక మేధావులూ గమనించాలి:

"My prime object was to find out by personal inquiry on the spot the correct vernacular form of all the names of places that I must submit to the Surveyor General for publication on the charts and records of the work. The list comprises, therefore, the names of all the survey stations, the topographical features of the ground mentioned in describing them, the surrounding villages, and the divisions of the district to which they belong. A few other names of interest met with are also included. The remarks and etymologies here offered must be regarded as crude suggestions by the way, and not as having any pretensions to scholarship or independent research. They are simply a desultory collection made by a travelling official in a certain locality, during a busy tour of a few months".

"The English seem peculiarly unhappy in their rendering of Indian proper names. Most of them would perhaps admit so much, but yet be quite averse to learn and adopt any system of

transliteration or orthography by which alone the stigma may be removed. The earlier sheets of the engraved map of the country—the Indian Atlas—are covered with irregularities of orthography and mistaken, many of them misleading and often extremely ludicrous. Some of them are due to the ignorance of the engraver in London and the bad writing of the manuscript, but had there been any uniform or acknowledged system of orthography, the copyist might have detected the errors or idiosyncrasies of the writer instead of perpetuating them, especially if he had possessed lists for reference, such as is here offered, only properly completed and corrected. The Government has now determined to adopt a system, and if it will adhere to it and carry it out consistently in all official publications and departments, the coming generation will fail into the way of it insensibly and with greater ease (?) than the present and past generations have enjoyed in acquiring the unsystematic practice hitherto current, so that we may now hope that the literature of the future will be free from the blunders and irregularities that now disgrace that of the past and so puzzle the new-comer and the foreigner. An attempt has been made in this paper to carry out the approved system of transliteration, but the first gazette of the Madras Government on the subject (date 2‹th August 1878) was so lamentably defective that its application to Tamil names was very uncertain, and even the amended publication in a new and revised gazette leaves much to be desired".

"Besides obtaining the correct form of each name and so helping to improve our maps, I thought that such a list as this might prove of some use to the gazetteer (compiler) and historical writer, and of interest to the traveller, the ethnological inquirer, the ordinary reader and writer, and most of all to the mapmaker; also to any one else curious in such matters, as throwing light on the history and circumstances of the inhabitants on the physical features of the country they dwell in, the language they speak, and the race they belong to".

"All proper names were, or were originally derived from, words or sounds having a meaning; but process of time and the long continued wear and tear of familiar use have rubbed off the corners that were rough to the tongue, and have run together the

liquid parts that most easily coalesced. With the original form the meaning has also been lost, and it is generally very difficult, often impossible, to discover them. Still local circumstances and traditions occasionally point to the true etymology whence the original form may be approximately reconstructed or fairly guessed at ; but there is a very general impression that the tradition itself has been often invented to account for the name. It is not, therefore, to be supposed that the names here given and their etymology are correct ; but they may be accepted as the current local usage and traditional explanation as given by the village elders questioned on the subject. Their answers were sometimes contradictory ; some declaring the name had no root meaning whatever, nor even had any, but was simply the proper name which they and their forefathers had uses from the very beginning ; whilst others were as quick in giving a ready-made derivation or explanation of which several were frequently forthcoming for the same name. A few only here and there offered a reasonable origin, explaning the gradual corruptions and contradictions that the name in question had undergone, and appealling to the authority of existing or well-known facts, or to history that could be consulted for confirmation. These were perhaps the modern instances upon which also further light was to be had from the Sanskrit name of the village temple or name of the local deity, to whom its chief shrine was dedicated, as told in the Sthalapurana or local history."

"The evidence of persons from adjacent villages was often taken, and the name itself was taken down in the vernacular (Tamil) on the spot in the handwriting of a resident who could write, usually the headman (Maniyakaran), the Chief Village Officer (Munsif), or the Village Accountant (Kanakkapillai)".

"I have prefaced the list of place-names with a few general remarks upon the results I have arrived at, and have appended a classified tabular statement of the characteristic adjuncts of the proper names. This is followed by some notes on the onomatology of the South Tanjore country beyond the Kaveri delta, gathered from the lists that were made during my absence from India in 1876-77, and though I did not visit that part of the country myself, I have reason to believe they may be relied on as correct so far as they go".

**"Finally I have added a classified list of the common appellative adjuncts to the proper names of places usually met with in the Tamil country, with their signification so far as I have been able to learn it." (Branfill, 1879, P. 43-45)."**

## ఈ రంగంలో ముమ్ముందు జరగవలసిన కృషి :

పాశ్చాత్యదేశాల్లో మనుష్యుల పేర్ల మీదా, ఇంటి పేర్ల మీదా, స్థలాల పేర్ల మీదా; వూర్ల పేర్ల మీదా; అన్నిరకాల పేర్ల మీదా గణనీయమైన పరిశోధన సాగుతోంది. (వివరాలకు చూడండి పు. 39-46). వారి కృషితో పోలిస్తే మన పరిశోధనలు ఒక ఆరంభం మాత్రమే.

ఒక ఉపఖండపు పరిమాణం కలిగి, సంకీర్ణమూ, వైవిధ్య సంపన్నమూ అయిన వివిధ భాషావర్ణకుల వ్యవస్థలకు నిలయమైన భారతదేశపు స్థలనామాలు అత్యంత ప్రాచీన చరిత్రను, సంస్కృతిని వెల్లడిస్తాయి.

ద్రావిడ భాషలకు చెందిన తెలుగు వూర్ల పేర్లను సంపూర్ణంగా జిల్లాలవారీగా సేకరించి చారిత్రక సాంస్కృతిక దృక్పథంనుండి, సామాజిక భాషా దృక్పథం నుండీ; వ్యుత్పత్తి దృక్పథంనుండి వివరిస్తే; వూర్ల పేర్లలోని ప్రథమ ద్వితీయావయవాల వ్యాప్తి, ఆ వృత్తులను పరిశీలిస్తే, ప్రజల వలసలకూ, జాతుల పరస్పర సంపర్కానికీ, సాంఘిక రాజకీయ మత కుల వ్యవస్థాది స్థితిగతులకూ సంబంధించిన అపూర్వాంశాలెన్నో తెలుస్తాయి. ఒకేరకం పేర్లు వివిధ ప్రాంతాల్లో ఎందుకు ప్రవర్తిల్లినాయో అందుకు కారణాలు తెలుస్తాయి. - అపి; - ఆల; - ఊరు; - పాడు; ముడిపి; - సాల వంటి గ్రామనామానామ ద్వితీయావయవాలున్న వూర్ల పేర్లను ఒక జిల్లాలోని వాటిని మాత్రమే ఆధారంగా తీసుకొని వివరించడం సాధ్యంకాకుండా పోతోంది కాబట్టి, ఇతర జిల్లాలలోని అటువంటి వూర్ల పేర్లూ, వాటి చారిత్రక రూపాల సాయంతో వివరించడం సాధ్యంకావచ్చు. ఊర్ల పేర్లు ఏ విధంగా కాలానుగుణంగా రూపొందనాయో, వాటి వికాసక్రమాన్ని, తద్వారా తెలిసే నాగరికతా వికాసక్రమాన్ని వివరించవచ్చు. - ఊరు వంటి ఒక్కొక్క ద్వితీయావయవంమీద ఏర్పడిన వూర్ల పేర్ల పరిశీలన చేయవచ్చు. సంపూర్ణ స్థలనామాల సర్వ వున్ముఖంగా ఇలాంటి పరిశోధనలు జరిగినపుడు మన ప్రాచీనచరిత్ర పునర్నిర్మాణం సాధ్యమవుతుంది.

## పాఠకులకు క్షమాపణ :

ఈ గ్రంథంవల్ల మామూలు పాఠకునికి తాను వాడే వూర్ల పేర్ల గొప్పదనం తెలియకపోవచ్చు - విషయాన్ని మరీ సాంకేతికంగా వివరించడం జరిగింది కాబట్టి.

ఊహా తెలియగల పాఠకులు నిఘంటువులో నేనిచ్చిన కొన్ని వ్యుత్పత్తులతో అంగీక
రించకపోవచ్చు. ప్రథమ ప్రయత్నం కాబట్టి సేకరణలో, వివరణలో కొన్ని లోపాలు
దొర్లివుండవచ్చు. అచ్చు కావడానికి దాదాపు సంవత్సరం పడుతుందని ముందే తెలిసి
వుంటే గ్రంథాన్ని Revise చేసివుండేవాన్ని. ఏమైనా మామూలు పాఠకులకుకూడా
వూర్ల పేర్లను గురించి పాపులర్‌గా తెలిపే గ్రంథాల రాకకు ఈ గ్రంథం తోడ్పడు
తుందనే విశ్వాసంతో, తెలుగువాడికి తెలుగుపేర్ల విలువ తెల్పే పరిశోధక గ్రంథాల
రచనకు ఈ గ్రంథం వూపు యిస్తుందనే విశ్వాసంతో మీ ముందుంచుతున్నాను.

ఇలాంటి గ్రంథాలను తప్పులేకుండా ముద్రించే స్థితికి మన ముద్రణాలయాలు
యింకా సాంకేతికంగా ఎదగలేదు. తప్పొప్పుల పట్టికలో సైతం తప్పుల్ని చేర్చగల
పరిస్థితులు ప్రెస్సుల్లో వున్నాయి. ఈ గ్రంథం ముద్రారాక్షసాలకు అపవాదం కాదు.
అందునా రచయిత ఒకచోట, ప్రెస్సు మరొకచోట దూరంలో వున్నపుడు అప
వాదం అసలేకాదు.

## కృతజ్ఞతాంజలి :

1959-61 మధ్యకాలంలో ఎం. ఏ. విద్యార్థిగావున్న రోజులనుండీ ఈనాటి
వరకూ విద్యా విషయాల్లో మార్గదర్శకులుగా; వైయక్తిక జీవితంలో ఆత్మబంధువుగా
వుంటూ; ఈ గ్రంథాన్ని పలికించడమే కాకుండా ప్రస్తావన కూర్చి ఈ గ్రంథా
నికీ, విషయానికీ ఎనలేని విలువను సంతరింప చేసిన గురువర్యులు, ఆత్మీయులు ఆచార్య
జి. ఎన్. రెడ్డిగారి ఋణం మాటలతో తీరేదికాదు. వారికి నా కృతజ్ఞతాసుమాంజలి.

పరిపాలనలో వూర్ల పేర్ల ప్రాధాన్యాన్ని గుర్తించి; కడపజిల్లా సామాజిక
సాంస్కృతిక వికాసానికి ఉడతాభక్తిగా తోడ్పడే యీ రచన ప్రచు
రణకు నోచుకావాలని; గ్రంథ ప్రచురణకు ప్రకాశం శతజయంత్యుత్సవ సమితి
నుండి రు. 5000/- ఋణం మంజూరుచేసి ముందు మాటను అభిమానంతో వ్రాసి
యిచ్చిన సాహితీ ప్రియులూ; సుమనస్కులూ; వినూత్న పథకనిర్మాణ దక్షులూ కడప
జిల్లా కలెక్టరు శ్రీ పి. ఎల్. సంజీవరెడ్డిగారికి నా కృతజ్ఞతా పూర్వక ధన్య
వాదాలు. వారి సాయమే లేకపోతే పెద్ద పెట్టుబడి అవసరమైన ఈ గ్రంథ
ముద్రణ జరిగి వుండేది కాదు.

పరిశోధనా పద్ధతులు తెలీక చీకట్లో కొట్టుమిట్టాడుతున్న రోజుల్లో
పాశ్చాత్య స్థలనామ పరిశోధనకు సంబంధించిన వ్యాసాలనూ, కొన్ని పుస్తకాలనూ
పంపి, వుత్తరాల ద్వారా ఎన్నో నూతన పరిశోధనాంశాలను అందించిన ఈ క్రింది
పాశ్చాత్య స్థలనామ వేత్తలను ఈ సందర్భంలో స్మరించకుండా వుండలేను.

1. Kelsie B. Harder, Executive Secretary, American Name Society, Potsdam, U.S.A.
2. Prof. Francis Lee Utley, English Department, Ohio State University, U.S.A.
3. Prof. G. R. Stewart, California University, U.S.A.
4. Prof. H. Draye, Secretary General, International Centre of Onomastics, Louvain (Belgium).
5. Dr. K. I. Sandred, English Department, University of Uppsala, Sweden.
6. Prof. Dr. J. Mcn. Dodgson, Hon. Secretary, English Place Name Society, London.

ఈ గ్రంథరచనా సందర్భంలో చక్కటి సూచనలిచ్చి, ఈ గ్రంథ ముఖ పత్ర కల్పన చేసిన స్నిగ్ధమిత్రులు శ్రీ పి. సి. నరసింహారెడ్డి గారికి నా కృతజ్ఞతలు. అలాగే అమూల్యమైన సూచనలిచ్చిన డా. బూదరాజు రాధాకృష్ణగారికీ, ఊర్లపేర్ల Indexing లో సాయపడిన డా. నిర్మల, కె. శ్రీనివాసులుశెట్టి, జవాద్ హుస్సేన్ లకు నా ధన్యవాదాలు. ఊర్లపేర్ల సేకరణలో తోడ్పడిన ఆయా అధికారులకూ, మిత్రులకూ నా వందనాలు.

ఈ గ్రంథ ముద్రణ జరిగి తీరాలని భావించి తోడ్పడిన మిత్రుడూ, శ్రీరామా ఫిలాసఫీ కడప కళాశాల తెలుగు ఉపన్యాసకుడు ఎం. లచ్చప్పకూ; కడప మునిసిపల్ కమీషనర్ శ్రీ రమణారెడ్డిగారికీ, శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారికీ, తదితర కడప ఆత్మీయులకూ; ఈ గ్రంథముద్రణా భూభారాన్ని దిగ్గజాల్లాగా భరించిన ప్రియ మిత్రులు డా. నాగయ్య; 'బంగోరె'లకూ; ఋణ సహాయకులకూ నా ధన్యవాదాలు.

కడపజిల్లా పటాన్ని శ్రమకోర్చి తయారుచేయించిన ప్రొ. బాలక్రిష్ణారెడ్డి (జాగ్రఫీశాఖ, ఎస్. వి. యూనివర్సిటీ) గారికీ, పటాన్ని రూపొందించిన వారి శాఖ లోని డ్రాఫ్ట్స్‌మన్, కార్టోగ్రాఫర్ శ్రీ ఎస్. శ్రీనివాసులుకు నా కృతజ్ఞతలు.

'ఆంధ్రకేసరి' టంగుటూరి ప్రకాశం పంతులు బ్లాకును దయతో ఇచ్చిన ఎమెస్కో అధిపతి శ్రీ ఎం. ఎన్. రావుగారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

ఎన్నో ప్రయాసలకోర్చి దాదాపు 10 మాసాలలో గ్రంథాన్ని ఈ రూపంలో ముద్రించి తోడ్పడిన ఫ్రీడమ్ ప్రెస్ అధినేత శ్రీ బాలసుందరంగారికీ, వారి సిబ్బందికీ నా నమస్సులు. సాధ్యమైనంతవరకు సమర్థవంతంగా ప్రూఫులు దిద్ది సాయపడిన శ్రీ ఎన్. చెంగల్రాయన్ (మద్రాసు) గారికి నా ధన్యవాదాలు.

## సంక్షిప్తరూపాలు : ఇంగ్లీషు
## (ABBREVIATIONS: ENGLISH)

| | |
|---|---|
| ABORI | Annals of the Bhandarkar Oriental Research Institute. |
| ALV | Alphabetical List of Villages (in the taluks and districts of the Madras Presidency). |
| ACR | Annals of Oriental Research Institute (Madras, University of Madras). |
| APDGC | Andhra Pradesh District Gazetteers, Cuddapah. |
| APGRES | Andhra Pradesh Government Epigraphical Series. |
| AR(IE/SIE) | Annual Report (on Indian Epigraphy/South Indian Epigraphy). |
| BDCRI | Bullettin of the Deccan College Research Institute (Poona). |
| BGM | Bombay Geographical Magazine (Bombay). |
| BRRI | Bulletin of the Ramavarma Research Institute. |
| BSOAS | Bulletin of the School of Oriental and African Studies. |
| CALR | The Ceylon Antiquary and Literary Register. |
| CDIAL | A comparative Dictionary of the Indo-Aryan Languages. |
| CGDSIL | A Comparative Grammar of the Dravidian or South Indian Languages. |
| CHJ | The Ceylon Historical Journal. |
| CPDL | Collected Papers on Dravidian Linguistics. |
| CTSI | Castes and Tribes of South India. |
| DBIA | Dravidian Borrowings from Indo-Aryan. |
| DED | Dravidian Etymological Dictionary. |

| | |
|---|---|
| **DEDS** | Dravidian Etymological Dictionary-Supplement. |
| **EI** | Epigraphica Indica. |
| **FF** | Fairs and Festivals. |
| **GRI** | Geographical Review of India. (Calcutta) |
| **GT** | Geography Teacher. |
| **HGA** | Historical Grammar of Apabhramsa |
| **HGOK** | A Historical Grammar of Old Kannada. |
| **IA** | Indian Antiquery. |
| **ICJ** | Indian Geographical Journal. (Madras) |
| **IG** | Imperial Gazetteer |
| **IHQ** | Indian Historical Quarterly. |
| **IL** | Indian Linguistics (Poona). |
| **JAHRS** | Journal of Andhra Historical Research Society. |
| **JASB** | Journal of Asiatic Society of Bengal (Calcutta). |
| **JAOS** | Journal of the American Oriental Society. |
| **JDL** | Journal of the Department of Letters (Calcutta). |
| **JDT** | Journal of the Dept. of Tamil, Kerala University, (Trivandrum). |
| **JMGA** | Journal of Madras Geographical Association (Madras, 1926-40). |
| **JMS** | Journal of Mythic Society (Bangalore). |
| **JOU** | Journal of Osmania University. |
| **JRAS** | Journal of the Royal Asiatic Society (Ceylon Branch) |
| **JSVORI** | Journal of the Venkateswara Oriental Research Institute. |
| **JUB** | Journal of the University of Baroda. |
| **JUPHS** | The Journal of Uttara Pradesh Historical Society. |

| | |
|---|---|
| **Lg.** | Language. Journal of the Linguistic Society of America. |
| **Lingua** | Lingua. |
| **MAMP** | Manual of the Administration of the Madras Presidency. |
| **MDGC** | Madras District Gazetteers, Cuddapah |
| **MI** | Man in India (Ranchi). |
| **MJLS** | Madras Journal of Literature and Science. |
| **Names** | Names (Postsdam, Newyork). |
| **NGJI** | National Geographical Journal of India (Varanasi) |
| **NIA** | New India Antiquary (Bombay). |
| **Onoma** | Onoma, |
| **PO** | The Poona Orientalist (Poona). |
| **QJMS** | The Quarterly Journal of the Mythic Society (Bangalore). |
| **SII** | South Indian Inscriptions. |
| **TC** | Tamil Culture (Madras). |
| **TVB** | Telugu Verbal Bases. |
| **TPS** | Transactions of Philological Society. |
| **TTDES** | Tirumalai Tirupati Devasthanam Epigraphical Series. |

## తెలుగు గ్రంథాలు

| | |
|---|---|
| ఆం. భూ. | ఆంధ్రదేశ చరిత్ర - భూగోళ సర్వస్వము. |
| ఆం. శ. ర. | ఆంధ్ర శబ్ద రత్నాకరము |
| క. జి. గె. | కడపజిల్లా గెజెట్, ఎక్స్ట్రార్డినరీ (1965) ఏప్రిల్ 30 |
| ప్రా. శా. | ప్రాచీనాంధ్ర శాసనాలు |
| బ్రౌ. | బ్రౌణ్యము |

| | |
|---|---|
| మాం. ప. | మాండలిక పదకోశము, |
| మాం. వృ. కో. I | మాండలిక వృత్తి పదకోశం, ప్రథమ సంపుటం. |
| ,, II | ,, ద్వితీయ సంపుటం |
| ,, IV | ,, చతుర్థ సంపుటం |
| మెకం. | మెకంజీ కైఫీయతు |
| శ. ర. | శబ్ద రత్నాకరము. |
| శా. శ. కో. | శాసన శబ్ద కోశము. |
| శృ. సం. | శృంగార సంకీర్తనలు (అన్నమాచార్య) |
| సూ. ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు. |

## సాధారణం

| | |
|---|---|
| ఆత్వసహిత బ. | ఆత్వసహిత బహువచనరూపం. |
| అనిర్దే. వ్యవ. | అనిర్దేశక వ్యవహార రూపం (non-specified usage) |
| అవ్య. | అవ్యయం. |
| అవ్య. బం. | అవ్యయబంధం |
| | అసమస్తం |
| | అస్పష్టనామబంధం (Latent Noun Phrase) |
| ఉ. | ఉచ్చారణలో |
| ఉదా. | ఉదాహరణ |
| ఏక. | ఏకవచనం |
| కు. నా. | కుటుంబనామం |
| కుల. నా. | కులనామం |
| కృ. ప్రా. | కృతక ప్రామాణికం |
| గోత్రనా. | గోత్రనామం |
| గ్రామ. నా. | గ్రామనామం |
| గ్రామనా. ప్ర. | గ్రామనామప్రథమావయవం(First element of the Place Name) |

| | |
|---|---|
| గ్రామనా. ద్వి. | గ్రామనామ ద్వితీయావం (**Second element of the Place name**) |
| చూ. | చూడు |
| చూ. ఆరో. | చూడు ఆరోపం |
| చూ. గ్రామనా. ద్వి. | చూడు గ్రామనామ ద్వితీయావయాలు |
| చూ. పోల్చిచూ. ఆరో. | చూడు పోల్చిచూడు ఆరోపం లేదా ఆరోపాలు |
| చూ. పో. ప. | చూడు పోలిక పదాలు. |
| నామబం. | నామబంధం |
| నామా / పర్యా. | నామాంతరం లేదా పర్యాయ రూపం |
| నిర్దే. వ్య. | నిర్దేశిక వ్యవహారరూపం (**Specified usage**) |
| పు. నా. | పురుష నామం |
| పు. నా. అను. | పురుషనామానుబంధం |
| | పూజ్యార్థకం |
| పోల్చిచూ. | పోల్చిచూడు |
| | పౌర్వాపర్య (కాల సంబంధం) |
| బ. | బహువచనం |
| ముఖప. | ముఖపత్రము. |
| మొ. | మొదలైనవి |
| రి. | రికార్డు (**Local Record**) |
| రూ. | రూపాంతరం |
| వి. | విశేషణం |
| లే. రూ. | లేఖన రూపాంతరం |
| లో. ని. /కృ. వ్యు. | లోక నిరుక్తి లేదా కృతక వ్యుత్పత్తి |
| వి. బం. | విశేషణ బంధం |
| వ్య. నా. | వ్యక్తి నామం |
| వ్యక్తినా. అను. | వ్యక్తినామ అనుబంధం |
| శా. రూ. | శాసన రూపం |
| సం. | సంపుటి |
| సంబ. నామబం. | సంబంధార్థక నామబంధం |

స్థలనా. — స్థలనామం
స్థలనా. ప్ర. — స్థలనామ ప్రథమావయవం
స్థలనా. ద్వి. — స్థలనామ ద్వితీయావయవం
స్థలానా. నామబం. — స్థలాత్మక నామబంధం
స్థలా. సూచి. — స్థలాత్మక సూచి.
స్త్రీనా. — స్త్రీనామం
స్త్రీనా. అను. — స్త్రీనామ అనుబంధం.

## తాలూకాలు:

కడ. — కడప
కమ. — కమలాపురం
జమ్మ. — జమ్మలమడుగు
పులి. — పులివెందుల
ప్రొద్దు. — ప్రొద్దుటూరు
బద్వే. — బద్వేలు
రాజం. — రాజంపేట
రాయ. — రాయచోటి
సిద్ధ. — సిద్ధవటం

## భాషలు:

అప. — అపభ్రంశ
అర. — అరబిక్
ఇం. — ఇంగ్లీషు
ఉ. — ఉర్దూ
క. — కన్నడం
కూయి
కువి
కుడుఖ్
కొడ. — కొడగు
కొలా. — కొలామీ

| | |
|---|---|
| | కోట |
| గోం. | గోండీ |
| ట. | టర్కిష్ |
| త. | తమిళం |
| తు. | తుళు |
| తె. | తెలుగు |
| నాయి. | నాయికీ |
| | పర్జి |
| పర్షి. | పర్షియన్ |
| పా. | పాళీ |
| ప్రా. | ప్రాకృతం |
| బ్రా. | బ్రాహుయీ |
| మ. | మలయాళం |
| మరా. | మరాఠీ |
| | మాల్తో |
| మూలద. ద్రా. | మూలదక్షిణద్రావిడభాష |
| మూలద్రా. | మూలద్రావిడభాష |
| సం. | సంస్కృతం |
| హిం. | హిందుస్తానీ |
| | హిబ్రూ |

# సంకేత వివరణ

## సంకేతాలు (Symbols)

| | |
|---|---|
| + | (1) గ్రామనామ ఆరోపం కోడ్ నెంబర్ పైన వాడినప్పుడు ప్రధాన గ్రామం కింద మజరా గ్రామం అని గుర్తింపు |
| + | (2) పదాంశం పక్కన వాడితే నామబంధంలోని అవయవాల మధ్య అవధిని సూచించే గుర్తింపు |
| + | (3) వర్ణ సమామ్నాయ పరిశీలనకు సంబంధించి పట్టికల్లో ఉపస్థితాంశానికి గుర్తు |
| + | (4) (అధ్యాయం 4లో) హిందుస్తానీ పదాలుండే గ్రామనామాలకు గుర్తు |
| — | పదాంశావధి (Morphemic boundary) |
| ~ | రూపాంతరం (Varient) |
| * | పునర్నిర్మితం |
| θ | శూన్యం |
| [ ] | ఈ రకం కుండలీకరణంలోని రూపాలు శాసన రూపాలు లేదా మూలరూపాలు |
| ( ) | ఈ రకం కుండలీకరణాలు పదాంశ విభజనకూ, ఆధార గ్రంథాలకూ, సామాన్య వివరణకూ సంకేతాలు |
| > < | చారిత్ర నిష్పత్తి సూచనకు గుర్తులు. మొన వైపున్నది అర్వాచీనం, మరోవైపున్నది ప్రాచీనం |
| ? | సందేహాస్పదం |



# అధ్యాయం - 1

## 1.1 గ్రామనామ పరిశీలన : పరిమితీ ప్రయోజనాలు:

**1.1.1** గ్రామనామాలు జీవద్భాషాసామగ్రి. అవి భాషా రూపాలు (Linguistic forms). భాషాచరిత్ర నిర్ణయంలో గ్రామనామాల ప్రాధాన్యాన్ని భాషావేత్తలు గుర్తించినారు.[1] ఒక భాషా సమాజంలోని గ్రామనామాల చరిత్ర, ఆ భాషా చరిత్రలో అంతర్భాగమే.[2] కాబట్టి గ్రామనామాల శాస్త్రీయపరిశీలనకు వర్ణనాత్మక (Descriptive), చారిత్రక (Historical) తులనాత్మక (Comparative) పద్ధతులు అవసరమూ, అనుసరణీయం కూడా. గ్రామనామ నిర్మాణ పరిశీలన వర్ణనాత్మక భాషా పరిశీలనకు చెందుతుంది. గ్రామనామాల ఉత్పత్తి పరిణామాలను, అవసరమైన చారిత్రకరూపాలతో పోల్చి చూడవలసి వచ్చినపుడు చారిత్రక పరిశీలనా పద్ధతి తప్పదు. ఒక భాషాప్రాంతంలోని గ్రామనామాలలో కన్పించే మాండలిక భేదాలనూ, సజాతీయ విజాతీయ రూపాలలోని లక్షణాలనూ పోల్చి వింగడించవలసి వచ్చినపుడు తులనాత్మక పరిశీలనావిధానం ఆవశ్యకమవుతుంది. కాబట్టి గ్రామనామపరిశీలన—సేకరణ, వర్గీకరణ వివరణ—భాషావిజ్ఞానానికి చెందిన విభాగమే.

**1.1.2** తెలుగులో భాషాదృక్పథంనుంచీ గ్రామనామ పరిశీలన శాస్త్రీయపద్ధతుల్లో ఇంతవరకూ జరగలేదు. ఔత్సాహికులైన కొందరు ప్రచురించిన వ్యాసాలు మినహా, భాషా చరిత్ర రచనా సందర్భంలో లేదా శాసనభాషా పరిశోధనా సందర్భంలో చెదురుమదురుగా సాగిన శాసనస్థ గ్రామనామ పరిశీలన తప్ప, ఎన్నదగిన ప్రామాణిక గ్రంథాలు తెలుగులో లేవు. ఇంతవరకు తెలుగు గ్రామనామాల గురించి జరిగిన కృషిని అధ్యాయం 3. 8. 6 లో వివరించినాను.

---

1. "It should never be forgotten that the fundamental characteristic of Place names is that they are linguistic Phenomena"—F. T. Wain Wright, Archaeology and Place-Names and History (London, 1962), P. 21.

   "Names of Places, like names of Persons, are as much elements of language as any other words"—Henry Cecil Wyld, The Place Names of Lancashire (London, 1911), P. 1

2. "—The History of the names of Places is part of the history of the language of the country in which they occur." Ibid. P, 2.

1.1.3 ఉత్తర అక్షాంశం 13°-40'కు 15°-15'కు మధ్యగానూ, తూర్పురేఖాంశం 77°-55'కు 79°-30'కు మధ్యగానూ కడప విస్తరించి ఉంది. ఈ జిల్లా వైశాల్యం 15,373 చదరపు కిలోమీటర్లు. ఉత్తరంలో కర్నూలు, తూర్పున నెల్లూరు, దక్షిణాన చిత్తూరు, పడమర అనంతపురం జిల్లాలు హద్దులుగా కడపజిల్లా ఏర్పాటయింది. భౌగోళికంగా కడపజిల్లా రాయలసీమ నడిబొడ్డున ఉంది. ఈ జిల్లాలోని 3403 ఊర్ల పేర్ల[1] సమగ్ర పరిశీలనమే ఈ పరిశోధక వ్యాస లక్ష్యం.

1.1.4 కడపజిల్లా గ్రామ నామాలలో కన్పించే తత్సమ, తద్భవ, తమిళ, కన్నడ, హిందుస్థానీ, మరాఠీ, ఆంగ్లభాషా పదజాలం, కడప జిల్లాపైగల వివిధ భాషా సంస్కృతుల ప్రభావాన్ని చాటుతుంది. కడపజిల్లా ఊర్ల పేర్లలో నేటికీ కన్పించే ప్రాచీన కావ్యభాషా రూపాలకు సన్నిహితమైన భాషారూపాలు కడప మాండలిక వైశిష్ట్యాన్ని చాటుతాయి. కడప భాషాసంస్కృతులను నిక్షిప్తం చేసుకొన్న శిలాజాలు (fossils) కడపజిల్లా గ్రామనామాలు. అందువల్ల కడప గ్రామనామాల పరిశీలన, కడపభాషా చరిత్రకు ప్రాణం; తెలుగుభాషా సమిష్టితో సరిపోల్చడానికి ఉపయోగం.

1.1.5 ఈ పరిశీలనలో వివిధ మూలాధారాల (sources) నుండి సేకరించిన ఊర్ల పేర్లను ప్రమాణీకరించి, వాటిలోని ధ్వని, పదనిర్మాణ స్వరూపాలను వర్ణనాత్మక పద్ధతిలో వివరించడమైంది. చారిత్రక తులనాత్మక పద్ధతులను అనుసరించలేదు దీనికి ప్రధాన కారణం, గ్రామనామ పరిశీలనకు జీవమైన చారిత్రక రూపాలు లభించే శాసనాలన్నీ వెలుగు చూడక పోవడమే. కడపజిల్లాకు సంబంధించిన శాసనాలు వెయ్యికిపైగా ఉన్నాయి. వెలుగులోకి వచ్చిన శాసనాలు వందాయాభైకి మించి లేవు. అముద్రిత శాసనాలలోని గ్రామనామ చారిత్రక రూపాలను సేకరించే అవకాశాన్ని, తమ పరిపాలనా సంబంధమైన ఇబ్బందుల వల్ల ఎపిగ్రఫి డిపార్ట్‌మెంట్ (మైసూరు) పరిశోధకునికి కల్పించలేదు. కాబట్టి ప్రాచీన యుగపు తెలుగు (Old Telugu), మధ్యయుగపు తెలుగు (Middle Telugu) భాషా లక్షణాలను నిక్షిప్తం చేసుకున్న శాసనస్థ గ్రామ నామ

1 దాదాపు వెయ్యికిపైగా ఉన్న హరిజన వాడలనూ, ఐదారు వందల వీధుల పేర్లనూ పరిశీలనలో చేర్చలేదు. మాలవాడలూ, మాదిగపల్లెలూ ప్రత్యేక గ్రామాలు కావు. అవి ఆయా గ్రామాలకు వెలిగా ఉండే వాడలు మాత్రమే.

రూపాల సేకరణకు దాదాపు పూర్తిగా కేవలవార్షిక నివేదికలమీద ఆధారపడవలసి వచ్చింది. వార్షిక నివేదికలలో లభించిన చారిత్రక రూపాలను వ్యుత్పత్తి పరిశీలనకు తోడ్పడతాయనే ఉద్దేశ్యంతో గ్రామనామ నిఘంటువులో ఇచ్చినా. వాటిని ధ్వని. పద నిర్మాణ పరిశీలనలో ఉపయోగించుకోలేదు. కడపజిల్లాలోని భాషా లక్షణాలను — మాండలిక భేదాలను — తెలుగుభాషా సమిష్టితో పోల్చి విలక్షణాంశాలను స్థూలంగా వివరించడం మాత్రం జరిగింది. వార్షిక నివేదికలలోని గ్రామనామ చారిత్రక రూపాలనూ. మెకంజీ కైఫీయతులవంటి చారిత్రక పత్రాలలోని రూపాలనూ జాగ్రత్తగా పరిశీలించి పదవ్యుత్పత్తి విచారణలో వినియోగించుకున్నాను. పదవ్యుత్పత్తి విచారణలో ప్రాచీన రూపాలు ఆధునికరూపాల వివరణకు తోడ్పడతాయి.

1.1.6 గ్రామ నామ వ్యుత్పత్తిని నిరూపించే పరిశోధకునికి భిన్న గ్రామాల నైసర్గిక విజ్ఞానం (Topography) తో పరిచయం తప్పక ఉండాలి. స్థానిక నైసర్గిక విజ్ఞానమూ. చరిత్రల అవగాహన లేకపోతే వ్యుత్పత్తి నిరూపణ ఊహాగానమవుతుంది. తాలూకా సర్వే మ్యాపులూ (Taluk Survey Maps), టోపో షీట్ల (toposheets) లో స్పష్టంగా కన్పరచిన నైసర్గిక వివరాలు గ్రామనామ పదవ్యుత్పత్తికి తోడ్పడినాయి. ఒక గ్రామం నదిగట్టున ఉందో. కొండ పక్కన ఉందో. మిట్టమీద ఉందో. పల్లంలో ఉందో. చెరువుదగ్గర ఉందో మొదలైన నైసర్గిక వివరాలు మ్యాపులు స్పష్టంగా గుర్తిస్తున్నందువల్ల. వాటి సాక్ష్యాలను వ్యుత్పత్తి నిరూపణలో ఉపయోగించుకొన్నాను. అలాగే కొన్ని గ్రామనామాల ఐతిహ్యవిశేషాలను గుర్తించడానికి మెకంజీ స్థానిక చరిత్రలు విశేషంగా తోడ్పడినాయి. గ్రామనామాల ప్రథమావయవాల్లో (First elements) ఉండే వ్యక్తినామాలూ (Personal names), ఇంటిపేర్లూ. కులాలూ. వృత్తులూ జాతులపేర్లూ సామాజిక చరిత్రలో భాగం. ప్రథమావయవాల్లో కన్పించే ఆయాపేర్లను నిర్ధరించడానికీ. సామాజిక భాషాదృక్పథంతో (Socio-linguistic approach) పరిశీలించడానికీ కావలసిన సాక్ష్యాలను మెకంజీ కైఫీయతులనుండి ఉపయోగించుకొన్నాను. అంతే తప్ప ప్రస్తుత పరిశీలనా లక్ష్యం గ్రామ నామాలలోని చారిత్రకాది విశేషాలను వెలికి తీయడం కాదు. లిఖిత సాక్ష్యాలనూ. పర్యటనానుభవాలనూ. కొందరు వ్యవహర్తలు (informants) చెప్పిన గ్రామనామ కథలూ గాథలనూ. అన్నిటికి మించి

భాషావిజ్ఞాన సూత్రాలనూ ఆధారంగా చేసుకొని ఊర్ల పేర్ల వ్యుత్పత్తి నిరూపణ కావించడం జరిగింది. (ఊర్ల పేర్ల వ్యుత్పత్తి నిరూపణ పద్ధతులకు. చూ. భూమిక.)

1.1.7 ఏ ప్రదేశంలో నయినా గ్రామనామాలు ఆదేశపు ప్రాచీన చరిత్రను, సంస్కృతిని నిక్షిప్తం చేసుకొన్న శిలాజాలవంటివి. గ్రామనామాల ప్రధాన భాగాల (Chief elements) వ్యాప్తి (distribution), ఆవృత్తు (frequency) లను గుర్తించి, ఒక భాషా ప్రాంతంలోని భౌగోళిక నైసర్గిక స్థితిగతులనూ, భిన్న జాతుల కలయికలనూ, సాంఘిక రాజకీయ మతాది వ్యవస్థల స్వరూప స్వభావాలనూ కొంతవరకు బహిర్గతం చేయవచ్చు. దీనికి గ్రామనామాలను భాషా దృక్పథం నుండే కాక, చారిత్రక సాంస్కృతిక సామాజిక దృక్పథాలనుండీ కూడా పరిశీలన అవసర మవుతుంది. గ్రామనామాలూ, చరిత్రా, పురాతత్వ విజ్ఞానమూ, భాషావిజ్ఞానమూ వీటి మధ్య ఉండవలసిన సంబంధ తత్వాన్ని గుర్తించినా, ఈ సిద్ధాంత వ్యాసంలో కడప ఊర్ల పేర్లలో భాషేతరాంశాల చర్చకు ఎక్కువగా పోలేదు.

## 1.2 కడపజిల్లా ఊర్ల పేర్లు: మూలాధారాలు (Sources)

1.2.1 గ్రామనామాలకు చెందిన భిన్న వర్ణక్రమాలూ (Spellings) నామాంతరాలూ పుట్టుపూర్వోత్తరాలు మొదలైన వాటిని సేకరించడానికి ఈ క్రింది మూలాధారాలు (Sources) ఉపయోగపడినాయి.

(అ) Alphabetical List of Villages in the Taluks and Districts of the Madras Presidency (Madras, 1924. Reprints: 1926, 1936, 1953).

(ఆ) Resettlement Registers. (Available at District Collectorate, Cuddapah, Andhra Pradesh).

(ఇ) District Census Hand Book, Cuddapah, Census of India, (Hyderabad, 1964).

(ఈ) Firka-wise List of Villages in Cuddapah District, General Administration, Election B Dept. Andhra Pradesh (Hyderabad, 1963).

(ఉ) Village-wise population according to 1961 census showing scheduled castes and scheduled tribes in 9. Cuddapah District, General Administration Department, Election B (Hyderabad, 1963).

(ఊ) Cuddapah District Gazette Extraordinary, Cuddapah, 12th August 1971 issued by District Collector.

(ఎ) కడపజిల్లా వివిధ తాలూకాలూ, సమితి కార్యాలయాల్లో లభించిన గ్రామ నామాల పట్టికలు - ఎ & బి రిజిస్టర్లతో సహా.

(ఏ) ఇనాం ఫతే రిజిస్టరు, 1802.

(ఐ) కడపజిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయంలో లభించిన గ్రామనామ పట్టికలు (Habitation Registers.).

(ఒ) కడపజిల్లా వివిధ అసెంబ్లీ నియోజక వర్గాల ఏకీకృత ఓటర్ల జాబితాల అనుబంధాలు, ముఖపత్రాలు :

147. కోడూరు అసెంబ్లీ నియోజక వర్గము, ఏకీకృత ఓటర్ల జాబితా : ముఖపత్రము (కడప, 1966)

148. రాజంపేట ,,

149. రాయచోటి ,,

150. లక్కిరెడ్డి పల్లె ,,

(రాయచోటి, లక్కిరెడ్డి పల్లె నియోజక వర్గాలు రాయచోటి తాలూకాకు చెందినవి)

151. కడప ,,

152. బద్వేలు ,,

153. మైదుకూరు ,,

154. ప్రొద్దుటూరు ,,

(మైదుకూరు, ప్రొద్దుటూరు నియోజకవర్గాలు
ప్రొద్దుటూరు తాలూకాకుచెందినవి)

155. జమ్మలమడుగు ,,

156. కమలాపురం ,,

157. పులివెందుల ,,

1.2.2 మ్యాపులు :

(అ) Taluk Survey maps : 1″= 4 Miles

| | | |
|---|---|---|
| కడప | VII E. 1/86 | (1952) |
| కమలాపురం | VII E. 1/113 | (1953) |
| రాయచోటి | VII E. 1/168 | (1953) |
| రాజంపేట | VII E. 1/163 | (1936) |
| సిద్ధవటం | VII E. 1/ | (1963) |
| బద్వేలు | VII E. 1/66 | (1963) |
| జమ్మలమడుగు | VII E. 1/109 | (1952) |
| ప్రొద్దుటూరు | VII E. 1/160 | (1954) |
| పులివెందుల | VII E. 1/161 | (1953) |

(ఆ) Toposheets covering Cuddapah District:

(Their numbers, years of Survey and the years of Publication and Edition number.)

| | No. | Years of Survey | Year of Publication | Edition |
|---|---|---|---|---|
| SHEET | 57 F/14 | . . | . . | . . |
| | 57 F/15 | 1929-30 | 1930 | First |
| | 57 J/1 | 21-22 | 1923 | ,, |
| | 57 J/2 | 21-23 | 1923 | ,, |
| | 57 J/3 | 23-24 | 1925 | ,, |
| | 57 1/8 | 21-22 | 1923 | ,, |
| | 57 J/5 | 21-22 | 1923 | ,, |

| | No. | Years of Survey | Year of Publication | Edition | |
|---|---|---|---|---|---|
| SHEET | 57 J/6 | 21-23 | 1924 | First,, | |
| | 57 J/7 | 23-24 | 1925 | ,, | |
| | 57 J/8 | 23-24 | 1925 | ... | HLO |
| | 57 K/5 | . . | . . | ... | |
| | 57 1/12 | 21-22 | 1923 | ,, | |
| | 57 J/9 | 23-24 | 1924 | ,, | |
| | 57 J/10 | 23-24 | 1924 | ,, | |
| | 57 J/11 | 22-23 | 1923 | ,, | |
| | 57 J/12 | 22-23 | 1924 | ,, | |
| | 57 K/9 | 22-23 | 1924 | ,, | |
| | 57 1/16 | . . | . . | . . | |
| | 57 J/13 | 23-24 | 1925 | ,, | |
| | 57 J/14 | 23-24 | 1925 | ,, | |
| | 57 J/15 | 22-23 | 1924 | ,, | |
| | 57 J/16 | 22-23 | 1924 | ,, | |
| | 57 K/13 | 22-23 | 1924 | ,, | |
| | 57 M/4 | 20-21 | 1922 | ,, | |
| | 57 N/1 | 17-18 | 1919 | ,, | |
| | 57 N/2 | 17-18 | 1919 | ,, | |
| | 57 N/3 | 17-18 | 1919 | ,, | |
| | 57 N/4 | 17-18 | 1919 | ,, | |
| | 57 O/1 | 15-16 | 1917 | ,, | |
| | 57 N/7 | 16-18 | 1919 | ,, | |
| | 57 N/8 | 17-18 | 1919 | ,, | |
| | 57 O/5 | 15-16 | 1917 | ,, | |
| | 57 O/6 | . . | . . | ... | |

**1.2.3 శాసనాలూ, వార్షిక నివేదికలూ (Annual Reports):**

(అ) శాసనాలు :

E. I. VII. 8
E. I. X. 24, 25, 26
E. I. XI. 29, 35
E. I. XVI. 18
E. I. XXVII. 42 (A-K)
E. I. XXVIII. 21

E. I. XXX. 4

E. I. XXXIII. 3

S. I. I. IX- I. 49, 63, 68, 69, 207, 208, 256, 257, 275, 283, 402

S. I. I. IX- II. 494, 495, 496, 508

S. I. I. X. 28, 29, 312, 408-A, 448, 463, 498, 506, 519, 536, 574, 575, 579, 593, 594, 595, 596, 597, 598, 599, 600, 603, 604, 605, 606, 607, 608, 609, 610, 611, 612, 613, 614, 617, 618, 636, 770.

S. I. I. XVI. 1, 2, 3, 6, 15, 16, 21, 22, 25, 28, 29, 31, 34, 36, 37, 39, 40, 45, 47, 55, 62, 64, 65, 66, 69, 70, 77, 78, 79, 81, 84, 91, 105, 108, 110, 112, 122, 123, 127, 128, 139, 144, 147, 148, 149, 153, 162, 163, 173, 176, 179, 185, 195, 196, 219, 220, 222, 224, 228, 256.

T. T. D. E. S. III. 65, 68.

T. T. D. E. S. IV. 144.

T. T. D. E. S. VI-I. 25.

(ఆ) Annual Reports on Indian Epigraphy :

| ARSEI | | | |
|---|---|---|---|
| | 1905 : | A | 376 - 409 |
| | 1907 : | | 570 - 623 |
| | 1911 : | | 398 - 446 |
| | 1925-'26 : | B | 399 - 408 |
| | 1926-'27 : | B | 714 - 717 |
| | 1929-'30 : | B | 98 - 106 |
| | 1932-'33 : | B | 349 - 386 |
| | 1935-'36 : | B | 297 - 335 |
| | 1937-'38 . | B | 191 - 312 |
| | 1938-'39 : | B | 331 - 443 |
| | 1939-'40 : | B | 1 - 71 |
| | 1940-'41 : | B | 319 - 442 |
| | 1941-'42 : | B | 24 - 54 |
| | 1945-'46 : | B | 111 - 155 |
| | 1946-'47 : | B | 1 - 25 |
| | 1959-'60 ; | B | 18 |

| | | | |
|---|---|---|---|
| 1960-'61 : | B | 3 - 5 | |
| 1961-'62 : | B | 6 - 8 | |
| 1962-'63 : | B | 137 - 146 | |
| 1963-'64 : | B | 2 - 10 | |
| 1965-'66 : | B | 3 - 7 | |
| 1966-'67 : | D | 10 - 22 | అరబిక్, పర్షియన్ శాసనాలు |
| 1967-'68 : | B | 1 - 21 | |
| 1968-'69 : | B | 1 - 30 | |

1.2.4 మెకంజీ కైఫీయతులు (స్థానిక చరిత్రలు)*

సం. 97. రి. 1110
సం. 98. రి. 1111
సం. 99. రి. 1112
సం. 105. రి. 1118
సం. 106. రి. 1119
సం. 108. రి. 1121
సం. 109. రి. 1134
సం. 112, 113, 114. రి. 1128
సం. 117. రి. 1169
సం. 118. రి. 1170
సం. 122, 123. రి. 1180
సం. 129. రి. 1204
సం. 130. రి. 1210
సం. 131. రి. 1211
సం. 133. రి. 1223
సం. 135. రి. 1225
సం. 137. రి. 1229
సం. 138. రి. 1240
సం. 139
సం. 140
సం. 145

*పై స్థానిక చరిత్రలు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో వ్రాయించి భద్రపరచిన నకలు ప్రతులు.

1.2.5 District Manuals, Gazetteers etc :

(అ) J. D. B. Grible, Manual of Cuddapah District (Madras, 1875)

(ఆ) C. F. Brackenbery, Cuddapah, Madras District Gazetteers (Hyderabad, 1867)

(ఇ) B. Sivasankaranarayana. ed. Cuddapah. *rev.* ed. Andhra Pradesh District Gazetteers (Hyderabad, 1967)

(ఈ) Census of India 1961, Vol. II Part VII-B (9) Fairs and Festivals 9, Cuddapah District (Hyderabad)

(ఉ) Manual of the Administration of the Madras Presidency Vol. III. Glossary (Madras, 1893)

(ఊ) Imperial Gazetteer af India, Vol. IV.

(ఎ) జనమంచి శేషాద్రిశర్మ. కడప మండలము (మద్రాసు, 1930)

(ఏ) „ „ కడప మండల చరిత్రము (మద్రాసు, 1930)

(ఐ) ఆంధ్ర దేశ చరిత్ర భూగోళ సర్వస్వము "ముఖద్వారము" (హైదరాబాదు, 1969)

1.2.6 సాహిత్యాధారాలు

(అ) తాళ్ళపాక అన్నమాచార్య కృతులు.

(ఆ) రాయ వాచకము.

(ఇ) కకుత్స్థ విజయము మొదలైనవి.

1.2.7 పైన పేర్కొన్న వివిధ మూలాధారాలను పురస్కరించుకొని కడప జిల్లాలోని ఊర్ల పేర్లను సేకరించడంలోనూ, ప్రామాణిక రూపాలను నిర్ణయించడంలోనూ అనేక సమస్యలు ఎదురయినాయి.

## 1.3 గ్రామనామ సేకరణ : కొన్ని సమస్యలు

1.3.1 తెలుగులో ఇంతవరకూ గ్రామనామ నిఘంటువు (Place name dictionary) లేదు కదా, అసలు జిల్లాలవారీగా సమగ్రమైన గ్రామనామాల పట్టికలు కూడా లేవు. బ్రిటిష్ పరిపాలనా కాలంలో మద్రాసు ప్రభుత్వం ప్రచురించిన 'Alphabetical list of Villages in the Taluks and Districts of Madras Presidency (1924) లోనూ, Resettlement Registers లోనూ, అదే దారిలో నడిచిన Census Department, General Administration Department, Election B వారి ప్రచురణల్లోనూ, కడపజిల్లా గెజిట్లలోనూ (చూ. 1.2.1 అ, ఆ, ఇ, ఈ, ఉ) కేవల రెవెన్యూ ప్రధాన (Revenue/Main Villages) గ్రామాలు మాత్రమే కన్పిస్తాయి. కానీ ప్రధాన గ్రామాలక్రింద సాధారణంగా ఉండే మజరా గ్రామాలు (Hamlets) లేవు. 'Alphabetical list of villages in the Taluks and Districts of Madras Presidency' లో ఉన్న ఆ ప్రధాన గ్రామాల పేర్లనయినా ఒక వైపు రోమన్ లిపిలోనూ మరొకవైపు తెలుగు లిపిలోనూ ఇచ్చినారు. తదితర ప్రభుత్వ ప్రచురణల్లో ఊర్లపేర్లు రోమన్ లిపిలోనే ఉన్నాయి. హ్రస్వ దీర్ఘాది

ఉచ్చారణ భేదాల్ని తెలిపే ఉచ్చారణచిహ్నాలు ఆ ప్రచురణల్లో లేవు. ఈ ఇబ్బందికి తోడు ఆ ప్రచురణల్లోని ముద్రారాక్షసాలు ముప్పుతిప్పలు పెడతాయి. అందువల్ల జిల్లాలోని ఊర్ల పేర్లను పూర్తిగా సేకరించడానికి, వాటి ఉచ్చారణా లేఖనాలను గుర్తించడానికి ఈ పట్టికలేవీ పూర్తిగా సాయపడవు. ఆంధ్రరచయితల సంఘం ప్రచురించిన 'ఆంధ్రదేశ చరిత్ర భూగోళసర్వస్వము' "ముఖద్వారము" నకు ఉపోద్ఘాతం వ్రాసిన శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఈ విషయమై ప్రకటించిన ఆవేదన అర్థం చేసికోదగింది : "Here with modern geography, we face no less difficulties than with ancient geography which was effaced in the corridors of time. To mention only one such difficulty, there are no lists of villages in Telugu. The census Department published some lists in English. The pronunciation and spelling of these are left much in doubt. There are no diacritical marks. Our people may smile or get annoyed, if the name of their village is subjected to all sorts of grotesque spellings". (ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము. 1963, p. ii)

1.8.2 పరిపాలనా వ్యవహారాలు తాలూకాలస్థాయిలో కూడా ఇన్నాళ్ళూ ఇంగ్లీషులోనే కొనసాగడంవల్ల, మనకు లభించే పట్టికలు సాధారణంగా ఇంగ్లీషులోనే ఉన్నాయి. ఇంగ్లీషులోనే ఉన్నా నిర్దుష్టంగా ఉండవు. పైగా లేఖన చిహ్నాలు ఉండవు. పరిపాలనా యంత్రాంగంలో ప్రధాన గ్రామానికి ఉండే స్థాయి, ప్రాధాన్యత మజరా గ్రామాలకు లేకపోవడంవల్ల ఒక్కచోట మనకు సమగ్ర గ్రామనామ పట్టికలు దొరకవు. 'రిసెటిల్‌మెంట్' పైసలాతి రిజిస్టర్లలో కూడా ప్రధాన గ్రామనామాల తెలుగు రూపాలయితే దొరుకుతాయి కానీ వాటి క్రింద ఉండే మజరా గ్రామ నామాలు దొరకవు. ఒక్క అసెంబ్లీ నియోజక వర్గాల 'ఏకీకృత జాబితా'లకు అనుబంధంగా ఉండే ముఖపత్రాలలో మాత్రమే రెవెన్యూ గ్రామాలూ, మజరా గ్రామాలూ అన్నీ తెలుగులో లభిస్తాయి. తాలూకా కార్యాలయాల్లో ముఖ్యంగా ఎన్నికల నిమిత్తం తయారుచేసిన ఊర్లపేర్ల ఇంగ్లీషు మూలాలను ముందుంచుకొని ఆయా అధికారులు తొందరకొద్దీ, అలసత్వం కొద్దీ తయారుచేసినవి కావడంవల్ల ముఖపత్రాలలో లేఖన ప్రమాదాలు కొల్లలుగా కన్పిస్తాయి. అధికారులు చేసిన లేఖన ప్రమాదాలకు స్థానిక ముద్రణాలయాలు మరికొంచెం అచ్చుతప్పుల్ని

జోడిస్తాయి. వీటికి తోడు కృతకప్రామాణిక కృతకవ్యుత్పత్తి ప్రభావాలుకూడా ఊర్ల పేర్లమీద ఉన్నాయి. ఏమైనా ఒక్క జిల్లాలోని మొత్తం ఊర్ల పేర్ల లిఖిత రూపాలను సాధ్యమైనంత నిర్దుష్టంగా సేకరించడం కూడా ఈ రోజుల్లో ఎంతో వ్యయప్రయాసలతో కూడుకొన్న పెద్ద పని.

1.8.3 కడపజిల్లాలోని 9 తాలూకాలలో 983 రెవెన్యూ గ్రామా లున్నాయి. మజరా గ్రామా లన్నిటినీ ఆయా ప్రభుత్వ కార్యాలయాలనుండీ ప్రభుత్వ రికార్డులనుండీ సేకరించి ఒక సంపూర్ణమైన కడపజిల్లా గ్రామనామపట్టికను రూపొందించడం కూడా పరిశోధకుని భగీరథ ప్రయత్నమైంది. ఆ శ్రమఫలితమే ఈ క్రింది పట్టిక. కడపజిల్లాలో తాలూకాల వారీగా ప్రధానగ్రామ, రెవెన్యూ గ్రామనామాల సంఖ్యా పట్టిక.*

| తాలూకా | ప్రధాన గ్రామాలు | మజరా గ్రామాలు | మొత్తం గ్రామాలు |
|---|---|---|---|
| కడప | 113 | 228 | 341 |
| కమలాపురం | 63 | 81 | 144 |
| రాయచోటి | 118 | 1034 | 1152 |
| రాజంపేట | 144 | 384 | 528 |
| సిద్ధవటం | 79 | 185 | 264 |
| బద్వేలు | 140 | 190 | 330 |
| జమ్మలమడుగు | 138 | 67 | 205 |
| ప్రొద్దుటూరు | 88 | 174 | 262 |
| పులివెందుల | 97 | 80 | 177 |
| | 980 | 2423 | 3403 |

* కమలాపురం తాలూకాలోని 43, 44 కోడ్ సంఖ్యలు గల ఉత్తరపాలగిరి దక్షిణపాలగిరి పరిపాలనా ప్రమాణం దృష్ట్యా రెండు ఊర్లయినా పేరురీత్యా ఒకటే ఊరు. (చూ. నిఘంటువు ఆరో. పాలగిరి). అలాగే సిద్ధవటం తాలూకాలోని 69, 70 కోడ్ సంఖ్యలున్న ఉత్తర దక్షిణ రామాపురాలు (చూ. నిఘంటువు. ఆరో. రామాపురం). ప్రొద్దుటూరు తాలూకాలోని 83, 84 కోడ్ సంఖ్యలు ఉత్తర దక్షిణ మైదుకూరులు. (చూ. నిఘంటువు. ఆరో. మైదుకూరు). కాబట్టి ఊర్ల పేర్లుగా లెక్కకు వచ్చేవి 980 రెవెన్యూ గ్రామాలే. ఈ లెక్కనుబట్టి కమలాపురం తాలూకాలో 64 రెవెన్యూ గ్రామాలుండగా 63 అనీ, సిద్ధవటం తాలూకాలో 80 వుండగా 79 అనీ, ప్రొద్దుటూరు తాలూకాలో 89 వుండగా 88 అని పట్టికలో ఇవ్వడం జరిగింది. ఈ పట్టికలో దాదాపు వెయ్యికి పైగా ఉన్న హరిజనవాడలనూ బదారువందల వీధుల పేర్లనూ చేర్చలేదు.

1.3.4 ఈ పరిశోధక వ్యాసానికి మూలసామగ్రి అయిన కడపజిల్లా గ్రామనామరూపాల సేకరణ, ప్రమాణీకరణ, అకారాది పట్టిక తయారీ, సంకేత సంఖ్యా నిర్ణయం (code numbering) మొదలైన వాటిని దశలవారీగా నిర్వహించడం జరిగింది. మూలాధారాలలో 1.2.1 కింద ఇచ్చిన పట్టికలను ఒకదానితో ఒకటి సరిపోల్చి సమగ్ర గ్రామనామ పట్టికను రూపొందించడం మొదటి దశ. ఆ తర్వాత తాలూకా సర్వే మ్యాపులూ, టోపోషీట్లలోని (1.2.2) ఊర్ల పేర్లతో వాటిని పోల్చి చూడడం రెండవ దశ. ఈ దశలో వివిధ ఆధారాలలో యాపాటివారి పల్లె; యామవరం వంటి అవ్యవస్థిత రూపాలను రూపాంతరాలను అప్రధానంగా గ్రహించడం జరిగింది. తాలూకా సర్వే మ్యాపులలో లేఖన చిహ్నాల గుర్తింపు లేకపోయినా, టోపోషీట్లలో వాటి గుర్తింపు ఉండడంవల్ల లిఖితరూప ప్రామాణికత సులభతరమయింది. 1" = 4 Miles Taluk census maps లోని ప్రధాన గ్రామనామ సంకేత సంఖ్యలను (code numbers) తీసుకొని, ఏ మజరా గ్రామాల నయినా సులభంగా మ్యాపుల్లో గుర్తించేందుకు అనువుగా వాటికి సంకేతనాల నిచ్చి ఊర్ల పేర్లన్నిటిని కార్డుల్లో వ్రాయడం మూడవ దశ. వివిధ తాలూకాలకు చెందిన ఆయా ప్రధాన గ్రామ సంకేత సంఖ్యలకు + గుర్తు పెట్టి మజరా గ్రామాలను సంకేతించినాము. దీనివల్ల గ్రామాలను మ్యాపుల్లో స్థూలంగా గుర్తించవచ్చు. గ్రామం వెలసినచోటూ, గ్రామనామ కరణ విధానమూ, గ్రామనామాల వ్యాప్తి తెలుసుకోడానికి ఈ సంకేత సంఖ్యలూ, సంకేతాలూ తోడ్పడతాయి. ఈ విధంగా మూడవ దశలో కడపజిల్లా గ్రామాల అకారాది పట్టిక సంపూర్ణంగా తయారయింది. నాల్గవ దశలో ఆధునిక రూపాలకు సంబంధించిన ప్రాచీన రూపాలను శాసనాలూ, వార్షిక నివేదికలూ, మెకంజీ కైఫీయతులూ మొదలైన వాటినుండీ సేకరించి గుర్తించడం జరిగింది. ఈ గుర్తింపులో శాసన సంపాదకుల అభిప్రాయాలూ, మెకంజీ రికార్డుల్లో ఇచ్చిన గ్రామనామ సరిహద్దుల వివరాలూ, స్వీయ పర్యటనానుభవాలూ, వివిధ వ్యవహర్తలతోటి సంప్రదింపులూ ఉపయోగించినాయి. చారిత్రక రూపాల తారీఖులు (dates), మూలాధారాలు (sources), వర్ణక్రమాలు (spellings) వీటిని కార్డుల్లో ఆధునిక రూపాలకు ఎదురుగా కుండలీకరణాలలో ఇవ్వడంతో పరిశీలనకు సామాగ్రి సిద్ధమైంది. విషయ సేకరణ, ఆరోప నిర్ణయం, అకారాది పట్టిక (indexing), వర్గీకరణ వివరణలకు సంబంధించిన పద్ధతులూ సూత్రాలూ ఈ క్రింది గ్రంథాలనుండీ స్థూలంగా గ్రహించినాను:

1. A. H. Smith, The preparation of county Place-Name Surveys, London: English Place Name Society, University College, 1954.

2. Byrd Howel Granger, Hand Book for Establishing A State Centre for A Survey of Place Names. Arizona: American Name Society, 1970 (Cyclostyled copy).

గ్రామనామ సేకరణ, ఆరోప నిర్ణయాలలో నిర్దుష్టత ప్రమాణంగా ఎంచుకొని ఊర్ల పేర్ల శబ్దార్థ పరిశీలన చేసినాను.



# అధ్యాయం - 2

## సంజ్ఞానామతత్వ సమస్య: సంజ్ఞానామ వర్గీకరణం

### 2.1 సంజ్ఞానామతత్వ సమస్య (The Problem of Proper Names):

**2.1.1** సంజ్ఞానామ తత్వ నిర్ణయం ప్రధానంగా తాత్వికుల్ని, తార్కికుల్ని తికమక పెడుతున్న సమస్య. ఇది భాషలో శబ్దార్థవస్తు సంబంధ తత్వానికి చెందిన విషయం. ప్రత్యేక పరిశీలనకు యోగ్యమైన అంశం. సంజ్ఞానామాలలో స్థలనామాలకు చెందిన గ్రామనామాల స్థానాన్ని గుర్తించడానికి మాత్రమే ఈ అధ్యాయంలో సంజ్ఞానామ సిద్ధాంతాలను స్థూలంగా ఉటంకించడమైంది.

**2.1.2** లౌకిక ప్రపంచంలోని చేతనాచేతన పదార్థాలనూ, మానవ ప్రతిభానిర్మితమైన వస్తువులనూ, మానవచైతన్యం నుంచి ఆవిర్భవించే అమూర్తభావాలనూ వివిధ భాషలు పలురకాలైన వాగ్రూప సంకేతాలతో సూచిస్తాయి. ఈ వాగ్రూప సంకేతాలు పదాలుగా, పద బంధాలుగా, వాక్యాలుగా ఏర్పడి భావ వ్యవహారానికి తోడ్పడతాయి. భాషలోని వాగ్రూప సంకేతాలను వ్యాకరిస్తూ చేసే వర్గీకరణలో నామవాచక పదజాలం ఒక వర్గం. స్థూలంగా విభజిస్తే నామవాచకాలు రెండు రకాలు: 1. సామాన్య వాచకాలు (Common nouns), 2. సంజ్ఞావాచకాలు (Proper nouns/Proper names)

**2.1.3** భాషలోని ఇతరపదాల కున్నట్లు సామాన్య వాచకాలకు కూడా శాబ్దికరూపమూ (form), అర్థమూ (meaning or sense) ఉంటాయి. సంకేతిత మగు అర్థాన్ని బోధించే శబ్దశక్తిని భారతీయాలంకారికులు 'అభిధ' అని వ్యవహరించి నారు. సంకేతితార్థమంటే వాచక శబ్దానికి గల ముఖ్యార్థం. దీనినే వాచ్యార్థ (denotation) మంటారు. వాచ్యార్థాన్ని బోధించే శక్తియే అభిధ. అభిధా శక్తితో కూడిన శబ్దాలు వాచకాలు. సంకేత స్వరూపస్వభావాలను బట్టి వాచక శబ్దం నాలుగు రకాలు: 1. జాతివాచకం, 2. గుణవాచకం, 3. క్రియవాచకం, 4. ద్రవ్యవాచకం. జాతి సంతతినీ బోధిస్తాయి. కాబట్టి ఆవు, గుర్రం, దేగ జాతివాచకాలు. వీటినే సామాన్య వాచకాలని వ్యవహరిస్తారు. ఎరుపు, నలుపు,

తెలుపు గుణవాచకాలు. వ్రాస్తున్నాడు, చదువుతున్నాడు క్రియా వాచకాలు. రాముడు, సరస్వతి, తిరుపతి, గుంటూరు ద్రవ్యవాచకాలు. ద్రవ్యమంటే పేరు. ద్రవ్య వాచకాలన్నే సంజ్ఞావాచకాలు, బిరుదవాచకాలు, పేర్లు అని వ్యవహరిస్తుంటారు. ద్రవ్యవాచకాలు కూడా గోశబ్దం గోత్వ మనే జాతిని బోధించేటట్లే రామత్వాది జాతుల బోధిస్తాయని కొందరి వాదం.

2.1.4 వాచ్యార్థానికి (denotation) బాధ కలిగినపుడు వాచ్యార్థంతో సంబంధం ఉండే వేరొక అర్థం రూఢిని బట్టిగానీ, ప్రయోజనాన్ని బట్టిగానీ స్ఫురింపచేసే శక్తిని లక్షణ అని భారతీయాలంకారికులు పేర్కొన్నారు. వాచ్యార్థ సంబంధం లేని లక్షణ ఉండదు. లక్షణావృత్తిలో గమనింప వలసిన అంశాలు మూడు: 1. ముఖ్యార్థానికి అనుపపత్తి. 2. దాని సంబంధం, 3. వేరొక అర్థాన్ని తెలప డానికి రూఢిగానీ ప్రయోజనం గానీ ఉండడం. (సూర్యనారాయణశాస్త్రి. 1945, 131-133) లక్షణావృత్తినే సహజార్థమని (connotation) పేర్కొనవచ్చు.

2.1.5 భాషలో సామాన్య వాచకాలకూ, సంజ్ఞావాచకాలకు గల భేదసాదృశ లక్షణాలనూ, భాషలో సంజ్ఞావాచకాల ప్రతిపత్తిని గూర్చి, ప్రధానంగా అర్థతత్వాన్ని పురస్కరించుకొని, సనాతనాధునాతన ప్రాచ్యపాశ్చాత్య తాత్వికులూ, తార్కికులూ, ఆలంకారికులూ, భాషా విజ్ఞానవేత్తలూ విభిన్న దృక్పథాలనుంచి సిద్ధాంత సమాలోచన చేసినారు. ఈ సిద్ధాంత సమాలోచనలను విహంగావలోకనం చేయడం ఈ సందర్భంలో అవసరం

## 2.2 సంజ్ఞావాచకాలు : భారతీయుల దృష్టి

2.2.1 ప్రాచీన మధ్య యుగాలకు చెందిన భారతీయ నైయాయికులూ, మీమాంసకులూ, వైశేషికులూ, బౌద్ధులూ, మతత్రయాలకు చెందిన వేదాంతులూ, ఆలంకారికులూ వైయాకరణులూ చేసిన పదపదార్థ సంబంధ వివేచన ఎనలేనిది. (వివరాలకు చూ. Kunjunni Raja, 1963, 3-15; G. N. Reddy, 1966, 10-29; Chakravarthi, 1925. 53-96). భాషలో సంజ్ఞావాచకాల స్థాయిని గూర్చి వీరు ప్రత్యేకంగా చర్చించకపోయినా వాటి అర్థతత్వాన్ని గూర్చి ప్రాసంగికంగా కొన్ని అభిప్రాయాలు చెప్పినారు.

2.2.2 భాషలోని ఇతర పదజాలంకంటే సంజ్ఞావాచకాలు భిన్నంకావని మీమాంసకులూ వేదాంతులూ అభిప్రాయపడినారు. సామాన్యవాచకాలవలెనే సంజ్ఞా నామాలు

కూడా సహజార్థబోధకాలని (connotative) భావించినారు. వీరి వాదం ప్రకారం పుట్టుక మొదలుకొని చావువరకు ఒక వ్యక్తి జీవితంలో కలిగే భిన్న దశల మధ్య గోచరించే సంజ్ఞా జ్ఞానం (knowledge of identity) వల్లనే ఆ వ్యక్తియొక్క సామాన్య లక్షణ(common attribute) బోధ కలుగుతుంది. "According to the Mimamsakas and Vedantins even proper nouns are connotative; the knowledge of the identity of the same person from birth to death through all the changing stages is explained on the basis of common attribute." (Kunjunni Raja 1963, 74-75). నైయాయికుల వాదం ప్రకారం సంజ్ఞా వాచకాలతో సహా అన్ని వాచకాలూ సహజార్థ బోధకాలే: "All the names including proper names are connotative according to Nyaya" (Kuppuswamy Sastry, 1951, 260).

ప్రతి క్షణం ద్రవ్యం భేదిస్తుంది కాబట్టి, రామాది ద్రవ్యాలు ఏకవిధంగా సర్వ కాలాల్లో ఉండవనీ, ప్రతిక్షణం మార్పులు కలుగుతుంటాయనీ, అందువల్ల క్షణం క్రింద చూచిన రాముడులే ఈ క్షణంలో చూచిన రాముడులు కారని బౌద్ధుల వాదం. ప్రతి క్షణం భేదించే రామాది ద్రవ్యాల్లో రామత్వ రూపజాతి ఉంటుంది. ఈ విధంగా అన్నీ జాతివాచకాలే అవుతాయని ఒక మతం (సూర్య నారాయణశాస్త్రి, 1945, 133.)

## 2.3 సంజ్ఞానామాలు : పాశ్చాత్యుల దృష్టి

2.3.1 సంజ్ఞావాచకాలకు సహజార్థం (connotation) ఉండదనీ, అవి అర్థరహిత మైన వస్తు నిర్దేశకాలు మాత్రమే నని పలువురు పాశ్చాత్య తాత్వికుల అభిప్రాయం : "According to one widely held view, proper names simply stand for objects, without having any sense or meaning other than standing for objects" (The Encyclopaedia of Philosophy, Vol. 6, 1967, 487)

ఈ దృక్పథానికి బీజం ప్లాటో (Plato) Theaetetus లో కనిపిస్తుంది. ప్లాటో కాలంనుండీ కూడా సంజ్ఞానామతత్వ సమస్యపై సుదీర్ఘ వాదోపవాదాలు సాగుతూనే ఉన్నాయి. భాషలోని ఇతర పదజాలానికి వలెనే సంజ్ఞా నామాలకు కూడా అర్థం ఉన్నదనే మౌలిక విషయం మీద ఈ వాదోపవాదాలు సాగినాయి.

వస్తు శబ్దాలకు (words related to world) ఉండే సంబంధ మేమిటనే మూల సమస్యా పరిష్కారానికి సంజ్ఞానామతత్వ చింతన అవసర మయింది. అదే కాకుండా భాషానిర్మాణం (Structure) లో, భాషావ్యాపారంలో (function) వాటి సంగతి తేల్చడానికి కూడా ఈ చర్చ ఉపయోగ పడింది. సంజ్ఞానామ తత్వ సమస్య చర్చించిన వారిలో విట్జెన్‌స్టీన్ (Wittgenstein); జె. ఎస్. మిల్ (J S. Mill), (Russell) మొదలైన తాత్వికు లున్నారు. కెయిన్స్ (Keynes), బ్రాడ్లీ (Bradley), బొసాన్‌కే (Bosanquet) మొదలైన తార్కికు లున్నారు. ఎస్‌పర్సన్ (Jespersen), గార్డినర్ (Gardiner), పల్‌గ్రాం (Pulgram), ఉల్‌మాన్ (Ullman) హాకెట్ (Hockett) మొదలైన భాషా శాస్త్రవేత్త లున్నారు. ఐసాక్ టెయిలర్ (Isaac Taylor), జార్జి స్టీవర్ట్ (George Stewart) ఇత్యాది స్థల నామతత్వ పరిశీలకులూ ఉన్నారు.

### 2.3.2 సంజ్ఞావాచకం యొక్క అర్థం అది సూచించే వస్తువని విట్జెన్‌స్టీన్ :

"The name means the object, The object is its meaning". (Wittgenstein as quoted by Searle, 1971, 135).

ఈవిధమైన కేవల అర్థాభావ సిద్ధాంతం (no sense theory) మిల్ నామతత్వ పరామర్శలో పరాకాష్ఠ నందుకుంది. (The Encyclopaedia of Philosophy, Vol. 6, 1967, 487). సంజ్ఞానామాలకు అర్థాలుండవు. అవి అర్థరహిత సంజ్ఞలు; వాటికి వాచ్యార్థం (denotation) ఉంటుంది కానీ, సహజార్థం (connotation) ఉండదని మిల్ యొక్క సిద్ధాంతం. మనిషి అనే సామాన్యవాచకం పీటర్, జేమ్స్, జాన్ మొదలైన అనేక వ్యక్తులను వాచ్యం చేయడమే కాకుండా, మనుష్యజాతి సామాన్య ధర్మాలైన దేహత్వం (Corporeity), జంతుజీవనం (animal life), వివేకం (rationality), ఆకారం (external form) మొదలైన వాటివి తెల్పుతుంది; అందువల్ల మనిషి అనే వాచకానికి వాచ్యార్థ సహజార్థా లున్నాయి. సహజార్థం లేని వాచకాలే సంజ్ఞా నామాలని మిల్ వాదం (Searle, 1971, 134; Jespersen 1958, 65). "A thousand and one Nights" లో దొంగలు తాము దొంగతనం చేయాలనుకున్న ఇంటివి స్పష్టంగా గుర్తించడానికి ఆ ఇంటిమీద గీచిపోయిన సుద్ద గీతల్లాంటివి సంజ్ఞావాచకాలని మిల్ అభిప్రాయం. (Ullmann, 1959, 73).

2.3.3 సంజ్ఞానామతత్వ సమస్య వివేచించి ఒక ప్రత్యేక సిద్ధాంత వ్యాసాన్ని రూపొం దించి, సంజ్ఞానామ తత్వావగాహనకు తోడ్పడిన అలెన్ హెచ్. గార్డినర్ (Alan H. Gardiner) వాదం ప్రకారం, మొదటినుంచీ శబ్దానికి గల అర్థంతో నిమిత్తం లేకుండా కేవల శబ్ద మాత్రంగానే సంజ్ఞానామం వస్తువును సూచిస్తుంది :

> "A proper name is a word or group of words recognised as indicating or tending to indicate the object or objects to which it refers by virtue of its distinctive sound alone, without regard to any meaning possessed by that sound from the start, or acquired by it through association with the said object or objects" (Gardiner, 1940, 43).

అర్థం మరుగున పడినప్పుడే సంజ్ఞావాచకాలు నిర్దుష్ట సంజ్ఞావాచకాలవుతాయని గార్డినర్ (Gardiner, 1940, 43):

2.3.4 శబ్దమాత్రంగానే సంజ్ఞానామాలు వస్తు నిర్దేశం చేస్తాయి కాబట్టి వాటి అర్థంతో నిమిత్తం లేదనే గార్డినర్ అభిప్రాయంతో పుల్‌గ్రాం (Pulgram) కు పేచీ లేదు; కానీ అర్థం లేదా నైఘంటిక విలువ (lexical value) ఉన్న సంజ్ఞానామాలు నిర్దుష్ట సంజ్ఞానామాలు కావనే గార్డినర్ వాదాన్ని పుల్‌గ్రాం ఖండిస్తారు. నేడెంత గుర్తించడానికి వీల్లేక పోయినా. ఒకప్పుడు భాషా వ్యవహర్తలకు నిత్య పరిచితమయిన అర్థం, లేదా నైఘంటిక విలువ సంజ్ఞానామాల వెనక ఉందని పుల్‌గ్రాం ఉద్ఘాటన :

> "I might agree that in proper names it is the sound and not the dictionary value that makes them meaningful. But it is unjustified to affirm that certain names are less properly proper names because of their obvious dictionary value, which might give a clue to the character of the object named. After all, there is at bottom of each name a dictionary value which, however unrecognizable and overgrown it may be to-day, at one time was obvious to the speakers". (Pulgram as quoted by Utley, 1963, 157).

2.3.5 సంజ్ఞావాచకాలకు సహజార్థం ఉందని పలువురు నామ విజ్ఞాన వేత్తల దృఢాభి ప్రాయం. ప్రధానంగా స్థలనామ వేత్తలందరూ స్థలనామాలు కేవలం అర్థ

రహితమైన ధ్వనులు కావని అభిప్రాయ పడినారు. స్థలనామ బహుముఖ ప్రాధాన్యాన్ని గుర్తించిన ఇసాక్ టెయిలర్ (Isaac Taylor) స్థలనామాలు కేవలం అర్థరహితమైనట్టి యాదృచ్ఛిక ధ్వనులు ఎన్నడూ కావని అభిప్రాయపడినాడు :

"Local names—whether they belong to Provinces, cities and villages or are the designations of rivers and mountains—are never merely arbitrary sounds, devoid of meaning". (Isaac Taylor, 1909, 19).

అమెరికా స్థలనామవేత్త జార్జి స్టీవర్ట్ (George Stewart) స్థల నామాలలోని వ్యస్తపదాల అర్థంకంటే, మొత్తం పేరులోని అర్థం గొప్పదని భావించినాడు : "The meaning of a name is more than the meaning of the words compositing it" (Stewart, 1967, 10).

అయితే కాలక్రమంలో స్థలనామాలకుండే అర్థాలు మనుష్యులు మరచిపోయారనీ, పేరు స్థలాన్ని స్వాభావికంగా వర్ణించాలనే ప్రాక్తన భావన పోయిందనీ స్టీవర్ట్ అభిప్రాయం. (Stewart, 1967, 21).

**2.3.6** సంజ్ఞానామాలు కేవల వాచ్యార్థ సూచకాలేనా, లేదా సహజార్థ సూచకాలు కూడానా అనే సమస్యపై వివిధ అభిప్రాయాలు గమనించాం. భాషలో వాటి వ్యాపారం (function) ఏమిటనే విషయం మీద భాషాశాస్త్రవేత్తల అభిప్రాయాలు పరికించడం మంచిది.

**2.3.7** సామాన్య సంజ్ఞావాచకాల మధ్య ప్రధాన విభేదం వాటి వ్యాపారం (function) లో ఉందనీ, సామాన్య వాచకాలు అర్థవంతమైన ప్రమాణాలైతే (meaningful units) సంజ్ఞావాచకాలు కేవలం సంజ్ఞలనీ (identification marks) స్టీఫన్ ఉల్‌మన్ అభిప్రాయం.

"The essential difference between common nouns and Proper names lies in their function, the former are meaningful units, the later mere identification marks". (Ullmann, 1962, 77).

సామాన్య వాచకాలనుంచీ సంజ్ఞానామాలను గుర్తించడం సులభమే అయినా, వాటి మధ్య ఉండే సరిహద్దురేఖ నిర్దిష్టమైంది కాదని, సామాన్య వాచక విష్పన్నాలైన Black Pool, New Castle మొదలైన స్థలనామాలెన్నో

కన్పిస్తాయని. అలాగే సంజ్ఞానామం సామాన్య వాచకంగా మారడం కూడా అసాధారణ మేమీ కాదని ఉల్‌మన్ భావిస్తారు (Ibid).

ఒక వ్యక్తిని మాత్రం ఉద్దేశించే పేరు సంజ్ఞానామమని ఎస్‌పర్సన్.

"A Proper name would naturally seem to be the name that can only be used in speaking of the individual" (Jespersen, 1958, 64.)

పర్వతశ్రేణులను సూచించే The Pyrenees; రాజకీయ ఫెడరల్ వ్యవస్థను నిర్దేశించే The United States సంజ్ఞావాచకాలేనని, వాటిని One Pyrenee, one United State అనరని, అవి ఏకవస్తు నిర్దేశకాలే నని ఎస్‌పర్సన్ అంటారు. వ్యవహారంలో ప్రతి సందర్భంలోనూ వక్తకూ శ్రోతకూ సంజ్ఞా వాచకోపయోగం ఏకవస్తు మాత్ర సంసూచకమూ, నిర్దిష్టపదార్థ పరిమితమూ నని ఆయన భావిస్తారు.

"Now every time a proper name is used in actual speech its value to both speaker and hearer is that of denoting one individual only, and being restricted to that one difinite being" (Ibid, 65).

సందర్భాన్ని (context) బట్టి నిర్దిష్ట వస్తు సూచన జరుగుతుందని చెప్పడానికి ఆయన ఒక ఉదాహరణ ఇచ్చినారు. ఈవాళ ఒక మిత్రబృందంతో మాట్లాడుతూ జాన్ అనే పేరు, ఆ పేరుగల ఒక నిర్దిష్ట వ్యక్తికి ఉపయోగించినంత మాత్రాన, మరునటిరోజు మరొక మిత్రబృందంలో అదే పేరును ఆ పేరే గల మరొక నిర్దిష్ట వ్యక్తికి ఉపయోగించ కూడదనే నిషేధ మేమీ లేదు కదా! (Ibid 65-66). సామాన్య నామాలకూ, సంజ్ఞానామాలకు మధ్య ఖచ్చితమైన సరిహద్దును నిర్ణయించడం సంపూర్ణంగా అసాధ్యమని ఉల్‌మన్ లాగా ఎస్‌పర్సన్ కూడా అభిప్రాయపడతారు. ఒక పరిచితమైన వ్యక్తినో, వస్తువునో (లేదా వ్యక్తులనో, వస్తువులనో) నిర్దేశించే యాదృచ్ఛిక సంజ్ఞ సంజ్ఞానామ మని ఆయన తేలుస్తారు:

"In general we may consider a proper name as an arbitrary lable used to denote a certain familiar person or thing (or group of persons or things (Jespersen as quoted by Utely 1963, 152).

సంజ్ఞావాచకాలు ఉపసర్జనాలు (substitutes) కావని. సందర్భాన్ని (context) బట్టి విశిష్టంగా వాచ్యార్థాన్ని మార్చే అన్వాదేశ ఉపసర్జనాలని (anaphoric substitutes) హాకెట్ అన్నారు.

> "Proper names" are not substitutes but in their behaviour they are much like anaphoric substitutes shifting their specific denotation from context to context—though less kaleidoscopically than do substitutes". (Hockett, 1959, 312)

సంజ్ఞానామాల విషయంలో సందర్భ (context) ప్రాధాన్యాన్ని గుర్తించిన వారు ఎస్పర్సన్, హాకెట్లు. ఒకే పేరున్న అనేక వ్యక్తులు లేదా స్థలాలు వ్యవహర్తల పరిచయంలో ఉంటే, ఆ వ్యవహర్తలమధ్య సాగే సంభాషణ సన్నివేశాన్ని బట్టి, దేశకాలాదులబట్టి వ్యక్తులూ, స్థలాల నిర్దేశం తప్పదు కదా!

2.4 సంజ్ఞానామ నిర్వచనం రూపొందించడానికి సంజ్ఞానామాల అర్థ ప్రతిపత్తిని, భాషలో వాటి వ్యాపారాన్ని విచారిద్దాం.

### 2.4.2 సంజ్ఞానామాలు : అర్థము

భాషా వ్యవహారంలో సంజ్ఞావాచకేతర పదాలు, పదబంధాలు అర్థనిరపేక్షకంగా వాడితే భావావగాహనకు తీరని నష్టం వాటిల్లుతుంది. కాబట్టి భాషా వ్యవహర్తకు దేశకాల స్థలానుగుణమైన అర్థ పరిజ్ఞానం (పదాలూ, అవి వ్యక్తం చేసే భావాల తీరుతో సంబంధం) ఉండాలి. లేకపోతే షెరిడన్ (Sheridan) నాటకం 'ది రైవల్స్' (The Rivals) లోని మిసెస్ మాలప్రోప్ (Mrs. Malaprop) లాగా, శూద్రకుని మృచ్ఛకటికంలోని శకారుడిలాగా భాషా సమాజానికి ఇబ్బంది తెచ్చి పెడతారు. కాబట్టి సంజ్ఞా వాచకేతర పద జాలానికి రూఢార్థ గ్రహణం వ్యవహర్తలకు తప్పని సరి. సంజ్ఞావాచకాల విషయంలో ఆ విధంగా కాదు. వాటి ప్రధాన వ్యాపారం నిర్దిష్ట వస్తు సూచనమే వాటికి వాచ్యార్థం (denotation) ప్రధానం. సహజార్థం (connotation) అప్రధానం. సాధారణంగా సహజార్థ నిరపేక్ష స్థితిలోనే సంజ్ఞావాచక వ్యవహార ప్రయోజనం సాగుతుంది. పదానికీ, వస్తువుకూ, అర్థానికి ఉండే సంబంధం సామాజికమైంది. అందువల్ల భాషలో రూఢి (established usage) ముఖ్యం.

వ్యుత్పత్తికంటే రూఢి బలవత్తరమైంది. సంజ్ఞావాచకాల రూఢి కేవల నిర్దిష్ట వస్తు సూచనమే. అయితే సంజ్ఞానామాల వ్యుత్పత్తిని త్రోసిరాజనడానికి వీల్లేదు. ప్రారంభంలో భాషా వ్యవహారంలో సంజ్ఞావాచకాలు సహజార్థ బోధ కాలుగా ఉన్నాయని ఒప్పుకోక తప్పదు. అయితే తర్వాత వాటి సహజార్థం మరుగున పడిపోవడం చూస్తాం. ఉదాహరణకు ఈ క్రింది సంజ్ఞానామాలను పరిశీలించవచ్చు :

మనుషులపేర్లు : ఎర్రయ్య. రెండు జడల సీత. ఇంటిపేర్లు : గుర్రం. పగడాల. ఊర్ల పేర్లు : ఉరుటూరు. కొత్తపల్లె. మేడిదిన్నె. ఖాజీపేట. బిడ్డరంగును బట్టి ఎర్రయ్య అనే నామకరణం జరిగి ఉండవచ్చు. కానీ ఈనాడు ఎర్రయ్య అనే పేరున్న వారందరూ ఎర్రగా ఉండకపోవచ్చు. అలాగే కాలేజీ రోజుల్లో రెండు జడలు వేసుకునే సీతకు రెండు జడల సీత అని ఎగతాళి పేరు (nick-name) అబ్బాయిలు పెట్టి ఉండవచ్చు. ఆ అమ్మాయి తర్వాత రెండు జడలు మానేసి ఒంటి జడే వేసుకున్నా, కొప్పు ముడుచుకొన్నా, రెండు జడల సీతగానే చలామణి అవుతుంది. అంటే వాచ్యార్థమే సహజార్థం మీద పైకొన్నదన్నమాట! పెంటయ్య. రుప్పయ్య. పుల్లయ్య మొదలైన నిందార్థక నామాల్లో (Opprobrious names) ఆచారబలంవల్ల సహజార్థ బోధకత పూర్తిగా మరుగున పడక పోవచ్చు. అయినా అవే పేర్లు ఏ తాతముత్తాతల జ్ఞాపకార్థమో పెట్టుకున్నట్లైతే అప్పుడు వాచ్యార్థమే ప్రాధాన్యం వహిస్తుంది. తెలుగు దేశంలోని గాంధీ. జవహర్. స్టాలిన్. లెనిన్ మొదలైన ప్రతిదేయ వ్యక్తినామాల్లో (loan-proper names) వాచ్యార్థమే ప్రాధాన్యం వహిస్తుంది. ఇంటిపేర్లను తీసుకుందాం. గుర్రం ఇంటి పేరుగాగల వాళ్ళ కెపుడో గుర్రం ఉండి ఉండవచ్చు, లేదా దానితో సంబంధం ఉండి ఉండవచ్చు. అయితే ఈనాడు ఆ ఇంటి పేరు ఉన్నవాళ్ళకంతా గుర్రా లుండకపోవచ్చు. అలాగే పగడాల అనే ఇంటి పేరు విషయం కూడా. ఇక ఊర్ల పేర్లను తీసుకుందాం. ఏ వందేళ్ళ కిందటో కొత్తగా వెలసిన ఊరును కొత్తపల్లె అని ఉంటారు. అది ఈనాడు కూడా కొత్తపల్లె కాదు కదా! ఎపుడో పరిసర ప్రాంతాల్లో పెద్దగా కన్పించిన ఊరును ఊరులూరు అన్నంత మాత్రాన ఈనాడు దాని పెద్దరికం విలవదు కదా! అలాగే మేడిదిన్నెలో ఈనాడొక్క మేడిచెట్టు కూడా లేకపోవచ్చు. ఇక మనుష్యనామ సూచకాలైన ఖాజీపేట మొదలైన వాటిని పరిశీలిస్తే ఆ సంబంధార్థకతకు

ఈనాడు విలువ పోయినట్లు గ్రహించగలం— ఖాళీ లేదు గనుక. అదే కాక పాతకొత్తపల్లె లాంటి ఊర్ల పేర్లు గమనించినట్లయితే ఈనాడు వాటి వాచ్యార్థతా ప్రాధాన్యం బోధపడుతుంది. అలాగే చూ. బ్రాహ్మణపల్లె; కమ్మవారి బ్రాహ్మణపల్లె, కులవృత్తి నామ సూచకాలైన గ్రామనామాలు ఈనాడు ప్రధానంగా వాచ్యార్థ ప్రాధాన్యం కలిగినవే. రెడ్డిపల్లె, కమ్మపల్లె, తొగటపల్లె, తురకపల్లెవంటి గ్రామాల్లో ఆయా కులాలవారు లేకపోయినా అవి గ్రామ సంకేతాలే.

### 2.4.3 సంజ్ఞానామాలు : భాషలో వాటి వ్యాపారం

సంజ్ఞానామాలు వాక్య ప్రమేయం (Sentence function) లోనూ, కారకం (case system) లోనూ సామాన్య వాచకాల వంటివే :

ఉదా : (అ) He saw a girl
He saw Elizabeth

(ఆ) He went to a village
He went to Rome

(ఇ) మహిషి గీచిన బొమ్మలు
రామారావు గీచిన బొమ్మలు

(ఈ) వాడు ఊరికి వెళ్ళినాడు
వాడు విజయవాడకు వెళ్ళినాడు.

సంజ్ఞావాచకాలకు వచన భేదకత్వం (number contrast) లేదు :

ఉదా : The mendips, కొత్తపల్లె
ఈ ప్రాంతంలో ఎన్ని తోట లున్నాయి
ఈ ప్రాంతంలో ఎన్ని కొత్తపల్లె లున్నాయి

నిర్ధారక పదాంశం (determiner or definite article) తో వినిర్మాణ క్రమమూ (Pattern) లేదు. ఆంగ్లభాషా సంజ్ఞానామాల్లో నిర్ధారక పదాంశం పాక్షికంగా ఉంటుంది. ఎస్పర్సన్ ప్రకారం జాన్ అనే పేరు ఏక దేశాన్ని నిర్దేశిస్తున్నది కాబట్టి దానికి సాధారణంగా నిర్ధారక పదాంశం రాదు. స్థల నామాల్లో ఇది పాక్షికంగా కన్పిస్తుంది. ఇంగ్లీషు నదుల పేర్లకు నిర్ధారక పదాంశం పూర్వం ఉండేది కాదు. బహుశా తర్వాత ఏర్పడి ఉండవచ్చు.

ఉదాహరణకు The River Thames వంటి నామ బంధాల్లో River అనే మాట లోపించగా The Thames అనే రూపం ఏర్పడింది. సముద్ర నామాలకు నిర్ధారక పదాంశం ఉంటుంది. సరోనామాలకు శూన్యం (Zero determiner). దేశ ద్వీప పర్వత పట్టణోద్యానవన నామాలకు కూడా బహువచనంలో తప్పిస్తే శూన్య నిర్ధారకమే ఉంటుంది. ఏమైనా నిర్ధారక పదాంశమే సంజ్ఞానామాలను సామాన్యవాచకాలనుంచీ వేరు చేస్తుందని అనుకోవడం పొరబాటు. (వివరాలకు చూ. Utley; 1983. 168-72). ద్రావిడ భాషా సంజ్ఞావాచకాలకు నిర్ధారక పదాంశం ఉండదు.

**2.4.4** సంజ్ఞానామాలు ఏకైక విషయ బోధకాలు. అయినా వ్యవహారంలో కొన్ని సందర్భాల్లో వాటి ప్రయోగం శ్రోతకు సంశయాస్పదం కావచ్చు. ఒకే పేరు కొందరు వ్యక్తుల కున్నపుడు మాటల సందర్భంలో పేర్కొన్న వ్యక్తి ఎవరనే సంశయం శ్రోతకు కలుగవచ్చు. అటువంటపుడు ఫలానా వ్యక్తి అని ఇంటి పేరు, వృత్తి, నివాసస్థానం మొదలైన ఇతర విషయ ప్రశంసతో ఆ వ్యక్తిని నిర్దేశించడం జరుగుతుంది. ఈ సందర్భంలో సంజ్ఞావాచకం వాచ్యార్థబోధకంగానే ప్రయుక్త మవుతుంది.

**2.4.5** సంజ్ఞావాచకాల విషయంలో సందర్భానికి (Context) ప్రాధాన్యం ఉంది :

ఉదా : (అ) కొత్తయిండ్లు చూశావా? కొత్తయిండ్లు. ఇక్కడ సామాన్య నామవాచకం.

కొత్తయిండ్లు చూశావా? కొత్తయిండ్లు. ఇక్కడ ఊరి పేరు.

(ఆ) కొట్టాలు ఎటువైపు? కొట్టాలు. ఇక్కడ సామాన్య నామ వాచకం.

కొట్టాలు ఎటువైపు? కొట్టాలు. ఇక్కడ ఊరి పేరు.

(ఇ) సుగాలి తండా ఎక్కడ? సుగాలి తండా. ఇక్కడ సామాన్య వాచకం.

సుగాలి తండా ఎక్కడ? సుగాలి తండా. ఇక్కడ ఊరి పేరు.

(ఈ) ఇది బలిపీఠం : ఇక్కడ బలిపీఠం, సామాన్య వాచకం.

ఇది బలిపీఠం : ఇక్కడ ముప్పాళ్ళ రంగనాయకమ్మ నవల పేరు.

పై ఉదాహరణల్లో ప్రయోగింపబడిన పదం సంజ్ఞావాచకమా లేదా సామాన్య వాచకమా అన్న విషయం సందర్భాన్ని బట్టి నిర్ణీత మవుతుంది.

ఈ క్రింది వాక్యాల్లో మనం ఉద్దేశించింది వ్యక్తినామమా లేక నదియొక్క పేరా అన్నది కూడా ప్రసంగ విషయం మీద లేదా పూర్వ సందర్భం మీద ఆధారపడి వుంటుంది.

ఉదా : గోదావరి ఎక్కడ ? ఒక నది పేరు.
గోదావరి ఎక్కడ ? ఒక అమ్మాయి పేరు

భాషలోని ఇతర పదజాలం లాగానే సంజ్ఞానామాలు కూడా యాదృచ్ఛిక వాగ్రూప సంకేతాలే.

పై పరిశీలనను బట్టి సంజ్ఞానామాల్ని ఈ క్రింది విధంగా నిర్వచింపవచ్చు :
వ్యుత్పత్తి నిరూపణలో సహజార్థ బోధకత ఉన్నా, రూఢిలో అర్థనిరపేక్షకంగా ఒక వ్యక్తినో, స్థలాన్నో, వస్తువునో దేశకాల స్థల సందర్భాలనుబట్టి నిర్దిష్టంగా సూచించే యాదృచ్ఛిక వాగ్రూప సంకేతమే (ఒక పదం కానీ, పద బంధం కానీ) సంజ్ఞానామం.

## 2.5 సంజ్ఞావాచక వర్గీకరణ :

2.5.1 భాషలో సంజ్ఞావాచకాలు భౌతిక సంపదాభివృద్ధితోపాటు, విజ్ఞాన వికాసంతో పాటు వ్యాప్తి చెందుతూనే ఉంటాయి. అందువల్ల సంజ్ఞావాచక వర్గీకరణ క్లిష్టమౌతుంది. ఈ కారణం వల్లనే కాబోలు సంజ్ఞావాచకాలను వర్గీకరించిన వారు వేరువేరుగా కన్పిస్తారు. జాఫ్రీపేటన్ (Geoffrey Payton) సంజ్ఞానామాలను విషయవర్గాలు (Subject categories) గా వర్గీకరించినారు. పేటన్ ప్రతిపాదించిన విషయ వర్గీకరణ 67 శీర్షికలతో కూడుకొన్నది. (Payton, 1969, Subject - categories), ఈ వర్గీకరణలో అతివ్యాప్తి, దోషాలు కన్పిస్తాయి. ఉదాహరణకు : Payton చేసిన "Arts cinema, children stories, cartoons and comics, fiction, opera, poetry and verse, literary allusions, theatre societies, institutions వంటి వివిధమైన విషయ వర్గీకరణ అతి వ్యాప్తికి (over differentiation) పాల్పడింది. Encyclopaedia Britannica, Vol. 15 లోని సంజ్ఞా వాచ

వర్గీకరణ మే_ల్తరమైంది (1969, 1157). ఈ వర్గీకరణను ప్రేరణగా తీసు కొన్నా కేవలం దాన్నే అనుసరించలేదు. సంజ్ఞానామాలకు ఈ క్రింది స్థూల మైన వర్గీకరణను ప్రతిపాదించవచ్చు.

2.5.2 వ్యక్తినామాలు (Personal names) : పేర్లు అనగానే మనకు వెంటనే స్ఫురించేవి మనుష్యులపేర్లు. ఇవి సంజ్ఞావాచకాల్లో అతి ప్రధానమైనవి. ఒక మనిషి నుంచి వేరొక మనిషిని నిర్దిష్టంగా గుర్తించడానికి ఏ సమాజంలో నయినా వ్యక్తులకు పేర్లుంటాయి. ఈనాడు భాషలేని మానవసమాజాలు లేనట్లే పేర్లులేని మనుష్యులంటూ ఏ సమాజంలోనూ లేరు. మానవజాతి నాగరికతా పరిణామదశల్లో అత్యంత పురాతన కాలంలోనే మనుష్యులపేర్లు మొదలయ్యాయని అందరూ అంగీకరించిన సత్యం. ప్రపంచంలోని వివిధ సమాజాల్లో ఉండే అసంఖ్యాకమైన స్త్రీ పురుషుల పేర్లలోను, వారి నామకరణ విధానం లోను ఆయా సమాజాల భాషా, సంస్కృతీ సంప్రదాయాలూ, విశ్వాసాలూ దాగి ఉంటాయి. వ్యక్తినామాల్లో ఈ క్రింది వర్గీకరణ చేయడానికి వీలుంటుంది. ఇంటిపేర్లు వ్యక్తినామాల్లో భాగమే.

(1) పెట్టిన పేర్లు
(2) ముద్దు పేర్లు
(3) ఉరవ్‌లు
(4) ఎగతాళి పేర్లు
(5) కలం పేర్లు
(6) బిరుదులు
(7) ప్రథమాక్షర సంఘటిత నామాలు.

(1) పెట్టిన పేర్లు (given names) : తల్లిదండ్రులో, ఇతర కుటుంబ సభ్యులో, బంధువులో, స్నేహితులో, కులపెద్దలో, కులగురువులో ఆయా సమాజాల నామకరణ పద్ధతుల ననుసరించి పుట్టిన బిడ్డకు చేసే నామకరణమే పెట్టిన పేరు. శిశువుల నామకరణం వివిధ సమాజాల్లో వివిధ సంప్రదాయాలకు, ఆచారాలకు సంబంధించి ఉంటుంది. సాధారణంగా ఆటవిక సమాజాలలోని నామకరణ పద్ధతి నాగరిక సమాజాలవారి పద్ధతికి భిన్నంగా కూడా ఉంటుంది. నాగరిక సమాజాల్లోనూ ఒక సమాజంలోని నామకరణ విధానం మరొక సమాజం వారికి విచిత్రంగా కన్పించవచ్చు. గణ సంకేతం (tribal totem) తాంత్రిక తత్వం (magic spell), పరిసరాల ప్రాభవం (environment) మొదలైన అంశాలు అనాగరిక సమాజాల నామకరణ విధానంలో గోచరిస్తాయి. దైవిక నామాలు,

మతాచారాలు, మూఢనమ్మకాలు, ఆధ్యాత్మికదృష్టి, వృత్తిధర్మం, కులం, పూర్వ వంశీయుల స్మరణ, నవ్యత (fashion) మొదలైన లక్షణాలు నాగరిక సమాజంలో ప్రాధాన్యం వహిస్తాయి. (వివరాలకు చూ. Benjamin Walker, Vol. II, 116-121; Masani, 1966) సాధారణంగా ఏ సమాజం వారైనా బిడ్డలకు పెట్టేపేర్లు శుభప్రదంగా ఉండాలనే భావిస్తారు. కానీ కొన్ని సమాజాల్లో, ఆ సమాజాలవారి మూఢవిశ్వాసాలు, నిషేధాచారాల (taboos) వల్ల నిందార్థక నామాలు (Opprobrious names) వ్యక్తుల పేర్లలో కన్పిస్తాయి. ఇంగ్లీషువాళ్ళ పేర్లలో "Filth, Coward, Worthless" మొదలైనవి, తెలుగువాళ్ళ పేర్లలో పెంటయ్య, కుప్పయ్య, పుల్లయ్య, మునలయ్య, తిక్కన్న మొదలైనవి ఉదాహరణలు (వివరాలకు చూ. Masani, 1966, ch. IV. Opprobrious names, 66-76.)

(2) ముద్దు పేర్లు (Pet names). పెట్టిన పేరున్నా తల్లిదండ్రులు, ఆప్తులూ, ముద్దుగా ఒక వ్యక్తిని పిలిచే పేరే ముద్దు పేరు.

ఉదా : అమ్మడు, బాబ్జి, చిట్టి, బుజ్జి మొదలైనవి. ఇవి కొన్ని సమయాల్లో ఉరవులుగా కూడా మారుతాయి.

మనుషులకు మాత్రమే కాక జంతువులకు కూడా ముద్దు పేర్లు పెట్టడం చూస్తుంటాం.

ఉదా : జానీ, రాము (కుక్కల పేర్లు).

(3) ఉరవులు (Aliases) : (< ఉ. ఉర్ఫ్) ఒక వ్యక్తికి రెండు పేర్లు ప్రచారంలో ఉన్నపుడు లేక అనే అర్థంలో ఉపయోగించే వేరొక పేరు ఉరవు పేరు.

గంగయ ఉరవు చిన్నరాజు; Simpson alias Smith.

(4) ఎగతాళి పేర్లు (to-names/nick-names) : పెట్టిన పేర్లకు బదులు వేళాకోళానికి, వెక్కిరించడానికి లేక చనువు కొద్దీ, చమత్కారం కొద్దీ ఉపయోగించే పేర్లు.

ఉదా : చకారకుక్షి : వేదవ్యాసునికి కాళిదాసు పెట్టిన పేరు.

పీరిగాడు : వీరేశలింగం పంతులుకు కొక్కొండవారు పెట్టిన పేరు.

ముక్కు తిమ్మన : నంది తిమ్మన.

(5) కలం పేర్లు (Pen-names) :

రచయితలు తమ పేర్లకు బదులు వాడే మారు పేర్లు.

బుచ్చిబాబు : శివరాజు వెంకట సుబ్బారావు.

ఆరుద్ర : భాగవతుల శంకరశాస్త్రి.

చెరబండరాజు : బద్దం భాస్కర రెడ్డి.

మాక్జిం గోర్కీ : అలెక్సి మెయ్ మాక్జి విచ్ పెష్కోవ్;

(6) బిరుదులు : కవితిలక. కళాప్రపూర్ణ. దేశోద్ధారక. లోకమాన్య. మహాత్మ ఇత్యాదులు.

(7) ప్రథమాక్షర సంఘటిత నామాలు (Acronyms) : వ్యక్తి పూర్తి పేరులోని మొదటి అక్షరాలతో కూర్చిన పేరు ప్రథమాక్షర సంఘటిత నామం.

ఉదా : శ్రీ శ్రీ : శ్రీరంగం శ్రీనివాసరావు.

కొకు : కొడవటిగంటి కుటుంబరావు.

సినారె : సి. నారాయణ రెడ్డి.

గోరా : గోపరాజు రామచంద్రరావు.

బంగోరె : బండి గోపాలరెడ్డి.

ఈ సంప్రదాయం సంస్థల పేర్లలో కూడా కన్పిస్తుంది.

ఉదా : ఐరాస : ఐక్య రాజ్య సమితి.

అరసం : అభ్యుదయ రచయితల సంఘం.

ముఖ్యంగా దీర్ఘమైన సంస్థల పేర్లను ఇంగ్లీషులో ఈ విధంగా సంక్షిప్తీకరించడం ఎక్కువ.

ఉదా : UNESCO : United Nations Educational, Scientific, and Cultural Organisation.

2.5.3 ఇంటిపేర్లు (Surnames/Family Names) : "ఎప్పుడైనా లోకంలో ఒక వ్యక్తినుంచి వేరొక వ్యక్తిని గుర్తించవలసి వచ్చినపుడు. వారిరువురి పేళ్ళు ఒకటే అయినపుడు ఇంటిపేరుతో అవసరం ఏర్పడుతుంది .... .... .... ఒక

కుటుంబంలోని వారిని మరియొక కుటుంబంలోని వారినుండి వేరు చేసి పిలువ వలసి వచ్చినపుడే ఇంటి పేరు కావలసి వస్తుంది." (నారాయణరావు. 1946. 378.) ఇంటిపేర్లు వ్యక్తినామాల్లో కారక రీత్యా (Syntactically) భాగమే. ఇంటిపేర్లు పెట్టిన పేర్లతో సంబంధార్థాన్ని కలిగి ఉంటాయి. అయినా వ్యక్తి నామాల్లో పెట్టిన పేర్లు లోపించి, ఇంటి పేర్లతోనే దేశకాల సందర్భాలను బట్టి వ్యక్తులను నిర్దిష్టంగా సూచించడం జరుగుతుంది. ఇది తెలుగు వాళ్లలో మరీ ఎక్కువ.

ఉదా : విశ్వనాథ సత్యనారాయణ : విశ్వనాథ వారు.

గురజాడ అప్పారావు : గురజాడ వారు.

ఈ కారణంగా ఇంటిపేర్లను సంజ్ఞా నామాల వర్గీకరణలో వ్యక్తి నామాల క్రింద కాక ప్రత్యేక వర్గంగా ఇవ్వడం జరిగింది.

తెలుగువాళ్ళ ఇంటి పేర్లలో గ్రామనామాలు, కులనామాలు, వ్యక్తినామాలు, వంశనామాలు మొదలైనవి కన్పిస్తాయి. సంప్రదాయాన్ని బట్టి కూడా ఇంటి పేర్లు మారతాయి. ఉదా : తెలుగు దేశంలోని స్త్రీలపేర్లు. వివాహం కాగానే స్త్రీల ఇంటిపేర్ల స్థానంలో వాళ్ల భర్తల ఇంటిపేర్లు చేరతాయి. ఒక భాషా ప్రాంతంలో భిన్న ప్రాంతాల్లో గల ఇంటిపేర్లను పరిశీలించడం ద్వారా, ఇంటి పేర్ల మధ్య గల సామాజిక సంబంధాలూ, వాటి వెనుక గల సంస్కృతీ చరిత్రా తెలుస్తాయి.

2.5.4 జాతి కులగోత్ర నామాలు : సామాజిక గణాలనూ, తెగలనూ నిర్దిష్టంగా తెల్పే పేర్లివి. సాధారణంగా వీటిని సముదాయ వాచకాల (collective nouns) కింద చేరుస్తుంటారు.

ఉదా : నీగ్రో, రెడ్ ఇండియన్ : జాతుల పేర్లు.

బ్రాహ్మణ, వెలమ : కులాల పేరు.

భరద్వాజ, విస్తరాకుల : గోత్రాల పేర్లు.

2.5.5 స్థల నామాలు (Place Names): భౌగోళిక నైసర్గిక సంజ్ఞలు (Geographical, topographical designations). ఒక స్థలం నుంచి వేరొక

స్థలాన్ని వేరుగా నిర్దేశించాలనుకున్నపుడు ఆ స్థలానికి పే రవసరం. భాషోత్ప త్తిని ఎట్లా నిర్ణయించలేమో, అట్లాగే స్థలాలపేర్ల పుట్టుకను నిర్ణయించి చెప్పడం సాధ్యం కాదు. కానీ వాటి పుట్టుకకూ, మానవ సమాజానికీ ఉండే సంబంధాన్ని వివరించవచ్చు. మనచుట్టు ఉన్న భౌతిక జగత్తులోని నదులూ, సముద్రాలూ, కొండలు, కోనలూ, గుట్టలు, మిట్టలూ, పర్వతశ్రేణులూ, పీఠ భూములూ, ఎడార్లూ, వనాలూ, ఊర్లూ, సరిహద్దులూ, భౌగోళిక విభాగాలూ (నాడు, మండలం, రాష్ట్రం, దేశం, ఖండం మొదలైనవి), విశ్వాంతరాళ గోళాలు మొదలైన వాటిని సంకేతించేవి స్థలనామాలు.

2.5.6 <u>సంస్థ నామాలు (Names of Institutions)</u> : నాగరికత, పరిపాలనా వ్యవస్థల అభివృద్ధివల్ల ఏర్పడిన, ఏర్పడుతున్న మత రాజకీయ విద్యాకళాది సంస్థలపేర్లు.

ఉదా : British Standards Institution, Oxford University,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తెలుగు అకాడెమి మొదలైనవి.

2.5.7 <u>శీర్షికలు (titles)</u> ; కళారంగానికి చెందిన కావ్య, నాటక, కథా, నవలా, చిత్ర, చలనచిత్రాదుల పేర్లు.

ఉదా : మహాభారతం
మహాప్రస్థానం
Paradise Lost } కావ్యాలపేర్లు

అభిజ్ఞాన శాకుంతలమ్
Hamlet } నాటకాలపేర్లు.

గాలివాన : పాలగుమ్మి పద్మరాజు ప్రసిద్ధ కథ పేరు.

Rain : సామర్‌సెట్ మామ్ ప్రసిద్ధ కథ.

చివరకు మిగిలేది
Ulysses } నవలల పేర్లు.

గుయెర్నికా (Guernica) : పికాసో చిత్రం పేరు.

మోనలిసా (Monalisa) : లియొనార్డో డ విన్సీ చిత్రం పేరు.

పైసా
కుతుబ్ మీనార్ } గోపురాల పేర్లు.

మల్లేశ్వరి
Battleship Potmkin } చలన చిత్రాల పేర్లు.
పథేర్ పాంచాలి

2.5.8 వాణిజ్య వాచకాలు (Brand Names): వాణిజ్య వ్యాపార ప్రపంచంలో బ్రాండుకున్న విలువ అనమానమైంది; వస్తువునే మించింది.

ఉదా : కోకో కోలా (Coco-Cola) కొడక్ (Kodak) ఈస్ట్‌మన్ కలర్ (Eastman Colour) అమృతాంజనం, లోధ్ర మొదలైనవి.

2.5.9 చారిత్రక సన్నివేశ నామాలు (Names of Events in History): వివిధదేశేతిహాసాల్లో. చరిత్రల్లో జరిగిన ప్రముఖ సంఘటనలను నిర్దేశించే పేర్లు.

ఉదా : కురుక్షేత్రం, కోడిపోరు, అక్టోబర్ విప్లవం (October Revolution) జెనీవా ఒప్పందం (Geneva Convention), సిమ్లా ఒప్పందం (Simla Agreement) మొదలైనవి.

2.5.10 వస్తునిర్దేశక సంజ్ఞానామాలు (Quasi-Personal names): మానవ కల్పితమైన నౌకలు, విమానాలు, రోదసి నౌకలు, ఆయుధాలు మొదలైన వాటిని మానవీకరణ దృష్టితో పెట్టిన పేర్లు :

ఉదా : విక్రాంత్ : నౌక పేరు.
వైజయంతి : ట్యాంకు పేరు.
జల ఉష : నౌక పేరు.

2.5.11 భావనిర్దేశక సంజ్ఞా నామాలు (Personified abstractions):

అమూర్తాలైన భావాలను మానవీకరణ దృష్టితో పెట్టిన పేర్లు.

ఉదా : Hope : A character in Bunyan's Pilgrim's Progress.

వివేకుడు, దంభుడు
మోహుండు, అహంకారుడు } ప్రబోధ చంద్రోదయంలోని పాత్రల పేర్లు.
కాముడు, సదాచారుడు

తత్వ వాచకాలు : (Names of abstractions not personified)

మానవీకరణ దృష్టితో పెట్టిన అమూర్త భావాల పేర్లు.

Marxism, Stoicism, అద్వైతం, బౌద్ధం మొదలైనవి.

2.5.12 పలురకాలైన సంజ్ఞావాచకాల శాస్త్రీయ పరిశీలనకు నామ విజ్ఞానం (Onomastics) అని పేరు. ఈ విజ్ఞాన శాఖ భాషా విజ్ఞానంలో ఒక విభాగం. ఈ నామ విజ్ఞానంలో ప్రధాన భాగాలు రెండు :

(అ) మనుష్యనామ విజ్ఞానం (Anthroponymy: Gk. *Anthropos*—man. *Onoma*—name): మనుష్య నామాల స్వరూప తత్వాలను పరిశీలించే విజ్ఞాన శాఖ.

(ఆ) స్థలనామ విజ్ఞానం (Toponymy: Gk. *topos*—place. *Onoma*—name) భౌగోళిక రోదసీ సంబంధ స్థలనామాల స్వరూప తత్వాలను పరిశీలించే విజ్ఞాన శాఖ.

స్థల నామకరణం అస్తవ్యస్తంగా జరిగే విషయం కాదు. ఒక భాషా ప్రాంతపు ప్రజల మానసిక ప్రవృత్తికి, సాంఘిక చరిత్రకు, సంస్కృతికి, భాషావ్యవస్థకు లోబడే స్థలనామకరణం జరుగుతుంది. కాబట్టి స్థలనామ పరిశోధనకు బహుముఖ ప్రయోజన ముంది.



# అధ్యాయం - 3

## స్థలనామ పరిశోధనా ప్రయోజనం : స్థలనామ పరిశోధనా వికాసం

### 3.1 స్థలనామ పరిశోధనా ప్రయోజనం :

3.1.1 ఒక భాషా సమాజంలోని స్థలనామోద్భవ వికాస పరిశోధన ఆ సమాజపు భాషా చారిత్రక సాంస్కృతిక విశేషాలను తెలియజేస్తుంది. స్థలనామాలు ఒక జీవద్భాషలోని పదజాలమే అయినా, వాటికి విశిష్ట ప్రయోజనం ఉంది. అవి భాషా చరిత్ర నిర్మాణ సామగ్రి; జాతికథాఖనులు: ప్రాచీన భాషను, చరిత్రను, సంస్కృతిని నిక్షిప్తం చేసుకొన్న శిలాజాలు (fossils) అని ప్రముఖుల అభిప్రాయం :

"Place names occupy, therefore, a unique situation in language being frequently the fossil representatives of an immemorial past". (Collier's Encyclopaedia, Vol. 16, 1952, 83),

"They may be regarded as records of the Past". (Isaac Taylor, 1909, 19),

"Every place name is a fossilized philological fact". (Thyagaraju, 1945, 51).

"Place names arise from and are influenced by and throw light upon the language and speech habits of people (Wain Wright, 1962, 10).

స్థలనామ పరిశోధనకు గల బహుముఖ ప్రయోజనాన్ని భాషా శాస్త్రవేత్తలూ, చరిత్రకారులూ, పురాతత్వశాస్త్రవేత్తలూ, మానవశాస్త్రజ్ఞులూ, జాతిశాస్త్రజ్ఞులు గుర్తించినారు. జంతుశాస్త్రజ్ఞుడు సైతం దీని ప్రాధాన్యాన్ని ఒప్పుకున్నాడు. ఒక ప్రాచీన జంతువు లేదా నశించిపోయిన ఒక జంతుజాతి నివాస ప్రాంతాన్ని నిర్ధరించడానికి, పేర్లలో శిలాజాలవలె దాగిన జంతునామాలు జంతుశాస్త్రజ్ఞునికి ఉపయోగిస్తాయి.

3.1.2 స్థలనామాలు భాషకు చెందిన పదజాలమే. అందువల్ల భాషాశాస్త్రజ్ఞుడు స్థలనామేతర పదజాలాన్ని భాషాదృష్టితో ఏ విధంగా పరిశీలిస్తాడో, అదే విధంగా స్థలనామాలను కూడా పరిశీలిస్తాడు. భాషా వికాసాన్ని గమనించడానికీ, సజాతీయ భాషలతో సంబంధాన్ని నిరూపించడానికీ, అన్య భాషా ప్రభావాన్ని గణించడానికీ, మాండలిక భాషాలక్షణాలను వింగడించడానికీ స్థలనామ పరిశోధన తోడ్పడుతుంది. వర్ణనాత్మక, చారిత్రక, తులనాత్మక పద్ధతుల ద్వారా చేసే స్థలనామ పరిశోధన వర్ణ నిర్మాణం (Phonology), పద రూప నిర్మాణం (Morphology), శబ్దార్థ తత్వం (Semantics), నిఘంటు నిర్మాణం (Lexicography), మాండలిక విజ్ఞానం (Dialectology), లిపి విజ్ఞానం (Graphemics) మొదలైన భాషాశాస్త్ర విభాగాల అవగాహనకు యెంతో ఉపయోగకారి.

3.1.3 స్థలనామ పరిశోధన ఒక భాషా సమాజపు పూర్వ చరిత్ర (Pre-history) రచనకు తోడ్పడుతుంది. స్థలనామాలలోని విశేషణ విశేష్య భాగాల ప్రథమావయవ (First element), ద్వితీయావయవా (Second element) ల వ్యాప్తి ఆవృత్తి (frequency), వ్యుత్పత్తుల (Etymologies) ను పరిశీలించడం ద్వారా ప్రజల వలసలు, జాతుల పరస్పర సంసర్గం, సాంఘిక రాజకీయ మత వ్యవస్థాది స్థితిగతులూ తెలుస్తాయి. స్థలనామ పరిశోధనా ఫలితాల సహాయం వల్లనే పూర్వ చారిత్రక, చారిత్రక యుగాల్లో థ్రేసియన్ (Thracian) ఇల్లిరియన్ (Illyrian), ఐబీరియన్ (Iberian), రోమన్ (Roman), స్కాండినేవియన్ (Scandinavian), జర్మానిక్ (Germanic), గ్రీక్ (Greek), కెల్టిక్ (Celtic), అరబిక్ (Arabic) రెడ్ ఇండియన్ (Red Indian) ద్రావిడాది జాతుల కదలిక, వలసల తీరు తెన్నులు కొంతవరకు తెలుసుకోగలుగుతున్నాం. జర్మనీ స్థలనామాల్లో స్లావ్ (Slav), కెల్టిక్ (Celtic) లక్షణాలూ, స్పెయిన్ స్థలనామాల్లో ఐబీరియన్, కెల్టిక్, ఫోనిషియన్ (Phoenician) రోమన్, గోథ్, అరబిక్ భాషాలక్షణాలూ, ఆంగ్ల స్థలనామాల్లో కెల్టిక్, స్కాండినేవియన్, నార్మన్, ఆంగ్లో సాక్సన్ లక్షణాలూ, ఫ్రెంచి స్థలనామాల్లో గాల్ (Gaul) రోమన్ లక్షణాలు, ఇండో ఆర్యన్, బాస్క్ (Basque) స్థలనామాల్లో ద్రావిడ భాషా లక్షణాల ముద్ర కన్పిస్తున్నట్లు ఈనాడు మనకు తెలియడం స్థలనామ పరిశోధనా సహాయం వల్లనే.

3.1.4 ప్రాచీన జర్మన్ సరిహద్దు ప్రాంతాల వారిని గూర్చిన వివరాలను స్థలనామ పరిశోధనవల్ల అడాల్ఫ్ బాఖ్ (Adolf Bach) వెలుగులోనికి తెచ్చినాడు. ఫ్రెంచి స్థలనామాలను పరిశోధించి గాల్. రోమన్ సంబంధాలను డాజా (Dauzat) నిరూపించినాడు. ఆంగ్ల స్థలనామాల్లో కన్పించే కెల్టిక్, స్కాండినేవియన్, నార్మన్, ఆంగ్లో సాక్సన్ లక్షణాలను నిశితంగా పరిశీలించి వలసలూ (migrations), స్థావరాలూ (settlements), ఫ్యూడల్ వ్యవస్థల గూర్చి అలెన్ మాయర్ (Allen Mawer), ఎఫ్. ఎం. స్టెంటాన్ (F. M. Stenton) లు వివరించినారు. ఇంగ్లండు నదుల పేర్లలో దాగిన కెల్టిక్ లక్షణాలను ఐలర్ట్ ఎక్వాల్ (Eilert Ekwall) వెలికి తెచ్చినాడు. ఎక్వాల్ కూర్చిన "The Conscise Oxford Dictionary of English Place Names" లో ఆంగ్ల స్థలనామాలపై గల వివిధ భాషా సంస్కృతుల ముద్రలు మనం చూడవచ్చు. ఆంగ్ల స్థలనామ సంఘం (English Place Name Society) ప్రచురించిన వివిధ సంపుటాల్లో ఈ విషయాన్ని విపులంగా చూడవచ్చు. అదే విధంగా బెంగాల్ స్థలనామాల్లో కన్పించే ఆర్యేతర భాషా లక్షణాలను పరిశీలించి ఆర్యుల రాకకు పూర్వమే ఆ ప్రాంతంలో సంస్కృత ప్రాకృతేతర భాషా వ్యవహర్తలైన అనార్య జాతులవారు నివసించినట్లు సునీత కుమార చటర్జీ తెలిపి, బెంగాలు స్థలనామాల్లో దాగిన ద్రావిడభాషా లక్షణాలను వెలికి తెచ్చినాడు. (Chatterji, 1926, 64-74), ఇండో-ఆర్యన్ భాషా ప్రాంతపు స్థలనామాల్లో గల ద్రావిడ భాషాలక్షణాలను కొందరు స్థలనామ పరిశోధకులు గుర్తించినారు కానీ అది అసంపూర్ణ కృషియే. (చూ Goswami, 1943, Kurl, 1965, 3. 8). ఇండో ఆర్యన్ స్థలనామాల అధ్యయనం పూర్తి అయినపుడే ద్రావిడుల వలసలూ, స్థావరాలను గూర్చిన వివరా లనేకం స్పష్టమవుతాయి. బాస్క్ స్థలనామాలలోని ద్రావిడ భాషా లక్షణాలను డా. లహోవరీ (Dr. Lahovary) Dravidian Origins and the West (1963) అన్న గ్రంథంలో నిరూపించ డానికి ప్రయత్నించినాడు. క్లిమెన్స్ షూనర్ (Clemens Schooner) మధ్య యూరప్, పశ్చిమ ఆసియా ప్రాంతాలలో ద్రావిడ భాషా లక్షణాలు గల 800 స్థల నామాలను తన ఆర్మలూరిక్ (Armalurich) లో ఉదహరించినాడు.

3.1.5 స్థలనామ పరిశోధన ఒక సమాజంలోని వర్ణవ్యవస్థనూ, నాగరికతనూ తెలుసు కోడానికి కూడా ఉపయోగిస్తుంది. స్థలనామాల విశేషణ భాగంలో (Adjectival

element) అంతే ప్రథమావయవం (First element)లో కన్పించే మనుష్య వంశనామాల పరిశీలనవల్ల స్త్రీ పురుష నామకరణ విధానం, గ్రామ నామకరణంతో సంబంధం గల ఆయా ప్రసిద్ధ వ్యక్తుల చరిత్ర తెలుస్తాయి; ఇంటి పేర్ల పరిశీలనవల్ల ఆయా వంశీకుల వ్యాప్తి తెలుస్తుంది. వర్ణనామాలవల్ల సామాజిక వర్ణ వ్యవస్థ. వృత్తినామాల పరిశీలనవల్ల సమాజంలోని వర్గ విభజన మొదలైన సాంఘిక విశేషాలు తెలుస్తాయి.

3.1.5 ప్రాంతీయ భౌతిక లక్షణాలూ (local physical features), వాస్తు నిర్మాణం పద్ధతులూ, జనసాంద్రతావ్యాప్తి, పరిశ్రమలూ, వ్యవసాయ విధానమూ, పశు వృత్తి సంపదా మొదలైన విశేషాలు కూడా స్థలనామ పరిశోధనవల్ల గ్రహించవచ్చు ఒక సమాజపు మత విశ్వాసాలు, మూఢనమ్మకాలు, ఐతిహ్యాలు వగైరా తెలుసుకోడానికి కూడా స్థలనామ పరిశోధన ఉపయోగిస్తుంది. కొన్ని స్థలనామాలకు కల్పించిన లోకనిరుక్తులు (Folk etymologies) ఆ సమాజపు జానపద విజ్ఞానా (Folk lore) వగాహనకు ఎంతో ఉపకరిస్తాయి. పైన పేర్కొన్న గ్రామనామ పరిశోధన బహుముఖ ప్రాధాన్యం తెలుగు గ్రామనామాలకు కూడా అన్వయిస్తుంది. (చూ. 3. 6) ఇట్టి బహుముఖ ప్రాధాన్యం వల్ల స్థలనామ పరిశోధన ఇటీవల ఒక విజ్ఞానశాఖగా రూపొందింది.

## 3.2 స్థలనామ పరిశోధనా వికాసం :

3.2.1 ఈనాడు వివిధదేశాల్లో దాదాపు వంద భాషలకు చెందిన స్థలనామ పరిశోధన సాగుతూంది. (Onoma, Vol. XV, 1970). స్థలనామ విజ్ఞానానికి నేడు ప్రత్యేక సంఘాలూ కూటాలూ, (Congresses) పత్రికలూ ఉన్నాయి. పాశ్చాత్య దేశాల్లో స్థలనామ సేకరణ, వర్గీకరణ వివరణలు పెద్ద ఎత్తున సాగుతున్నాయి; స్థలనామ నిఘంటువులు, వ్యాకరణాలు కూడా వస్తున్నాయి.

### 3.2.2 యూరప్‌లో స్థలనామ పరిశోధన :

ప్రాచీన మధ్యయుగాల్లో స్థలనామ పరిశోధనా ప్రాధాన్యం జిజ్ఞాసువులకు తెలియదు. మతగ్రంథాల్లోని కొన్ని స్థలనామాల వ్యుత్పత్తులను వారు ప్రాసంగికంగా చర్చించినా, అవి భాషాశాస్త్ర సమ్మతం కాని ఊహాగానాలు మాత్రమే. స్థలనామ పరిశోధన ఒక విజ్ఞాన శాఖగా ప్రారంభమయిందీ, పరిణమించిందీ

ఈ శతాబ్దంలోనే. 19-వ శతాబ్ది ఉత్తరార్థంలో ఈ విజ్ఞానశాఖకు పునాదులు పడినాయి. జర్మనీలో ఫార్‌స్తమన్ (Forsteman), నార్వేలో, రై (Rygh) స్వీడన్‌లో నొరీన్ (Noreen), ఇంగ్లండులో స్కీట్ (Skeat), ఫ్రాన్స్‌లో, లాంగ్మన్ (Longman) స్థలనామ పరిశోధనారంగంలో కృషి సల్పిన ఆద్యులు, ముఖ్యులు.

3.2.3 స్థలనామ స్వరూప తత్వ నిరూపణలో చారిత్రక రూపాల ప్రాధాన్యాన్ని, నైసర్గిక స్థితిగతులతోటి సంబంధాన్ని వారు గుర్తించినారు. అర్థరహితమైన స్థలనామం లేదని, స్థలనామాలు సజీవ భాషలోని ప్రాచీన రూపాలను కలిగి ఉంటాయని, అవి ఒక భాషా సమాజపు చారిత్రక సాంస్కృతిక విశేషాలను తెలియజేస్తాయని వారు నిరూపించినారు.

3.2.4 1921లో ఆంగ్ల స్థలనామపరిశోధనా సంస్థ (English Place Name Society) స్థాపనతో యూరప్‌లో స్థలనామ పరిశోధనలో ఒక నూతనాధ్యాయం మొదలైంది; ఒక అపూర్వ పరిణామమూ సంభవించింది. బ్రిటిష్ అకాడమి ఆధ్వర్యాన అలెన్ మాయర్, ఎఫ్. ఎం. స్టెంటాన్‌ల నాయకత్వంతో ఆంగ్ల స్థలనామాల సర్వే 1924 లో మొదలైంది. ఈ సర్వే పద్ధతి ఆదర్శప్రాయమైంది :

"The English Place Name Society undertaken with the approval of the British Academy proposes to interpret county by county the place names of England and to draw from them all those conclusions, historical, cultural and linguistic, which are implicit in them. Its volumes will be planned and written to appeal to the educated public at large and not the specialist alone. Throughout its work, its aim will be to secure the co-operation of all those scholarly interests, historical, topographical, archaelogical, linguistic—that are concerned with the study of Place names in its widely varied aspects". (Mawer and Stenton as quoted by Silva, 1949-50, 4). English Place Name Society స్థాపనతో ఇంగ్లండులో వివిధ ప్రాంతాలకు చెందిన స్థల నామాల సేకరణ, వర్గీకరణ, పరిశీలన, వివరణలు మొదలైనాయి. ఈ సంఘం ఇప్పటికి 44 స్థలనామ సంపుటాలను ప్రచురించింది. ప్రపంచంలో ఏ స్థలనామ పరిశోధనాసంస్థ కానీ ఇంతటి బృహత్తరమైన కృషిని ఇంతవరకూ సాధించలేదు.

3.2.5 ఆంగ్ల స్థలనామ పరిశోధన కావించిన వారిలో ప్రముఖులు అలెన్ మాయర్, ఎఫ్. ఎం. స్టెంటాన్, ఎ. హెచ్. స్మిత్ (A. H. Smith), పి. హెచ్. రీనే (P. H. Reaney) ఎక్వాల్[1] మొదలైనవారు.

3.2.6 జర్మన్ స్థలనామాలగూర్చి బాఖ్. ఫ్రెంచి స్థలనామాలగూర్చి డాజా విపులమైన పరిశోధనలు చేసినారు. (Utley. 1963, 145-148). ఇంగ్లండ్, జర్మనీ, ఫ్రాన్స్ దేశాలకు చెందిన స్థలనామ పరిశోధకులు ఏర్పరచిన మార్గంలో యూరప్‌లోని ఇతర దేశాల స్థలనామవేత్తలు ఈనాడు స్థలనామ రంగంలో ప్రగతి సాధిస్తున్నారు.

## 3.3 అమెరికాలో స్థలనామ పరిశోధన :

3.3.1 అమెరికాలో స్థలనామ పరిశోధన గట్టిగా ఈ శతాబ్దిలోనే ప్రారంభమయింది. Minnesota Historical Society కల్పించిన అవకాశాల నుపయోగించుకొని వారెన్ అప్‌హామ్ (Warren Upham), 1920 లో మిన్నెసోటా రాష్ట్ర స్థలనామ పరిశోధనా వివరాలను సంపుటీకరించినాడు, డాక్టర్ లూయిస్ పౌండ్ (Dr. Louise Pound) సూచన ననుసరించి లిలియన్ లిండర్ ఫిట్జ్ పాట్రిక్ (Lilian Linder Fitzpatrick) నెబ్రాస్కా స్థలనామాలపై 1924 లో ప్రప్రథమ పరిశోధక వ్యాసాన్ని (dissertation) రచించినాడు. ఆ తర్వాత 1925 లో అలెన్ వాకర్ రీడ్ (Allen Walker Read) అయోవా (Iowa) స్థలనామాలను పరిశోధించి ఒక సిద్ధాంత వ్యాసాన్ని రచించినాడు. రాబర్ట్ ఎల్. రామ్సే (Robert, L. Ramsay) పర్యవేక్షణలో మిస్సోరి (Missouri) స్థలనామాలపై అనేక పరిశోధక వ్యాసాలు (Master's dissertations) వచ్చినాయి.

---

1. ఎక్వాల్ కూర్చిన "The Concise Oxford Dictionary of English Place Names" (4th ed. 1966) స్థలనామ శాస్త్ర నియమాలనూ, భాషా శాస్త్ర సూత్రాలనూ అనుసరించి నిర్మించింది. పాశ్చాత్య స్థలనామ నిఘంటువులకు తలమానికమైంది. స్థలనామ వ్యుత్పత్తి నిరూపణకు తప్పనిసరియైన చారిత్రక రూపాలను ఇవ్వడమే కాకుండా స్థల నామాల ఆధునికోచ్చారణా ప్రయోజనాన్ని గ్రహించి, స్థలనామ నైసర్గిక స్థితిగతులు, స్థానిక చరిత మొదలైన అంశాలను దృష్టిలో ఉంచుకొని ఎక్వాల్ ఆంగ్ల స్థల నామాల వ్యుత్పత్తిని నిరూపించినాడు ; వాటి నిష్పత్తి (derivation) ని వివరించినాడు.

3.3.2 1938 లో, కొలంబియా విశ్వవిద్యాలయానికి చెందిన హారీ మోర్గన్ అయర్స్ (Harry Morgan Ayers), Modern Language Association (MLA) ఆధునిక ఆంగ్లభాషా విభాగాధ్యక్షులుగా ఉన్నపుడు, అమెరికా స్థలనామాల సర్వే ప్రతిపాదన వచ్చింది. అమెరికా స్థలనామ సంఘం (American Place Name Society) స్థాపించాలనే ఆయన తీర్మానాన్ని MLA విభాగం ఆమోదించింది, కానీ 1940 లో అంతర్జాతీయ పరిస్థితులవల్ల అమెరికా రెండవ ప్రపంచయుద్ధంలో దిగింది. అకారణంగా అమెరికా స్థలనామ సంఘస్థాపనకు చేసిన ప్రయత్నం వెంటనే ఫలించలేదు.

3.3.3 ఆ తర్వాత ప్రముఖ స్థలనామవేత్త జార్జి ఆర్. స్టీవర్ట్ (George R. Stewart) సూచనమేరకు ప్రిన్స్టన్ యూనివర్సిటీ ప్రెస్ (Princeton University Press) మొత్తం అమెరికా సంయుక్తరాష్ట్రాలకు చెందిన స్థలనామ పరిశోధనా విశేషాలను (Place name studies) దాదాపు 50 సంపుటాల్లో వరసగా ప్రచురించాలని అనుకుంది. కాలిఫోర్నియా స్థలనామ పరిశోధనను పూర్తిచేసి, ముందే ఇచ్చిన మాటమేరకు, ఎర్విన్ గుడే (Erwin Gudde) తన గ్రంథాన్ని (California Place Names, 1949) కాలిఫోర్నియా యూనివర్సిటీ ప్రెస్స్ (California University Press) కు ఇవ్వడానికి ప్రమాణొన్నందువల్ల, కాలిఫోర్నియా స్థలనామ సంపుటివంటి ప్రధానమైన దానిని తాము ప్రచురించ లేక పోయినందుకు నిరాశ చెందిన ప్రిన్స్టన్ యూనివర్సిటీ ప్రెస్సువారు తమ బృహత్ప్రథకాన్ని విరమించుకున్నారు. 1945 లో జార్జి. ఆర్. స్టీవర్ట్ Names on the land, A Historical account of Place-Naming in the United States, అనే గ్రంథాన్ని సంగ్రహరూపంలో ప్రచురించినారు. అమెరికా స్థలనామాల పుట్టుపూర్వోత్తరాలను పరిశీలించిన గ్రంథ మిది. అమెరికా స్థలనామాలు పుట్టిన తీరుతెన్నులను - అంటే వాటి చరిత్రను – ఈ గ్రంథం వివరిస్తుంది. కానీ వ్యాకరణంలో స్థలనామాలు ఏ విధంగా ఇముడుతాయో, భాషాపరిణామ దృష్ట్యా అవి ఏ విధంగా మార్పులు చెందినాయో ఈ గ్రంథం వివరించదు. అయితే అమెరికా స్థలనామ నామకరణ లక్షణాలను (Characteristics of American Place Naming) తెల్పే ఈ గ్రంథం అమెరికా స్థలనామ పరిశోధనా వికాసానికి ఒక గొప్ప ప్రేరణ. స్టీవర్ట్ కూర్చిన "American Place Names" తొలి అమెరికా స్థలనామ నిఘంటువు (1971). వీరుగాక ఎడ్వర్డ్ సి. ఎహ్రెన్ స్ప్రెగర్ (Edward C. Ehren

Sperger) హామిల్ కెన్నీ (Hamill Kenny,) జె. టి. లింక్ (J. T. Link), ఫానీ ఎక్‌స్టార్మ్ (Fanny Eckstorm), బర్డ్ గ్రాంగర్ (Byrd Granger), ఇ. వాలెస్ మాక్‌ములన్ (E. Wallace Mc Mullan, Jr.) జార్జ్ డి. మాక్ జిమ్‌సే (George D. Mc Jimsey), కెల్సీ బి హార్డర్ (Kelsie B. Harder), ఫ్రాన్సిస్ లీ అట్లీ (Francis Lee Utley) మొదలైనవారు అమెరికా స్థల నామ పరిశోధనా రంగంలో గణనీయులు.

3.3.4 1951లో American Name Society స్థాపన జరిగింది. ఈ సంస్థ యొక్క ఉద్దేశ్యాలు, American Name Society 1952 నుంచీ ప్రచురించే Names అనే త్రైమాస పత్రికలో చూడవచ్చు.

"The purposes of the American Name Society are :

The Study of the etymology, origin, meaning, and application of all categories of names—geographical, personal scientific, commercial popular—and the dissemination of the results of such study ;

to make the American People conscious of the interest and importance of names in all fields of human endeavour and in all subjects taught in our schools and colleges; to act as a clearing house for American nomenclature and as an advisory agency for government offices, organisations and individuals concerned with the application, changing, spelling and pronunciation of names. The media to attain these purpose will be :

The publication of a journal devoted to the study of names; the publication of books and monographs in the fields of Onomastics, and the support and encouragement of such publications; the eventual publication of standard reference dictionaries in the various categories of names; contributions to the daily press and popular lectures on the subject by members of the society.

3.3.5 <u>అమెరికా సంయుక్తరాష్ట్రాల స్థలనామాల సర్వే (Place Name Survey of the United States)</u> :

అమెరికా సంయుక్త రాష్ట్రాల స్థలనామాల సర్వేకు సంబంధించిన ఒక సమగ్ర పథకాన్ని అమెరికా నామ సంఘం (American Name Society) డిసెంబర్

30, 1963 లో, డెన్వర్ సమావేశం (Denver Convention) లో ఆమోదించింది. రాష్ట్రాల వారీగా స్థలనామాలను సేకరించాలనీ, జాతీయ స్థలనామ కేంద్రం (National Place Name Centre) లో వాటిని ఉంచాలనీ డెన్వర్ సమావేశం నిశ్చయించింది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని దాదాపు 5 మిలియన్ల స్థలనామాల ఆధునిక రూపాలను, వాటి ఉచ్చారణ రీతులను, స్థల నామ చరిత్రకు సంబంధించి స్థానికులు తెల్పే వివరాలను, ముద్రితాముద్రిత పత్రాల్లోని, గ్రంథాల్లోని పూర్వలేఖనాలను (early spellings) సేకరించి కేంద్ర కవిలె భాండాగారం (Central Archives) లో నిక్షేపించి అత్యాధునిక కంప్యూటర్ విధానాలతో విశ్లేషించాలని ఈ సర్వే పథకం ధ్యేయం. సర్వేకు సంబంధించిన సమగ్ర పథకాన్ని 'దాని' అమలుకు అనుసరించవలసిన శాస్త్రీయ పద్ధతుల్ని బర్డ్ హావెల్ గ్రాంగర్ (Byrd Howel Granger) Hand Book for establishing A State Centre for a Survey of Place Names లో వివరించినాడు [1] ఐడహో (Idaho), న్యూయార్క్ (New York) అరిజోనా (Arizona) రాష్ట్రాలలో పైలెట్ సర్వేలు (Pilot Surveys) కూడా జరుగుతున్నాయి. ఎలక్ట్రానిక్ పరికరాల సహాయంతో నామ వర్గీకరణ విశ్లేషణాదులు జరుగుతాయని ప్రొఫెస్ లీ అట్లీ అంటారు :

"The survey will make use of the most advanced electronic-aids whenever possible, especially for alphabetization, sorting and distributional analysis of names, name types and name elements" (As quoted by Read, 1970, 5)

## 3.4 స్థలనామ పరిశోధనలో యూరప్ అమెరికాల విధానాలు:

3.4.1 స్థలనామ పరిశోధనా విధానాల్లో యూరప్ అమెరికా పరిశోధకుల మధ్య కొంత భేదం ఉంది. యూరప్ స్థలనామ వేత్తలు ప్రధానంగా వ్యుత్పత్తి నిరూపకులు. నిరుక్త ప్రియులు. అమెరికా స్థలనామవేత్తలు ప్రధానంగా ప్రణాళికాప్రియులు. (Methodologists). యూరప్ స్థలనామ పరిశోధకులకు ప్రాచీన చరిత్ర పునర్నిర్మాణం మీద దృష్టి. అమెరికా స్థలనామ పరిశోధకులకు నవీన చరిత్ర

---

1, అపురూపమైన ఈ Hand Book ను సభ్యుల మధ్య సర్క్యులేషన్‌లో ఉండగానే పంపిన ప్రొఫెసర్ అట్లీ (ఆంగ్ల శాఖ, కాలిఫోర్నియా)గారికి ఈ వ్యాసరచయిత కృతజ్ఞుడు.

మీద దృష్టి. దృక్పథాల మధ్యగల తారతమ్యం స్థలనామ పరిశోధనా పద్ధతుల్లో వ్యక్త మవుతుంది:

"As a result of the difference in the nature of the problems in Europe and in the United States, the methods and interest of Onomatologists have differed greatly. European scholars, lacking historical information, have generally worked by linguistic methods drawing what help they could from geography, history and anthropology. They have been essentially etymologists. The usual European scholar has little interest in names that have arisen since middle ages, and are therefore of no etymological interest. Many European scholars have been intensly concerned with the ancillary use of Place-name study as a tool for the investigation of Pre-history,

American scholars rely mainly on the methodology of history. Not primarily etymologists, they are likely to consider the establishment of etymology as a mere primary step, of not much significance unless the reason for the application can be established. They are more likely than European scholars to be informed as to the process of of place-naming and more likely to be interested in recent and current naming" (The Encyclopaedia Britannica, Vol. 15, 1162).

## 3.5 స్థలనామ పరిశోధన : అంతర్జాతీయ సహకారం

3.5.1 స్థలనామ పరిశోధనా కేంద్రాలు. నామ సంఘాలు అనేకం ఈనాడు వివిధదేశాల్లో నెలకొన్నాయి, వివిధ దేశాల్లోని స్థలనామ పరిశోధనా కేంద్రాల మధ్య, నామ సంఘాలమధ్య సంబంధ సహకారాలను పెంపొందించి, నామ విజ్ఞానాభివృద్ధి గావించాలనే అంతర్జాతీయ దృక్పథం కూడా నామశాస్త్రవేత్తలకు కలిగింది. 1938 లో, పారిస్ నగరంలో జరిగిన ప్రథమ అంతర్జాతీయ స్థలనామ మనుష్య నామ విజ్ఞాన సమావేశం (International Congress of Topynymy and Anthroponymy) లో నామవిజ్ఞానాభివృద్ధికి ఒక అంతర్జాతీయ సంస్థ స్థాపన అవసరమని వివిధ దేశాల ప్రతినిధులు అభిప్రాయపడినారు. నామ విజ్ఞానాభివృద్ధి నిమిత్తం, వివిధదేశాల నామవిజ్ఞానులమధ్య సంబంధ సహకా

రాలను నెలకొల్పే ఆశయంతో 1949 (జూలై 14-19) లో బ్రస్సెల్స్ (Brussels) లో జరిగిన తృతీయ అంతర్జాతీయ స్థలనామ. మనుష్యనామ విజ్ఞాన సమావేశంలో అంతర్జాతీయనామ సంస్థ స్థాపనకు ఒక నిర్ణయం జరిగింది. అంతర్జాతీయ నామసంస్థ (Institute Voornomen Kunde, Onomastic Institute) శాశ్వతంగా లొవైన్ (Louvain) విశ్వ విద్యాలయంలో నెల కొల్పాలని బ్రస్సెల్స్ సమావేశం తీర్మానించింది. ఈ కేంద్రం 1950 నుండి Onoma : Bibliographical and Information Bulletin అనే నామ విజ్ఞాన పత్రికను నిర్వహిస్తోంది. అంతర్జాతీయ నామవిజ్ఞాన సంస్థ ప్రధాన కార్యదర్శి (Secretary-General) హెచ్. జె. వాన్ ద వైజర్ (H. J. Van De Wijer) ఆ పత్రిక ఆశయా లేమిటో ప్రథమ సంచికలో వివరిస్తూ ఇలా అన్నారు :

"We intend supplying scholars interested in Onomastic research in its widest sense, with bibliographical information as exhaustive as possible. Owing to the collaboration of the representatives of Onomastics in the various countries, and especially thanks to the national delegates in the International Committe of Onomastic science, Onoma will publish annual bibliographical lists mentioning the publications and the important articles of reviews published throughout the world. We also ask our collaborators to inform us about the state of research and new initiatives in the field of Onomastics in their several countries, about the different scientific meetings that take place, the organisation and methods of research, work in progress, appoint ments, honorary distinctions, etc. (Onoma, Vol. 1, 1950).

ఈ విధంగా పాశ్చాత్యదేశాల్లో అభివృద్ధి నొందిన స్థలనామ విజ్ఞాన ప్రభావం భారతదేశం మీద కూడా ప్రసరించింది.

## 3.6 భారతదేశంలో స్థలనామ పరిశోధన :

3.6.1 19 వ శతాబ్దిలో, పాశ్చాత్య సంస్కృతీ సంపర్కంవల్ల పాశ్చాత్య విజ్ఞాన దృక్పథాలూ, భావాలూ భారతదేశంలో ప్రచారానికి వచ్చిన తర్వాతనే స్థలనామ పరిశీలన ఒక ప్రత్యేక పరిశోధనగా ప్రారంభమైంది. అయితే ప్రాచీన భార

తీయ నైఘంటికులూ, వైయాకరణులు స్థలనామాలు భాషా సమష్టిలో భాగంగా గుర్తించలేక పోలేదు. ప్రపంచంలోని ప్రథమ నిరుక్తకారుడు (Etymologist) యాస్కుడు వైదిక వాఙ్మయంలోని కొన్ని స్థలనామాల వ్యుత్పత్తులను వివరించినాడు. ఆయన తన నిరుక్తంతో ఇచ్చిన కొన్ని నదీనామ వ్యుత్పత్తులు చూడండి :

| | |
|---|---|
| గంగా | గమనాత్, నిరుక్త IX.26 |
| యమునా | మునా ప్రయువతీ గచ్ఛతి, నిరుక్త, IX.26 |
| సరస్వతీ | సర ఇత్యుదకానామ్ సర్తేస్తద్వతీ, నిరుక్త, IX.26 |
| అసిక్నీ | సిక్న శుక్లా అసితా, నిరుక్త, IX.26 |
| ఆర్జికీయా | యాం విపాది త్యాహుః, ఋజీక ప్రభావా, ఋజీక గామినీవా, నిరుక్త, IX.26 |
| విపాశ | పాశా అస్యామ్ వ్యపాశ్యంత వశిష్ఠస్య ముమూర్షతః, తస్మాత్ విపాడ్ ఉచ్యతే, నిరుక్త, IX.26 |
| రసా | సానదీ రసతేః శబ్ద కర్మణః, నిరుక్త, IX.25 |

ఆర్జికీయా, విపాశావంటి నదీనామాలకు మాత్రం యాస్కుడిచ్చిన వ్యుత్పత్తులు భాషాశాస్త్ర దృష్ట్యా సమ్మతం కావివి. ఆర్జికీయా శబ్దానికి యాస్కుడిచ్చిన వ్యుత్పత్తి అస్పష్ట (obscure) మనీ, విపాశ శబ్దాని కిచ్చిన వ్యుత్పత్తి లోక నిరుక్తి (popular etymology) కి చెందిందనీ సిద్ధేశ్వరవర్మ అభిప్రాయం వివరాలకు చూ. సిద్ధేశ్వరవర్మ 1953, 127, 104). అయినా చారిత్రక తులనాత్మక పరిశీలనా పద్ధతులు నాస్తి అనదగిన ఆ పురాతన కాలంలో యాస్కుని కృషి అద్వితీయమైంది.

3.6.2 సంస్కృతభాషా నిర్మాణాన్ని సమగ్రంగా, శాస్త్రీయంగా వర్ణనాత్మక విధానంలో అద్వితీయంగా రచించిన పాణిని, తన అష్టాధ్యాయిలో స్థలనామాల నిష్పత్తిని వింగడించి యున్నాడు. (వివరాలకు చూ. Agarwala, 1954, Ch. 11. Geographical Data, 37-74). నామ వాచకాలకు తద్ధిత ప్రత్యయాలు పరమైనపుడు ఏర్పడే రూప నిష్పత్తిని వివరిస్తూ, దేశాలు, నదులు, నగరాలు మొదలైన స్థలనామాలను అష్టాధ్యాయి సూత్రాలలో పాణిని ఉదహరించినాడు:

ఉదా : ఔదుమ్బరః — అష్టాధ్యాయి 4.2.67
కౌశామ్బీ నగరీ — 4.2.68
శైబః — 4.2.69
వైదిశమ్ — 4.2.70
పౌష్కలమ్
ఇక్షుమతీ — 4.2.75
కురవః, అఙ్గాః
వఙ్గాః, కలిఙ్గాః — 4.2.81
హైమవతీ — 4.2.83

స్థలనామాలలోని స్వరదైర్ఘ్యము (Vowel lengthening). మూర్ధన్యీకరణము (Cerebralisation) మొదలైన వర్ణపరిణామాలను కూడా పాణిని చర్చించినాడు :

ఉదా : వనం పురగా మిశ్రకా సిధ్రకా సారికా కోటరాగ్రేభ్యః; అష్టాధ్యాయి 8.4.4
ప్రనిరన్తః శరేక్షు ప్లక్షామ్ర కార్ష్యఖదిర పీయూక్షాభ్యో సంజ్ఞాయామపి: అష్టాధ్యాయి 8 4.5

వనగిర్యోః సంజ్ఞాయాం కోటర కింశులకాదీనాం : అష్టాధ్యాయి 6.3.117

కాత్యాయన పతంజలులు పాణిని పద్ధతినే అనుసరించి స్థలనామాల ఉదాహరణలను తమ రచనలో ఎక్కువగా ఇచ్చినారు.

3.6.3 భారతదేశంలో స్థలనామ పరిశోధనకు పాశ్చాత్యులే స్వీకారం చుట్టినారు (చూ. Blochmann. 1873, Hahn, 1903). వీరిది ఔత్సాహిత ప్రయత్నం ఈ రంగంలో గణనీయమైన కృషి 1840 ప్రాంతాలనుండి జరిగింది. (చూ. Bibliography). యూరప్, అమెరికాలలో జరిగిన కృషితో పోల్చినపుడు, భారతీయుల కృషి ఎక్కువగా చారిత్రిక సాంస్కృతిక విషయాలకు సంబంధించి జరిగిందే కానీ, భాషాశాస్త్ర దృష్ట్యా ఎన్నదగిన పరిశ్రమ జరగలేదు.

## 3. 7 ఉత్తరార్యభాషల్లో స్థలనామ పరిశోధన :

3.7.1 స్థలనామాలు వెల్లడి చేసే చరిత్రా సంస్కృతుల పరిశీలనకు అత్యధిక ప్రాధాన్యాన్నిచ్చి, ఆ పరిశీలనకు సహాయకారిగా కొంత మేరకు భాషావిజ్ఞానాన్ని

వినియోగించుకొని స్థలనామాలలో కన్పించే చారిత్రక, రాజకీయ, సాంఘిక, మత, భౌగోళిక, జాతి విశేషాలను వెలికి తీయడానికి ఒక సమగ్ర పథకాన్ని మన దేశంలో మొట్టమొదట చేపట్టినవారు ప్రముఖ పురాతత్వ శాస్త్రవేత్తలు పూనా దక్కన్ కాలేజీ పురాతత్వ విభాగాధ్యక్షులు అయిన హెచ్. డి. సంకాలియా (H. D. Sankalia.) [Suresh, 1961, I & II] "The Studies in Historical and Cultural Geography and Ethnography of Ancient Gujarat," అనే పరిశోధనా గ్రంథాన్ని 1949 లో వెలువరించినారు. ఒక ప్రాంతపు శాసనస్థ స్థలనామ రూపాల ఆధునిక రూపాలను గుర్తించడం. ప్రాచీన రూపాలను ఆధునిక రూపాలతో పోల్చి చూడడం. స్థలనామాలలోని విశేషణ విశేష్య భాగాల పరిశీలన కావించి నామవిషయాన్ని (Name content) బట్టి వర్గీకరించడం, తద్వారా స్థలోద్భవ ప్రాశస్త్యాలను వెలువరించడం సంకాలియా పరిశోధనా పద్ధతి :

"..... A study of the prefixes and the suffixes as well as the study of the body of the Place-name is required. When such studies are made and places plotted on a map, certain regional or geographic groups will stand out. These when correlated with our knowledge of the religious customs and ethnic groups existing in these areas will lead perhaps to the understanding of either, or to some other knowledge. It is not unlikely that such studies will bring out to light the ethnographic basis of the Place-names, and thus lead to the ethnographic or ethnic distribution of the people and their original beliefs.

Similarly a study of the place-names from linguistic point of view may inform us of the actual language spoken and written by the people and the political and cultural forces that existed during the period, or of various elements that go to form the present language. Further a comparison of the ancient place-names with their modern equivalents will point out not only the linguistic reasons that have been responsible for their modern equivalents but such a linguistic study of place-names might also reveal the form of ancient Gujarati and its development" (Sankalia, 1949, 4-6).

స్థలనామ పరిశోధనలో వ్యక్తినామ పరిశోధనా ప్రాధాన్యాన్ని కూడా సంకాలియా గుర్తించినారు :

"Personal names have a cultural significance, though usually these names being proper names are regarded non-connotative or having the least connotation. Very often they are significant names. The names may signify the religion or religious tendencies of the persons bearing the names or of the age. They also signify the prevailing political and social conditions - customs and fashions of the time (Ibid, 6.)

3.7.2 స్థలనామ పరిశోధనారంగంలో సంకాలియా ప్రతిపాదించిన పద్ధతిలోనే వారి పర్యవేక్షణక్రింద కొందరు వివిధ ప్రాంతాల శాసనస్థ స్థల నామాల మీద పరిశోధన చేసి సిద్ధాంతవ్యాసాలను (dissertations) రచించి ఉన్నారు. వివిధ ప్రాంతాల చారిత్రక, సాంస్కృతిక, భౌగోళిక, జాతి విశేషాలను పరిశోధించి సంకాలియా పర్యవేక్షణలో డాక్టరేటు పట్టం పొందినవారు : సుమతి ములె (1954); శోభనా గోఖలే (1960), కాశీనాథ లక్ష్మణ లేలే (1962), మధుర మోహినీ మాథుర్ (1963); టి. కె. శేషాద్రి (1963); బి. సురేష్ (1965). వీరు వరుసగా దక్కన్ (కన్నడ మరాఠీ ప్రాంతాలు), మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, దక్షిణ భారత దేశాలలోని స్థలనామ వ్యక్తి నామాలను పరిశోధించినారు. స్థలనామ పరిశోధనా ప్రాధాన్యాన్ని గుర్తించి, ప్రప్రథమంగా ఎన్నదగిన పరిశోధన గావించినట్టి కీర్తి భారతీయ విద్యాసంస్థల్లో ఒక్క దక్కన్ కాలేజీకే దక్కుతుంది. పురాతత్వశాస్త్రం, చరిత్ర, స్థలనామాలు - వీటి మధ్య గల సంబంధ సహకారాలను గుర్తించి, తమ పరిశోధనలకు అన్వయించిన ఘనత కూడా దక్కన్ కాలేజీ పరిశోధకులదే.

3.7.3 సంకాలియా, ఆయన పరిశోధక బృందం ప్రధానంగా పురాతత్వ పరిశోధకులు. అందువల్ల స్థలనామాలోని భాషా విశేషాలకంటే, సాంస్కృతిక విశేషాలకే వారు తమ పరిశోధనలో అధిక ప్రాధాన్యం ఇచ్చినారు. అయినప్పటికీ వారి పరిశోధనలు తగు మేరకు, ఆర్య భాషా ప్రాంతాలలోగల అనార్య భాషా లక్షణాల పరిశీలనకు, ద్రావిడభాషా ప్రాంతాలలోని ఆర్యభాషా లక్షణాల పరిశీలనకూ తోడ్పడతాయి.

3.7.4 ప్రముఖ భాషా శాస్త్రవేత్త సునీత్ కుమార్ చటర్జీ, "The origin and Development of Bengali Language" (1926) అనే గ్రంథంలో, శాసనస్థ స్థలనామాలను భాషాదృష్టితో విశ్లేషించి స్థలనామ పరిశోధనలో భాషా తత్వ పరిశీలనా ప్రాధాన్యాన్ని ప్రకటించినారు. బెంగాలీ స్థల నామాలు ప్రధానంగా ఆర్యభాషా లక్షణాలను కలిగి ఉన్నా, అనార్య భాషా లక్షణాలు కూడా వాటిలో ఉన్నాయని చటర్జీ చాటినారు. ఆర్య భాషా జనుల ప్రవేశానికి పూర్వమే ఒకప్పుడు అనార్య భాషా వ్యవహర్తలైన కోల్, ద్రావిడులు బెంగాలులో నివసించి ఉండేవారనీ, తర్వాతి కాలాల్లో వారా ప్రాంతాన్ని వదలినా, వారి భాషా లక్షణాలు బెంగాల్ స్థలనామాల్లో నిలిచి ఉన్నాయనీ వారు నిరూపించినారు:

"An investigation of the Place-Names of Bengal, as in other parts of Aryan India, is sure to reveal the presence of non-Aryan speakers, mostly Dravidian, all over the land before the establishment of Aryan tongue" (Chatterji, 1926, Vol. I. Part I, 67).

3.7.5 చటర్జీ పరిశోధనా పద్ధతిలో కృష్ణపాద గోస్వామి "Place-Names of Bengal" అనే ఒక విపులమైన వ్యాసాన్ని రచించినారు (Goswami, 1943, 1-79). గుప్త, పాల, సేనాది రాజవంశస్థులు బెంగాల్, అస్సాం ప్రాంతాల్లో వేయించిన ప్రాచీన శాసనాల్లోని స్థలనామాల భాషానిర్మాణాన్ని పరిశీలించడమే కాక, సిల్హెట్, మాన్‌భూమ్, సింగ్‌భూమ్, పూర్ణియా, హజారీబాగ్, సంతల్ పరగణాలకు చెందిన కొన్ని ఆధునిక స్థలనామాలను సామాజిక భాషా దృక్పథం నుండి గోస్వామి వివరించినారు. స్థలనామ అర్థ దృష్టితో కూడా వారు వివరించినారు. బెంగాలీ స్థలనామాల్లో కోల్, ద్రావిడ, ఆస్ట్రో-ఏషియాటిక్, టిబెటో-బర్మన్ భాషా లక్షణా లున్నట్లు గోస్వామి ధృవపరచినారు. బెంగాలీ భాష మాత్రమే కాక, బెంగాలీ జాతికూడా కోల్, ద్రావిడుల ప్రభావానికి గురి అయినట్లు గోస్వామి తెల్పినారు.

"Although the bulk of the modern place-names of Bengal are of Aryan origin, yet there are thousands of names which are Prakrit and non-Aryan words (or we may better call them as names of doubtful origin and obscure in meaning also) as their components........................................

As we find a large number of Dravidian, Kol, Tibeto-Burman and other words of unexplained origin in the vocabulary of Bengali language as well as in the place-names, it can be asserted that the Pre-Aryans of Bengal were certainly influenced both in blood as well as in tongue by Dravidians and Kols who lived in the western boundaries of Bengal area and by the Tibeto-Burman people living in the northern and eastern fringes (Goswami, 1943, 24).

3.7.6 సామాజిక భాషాశాస్త్ర దృక్పథం (Socio-linguistic approach) తో ఆర్య భాషా స్థలనామాలపై వెలువడిన ప్రప్రథమ సిద్ధాంత వ్యాసం ప్రకాశ్ కుర్ల్ రచించిన A Socio-linguistic Study of Place-names of Saharanpur District (Kurl, 1965). శహరాన్పూర్ (ఉత్తరప్రదేశ్‌లోని ఒక జిల్లా) జిల్లాలోని 1626 గ్రామనామాల వ్యవహార, లిఖిత రూపాల ధ్వని విభేదాలనూ భాషా నిర్మాణాన్నీ, వ్యుత్పత్తులనూ, సామాజిక విశేషాలనూ కుర్ల్ తన సిద్ధాంత వ్యాసంలో చర్చించినాడు. కుర్ల్ సిద్ధాంతానికి మూలాధారాలు (sources) ప్రధానంగా కలెక్టర్ కార్యాలయం నుంచీ సేకరించిన లిఖిత రూపాలు. కుర్ల్ పరిశోధనా ధ్యేయాలివి.

"The Study proposes to analyse all the three parts (of Place-names) and classify them according to various sources (eg: Sk., Ar. Per, etc.) and to contents (eg. names of personages, topography, historical events etc.). The analysis and classification has been interpreted with historical and cultural angles and logical inferences have been drawn therefrom" (Kurl, 1965, Preface).

మన దేశంలో సామాజిక భాషాశాస్త్ర దృక్పథంతో స్థలనామాలపై వచ్చిన మొదటి సిద్ధాంత వ్యాసమిదే.

## 3.8 ద్రావిడ భాషల్లో స్థలనామ పరిశోధన :

3.8.1 Manual of the Administration of the Madras Presidency, Vol. iii Glossary (1893) లో మద్రాసు రాజధానికి చెందిన వివిధ జిల్లాల లోని కొన్ని వందల స్థలనామ వ్యుత్పత్తులు కన్పిస్తాయి. అదే గ్రంథంలో స్థల నామాల ద్వితీయావయవాల (Second elements) వ్యుత్పత్తులను కూడా

చర్చించడం జరిగింది. అయితే 1930 తర్వాతనే స్థలనామ పరిశోధనా సంబంధ వ్యాసాలు ద్రావిడ భాషల్లో రావడం మొదలయ్యాయి. అప్పటినుంచే స్థలనామ పరిశీలన పరిశోధనార్హ విషయంగా కొందరు గుర్తించినట్లు తెలుస్తుంది. వివిధ ద్రావిడ భాషల్లో జరిగిన స్థలనామ పరిశోధనా కృషిని గమనిద్దాం :

3.8.2 <u>తమిళం</u> : తమిళ స్థలనామాల గురించి ఔత్సాహికులు కొందరు వ్యాసాలు వ్రాసినారు. (Bharati 1932; Chettiar 1930, 1936, 1937, 1938a, 1938b and 1943; Devasikhamani 1933; Natesan 1930; Sastri 1937; Ayer 1940; Lakhmana Pillai 1940) వీరందరిలోనూ తమిళ స్థలనామాల విషయమై భాషా దృష్ట్యా చెప్పుకో తగ్గ కృషి చేసినవారు ఆర్. పి. సేతుపిళ్లై. తమిళ స్థలనామ చరిత్రను తెలిపే 'తమిఴగం ఊరుం పేరుం' (1956) అనే గ్రంథాన్ని, మరికొన్ని వ్యాసాల్ని సేతుపిళ్లై రచించినారు. (1939-1940, 15-36; 1940-41, 1-8; 1-34; 1940, 257-262; 1946: 143-154; 1946-1948; 1954, 82-91;). తమిళ స్థల నామాను బంధాల వర్గీకరణ (Place-Name Suffixes in Tamil) పై గల వారి వ్యాసాలు ముఖ్యంగా ఎన్నదగినవి. (1939-1940, 15-36, 1940-41, 1-30, 1946-1948 1-34;) స్థలనామాను బంధాల (Place-Name Suffixes) ను వాటి అర్థాన్నిబట్టి ఈ క్రింది వర్గాలుగా విభజించినారు :

(1) The suffixes pertaining to Place-Names of the Mountanious region (Kurunji)

(2) Terminals of the Place-Names of the Wooded Region (Mullai).

(3) Terminals of Place-Names denoting Rivers and Waters.

(4) Suffixes of Place-Names of the Arable Region.

(5) Suffixes of the Place-Names denoting Habitations.

(6) Suffixes of Place-Names denoting Religious and Charitable Foundations.

(7) Suffixes of Place-Names denoting Fortifications.

(8) Suffixes of Place-Names denoting Industry and Commerce.

(9) Suffixes of Place-Names denoting Villages and Towns.

(10) Suffixes of Place-Names signifying Territorial Divisions.

(11) Suffixes of Place-Names of the Littoral Regions.

3.8.3 సగోత్ర స్థలనామానుబంధాలైన తెలుగు, కన్నడ, మళయాల, తుళు స్థలనామానుబంధాలను తులనాత్మక పరిశీలనా నిమిత్తం ఇచ్చినారు. పేతుపిళ్లై కృషి తర్వాత తమిళ స్థలనామ పరిశీలన దాదాపు మూల బడిందనే చెప్పవచ్చు. అయితే ఈ మధ్య, కేరళ విశ్వవిద్యాలయం తమిళ విభాగానికి చెందిన కె. నచ్చిముత్తు, కోయంబత్తూరుజిలా స్థలనామాలను పరిశోధక విషయంగా తీసుకొని డాక్టరేటు పట్టం కోసం సాగిస్తున్న కృషితో తమిళ స్థలనామ పరిశోధనకు మళ్ళీ ప్రాణం వచ్చిందని చెప్పవచ్చు. నచ్చిముత్తు రచించిన The Place-Name Suffix–Paalaiyam (1971) అనే వ్యాసం, తదితర ద్రావిడభాషా స్థలనామాలపై వచ్చిన అన్ని వ్యాసాలతో పోల్చి చూచినప్పుడు పరిశోధనా పద్ధతి దృష్ట్యా విలక్షణమైందిగా కన్పిస్తుంది; కొత్తదారిని తొక్కినట్లుగానూ కన్పిస్తుంది. తమిళ, తెలుగు, కర్నాటక, మళయాల, సింహళ స్థలనామాల్లో ద్వితీయావయవంగా కన్పించే 'పాళైయం' (Nachimuthu, 1971, 29) వ్యుత్పత్తి నిరూపణ మీద దృష్టి కేంద్రీకరించి, గ్రామనామానుసంబద్ధమైన పాళైయం మీద విశేషణంగా చేరే వ్యక్తినామాలు, కులవృత్తినామాలు, స్థలనామాలు మొదలైన వాటిని ఉదహరిస్తూ, తమిళ దేశపు మధ్య యుగచరిత్రను గురించి నచ్చిముత్తు కొన్ని వివరాలు తెల్పినాడు.

3.8.4 కన్నడం : కన్నడంలో ఔత్సాహికులు ఒకరిద్దరు ప్రచురించిన వ్యాసాలు తప్ప కన్నడ స్థలనామాల గూర్చి విశేష కృషి జరిగినట్లు కన్పించదు. (Hayavadana Rao, 264-281. Silva. 1949-1950, 91-114; Hiremath, 1968, 138-158).

3.8.5 మలయాళం : మలయాళ స్థలనామాలపై ఒకటి రెండు వ్యాసాలు మాత్రమే వచ్చినాయి. (Menon, 1939, 56-70). అయితే స్థలనామ పరిశోధన సిద్ధాంత వ్యాస విషయంగా గ్రహించి విశేష కృషి ఈనాడు మలయాళంలో జరుగుతూంది. కేరళ స్థలనామాలు: త్రివేంద్రం జిల్లా (Place-Names of Kerala: Trivandrum District) విషయంగా తీసుకొని ఎం. లిట్. కోసం ఎస్. జ్ఞానముత్తు మొదటి సిద్ధాంత వ్యాసాన్ని రచించినాడు (1965). త్రివేంద్రం జిల్లా

లోని. త్రివేంద్రం. నెయ్యతింకర. చిరయింగల్. నెడుమంగాల్ తాలూకాలకు చెందిన 1200 స్థలనామ లిఖితరూపాలను. మ్యాపులు. సెన్సస్ నివేదిక (Census Report) నుండి గ్రహించి. జ్ఞానముత్తు పరిశీలించినాడు. త్రివేంద్రం జిల్లా స్థలనామాలను ఈ క్రింది విధంగా వర్గీకరించినాడు:

(1) జానపద నామాలు (Folk names)

(2) ప్రకృతి నామాలు (Nature names)

(3) జనపద నామాలు (Habitation names)

నామాంతరాలనూ. ప్రతిచేయ స్థలనామాలనూ చర్చించడమే కాక. 1200 స్థల నామాల అర్థవిచారణ కూడా జ్ఞానముత్తు చేసినాడు. సిద్ధాంతవ్యాస రచనలో జ్ఞానముత్తుది ప్రధానంగా చారిత్రక సాంస్కృతిక దృష్టి. జ్ఞానముత్తు కన్యా కుమారి జిల్లా స్థలనామ పరిశీలన — ఎం. లిట్. సిద్ధాంతవ్యాసంతో తులనాత్మక పరిశీలన చేసింది (Place-names of the Kanyakumari District. A comparative study with place-names of the Trivandrum District) దాక్షిణాత్యభాషల్లో మొదటి సిద్ధాంతవ్యాసం. (చూ. ఆముఖం.)

## 3.8.6 తెలుగులో స్థలనామ పరిశీలన :

తెలుగు నిఘంటువులూ. వ్యాకరణాలూ సంస్కృతమార్గ విధేయాలే అయినా. తెలుగు నిఘంటువుల్లో స్థలనామాల అర్థవివరణ కన్పించదు. తెలుగు వ్యాకరణాల్లో వ్యక్తినామాల స్థూల చర్చ తప్ప స్థలనామాల ప్రశంస లేదు. తెలుగు నిఘంటువులు ప్రధానంగా కావ్యభాషా నిఘంటువులు. తెలుగు వ్యాకరణాలు కావ్యభాషా వ్యాకరణాలు. అందుచేత వ్యాకరణాల్లో సజీవ భాషా పద జాలమైన స్థలనామాల భాషా విశ్లేషణ కన్పింపదు. నిఘంటువుల్లో వాటి అర్థాలు గోచరింపవు.

3.8.7 తెలుగు సాహిత్యంలో వెలసిన కావ్యాలు ప్రధానంగా అటు అనువాదాలో, లేదా పౌరాణిక గాథల నాధారంగా చేసుకొన్న ప్రబంధాల్లో కావడంవల్ల, ఆయా ఇతిహాసాల్లోనూ, కావ్యాల్లోనూ, ప్రబంధాల్లోనూ తెలుగు స్థలనామాలు లేక పోవడంలో ఆశ్చర్యం లేదు. శివకవుల రచనల్లో తెలుగు స్థలనామాలు కొన్ని

కన్పిస్తాయి. శివకవుల భాషను తెలుగు వ్యాకరణాలు నిరాదరించినపుడు వారి గ్రంథాల్లోవి స్థలనామాలకు వ్యాకరణంలో స్థానం ఎలా ఉంటుంది? ఉదాహరణకు పాల్కురికి సోమన రచనల్లో ఈ క్రింది స్థలనామాలు వ్యాకరణ దృష్ట్యా యెన్నదగినవి :

| | | |
|---|---|---|
| గుడ్డవ్వ పురము | పండితారాధ్య చరిత్రము | 2,413 |
| ముక్తీశ్వరము | ,, | 2.533 |
| బాపూరు | బసవ పురాణము | 4.258 |
| భాగవాడ | ,, | 2.68 |
| మత్స్యకుండ | ,, | 2.533 |

"సోమనాథునికిఁ బూర్వము రచితములయిన గ్రంథములలో నొక్క శివతత్త్వ సారమున మాత్రమే యాయా శివభక్తుల చరితములను బేర్కొని స్తుతించు సందర్భమున దేశీయములైన వారి పేళ్ళు వినవచ్చుచున్నవి. సోమనాథునికి దరువాతి కాలముఁగూడ నింత విస్తారముగా సంజ్ఞాపదములను గలిగిన కావ్యము మఱొండు గానరాదు" (కోదండ రామయ్య, 1968, 637) సంజ్ఞానామ పదాలకు చూ. Ibid అనుబంధం.

3.3.3 పాణిని ప్రభావం వల్ల కావచ్చు, అధర్వణుడు మాత్రం వికృతి వివేక కారికల్లో గ్రామనామాలను చర్చించినాడు :

"భవ ద్బిరుద శబ్దేషు యథేచ్ఛం పరకల్పనా
గ్రామ మానుష్య బిరుద శబ్దానా మపి సోమతః
గ్రామ నామ్న స్సమా సేతు వికారోపి క్వచిద్ధితః
క్వచిత్స్యాదుత ఈదిచ్చ యణ్ణా న్యస్మి న్నయ ణ్మతః
స్వరూపత స్సమాసస్యా వికారస్య ప్రశుతా వపి
క్వచి దేవంతయా యాంతు స్యా దవ్యయ సమస్థితిః
క్వచి దాంధ్ర వికారస్సు సమాసే స్యాద్విరోధకృత్
గ్రామనామ్నో పి మొల్ల పుస్స్యా త్సమాస ఇతి బావుకః"

(అధర్వణాచార్య, 1955, హలంత పరిచ్ఛేదం, సూ. 9, 10, 11, 12, 13. వివరాలకు వ్యాఖ్యలు చూ: అహోబల పండితీయం, 1965, సంధిపరిచ్ఛేదం సూ. 31, హలంత పరిచ్ఛేదం సూ. 33; చిన సీతారామశాస్త్రి, 1937, 450-

451; 1951, 142-147). ఆంధ్ర శబ్దచింతామణికి కారికావళి అయిన వికృతి వివేకంలో కన్పించే బిరుదనామ సంబంధ కారికలను బాలసరస్వతి, అప్పకవి వదలివేసినారు. అహోబల పండితుడు వానివి వ్యాఖ్యానించినా, ఆధునిక వైయాకరణులైన చిన్నయసూర్యాదులకు గ్రామనామాలు అంటరానివయ్యాయి. సంజ్ఞానామాలు అనుశాసనయోగ్యాలు కావని వ్యాకరణ వేత్తలు, వ్యాఖ్యాతలు భావించియుండడమే ఈ నిరాదరణకు కారణం కావచ్చు. (వేంకట నరసింహ భాష్యకాచార్యులు, 1963, 227, 229-230). వ్యాకరణవేత్తలే అవి లక్షణాతీతమైనవి భావించినప్పుడు, వారి ననుసరించిన నైఘంటికులు వాటిని వెలివేయడంలో ఆశ్చర్యంలేదు.

3.8.9 తెలుగు గ్రామనామ పరిశోధనా ప్రాధాన్యాన్ని తొలుత గుర్తించినవారు ఆంధ్ర భాషా చరిత్రకర్త చిలుకూరి నారాయణరావు (1935; 1937). గ్రామనామ పరిశీలనా ప్రాధాన్యాన్ని చిలుకూరివారు ఈ క్రింది వాక్యాల్లో చాటినారు:

"ఈ (గ్రామనామ) చర్చ అనేక విధములుగ నుపయోగకరమైనది. శబ్దోత్పత్తి శాస్త్రమునకు (Philology) ఇది చాలా సాహాయకారి. ప్రజలు పరదేశ గమనమును లేదా వలసల (Migration) ను గుఱించి పరిశోధించువారికీ చర్చ మిక్కిలి తోడ్పడును. వివిధ జాతులెంతవఱకు దేశములో వలుకుబడి సంపాదించినవో ఇందువలన తెలిసికొనవచ్చును. గ్రామములు పట్టణములు నెలకొల్పఁబడిన నివేశనములబట్టి, పూర్వుల అవసరములేవో, ఎట్టి ప్రదేశములు వారి దృష్టిలో వాసయోగ్యములో ఊహింపవచ్చును. ఏ రాజ వంశీయులు ఏయే ప్రదేశములను చిరకాలము పాలించిరో, ఎవ్వరు దిగ్విజయ యాత్రచే మాత్రమే తృప్తిపడిపోయిరో, లేదా ఓడి వెనుదిరిగిపోయిరో కనుగొనవచ్చును. ఘనులైన వ్యక్తులయొక్కయు, వంశములయొక్కయు చరిత్రలను కొంతవరకు అన్వేషింపవచ్చును. వివిధమతముల చొరవను, జనుల నాగరకతా సరళిని గ్రహింపవచ్చును. భిన్నజాతుల సంపర్క సహవాసముల నెఱుంగవచ్చును" (నారాయణరావు, 1937, 647).

3.8.10 గ్రామనామ పరిశోధనలోని చిక్కులను కూడా చిలుకూరివారు స్పష్టంగా గుర్తించినారు:

"ఈ విషయము చాలా కష్టమైనదే గాక అనేకులను ఆకర్షింపఁజాలదు. చాల పేర్లు కాలవశమున మారిపోయి వికారరూపమును దాల్చినవి. వాటి మొదటి

రూపమును నిర్ధరించుటకు చేయు నాలోచన కొంత వినోదము నియ్యవచ్చును. ఇందులో కష్ట మేమనగా జనులు చెప్పుకొను అర్థములకును, ఉచ్చారణలో నున్న పదజాలమునకుఁగల శబ్దశాస్త్ర వ్యుత్పత్తికిని, వ్యత్యాసము కనపడుచునే యుండును. చరిత్ర సంబంధమైన నామధేయములు మారి, జనులవాడుకలోని యైతిహ్యములను గుఱించిన పేరులు నిలిచియుండును. కొన్ని ప్రాచీన గ్రామములు గుర్తించుటయే కష్టము కొన్ని గ్రామములే అదృశ్యములైనవి. కొన్నింటి పేర్లు పూర్తిగా మారినవి. కొన్ని తమిళ, కన్నడ, మహమ్మదీయ, ఆంగ్లభాషా సంపర్కముచే వికృతములైనవి. పై విషయమును వ్రాయఁదలచుకొనువాఁడు ఈ మార్పుల నన్నింటిని గమనింపవలెను. కావున కొన్ని గ్రామముల పేర్ల యర్థ నిమిత్తమవి తెల్పలేక పోవుటలో నాశ్చర్యములేదు." (Ibid).

3.8.11 "అనంతపురము జిల్లాలోని గ్రామనామధేయములను గుఱించిన మీమాంస" అన్న శీర్షిక కింద ఆంధ్రభాషాచరిత్రలో వారు అనంతపురం జిల్లాలోని ఊర్ల పేర్లు ఏర్పడిన తీరు తెన్నులను చర్చించారు (1987, 657-667) వారి విషయసేకరణ, విభజనలలో శాస్త్రీయ దృష్టి కన్పిస్తుంది. ఉదాహరణకు గ్రామనామాలు భాషారీత్యా కొన్ని సంస్కృత భాషా నిష్పన్నాలనీ, కొన్ని తెలుగు భాషా నిష్పన్నాలనీ, కొన్ని కన్నడ భాషా నిష్పన్నాలనీ, మరి కొన్ని ఉర్దూ భాషా నిష్పన్నాలనీ గుర్తించినారు. గ్రామనామాల అర్థాన్ని బట్టి ఈ క్రింది విధంగా వర్గీకరించినారు. (Semantic Categories):

(1) చెట్లు, తీగెలు, పొదలనుండి కొన్ని గ్రామముల పేర్లు ఏర్పడినవి.

(2) చెట్లలోని భాగములనుండి కొన్ని నామధేయములు, కొన్ని గ్రామముల పేర్లు ధాన్యములనుండి వచ్చినవి.

(3) ఆయా నేల తీరునుబట్టి కొన్నింటికి పేర్లు కలిగినవి.

(4) దిశలను బట్టి కొన్ని పేర్లు

(5) రాళ్లను బట్టి పేర్లు.

(6) పెద్ద, చిన్న, ప్రాత, క్రొత్త అను విశేషణములను బట్టి కొన్నింటికి పేర్లు వచ్చినవి.

(7) కొండ పేరిట వచ్చినవి.

(8) ఊటలవలన కొన్ని.

(9) కొలనుల వలన కొన్ని.

(10) కాలువలు.

(11) కోటలు, దేవళములు, తిప్పలు వీని మూలమున కొన్ని.

(12) నక్షత్రముల పేర్లు.

(13) పశుపక్ష్యాదులనుండి వచ్చిన పేర్లు.

(14) శరీరములోని అంగముల పేర్లు.

(15) కొన్నింటి పేర్లు బంధుత్వ సంబంధములనుబట్టి వచ్చినవి.

(16) ఆహార వస్తువులబట్టి.

(17) జనుల వృత్తులనుబట్టి వచ్చినవి కొన్ని.

(18) కొన్ని కుటుంబ నామములు.

(19) ఈ మండలము నేలిన రాజుల వంశనామములు కొన్ని గ్రామనామముల కంటినవి'' (Ibid, 653-655).

ఈ వర్గీకరణలో అతివ్యాప్తి దోషముంది. ఉదా॥ ఊటలవలన, కొలనులవలవ, కాలువలవలవ బంధుత్వ సంబంధమువలన వచ్చినవి. అతివ్యాప్తికి (Over differentiation) పాల్పడ్డాయి. చిలుకూరివారి విషయ వివరణ, సూత్రీకరణ, భాషాశాస్త్రాన్వయాలు పాక్షికమైనవి, కృతకమైనవి. ఉదాహరణకు వ్యాసంలో గ్రామనామ ద్వితీయావయవాలకు (వీటినే 'తుదిపదములు'ని వారన్నారు). ''ద్వంద్వపదములుగా విప్పుటకు తనవడ''నివి, ''ప్రత్యయరూపములుగా''నివి (Ibid). 649) అవి చిలుకూరివారు వ్యవహరించిన అస్పష్టనామ బంధాలకూ (Latent Phrases) గ్రామనామ ద్వితీయావయవాలకూ వారు చూపిన మూల రూపాలు చూడండి :

సనప < స్వామిపాద

గుత్తి < గుప్తి

కదిరి < స్కందిత + ఇకా

పర్రు. పర్తి < ప్రస్థ

వాయి < వాపి

నార్వల < నారికేళ వాల.

(వివరాలకు చూ. Ibid 651-652).

అనంతపురం జిల్లాలోని గ్రామనామాల్లో కన్పించే మత చారిత్రక విశేషాలను వారు చర్చించినారు.

3.8.12 తెలుగు ఊర్ల పేర్లపై ఒక సంగ్రహ వ్యాసం 'ఆంధ్రవిజ్ఞానసర్వస్వం' ప్రథమ సంపుటంలో ఉంది (ఆ. ప్రసాదభూపాలుడు, 1938, 250-252). దీని తర్వాత వచ్చిన విజ్ఞాన సర్వస్వాల్లో ఊర్లపేర్లకు సంబంధించిన వ్యాసం లేకపోవడం శోచనీయం.

3.8.13 స్థలనామ పరిశీలనకుగల బహుముఖ ప్రాధాన్యాన్ని గుర్తించి, భాషాశాస్త్ర దృష్టితో విపుల పరిశీలన చేయడానికి ఒక పథకం రూపొందించుకొని చారిత్రక తులనాత్మక భాషా పరిశీలనా పద్ధతులలో తెలుగు గ్రామనామాల విశిష్ట లక్షణాలను గురించి ఎస్. త్యాగరాజు కొన్ని వ్యాసాలను తెలుగులో, Journal of Andhra Historical Research Society (JAHRS)లో ప్రచురించినారు. ఈ వ్యాసాల్లో, తెలుగు స్థలనామ పరిశోధనా ప్రాముఖ్యాన్ని గుర్తించడమే కాకుండా, తెలుగు స్థలనామాల నిర్మాణమూ, ప్రథమ ద్వితీయావయవాలలోని (వీటిని Prefixes/Adjectival elements, Place-Name Suffixes అని వారు వ్యవహరించినారు) పదాల రూప పరిణామం, అర్థం, వాని వర్గీకరణం వ్యాప్తి (distribution) మొదలైన విషయాలపై చర్చ కావించినారు. స్థలనామ ప్రథమ ద్వితీయావయవాల చారిత్రకరూపాలు కాలాంతరంలో లోనైన ధ్వని మార్పులను వింగడించి, వాటి వ్యుత్పత్తి నిరూపణకు ప్రయత్నించినారు. స్థలనామ పరిశోధనలో చారిత్రక రూపాల ప్రాధాన్యాన్ని వీరు గుర్తించినారు ఈ వ్యాసాలు ప్రచురించేనాటికి ఇంత విపులమైన పరిశీలన శాస్త్రీయ భారతీయ భాషల్లో జరగలేదనే చెప్పవచ్చు (వివరాలకు చూ. Thyagaraju, 1943-1945). తర్వాత మేరు సోమయాజులు వరహాలు (1945), నాయని కృష్ణ

కుమారి (1957), కె. రామచంద్రారెడ్డి మొదలైనవారు వ్రాసిన మూడు నాలుగు ఔత్సాహిక వ్యాసాలు తప్ప తెలుగు గ్రామనామాలపై విశేష పరిశ్రమ జరగలేదు.

3.8.14 అయితే ప్రాచీన తెనుగు భాషా స్వరూప పరిశీలనా సందర్భంలో పరిశోధకులు తమ కెదురైన స్థలనామాలను చర్చించకపోలేదు. క్రీ. శ. ప్రథమ శతాబ్దినుండి 14 వ శతాబ్దివరకు తెనుగుభాష ఉనికినీ, స్వరూపాన్నీ పరిశీలించడానికి, ద్రావిడ భాషా ప్రత్యేక ధ్వనులను చర్చించడానికి, తెలుగు స్థలనామాలలోని పదాలు కాలాంతర స్థలాంతరాలలో లోనైన ధ్వన్యర్థ పరిణామాలను అన్వేషించ డానికి, వాటి క్రమ పరిణామాన్ని సూత్రీకరించడానికి, తెలుగుపై అన్యభాషా ప్రభావాలను వింగడించడానికి గిడుగు రామమూర్తిపంతులు (1922), చిలుకూరి నారాయణరావు (1937), మల్లంపల్లి సోమశేఖరశర్మ (1941), కుందూరి ఈశ్వరదత్తు (ప్రతిభ. 1. 1.), కోరాడ రామకృష్ణయ్య, దివాకర్ల వేంకటావధాని (1960), బూదరాజు రాధాకృష్ణ (1964), కందప్పచెట్టి (1966) కోరాడ మహాదేవశాస్త్రి (1969), మొదలైన భాషా పరిశోధకులు తెలుగు గ్రామనామాలను తమ పరిశోధనా రచనల్లోనూ, గ్రంథాల్లోనూ, ప్రాసంగికంగా చర్చించినారు. వీరిలో ప్రధానంగా బూదరాజు రాధాకృష్ణ తమ సిద్ధాంత వ్యాసంలో గ్రామనామ పరిశీలనకు కొంత అధిక ప్రాధాన్యాన్ని ఇచ్చినారు. 44 గ్రామనామ ద్వితీయావయవాలు కాలక్రమంలో లోనైన ధ్వని పరిణామా లను తమ సిద్ధాంత వ్యాసంలో వివరించినారు (1964, 607-622). క్రీ. శ. 200-1100 లకు చెందిన 269 శాసనాలలోని దాదాపు 500 స్థలనామ వ్యుత్పత్తు లను ఆయన తన 'ప్రాచీనాంధ్ర శాసనములు' (1971) లో చర్చించినారు. ఇంతవరకు ఏ పరిశోధకుడు కానీ, తెలుగు గ్రామనామాలకు సంబంధించిన సిద్ధాంత వ్యాసాన్ని వ్రాయలేదు. ఇదే తొలి ప్రయత్నం.

## 3.8.15 స్థలనామ సంఘ స్థాపన :

స్థలనామ పరిశోధనకు ప్రోత్సాహకారిగా పాశ్చాత్యదేశాల్లో స్థలనామ సంఘాలు ఎన్నో వెలసినాయి. భారతదేశంలోమాత్రం అటువంటి స్థలనామ సంఘస్థాపన ఇంకా ఒక కలగానే మిగిలిఉంది. స్వర్గీయ కుందూరి ఈశ్వరదత్తు

Indian History Congress (1945-46) తృతీయ సమావేశంలో భారతీయ స్థలనామ సంఘ స్థాపనకు విజ్ఞప్తి చేసినారు కానీ అది నేటికీ ఫలించ లేదు. 1972లో తిరుపతిలో జరిగిన రెండవ అఖిలభారత ద్రావిడభాషా శాస్త్రజ్ఞుల సమావేశంలో (Second All Indian Conference of Dravidian Linguists) ద్రావిడ స్థలనామ (Dravidian Place-Name Society) స్థాపనకు బీజారోపణం జరిగింది. ముందుముందు స్థలనామ పరిశోధనకు మన దేశంలో కూడా సముచిత దోహదం కలుగ గలదని ఆశించవచ్చు.



# అధ్యాయం - 4

## గ్రామనామ వర్ణసమామ్నాయ పరిశీలన

### వర్ణసమామ్నాయ పరిశీలన : (Place-Name Phonology)

4.1 భాషా నిర్మాణస్వరూపాన్ని తెలుసుకోవడానికి ఆ భాషలోని సంజ్ఞానామాలకు సంబంధించిన వర్ణసమామ్నాయ స్వరూపం కూడా ఉపయోగిస్తుంది. సంజ్ఞా వాచకాలను పరిశీలించిన భాషాశాస్త్రవేత్తలు ఈ దృష్టితోనే, యూరోపియన్ భాషలకు చెందిన స్థలనామాలకూ, మనుష్యనామాలకు ప్రత్యేకంగా వర్ణసమామ్నాయాలను రూపొందించినారు.[1] గ్రామనామాలు కూడా స్థలనామ పరిశీలనలో ఒక భాగం. గ్రామనామధ్వనుల పరిశీలన "శబ్దోత్పత్తి శాస్త్రమునకు (Philology) చాలా సాహాయ్యకారి" అని డా. చిలుకూరి నారాయణరావు గుర్తించినారు.[2] ఆంధ్ర భాషాపరిశోధకులు కొంతమంది తమ చారిత్రక, తులనాత్మక వ్యాకరణాల్లో తెలుగు వర్ణసమామ్నాయ స్వరూపాన్ని నిరూపించి ఉన్నారు;[3] కానీ ప్రత్యేకంగా గ్రామనామాలకు చెందిన వర్ణసమామ్నాయ నిర్ణయం ఇంతవరకూ తెలుగులో జరుగలేదు. ఈ సిద్ధాంత వ్యాసంలో కడప జిల్లా గ్రామనామాలను పురస్కరించుకొని వర్ణనాత్మక పద్ధతిలో తెలుగు వర్ణమాలా స్వరూపం ప్రతిపాదించడం జరిగింది.

4.2 సవర్ణాలను గురించిన నిర్ణయాలు, ఆయా వర్ణాల కిందనే చర్చించడం జరిగింది. హిందూస్తానీ పదాంశాలున్న కొన్ని గ్రామనామాల్లో పదాంశావధి (morphemic boundary) లో తెలుగు గ్రామనామ ద్వితీయావయవాలకు ముందు ఉత్వ రహితంగా కూడా కొన్ని హల్లుల వ్యాప్తి ఉంది. అటువంటి హల్లులు : (బ్) (ద్) (జ్) (న్) (ల్) (ర్) (య్)—ఉదా : పాపా సాహెబ్ పల్లె; మహమ్మద్ గుంటపల్లె: నవాజ్ ఖాన్ పల్లె; ఆలంఖాన్ పల్లె; రసూల్ పల్లె; ఖాదర్ పల్లె; మహమ్మద్ ఖాయ్ పల్లె. ఈ అధ్యాయంలో ఆయా వర్ణాల క్రింద ఉదాహరణలుగా ఇచ్చిన గ్రామనామాల్లో హిందుస్తానీ పదాలున్న గ్రామాలకు + గుర్తు వాడడం జరిగింది.

**4.3 కడప గ్రామనామ వర్ణమాల :**

హల్లులు (30)

| | | | ఓష్ఠ్యాలు | దంతోష్ఠ్యాలు | దంత్యాలు | మూర్ధన్యాలు | తాలవ్యాలు | కంఠ్యాలు | నాద తంత్రీయాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| స్పర్శాలు | అల్పప్రాణ | శ్వాస | ప | | త | ట | చ | క | |
| | | నాద | బ | | ద | డ | జ | గ | |
| | మహాప్రాణ | శ్వాస | | | థ | ఠ | | ఖ | |
| | | నాద | భ | | ధ | | ఝ | ఘ | |
| అనునాసికాలు | | | మ | | న | ణ | | | |
| ఊష్మాలు | | | | ఫ̣ | స | ష | శ | | హ |
| పార్శ్వికాలు | | | | | ల | ళ | | | |
| తాడితాలు | | | | | ర | | | | |
| అర్ధాచ్చులు | | | వ | | | | య | | |

అచ్చులు (10)

| | పూర్వ | పశ్చిమ | |
|---|---|---|---|
| | విరోష్ఠ్య | విరోష్ఠ్య | ఓష్ఠ్య |
| అగ్ర | ఇ ఈ | | ఉ ఊ |
| మధ్య | ఎ ఏ | | ఒ ఓ |
| నిమ్న | | అ ఆ | |

4.4 /ప/ ఈ వర్ణం పదాదిలో అన్ని అచ్చులకు ముందూ, అచ్చులమధ్య అద్విత్వం గానూ, ద్విత్వంగానూ వస్తుంది. సంయుక్తాచ్చు 'ఐ' కి పూర్వం పదాదిలో వస్తుంది; 'ఔ' కు పూర్వం రాదు.

4.5 /బ/ ఈ వర్ణం పదాదిలో అన్ని అచ్చులకు ముందూ, అచ్చులమధ్య అద్విత్వం గానూ, ద్విత్వంగానూ వస్తుంది. సంయుక్తాచ్చు 'ఐ' కి పూర్వమూ పదాదిలో వస్తుంది; 'ఔ' కు పూర్వం రాదు.

4.6 /భ/ పదాదిలో /అ, ఈ, ఊ/ లకు పూర్వం మాత్రం. అచ్చుల మధ్యా ఈ వర్ణం వస్తుంది. తత్సమ, హిందూస్తానీ పదాల్లో మాత్రమే ఈ వర్ణం కన్పిస్తుంది. కడప మాండలికంలో ప్రామాణిక వ్యవహారంలో కూడా బ/భ ల పర్యాయప్రవృత్తి (free variation) విన్పిస్తుంది. ప్రామాణికేతర భాషలో పూర్తిగా ఈ వర్ణానికి మహా ప్రాణోచ్చారణ ఉండదు. తద్భవాల్లో /బ/ మాత్రమే ఉంది. /భ/ లోని మహాప్రాణత్వానికి లోపం (de-aspiration) క్రీ. శ. 7 వ శతాబ్దినుండి శాసన భాషలో కన్పిస్తుంది.

కడపజిల్లా గ్రామనామాల్లో పదాది/భ-/వర్ణరూపాల ఆవృత్తి (frequency) చాలా తక్కువ (16). వీనిలో సుగమ వ్యుత్పత్తులున్న (clear etymologies) గ్రామనామపదాలు 13 మాత్రమే. భల్లకివారిపల్లె; భాగంపల్లె — ఈ రెండు గ్రామనామాలలోని భల్లకి-; భాగం- వ్యుత్పత్తులు అస్పష్టం. భూతమాపురం కృతక ప్రామాణికం. పదమధ్యంలో /-భ/ ఆవృత్తి అతి విరళం.

4.7 /త/ ఈ వర్ణం పదాదిలో /ఈ/ అచ్చుకు తప్ప అన్ని అచ్చులకు పూర్వమూ, అచ్చుల మధ్య అద్విత్వంగానూ, ద్విత్వంగానూ వస్తుంది. సంయుక్తాచ్చులకు ముందు రాదు.

4.8 /ద/ ఈ వర్ణం పదాదిలో /ఎ/ అచ్చుకు తప్ప, అన్ని అచ్చులకు పూర్వమూ, పద మధ్యంలో అచ్చుల మధ్య అద్విత్వంగానూ, ద్విత్వంగానూ వస్తుంది. పదాదిలో సంయుక్తాచ్చు 'ఔ' కు ముందు కూడా వస్తుంది; 'ఐ' కి ముందు రాదు.

4.9 /థ/ ఈ వర్ణం తత్సమపదాల్లో అచ్చులమధ్య మాత్రమే కన్పిస్తుంది.

ప్రామాణికేతరోచ్చారణలో /థ/ వర్ణోచ్చారణ లేదు.[5] కడప మాండలికంలో ప్రామాణికోచ్చారణలో /థ/, ప్రామాణికేతరోచ్చారణలో /-ద-/ లేదా /-త-/గా విన్పిస్తుంది. గ్రంథస్థ రూపాల్లో /థ/ /ధ/- రెండూ కన్పిస్తున్నాయి.

4.10 /ధ/ ఈ వర్ణం తత్సమపదాల్లో పదాదిలో /అ/ కు పూర్వమూ, అచ్చుల మధ్య అద్విత్వంగానూ, ద్విత్వంగానూ వస్తుంది. కడప మాండలిక ప్రామాణికోచ్చారణలో కూడ /ధ/ /ద/ ల మధ్య పర్యాయ ప్రవృత్తి కన్పిస్తుంది. /ధ-/ పదాదిగల ఆరోపాలు రెండు మాత్రమే ఉన్నాయి.

4.11 /ట/ ఈ వర్ణం పదాదిలో /ఇ, ఎ, ఏ/ లకు పూర్వమూ, అచ్చుల మధ్య అద్విత్వంగనూ, ద్విత్వంగానూ వస్తుంది. /ట/ పదాదిగాగల ఆరోపాలు 5 మాత్రమే ఉన్నాయి. మూల ద్రావిడంలో పదాది ట వర్ణం లేదు. తెలుగులో ధ్వని మార్పువల్ల ట వర్ణంగల రూపాలు కొన్ని ఏర్పడి నాయి. త- > ట- మార్పు మధ్యయుగపు తెలుగులో జరిగినట్లు శాసనభాషను బట్టి నిరూపించడం జరిగింది.

"It seems *t* preceding the phonemic sequence ***emk*** change to ṭ and this change must be taking shape during this period"[6]. Also see DED 2842.

4.12 /డ/ ఈ వర్ణం పదాదిలో /ఏ, ఒ/ లకు పూర్వమూ, అచ్చుల మధ్య అద్విత్వంగానూ, ద్విత్వంగానూ కన్పిస్తుంది.

మూల ద్రావిడంలో పదాది /డ-/ వర్ణంలేదు. తెలుగులో పదాది /డ-/ వర్ణవ్యత్యయంవల్ల ఏర్పడింది. చూ. ఉదా :

**"Tel. ḍoṅku to perish, subside, sunk; Tam. oṭuṅk to be restrained, to sink. Tel. ḍoṅku is therefore from < *ḍoṅku < *do—ank—; the alternative development appears in dōku, to sink, used in a 14th Century literary work."[7]**

పదాది /డ-/ ఉన్న గ్రామనామ ఆరోపాలు మూడు మాత్రమే ఉన్నాయి.

డొంకుపల్లె : ఈ గ్రామనామంలో దొంక - రూపమయితే నిలిచింది కాని, కడప మాండలికంలో 'డొంక' విన్పిస్తుంది.

4.13 /థ/ ఈ వర్ణం తత్సమ పదాల్లో అచ్చుల మధ్య మాత్రమే వస్తుంది. ప్రామాణికేతరోచ్చారణలో మహాప్రాణత్వం లేదు.

4.14 /చ/ /జ/ తెలుగు వర్ణమాలలో /చ/ /జ/ లు స్పర్శోష్మాలు. /చ/ /జ/ లకు దంత్య తాలవ్య భేదాన్ని తెలుగు వైయాకరణులు గుర్తించి ఉన్నారు. కాని ఉచ్చారణలో దంత్యాలుగా గుర్తించినవి దంతమూలీయాలని తెలుస్తున్నది. నేటి తెలుగులో /చ/ /జ/ లకు గల దంత్య మూలీయ తాలవ్యోచ్చారణ భేదం అర్థభేదకశక్తి కలిగింది కాదు. ఇది కేవలం పరిసర ధ్వనులచే నిర్ణీతమయింది. పూర్వాచ్చులకు (ఇ, ఈ, ఎ, ఏ) ముందు తాలవ్య చ, జ లు, పశ్చిమాచ్చులకు (అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ) ముందు దంత్యమూలీయ చ̄, జ̄ లుంటాయి. కాబట్టి /చ/ వర్ణానికి [చ], [చ̄] లు సవర్ణాలు. /జ/ వర్ణానికి [జ], [జ̄] లు సవర్ణాలు. వ్రాతలో /అ/ /ఆ/ లతో కూడిన చ, జ లు అన్నీ దంత్య మూలీయాలు కావు. కొన్ని తాలవ్యాలు కూడా. చూ. ఉదా: చంద్రగిరి; చవ్వారిపల్లె; చామకూరు; జంగంపల్లె; జమ్మలమడుగు; జాలపర్తి; జాంద్రపేట మొ. తాలవ్యోచ్చారణ గల /చ/ /జ/ ల పరంలో వ్రాతలో కన్పించే /అ/, /ఆ/ లకు పూర్వోచ్చారణ ఉంటుంది. తాలవ్య /చ/ /జ/ లకు పరంలో పశ్చిమాచ్చుల /అ, ఆ/ ఉచ్చారణ ఉండదు.[8]. హిందుస్తానీ పదాలున్న గ్రామనామాల్లో కూడా /జ/ ఉచ్చారణ పై విధంగానే ఉంటుంది. చూ. ఉదా: జమాల్‌పల్లె+; జాఫర్ సాహెబ్ పేట+; ఖాజీపేట+; బురుజాపల్లె+.

4.15 /ఛ/ ఈ వర్ణం పదాదిలో /ఊ, ఓ/ లకు తప్ప, మిగిలిన అచ్చులకు ముందూ, అచ్చులమధ్య అద్విత్వంగానూ, ద్విత్వంగానూ వస్తుంది. 'ఔ' సంయుక్తాచ్చుకు ముందుకూడా పదాదిలో వస్తుంది. 'ఐ' కి ముందురాదు.

4.16 /ఝ/ ఈ వర్ణం పదాదిలో /ఎ/ కు తప్ప, అన్ని అచ్చులకు పూర్వమూ, అచ్చుల మధ్య అద్విత్వంగానూ, ద్విత్వంగానూ వస్తుంది. 'ఔ' సంయుక్తాచ్చుకు పూర్వం కూడా వస్తుంది.

హిందూస్తానీ గ్రామనామ పదాల్లోని /జ/ వర్ణానికి మూలం హిందుస్థానీలోని తాలవ్యనాద స్పర్శవర్ణం /j/ గానీ, దంతమూలీయ నాదోష్మ

వర్ణం /z/ గానీ ఉంటుంది. (చూ. గ్రామనామ నిఘంటువు.) వీటి ఉచ్చారణ భేదం కడపజిల్లాలో మహమ్మదీయుల వ్యవహారంలో మాత్రం వినిపిస్తుంది. ఇతరుల వ్యవహారంలో తెలుగు /జ/ వర్ణోచ్చారణే ఉంటుంది.

4.17 /ఝ/ ఈ వర్ణం రెండూ గ్రంథస్థరూపాల్లో పదాదిలో పదమధ్యంలో కన్పిస్తుంది. /ఝ/ఝంసరాబాయిపేట, చూ. ఆరో. జంషారాబాయిపేట. /ఝ/ నారావఝులపల్లె, చూ. ఆరో. నార్జాంపల్లె (గ్రామ నామ నిఘంటువు.)

మెకంజీ రూపంలో /ఝ/ అద్విరుక్తంగానే ఉన్నా దీని ఉచ్చారణ ద్విత్వ సహితంగానే ఉండడానికి అవకాశం ఉంది. కాబట్టి /ఝ/ ను కూడా ఒక వర్ణంగా నిర్ణయించడం జరిగింది.

4.18 /క/ ఈ వర్ణం పదాదిలో /ఎ/ తప్ప మిగిలిన అచ్చులకు పూర్వం, అచ్చుల మధ్య అద్విరుక్తంగానూ, ద్విరుక్తంగానూ వస్తుంది. 'ఐ' సంయుక్తాచ్చుకు ముందు కూడా పదాదిలో వస్తుంది. 'ఔ' కు ముందు రాదు.

4.19 /గ/ ఈ వర్ణం పదాది /ఈ, ఎ, ఏ/లకు తప్ప మిగతా అచ్చులకు పూర్వం, అచ్చులమధ్య అద్విత్వంగానూ, ద్విత్వంగానూ వస్తుంది. సంయుక్తాచ్చు 'ఔ' కు పూర్వంకూడా వస్తుంది. 'ఐ' కి పూర్వం రాదు.

4.20 /ఖ/ ఈ వర్ణం తత్సమపదాల్లోను, హిందూస్తానీ పదాల్లోను వస్తుంది. తత్సమ పదాల్లో అచ్చులమధ్య అద్విత్వంగా మాత్రమే వస్తుంది.

ఉచ్చారణలో /ఖ/ వర్ణానికి మహాప్రాణత్వం లేదు. హిందూస్తానీ పదాల్లో పదాదిలో, పదమధ్యంలో /అ/ కు పూర్వం మాత్రమే వస్తుంది. ఈ /ఖ/ వర్ణానికి మూలం హిందూస్తానీలో కంఠ్యశ్వాసోష్మ వర్ణం (x) గాని, లంబకశ్వాసస్పర్శ వర్ణం (Uvular plosive) (q) గాని కావచ్చు.

4.21 /ఘ/ ఈ వర్ణం పదమధ్యంలో అచ్చులమధ్య కనిపిస్తుంది. ఈ వర్ణమున్న గ్రామనామాలు 6 మాత్రమే ఉన్నాయి.

4.22 /మ/ ఈ వర్ణం పదాదిలో అన్ని అచ్చులకు పూర్వం, అచ్చులమధ్య అద్వి త్వంగానూ, ద్విత్వంగానూ వస్తుంది. సంయుక్తాచ్చు 'ఐ' ముందు కూడా వస్తుంది; 'ఔ' కు పూర్వం రాదు.

4.23 /న/ ఈ వర్ణం పదాదిలో /ఓ/కు తప్ప మిగత అచ్చులకు పూర్వం, పద మధ్యంలో అద్విత్వంగానూ, ద్విత్వంగానూ వస్తుంది.'ఐ' 'ఔ' సంయు క్తాచ్చులకు ముందు రాదు.

తెలుగులో అనునాసిక వర్ణాలు మూడే: /మ/, /న/, /ణ/. [ఞ] [ఙ]లు క్రమంగా తాలవ్య కంఠ్యవర్ణ హల్లులకు పూర్వమే వస్తాయి. అందువల్ల ఇవి సవర్ణయోగ్యత కలిగిన ధ్వనులే. న వర్ణము దంత్య స్పర్శలకు పూర్వం దంత్య అనునాసికంగానూ, ఇతర పరిసరాలలో దంతమూలీయ అనునాసికంగానూ న̱ ఉచ్చరింపబడుతుంది. కాబట్టి న వర్ణానికి నాలుగు సవర్ణాలను. [ఞ] [ఙ] [న] [న̱]లను నిర్ణయించ వచ్చు. తెలుగులిపిలో వర్గానునాసికాలకు సాముదాయికంగా పూర్ణ బిందువు (ం) సంకేతం.

4.24 /ణ/ ఈ వర్ణం పదాదిలో రాదు. అచ్చుల మధ్య అద్విత్వంగా వస్తుంది.

4.25 /ఫ఼/ కొన్ని హిందూస్తానీ, ఇంగ్లీషు ప్రతిబేయపదాల (Loan words) ద్వారా తెలుగులోకి వచ్చిన దంతోష్ఠ్య ఊష్మవర్ణం /ఫ఼/. దీనికి వ్రాతలో ఫ సంకేతాన్నే వాడుతారు. హిందూస్తానీ ప్రతిబేయపదాలుండే గ్రామ నామాల్లో పదాదిలో /అ, ఆ/ లకు పూర్వం, అచ్చులమధ్య /ఫ఼/ వర్ణం వస్తుంది. ప్రామాణికేతర వ్యవహారంతో దీని ఉచ్చారణ /ప/ గానే ఉంటుంది.

4.26 /స/ ఈ వర్ణం పదాదిలో (ఏ) కు తప్ప మిగిలిన అచ్చులకు పూర్వ, పద మధ్యంలో అద్విత్వంగా వస్తుంది. ఐ సంయుక్తాచ్చుకు పూర్వం వస్తుంది. ఔ కు ముందుమాత్రం రాదు.

పూర్వాచ్చులు /ఇ, ఈ, ఎ, ఏ/లతో కూడిన దంత్య /స/ వర్ణం ఉచ్చారణలో /శ/ వినిపిస్తుంది. /స/ /శ/ల మధ్య లిపిలో వుండే పర్యాయ ప్రవృత్తిలో ఇది ద్యోతకమవుతుంది. ఈ స్థితిని ప్రాచీన

కాలపు తెలుగులోనే చూడవచ్చు[9]. ముఖ్యంగా సెట్టి రూపంలో ఈ పర్యాయ ప్రవృత్తిని కావ్యభాషా నిఘంటువులలో కూడా చూడవచ్చు. స>చ. పదాది పూర్వాచ్చులకు ముందుండే స>చ అవుతుంది: చూ. సెట్టికుంట మెకం. 1223. 62; చెట్టికుంట.

4.27 /ష/ ఈ వర్ణం తత్సమ పదాల్లో అచ్చులమధ్య అద్విత్వంగా కన్పిస్తుంది. ప్రామాణికేతరోచ్చారణలో ఇది /స/గా వినిపిస్తుంది.

4.28 /శ/ ఈ వర్ణం తత్సమ పదాదిలో /అ, ఆ, ఇ, ఏ/లకు పూర్వం మాత్రమే వస్తుంది. పదమధ్యంలో వచ్చే ఆరోపాల వ్యుత్పత్తి అస్పష్టం.

4.29 /హ/ మూలద్రావిడంలో /హ/ లేదు. క్రీ. శ. 11 వ శతాబ్దివరకు శాసన భాషలో పదాది /హ/ కన్పించదు. నన్నయకాలంలో ప్రాచీనాంధ్రానికి /హ/ వర్ణఘటితదేశ్య శబ్దం ఒక్కటి కూడా లేదు. నన్నయ తర్వాతి కాలంలో /హ/ పదాలు తెలుగులో చాలా తక్కువగా కన్పిస్తాయి. తెలుగులోని 1236 ధాతువుల్లో /హ/ ధాతువులు రెండు మాత్రమే కన్పిస్తాయి. హత్తు- హెచ్చు. ఇవి కన్నడంనుండి వచ్చిన ఎరువు మాటలు (Loan words). వైకృతాల్లో పదాది /హ/ పదాలు పది కంటె ఎక్కువ లేవు. హిందూస్తానీ, మరాఠీ, ఇంగ్లీషునుండి ప్రవేశించిన పదజాలాలలో /హ/ వర్ణపదాలు కన్పిస్తాయి[10].

కడపజిల్లా గ్రామనామ పదజాలంలో /హ/ వర్ణాది గ్రామనామ పదాలు 9 మాత్రమే ఉన్నాయి. తత్సమ రూపాలు 6. మరాఠీ పదం 1, హిందూస్తానీ 1. హనుమనగుత్తి, హిమకుంట్ల అవ్యుత్పన్నాలు: ప్రామాణికాభాస రూపాలు కావచ్చు.

/హ/ వర్ణం తత్సమ, హిందూస్తానీ, మరాఠీ పదాలలో పదాదియందు /అ, ఈ, ఏ/ అచ్చులకు పూర్వం, పదమధ్యంలో అచ్చుల మధ్య వస్తుంది.

4.30 /ల/ ఈ వర్ణం /అ, ఆ, ఇ, ఎ, ఏ, ఒ/లకు పూర్వం, అచ్చులమధ్య అద్విరుక్తంగానూ, ద్విరుక్తంగానూ వస్తుంది.

4.31 /ళ/ ఈ వర్ణం పదాదిలో రాదు. అచ్చులమధ్య అద్విరుక్తంగానూ, ద్విరుక్తంగానూ వస్తుంది.

అచ్చులమధ్య అద్విరుక్తంగా ద్విరుక్తంగావచ్చే మూర్ధన్య /ళ/ వర్ణోచ్చారణ కడప మాండలికంలో దంత్యంగానే వినిపిస్తుంది. వర్ణక్రమంలో (Spelling) /ళ/ వర్ణంతో /ల/ వర్ణానికి పర్యాయ ప్రవృత్తి ఉంది. కడప మండలవాసుల ఉచ్చారణలో 'ళ' ఉచ్చారణ ఏ పరిసరాల్లోను లేదు. తెలుగులో /ళ/వర్ణం /ల/తో వర్ణైక్యం పొందడం 7 వ శతాబ్దిలోనే ప్రారంభమైనట్లు శాసనాలనుబట్టి తెలుస్తున్నది[12].

4.32 /ర/ ఈ వర్ణం పదాది /ఇ, ఈ, ఒ/లకు తప్ప అన్ని అచ్చులకు పూర్వము. అచ్చులమధ్య అద్విరుక్తంగా, ద్విరుక్తంగానూ వస్తుంది. సంయుక్తాచ్చు 'ఔ'కు పూర్వం వస్తుంది.

సవర్ణాలు : అద్విత్వ 'ర' సవర్ణం దంతమూలీయతాడితం. ద్విత్వ /ర్ర/ సవర్ణం దంతమూలీయ కంపితం. ద్విత్వ ఉచ్చారణకు బదులు అద్విత్వ ఉచ్చారణ కూడ వ్యవహారంలో కన్పిస్తుంది. గ్రంథస్థరూపాల్లోని వర్ణక్రమంలో ఱ కన్పిస్తుంది. ఇది కేవలం తెలుగు లిపి సంప్రదాయానికి సంబంధించినది.

క్రీ. శ. 7 వ శతాబ్దినుండి ఱ - ర లకు వ్రాతలో కూడా సాంకర్యం ఉన్నట్లు శాసన సాక్ష్యాలున్నాయి. ప్రాచీనాంధ్రంలోనే ఱ - ర ల మధ్య వర్ణవిభేదం తొలగింది[13]. అయితే సాంప్రదాయిక లాక్షణికులూ పండితులూ వాటి మధ్య విభేదాన్ని పాటించాలని నిబద్ధించినారు[14]. పదాది పదమధ్య ఱ-; -ఱ-. ర-; -ర- ల పట్టికలను కూడా ఇచ్చినారు[15]. శకటరేఫా వ్యామోహంతో కొన్ని కృతక ప్రామాణిక రూపాలను కూడా కవులు ప్రయోగించినారు[16].

4.33 /వ/ ఈ వర్ణం పదాదిలో /అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ/ లకు పూర్వమూ, అచ్చుల మధ్య అద్విత్వంగానూ, ద్విత్వంగానూ వస్తుంది.

పదాది, పదమధ్య 'వ' వరంలో పూర్వాచ్చులు వచ్చినపుడు ప్రామాణికేతర వ్యవహారంలో 'య' వినిపిస్తుంది, రెవెన్యూ రికార్డుల్లో కూడా ఈ మార్పు

అక్కడక్కడా చోటు చేసుకుంది. ఉదా: వేములవారి పల్లెకు బదులు యాములవారిపల్లె అని ముఖపత్రంలో రాయడం జరిగింది.

కేతన తన ఆంధ్రభాషా భూషణంలో గ్రామ్యాలకింద ఇచ్చిన ఉదాహరణలను బట్టి '(యేగ' < వేగ; 'యిందాము' < విందాము; 'యేదాలు' < వేదాలు; 'యీదే కదా. < వీదే కదా). 13 వ శతాబ్దినాటికే వ > య మార్పు వ్యవహారంలో ఎంత అధికంగా ఉందో చూడవచ్చు[17]. శాసన భాషలో ఈ మార్పు సాధారణంగా కన్పిస్తుంది[18]. పశ్చిమాచ్చులకు పూర్వంలో వ పూర్వశ్రుతి (onglide) వ్యావహారికంలో ఉంది.

4.34 /య/ ఈ వర్ణం పదాది /అ/ కు పూర్వమూ. అచ్చులమధ్య అద్విరుక్తంగానూ. ద్విరుక్తంగానూ వస్తుంది.

పదాది /య/ తెలుగుకు విసర్గం కాదు కానీ పూర్వాచ్చులకు పూర్వంలో య పూర్వశ్రుతి (onglide) గా వస్తుంది. పదాది పూర్వాచ్చులకు ముందు /య/ వర్ణాన్ని ఉపయోగించడం క్రీ. శ. 5 వ శతాబ్ది నుండి కూడా శాసనభాషలో చూడవచ్చు[19]. కావ్య భాషా వ్యాకర్తలు మాత్రం పదాది 'యా' పూర్వశ్రుతి కలిగిన తెలుగు మాటలను నిషేధించినారు[20]. పదాది /య/ వర్ణం కలిగిన మాటలు తత్సమ. హిందుస్తానీ. ఇంగ్లీషు ప్రతిదేయాలు.

## 4.35.1 హల్సంయుక్తాలు :

హల్సంయుక్తాలు వర్ణవ్యత్యయ కారణంగా ఆంధ్ర భాషా పరిణామంలో ఏర్పడినాయి. హల్సంయుక్తాలు ఎన్నో సంస్కృత పదాలనుండీ తెలుగులోనికి వచ్చినాయి. హిందుస్తానీ. ఇంగ్లీషు మొదలైన భాషల నుండి కూడా హల్సంయుక్తాలు ప్రవేశించినాయి. హల్సంయుక్త నిర్మాణం నేటి తెలుగుకు సాధారణమే.

"The occurrence of consonant groups in the initial position is not a common Dravidian characteristic, but, during the pre-historic period Telugu and Kui formed initial consonant clusters through metathesis attended

# అధ్యాయం - 8

## కడప గ్రామనామాలు : అర్థపరిశీలన

## (Cuddapah Place-Name Semantics)

8.1 కడప గ్రామనామాలను వాటి అర్థాన్నిబట్టి వివిధ రకాలుగా స్థూల వర్గీకరణ చేయవచ్చు. ఈ విధమైన వర్గీకరణ వల్ల ఊర్లపేర్లు ఏ విధంగా ఏర్పడుతాయో తెలుస్తుంది. కడప మండలానికి సంబంధించిన భౌగోళిక సాంస్కృతిక విశేషాలు, సాంఘిక చారిత్రక వివరాలు, ప్రజల నాగరికత ఈ వర్గీకరణవల్ల కొంతవరకు తెలుస్తాయి. (వివరాలకు చూ. అధ్యాయం 9.) ఈ వర్గీకరణ క్రమం గ్రామనామ వికాస క్రమాన్ని, సామాజిక నాగరికతా పరిమాణాన్ని కొంతవరకు సూచిస్తుంది.

8.1.2 కడప గ్రామాలను రెండు ప్రధాన వర్గాలుగా విభజించవచ్చు :

1. సామాన్యనామ సూచక గ్రామాలు.
2. సంజ్ఞానామ సూచక గ్రామాలు.

### 8.2 సామాన్యనామ సూచక గ్రామాలు :

ప్రథమావయవంలోని సామాన్య నామాల వైవిధ్యాన్ని బట్టి వీటిని రెండు ముఖ్యమైన రకాలుగా విభజించవచ్చు :

1. వర్ణనాత్మక నామాలు (Descriptive Names)
2. సంఘటన నామాలు (Incident Names)

8.2.1 వర్ణనాత్మక నామాలు :

ప్రథమావయవంలో వర్ణ్యమాన విశేష్యం కానీ విశేషణం కానీ ఉన్న గ్రామ నామాలు. వీటిని మళ్ళీ రెండు రకాలుగా విభజించవచ్చు.

1. నైసర్గిక నామాలు (Nature names or topographic names)
2. విశేషణ పూర్వకనామాలు లేదా విశేషణ సూచక గ్రామాలు.

3.2.1.1. నైసర్గిక నామాలు :

వర్ణ్యమాన విశేష్యాలైన స్థానిక నైసర్గిక వాచకాలు కాపీ, వృక్ష, జంతు, వాస్తు, వస్తు సాదృశ్యబోధకాది నామాలు గాపీ ప్రథమావయవంలో ఉండే నామాలు. వీటిని 14 రకాలుగా విభజించవచ్చు. ఇవి :

(అ) జలసూచక గ్రామాలు :

ఉదా : ఏలూరు; కోడూరు; బుగ్గ అగ్రహారం; వంకమర్రి; వాకమడ మొదలైనవి.

(ఆ) శిలాసూచక గ్రామాలు :

ఉదా : కలమళ్ళ, కల్లూరు, గుండ్లూరు. గుండ్లమడ మొదలైనవి.

(ఇ) పర్వత సూచక గ్రామాలు :

ఉదా : కొండూరు, గండికోట మొదలైనవి.

(ఈ) ఉన్నత భూసూచక గ్రామాలు :

ఉదా : గుట్టపల్లె, తిప్పలూరు, మిట్టపల్లె మొదలైనవి,

(ఉ) అటవీ సూచక గ్రామాలు :

ఉదా : అడవిపల్లె, కానపల్లె మొదలైనవి.

(ఊ) భూసూచక గ్రామాలు :

గ్రామాలు వెలసిన ప్రదేశపు నేల తీరు తెల్పేవి.

ఉదా : ఇసుకపల్లె, ఉప్పలపాడు, గరుగుపల్లె, పుద్దమళ్ళ, సున్నపురాళ్ళపల్లె మొదలైనవి.

(ఎ) వనసూచక గ్రామాలు :

ఉదా : ఆకుతోటపల్లె, వనిపెంట మొదలైనవి.

(ఏ) వృక్షసూచక గ్రామాలు :

వృక్షసస్యసూచకాలున్న గ్రామనామాలన్నీ ఈ తరగతిలో చేరుతాయి.

ఉదా : అత్తిరాల, ఏపిల మిట్ట, ఒడిశలగొంది, గురిగింజకుంట, గొట్లమిట్ట, చంద్రపల్లె, జమ్మలమడుగు, చాగలేరు, నేరేళ్ళవంక, మేడిదిన్నె, మర్లబైలు, మొదలైనవి.

(ఐ) జంతుసూచక గ్రామాలు :

పశుపక్ష్యాదులు, సరీసృపాల పేర్లున్న గ్రామాలన్నీ ఈ తరగతిలో చేరుతాయి.

ఉదా : ఆనిమెల, అలవలపాడు, నెమళ్ళదిన్నె, కేశ్వూరు మొదలైనవి.

(ఒ) దేవతా సూచకాలు :

ఉదా : దేవగుడి, దేవతాపురం, కన్నెలూరు, హనుమద్గిరి మొ. మంగళ సూచక గ్రామాలను కూడా ఇందులో చేర్చవచ్చు.

(ఓ) వాస్తు సూచక గ్రామాలు :

ఉదా : కోటపాడు, మిద్దెపాడు, బురుజుపల్లె, మొదలైనవి.

(ఔ) వృత్తి సూచక గ్రామాలు :

ఉదా : దర్జీపల్లె, దఫేదారుపల్లె, హవల్దారుపేట.

(క) బిరుద సూచక గ్రామాలు ;

ఉదా : పక్కీరుపల్లె, రాయచోటి, దొరసానిపల్లె మొదలైనవి.

(ఖ) సాదృశ్య బోధక గ్రామాలు :

ఉదా : పుష్పగిరి, చంద్రగిరి.

(గ) వస్తు సూచక గ్రామాలు :

ఉదా : ధన్నవాడ,

8.2.1.2 విశేషణ పూర్వక నామాలు లేదా విశేషణ సూచక గ్రామాలు :

వీటిని 6 రకాలుగా వర్గీకరింపవచ్చు.

(అ) వర్ణ సూచకాలు :

ఉదా : ఎర్రబల్లె, నల్లబల్లె, పొదదుర్తి మొదలైనవి.

(ఆ) సంఖ్యా సూచకాలు :

ఉదా : ఒంటిల్లు, ఒంటిమిట్ట, ఇనగలూరు మొదలైనవి.

(ఇ) దిక్సూచకాలు :

కేవల దిగ్వాచక విశేషణ సూచకాలైన గ్రామాలు; స్థలార్థకాలైన గ్రామాలు ఈ వర్గం కిందికి వస్తాయి.

1. కేవల దిగ్వాచక నామాలు :

దిక్కులను సూచించే తూర్పు, పడమర మాత్రమే కాక, ఎగువ, దిగువ, నడిమి, బయటి - కూడా ఈ వర్గానికి చెందుతాయి.

ఉదా : ఎగువపల్లె, దిగువపల్లె, తూర్పుపల్లె, పడమటికోన, నడింపల్లె, బయటిపాలెం మొదలైనవి.

2. స్థలార్థక నామాలు :

గ్రామం ఏ స్థలంలో ఉందో తెల్పేవి.

ఉదా : లోమడ, కనుమలోపల్లె, మిట్టమీదపల్లె, చెరువు ముందర రాచపల్లె, ఏటవతల పక్కీడపల్లె, మిద్దెకాడపల్లె మొదలైనవి.

(ఉ) పౌర్వాపర్య సూచకాలు :

కాలగతికి సంబంధించిన పూర్వాపరాలను, పాత కొత్తలను తెల్పేవి.

ఉదా : కొత్తపల్లె, పాతపల్లె, పూర్వబొమ్మేపల్లె, మునిపాక (మునుపాక) మొదలైనవి.

(ఊ) పరిమాణ సూచకాలు :

ఉదా : చిన్నదండ్లూరు, పెద్దదండ్లూరు, దొడ్డియం, విడుకావ్వె, పెనగలూరు, పొట్టిపాడు, పొడుమాతల, పిట్టిగుంట, పిచ్చిపాడు, గున్నకుంట్ల, నెర్రవాడ మొదలైనవి.

(ఎ) పూజ్యార్థక విశేషణాలు :

కిచిలేబొమ్మేపల్లె, కిచిలేసుగుమంచిపల్లె, కిచిలేవెంకటాపురం.

## 8.3 సంఘటన నామాలు :

ఒక సంఘటనను ఆధారంగా చేసుకొని ఏర్పడిన ఊర్లు.

ఉదా : తుడుములదిన్నె, దొంగలసాని, పెండ్లిమర్రి, వలపపల్లె, వెలిదండ్ల, కుంపిణీపురం.

## 3.4 సంజ్ఞానామసూచక గ్రామాలు :

వీటినే సంబంధార్థక నామాలనీ లేదా షష్ఠ్యర్థక నామాలనీ (Possessive names) వ్యవహరించవచ్చు. వీటిని మళ్ళీ 8 రకాలుగా విభజించవచ్చు.

అవి : (అ) స్థలనామ సూచకాలు
(ఆ) వ్యక్తినామ సూచకాలు
(ఇ) గణసూచకాలు
(ఈ) కుటుంబనామ సూచకాలు
(ఉ) కులసూచకాలు
(ఊ) మతసూచకాలు
(ఎ) జాతిసూచకాలు
(ఏ) గ్రామనామ/జనపద సూచకాలు.

పై వర్గాల సంబంధంతో ఏర్పడిన ఊర్ల పేర్లివి. ఈ సంబంధం పట్టబద్ధమైంది కావచ్చు. కాకపోవచ్చు. వ్యక్తి, కుటుంబనామాలున్న గ్రామాలు వ్యక్తి ప్రాధాన్యాన్నిబట్టి, కుటుంబ ప్రాధాన్యాన్నిబట్టి ఏర్పడి ఉండవచ్చు. గణ, కుల, జాతి, మత సంబంధవాచకాలైన గ్రామాలు వాటి ప్రాబల్యాన్ని బట్టి యేర్పడి ఉండవచ్చు.

### 3.4.1 స్థలనామ సూచకాలు :

ఒక పరిసరంలో గుర్తించదగిన స్థలం పేరుతో యేర్పడిన ఊర్ల పేర్లు.
ఉదా : ఒడిశెలవంకపల్లె, పొట్టిపెడపల్లె, మల్లెంపల్లెపుట్ల, సుగాలితాండ, కోతులగుట్టపల్లె, బుర్రలదిన్నెపల్లె, నల్లవాగుపల్లె, ఉప్పుగుంట్లపల్లె మొదలైనవి.

### 3.4.2 వ్యక్తినామ సూచకాలు :

ఇవి రెండు రకాలు, (1) పురుషనామ సూచకాలు. (2) స్త్రీనామ సూచకాలు.

(1) పురుషనామ సూచకాలు :

ఉదా : అంకన గొడుగునూరు, అంకాయపల్లె, కొండప్పగారిపల్లె, సిద్ధమూర్తిపల్లె, నరసింహస్వామిపల్లె, తలమంచిపట్న, అక్కులుగారిపల్లె. కులసూచకానుబంధాలున్న పురుషనామాలు కూడ ఈ వర్గంలోనే చేరుతాయి.

ఉదా : అబ్బినాయునిపల్లె, నందనాయకబిడెం, ఈశ్వరభట్లుపల్లె, అచ్చి రాజుపల్లె, దేవరాయపల్లె, అంకిరెడ్డిపల్లె, అన్నపుశాస్త్రిపల్లె, మీర్జాఖాన్‌పల్లె, హీరోజీపురం మొ.

(2) స్త్రీ నామసూచకాలు :

ఉదా : మంగంపేట, అంబికపల్లె, మంగమాంబాపురం, గంగాదేవి పల్లె, జంషారాబాయిపేట మొదలైనవి.

**8.4.3** గణసూచకాలు : (Tribe denoting Names)

ఎరికలబిడం, కురవపల్లె, సుగాలిబిడం

**8.4.4** కుటుంబ నామసూచకాలు :

వంశమూలపురుషుడి పేరువల్ల కలిగినవి లేదా ఇతర సంస్కృతి సూచకాలైన పేర్లు ఈ వర్గంలో చేరుతాయి.

ఉదా : గజరాజువాండ్లపల్లె, కొల్లావాండ్లపల్లె, గాలివారిపల్లె, గంధంవారిపల్లె, గడ్డంవాండ్లపలె, పల్లవోలు, వలూరు మొదలైనవి.

**8.4.5** కులసూచకాలు :

ఉదా : ఆసాదివాండపలె, ఏకర్లపాలెం, కమ్మపల్లె, కాపపల్లె, గొరిగెనూరు, బెస్తపల్లె, పిచ్చిగుంట్లపల్లె, బోయపల్లె, బ్రాహ్మణపల్లె, మరాటిపల్లె, యాదవాపురం, వెలమవారిపల్లె మొదలైనవి.

**8.4.6** జాతి సూచకాలు :

అరవపల్లె, అరవీడు, ఏరువపాలెం.

**8.4.7** మత సూచకాలు :

ఆదపూరు, వీరబల్లె, చియ్యపాడు, చియ్యవరం, శంఖవరం, జాండ్లమరం, దానవులపాడు, బూదవాడ.

**8.4.8** గ్రామనామ జనపద సూచకాలు :

ఒక గ్రామం ప్రథమావయవంగా ఏర్పడినవి లేదా జనపదాన్ని సూచించేవి.

అగ్రహారం గుత్తికొట్టాల, గుంటూరు కొట్టాల, పొదిలివారిపల్లె మొదలైనవి.



సామాన్యనామ
సూచకాలు
సంజ్ఞానామ
సూచకాలు
స్థల
వ్యక్తి
గణ
కుటుంబ
కుల
జాతి
మత
గ్రామ/జనపద
వర్ణనాత్మక
సంఘటనాత్మక
నైసర్గిక
విశేషణ
వర్ణ
సంఖ్య
దిక్
పౌర్వాపర్య
పరిమాణ
పూజ్యార్థక
కేవలదిక్
స్థలార్థక
జల
శిలా
పర్వత
ఉష్ణతభూ
అటవీ
వన
వృక్ష
జంతు
దేవత
వాస్తు
వృత్తి
బిరుద
సాదృశ్యబోధక
వస్తు

8.6. గ్రామనామ ప్రథమావయవాల్లో కన్పించే కుటుంబనామ, వ్యక్తినామాలనుకూడా అర్థ దృష్ట్యా కొన్ని వర్గాలుగా విభజించవచ్చు.

ఉదా : కుటుంబనామాలే తీసుకుందాం. నైసర్గిక సూచకాలు (అడవివారిపల్లె, చింతలవాండ్లపల్లె, చామంచులవారిపల్లె మొ.). జంతు సూచకాలు (ఆవులవాండ్లపల్లె, కోడిచిన్నాయపల్లె . విశేషణ సూచకాలు (ఒంటిగారిపల్లె, కొత్తవాండ్లపల్లె మొ.), ఆహార సూచకాలు (నేతివారిపల్లె, చల్లావారిపల్లె మొ.), వస్తుసూచకాలు (గాదెవారిపల్లె, గుజ్జులవారిపల్లె మొ.), గ్రామనామ సూచకాలు (అరవీటివాండ్లపల్లె, అమారువారిపల్లె) మొదలయిన వివిధవర్గాలుగా (గ్రామనామాల వర్గీకరణ క్రమంలోనే) విభజించవచ్చు. ఈ విధంగానే వ్యక్తినామాలను కూడా వర్గీకరించవచ్చు. కానీ ఈ సిద్ధాంతవ్యాసం కేవలం గ్రామనామాలకు సంబంధించిందే కాబట్టి వ్యక్తినామ, కుటుంబనామాలను గురించిన విశేష పరిశీలనకు ఇక్కడ అవకాశం లేదు. ఇది ప్రత్యేకంగా చేయవలసిన నామ విభాగ కృషి. అయినా నిఘంటువులో ఆయా వ్యక్తి, కుటుంబనామాలకు పరంలో పై వర్గీకరణ కొంతవరకు సూచింపబడింది.

## 8.7. లోక నిరుక్తి (Folk-etymology)[1]

గ్రామనామ పరిశీలనలో అర్థదృష్ట్యా ఆసక్తికరమైన విషయం లోక నిరుక్తి. ఇంగ్లీషులో 'Folk-etymology'కి సమానార్థకంగా తెలుగులో జానపద వ్యుత్పత్తి, జన నిరుక్తి, లోక నిరుక్తి అని వాడుతున్నారు.

8.7.1. ఇంగ్లీషు నిఘంటువుల్లో Folk-etymology కి గల అర్థాల "Usually the popular perversion of the form of words in order of render it apparently significant" (The Oxford English Dictionary).

---

1. Volke etymologie (the etymology of the common people or ordinary people) అనే రూపాన్ని ప్రప్రథమంగా Ernt Wilhelm Forstemann 1870 లో సృష్టించినాడు. ఈ పదానికి ఇంగ్లీషు సమానార్థకం Folk-etymology. 1882 లో A S. Palmer 'Folk-etymology' అన్న గ్రంథాన్ని వ్రాసినా Oxford English Dictionary లో ప్రప్రథమంగా 1883 లో Folk-etymology ఒక ఆరోపంగా కన్పిస్తుంది. (వివరాలకు చూ. Partridge, Eric, 1961, 34-59).

"The popular transformation of words so as to give them an apparent relationship to other, better known or better understood words as the dialectal change of asparagus to 'sparrow grass' (Webster's New International Dictionary) James B. Greenough and George L. Kitteredge" నిర్వచనం :

"In its simplest operation folk-etymology merely associates together words which resemble each other in sound and show a real or fancied similarity in meaning but which are not at all related in their origin.[1]

8.72 జానపద వ్యుత్పత్తికి తెలుగులో మొట్టమొదట ఒక నిర్వచనాన్ని ఇచ్చినవారు ప్రొ. భద్రిరాజు కృష్ణమూర్తి. వారి నిర్వచనం : "ఒక పదంలో గాని పద బంధంలో గాని అపరిచితంగా (లేక అల్ప పరిచితంగా) ఉన్న పద భాగాన్ని తీసివేసి దాని స్థానంలో పరిచితపదాన్ని ఉంచడం జానపదుల నూతన పద సృష్టిలో ఒక పద్ధతి." (కృష్ణమూర్తి, 1962, 45.)
అర్థతత్వ పరిశీలనలో లోకనిరుక్తి స్థానాన్ని గుర్తించి. ఆ విషయమై ప్రొ. ఈవిధంగా జి. యన్. రెడ్డి : తెల్పినారు:

"Etymologising is not the exclusive privilege of scholars. The common people have also their own fanciful derivations of words. And in accordance with the fancied derivations an unfamilliar form may be changed so as to make it familiar, and if possible a meaning may be given to that which was meaningless before. (G. N. Reddy, 1966, 107)

ఈ విషయమై తెలుగులో మొదటిసారిగా ఆసక్తికరమైన వ్యాసాన్ని రాసినవారు ప్రొ. తూమాటి దొణప్ప. వారి నిర్వచనంలో జననిరుక్తి :

"ఏదైనా ఒక భాషా రూపానికి కృత్రిమంగా కల్పించబడ్డ వ్యుత్పత్తి ననుసరించి సిద్ధించే రూపాంతరీకరణాన్ని జననిరుక్తి లేదా లోకనిరుక్తి 'ఫోక్ ఎటిమాలజీ' (Folk-etymology) అని శాస్త్రకారులు నిర్వచించారు. శాబ్దికంగా జరిగే తికమకలు కృతక ప్రామాణిక రూపాలు (hyper-forms) సృష్టికీ, అర్థపరంగా ప్రవర్తిల్లే అవకతవకలు కృత్రిమ వ్యుత్పత్తుల కల్పనకీ హేతువు లవుతాయి.

1. Greenough, James Bond Kitteredge, George L Words and their way in English speech Ch. XXIII: Folk-Etymology.

వెరసి యీ రెండు రీతులనూ....జనవిరుక్తి 'ఫోక్ ఎటిమాలజీ' అని పేర్కొనటం..........(దొణప్ప. 1972, 31.)

3.7.3 సాధారణంగా ఏ భాషలోనైనా స్థలనామాలకు లోకనిరుక్తులు కన్పిస్తాయి. ఉదాహరణకు బ్రూటస్ పేరుతో బ్రిటన్ ఏర్పడింది దనడం. రోములస్ పేరుతో రోమ్ పేరు వచ్చిందని చెప్పడం (Utley, 1963, 154). తమిళ స్థలనామమైన ఐయర్ మలైకి పంచపాండవులతో సంబంధాన్ని కల్పించి ఐవర్ మలై (అయిదుగురి కొండ) గా మార్చి లోకనిరుక్తి చెప్పడం. తమిళ గ్రామనామం తిరుచ్చిరాపల్లికి త్రిశిరునితో (లంకలో ఒక రాక్షసుడు) సంబంధాన్ని ముడిపెట్టి తిరిసిరాపల్లి అని లోక నిరుక్తి ఇవ్వడం (Sethu pillay 1953, 27-28) "రఘురామ వీరవరుడు పృథివి జాతాపహరణంబు విన్నచోటు శ్రుతిగిరి పురంబునాడి" అని జాషువాకవి స్వగ్రామమైన వినుకొండను ఆత్మకథలో పేర్కొనడం లోక నిరుక్తికి దృష్టాంతం.

3.7.4 కడప గ్రామనామాలలో గ్రంథస్థమైన లోకనిరుక్తులు వందవరకూ ఉన్నాయి. మెకంజీ కైఫీయతులనుండి ఇతర గ్రంథాలనుండి. పర్యటనలలోను సేకరించిన లోకనిరుక్తులు విషయసూచిలో ఆయా గ్రామాల వ్యుత్పత్తి పరిశీలనతో ఒక భాగంగా వివరించడమైంది. ఈ లోక నిరుక్తులను రెండు రకాలుగా వర్గీకరించ వచ్చు.

1. ప్రజాసామాన్య నిరుక్తులు (Popular Etymology)
2. పండితలోక నిరుక్తులు (Learned folk-etymology)[1]

3.7.4.1 <u>ప్రజాసామాన్య నిరుక్తులు</u> : సామాన్య ప్రజల కృతక ప్రామాణిక రూపాల నుంచి ఏర్పడినవీ, శాబ్దికరూపాన్ని మార్చకుండా నిరుక్తి చెప్పినవీ ఈ వర్గంలో చేరుతాయి,

(అ) <u>కృతక ప్రామాణికాల లోకనిరుక్తి</u> :

ఇల్లూరును విల్లూరుగా పలకడం వల్ల వచ్చిన లోకనిరుక్తి (చూ. అరో. ఇల్లూరు). ఈటెంవారిపురంను ఈటెవాల్పూరుగా చేయడంవల్ల పుట్టిన లోక నిరుక్తి (చూ. అరో. ఈటిమార్పురం )

1. Learned Folk-Etymology అన్న పదాన్ని కల్పించిన వారు Eric Partridge (వివరాలకు చూ. Partridge, 40-46).

(ఆ) శాబ్దిక రూపాన్ని మార్చకుండా చెప్పిన లోక విరుక్తులు :

ఉదా : చూ. ఆరో. పెద్దకొామెర్ల, రోళ్ళమడుగు, పోలి మొదలైనవి.
ఈ విధమైన ప్రజాసామాన్య విరుక్తులలో స్థానికమైన ఒక ఐతిహ్యం (Local legendry) ప్రాధాన్యం వహించినట్లు తెలుస్తుంది.

8.7.4.2 పండితలోక విరుక్తులు :

మతవాఙ్మయానికి చెందిన ఒక ఐతిహాసిక గాధను ధృవపరిచే ఉద్దేశ్యంతో, ఆ ఐతిహాసిక గాధకు అనుగుణంగా గ్రామనామ శాబ్దికరూపాన్ని మార్చిగానీ, మార్చకుండా గానీ కల్పించిన లోక విరుక్తులివి: ''జనని సంస్కృతంబు సకల భాషలకును'' అని నమ్మిన సంస్కృత భాషాభిమానులూ, పురాణ ప్రియులూ ఈవిధమైన లోక విరుక్తికి కారకులు. గ్రామనామాలను సంస్కృతీకరించడం కూడా ఇట్టి పండితుల పనే. (చూ. సంస్కృతీకరణం 9.3.9).

(అ) శాబ్దిక రూపం మార్చి చెప్పిన లోక విరుక్తులు :

ఉదా : అత్తిరాలను, హత్యరాలగా మార్చి పరశురాముడి మాతృహత్యా నేర కథతో సంబంధాన్ని కల్పించడం (చూ. ఆరో. అత్తిరాల).
కోగటానికి కణ్వాశ్రమంలోని శకుంతలకు, శకుంత పక్షులకు ముడి పెట్టడం (చూ. ఆరో. కోగటం).

నంబటూరులో చ్యవనాశ్రమాన్ని సృష్టించి దాన్ని చ్యవటూరుగా మార్చి లోక విరుక్తి చెప్పడం (చూ. ఆరో. నంబటూరు).

(ఆ) శాబ్దిక రూపం మార్చకుండా చెప్పిన లోక విరుక్తులు :

ఉదా : నందలూరు, నందిమండలం.

పండితలోక విరుక్తిలో విచిత్రమైన వైరుధ్యం కూడా కన్పిస్తూ ఉంటుంది.

ఉదా : నందిమండలానికీ, వోట్లదుర్తికీ గల లోక విరుక్తులు. నంది మండలంలోనూ కుందేళ్ళు కుక్కలపై తిరగబడినాయి. వోట్ల దుర్తిలోనూ తిరగబడినాయి. (చూ. ఆరో. నంది మండలం, వోట్లదుర్తి). ఆనెగొందిలో ఆ విధంగా కుందేళ్ళు కుక్కలపై తిరగబడగా విద్యారణ్యస్వామి ఆ ప్రదేశంలో రాజ్యాన్ని స్థాపించమని హరిహర బుక్కరాయలకు చెప్పడం గమనిస్తే ఒక కథను

ధృవపరచడానికి పండితులు చేసిన ప్రయత్నం అర్థ మవుతుంది. అదేవిధంగా అంతో యింతో తెలిపిన చరిత్రను చెప్పే సందర్భంలో కూడా ఏ సంబంధమూ లేని పురాణ విషయాలను జోడించడం కూడా చూడవచ్చు. (చూ. ఆరో. నందలూరు)

8.7.5 కడప గ్రామనామాలలోని లోకనిరుక్తులు ప్రత్యేక పరిశీలనార్హాలు అని కూడా చెప్పవచ్చు. అవి జానపద వాఙ్మయ పరిశీలనలో ఉపయోగిస్తాయి. ఈ లోకనిరుక్తుల వల్ల ప్రజల, పండితుల విశ్వాసాలూ, కల్పనాశక్తి, జానపద చాపల్యమూ తెలుస్తాయి. అయితే శాసన సాక్ష్యాలు లభించని చోట్లా, వ్యుత్పత్తి రీత్యా క్లిష్టమైన నామబంధాలున్న సందర్భంలోనూ ఈ లోకనిరుక్తులే విస్తలైన నిరుక్తులని భ్రమపడే ప్రమాదముంది. నామవిజ్ఞానంలో లోకనిరుక్తుల్ని యథాతథంగా గ్రహించడం ప్రమాదకరం. వాటి పరిశీలనకు విచక్షణ అవసరం:

"Folk-etymology is a branch of folk-lore and legitimate subject for study, though its use in onomastics proper should be largely iconoclastic" (Utley, 1963, 154).



# అధ్యాయం - 9

## కడపగ్రామనామాలు: నైసర్గిక, సాంస్కృతిక, చారిత్రకాది విశేషాలు

**9.1** గ్రామనామ పరిశీలన కేవలం భాషా చరిత్రకు సంబంధించినదే కాదు, సాంఘిక చరిత్రకూ, సామాజిక విజ్ఞానానికీ ఉపకరించే విజ్ఞాన మిది. గ్రామనామ పరిశీలన వల్ల భాషా విశేషాలే గాక, భాషేతరమైన సామాజిక విశేషాలు— నైసర్గిక, సాంస్కృతిక, చారిత్రకాది విశేషాలు — కూడా అనేకం వ్యక్తమవు తాయి. కడపజిల్లా గ్రామనామాలనుబట్టి వ్యక్తమయ్యే నైసర్గికాది భాషేతర విశేషాలను ఈ అధ్యాయంలో స్థూలంగా చర్చించడమైంది.

### 9.2 నైసర్గిక విశేషాలు :

కడప గ్రామనామాల్లో నైసర్గిక నామసూచకాలైన గ్రామాల పరిశీలనవల్ల కడప మండల నైసర్గిక స్వరూపం కొంత తెలుస్తుంది.

(అ) జీవనదులు కడపజిల్లాలో నేడు లేవు. ఒకప్పటి జీవనది అయిన పెన్న, దాని ప్రధాన ఉపనదులు చిత్రావతి, కుందేరు (కుముద్వతి), పాపాఘ్ని, సగిలేరు, చెయ్యేరు (బాహుదా), పించా, మాండవి; మరెన్నో వంకలు, వాగులు, కాల్వలు, తటాకాలు కడపజిల్లాలో ఉన్నాయి. జలసూచక గ్రామాలు, జలసూచక గ్రామనామ ద్వితీయావయవాలు కడప మండలం లోని జలాధారాలను వ్యక్తపరుస్తాయి:

ఉదా : గంగపేరూరు, పెన్నపేరూరు, పొడదుర్తి, వెలుదుర్తి, వెనకయ్య కాల్వ, రోళ్ళమడుగు, రావులకొల్లు మొదలయినవి. జలసూచక గ్రామ నామ ద్వితీయావయవాలు 17. అవి; -ఏరు, -కాలవ, కాల్వ,- కుంట ~ గుంట, ~ గుంట్ల, -కొలను, ~ కొల్లు, -గుండం, -చెరువు, ~ చెర్ల, -దుర్తి గుత్తి, -దెన, -నూతల, -పాయ ~ వాయి, -బావి; మడ, -మడుగు ~ మడక, -రాల, -వంక, -వాగు, -సముద్రం.

(ఆ) ఏజెన్సీ ప్రాంతాన్ని విడిస్తే, ఆంధ్రప్రదేశ్‌లో కడప అత్యధిక పర్వత ప్రాంతంగల జిల్లా. ఈ జిల్లాలో ఎర్రమల, నల్లమల, లంకమలల

వరుసలూ, పాలకొండ, ఖానుకోట, మల్లేల కొండలు, కోకిలేటి కనుమ కొండలూ, బిద్వేలికొండలూ; రాయచోటి తాలూకాలోని పెక్కు చిల్లర కొండలూ, గుట్టలూ ఉన్నాయి. (వివిధ తాలూకాలకు చెందిన పర్వత స్థల నామాల వివరాలకు చూ. APDGC, P. 11-21.) ఈ జిల్లాలో 1,180,198 ఎకరాల అటవీ ప్రాంతం ఉంది. కడపజిల్లా వైశాల్యంలో ఇది 30 శాతం ఆక్రమిస్తుంది, (Ibid, 32). శిలా, పర్వత అటవీ ఉన్నత భూసూచకాలైన గ్రామనామాలు, గ్రామనామ ద్వితీయావయవాలు కడప మండలంలోని శిలా పర్వత అటవీ ఉన్నత భూస్థితులను వ్యక్తపరుస్తాయి:

ఉదా : కల్లూరు, కలమళ్ళ, కొండూరు, గండికోట, బోటిమీదపల్లె, మిట్టమీద పల్లె, అడవిపల్లె, వనిపెంట, కనుమలోపల్లె, కానపల్లె, సానిపాయ మొదలైనవి. శిలాసూచక గ్రామనామ ద్వితీయావయవాలు 3. అవి కల్లు, -గుండ్ల, -బండ. పర్వతసూచకానుబంధాలు 9. అవి : -ఏనె, -కిరి, ~ గిరి, -కొండ, గండ్ల, -గొంది, -దిన్నె, -మల, ~ మెల, ~ మెళ్ళ, మిట్ట, -పాని, ఉన్నత భూసూచి ద్వితీయవయవాలు 2, అవి -కట్ట, ~ కట్ల, -గట్టు.

(ఇ) కడప మండలంలోని భూస్థితిని సూచించే ఊర్లు.

ఉదా : ఉప్పులపాడు, గరుగుపల్లె, చౌటపల్లె, సున్నపురాళ్ళపల్లె మొదలైనవి.

(ఈ) చెట్లూ చేమలూ (Flora) :

వృక్ష సస్య సూచకాలైన 181 కడప గ్రామాల పరిశీలనను బట్టి ఈ కింది 57 చెట్ల చేమల రకాలు కడప మండలంలో ఉన్నాయని తెలుస్తుంది. అవి :

| | |
|---|---|
| ఆత్తి- | ఆత్తిరాల |
| అనుము- | హనుమనగుత్తి |
| అల్లి - | అలిదెన |
| ఇప్ప- | ఇప్పట్ల, ఇప్పపెంట |
| ఈదు- | ఈదులపల్లె, ఈదుళ్ళపల్లె |
| ఊడవ- | ఊడవగండ్ల |
| ఏపె- | ఏప్పిరాల, ఎపిలమిట్ట, ఏపిలవంకపల్లె |
| ఒడిశ- | ఒడిశలగొంది |
| కనుము- | కమపత్రి |

కలే- కలికిరి

గానుగ- గానుగపెంట

గార- గారాలమడుగు

గురిగింజ- గురిగింజకుంట

గొట్టి- గొట్లమిట్ట

గోనుమాకు- గోనుమాకులపల్లె

చంద్ర- చంద్రపల్లి (3 ఆరోపాలు), చండ్లూరు, సన్నుపల్లె

చాగ- చాగలేరు, చాగలగుట్టపల్లె

చింత- చింతకుంట, చింతలచెలక, చింతకొమ్మదిన్నె

చిగర- చిరిగెపల్లె

చిటిమిడి- చిటిమిటిచింతల

జంబు- జమ్ములమడుగు

జాల- జాలప_ర్తి

జిల్లెడు- జిల్లేళ్ళ (2 ఆరోపాలు), జిల్లేళ్ళమడక

జావ్వి- జువ్వలపల్లె

జెముడు- చెముడూరు, చెముళ్ళపల్లె

టెంకాయచెట్టు- టెంకాయచెట్లపల్లె

తంగేడు- తంగేడుపల్లె (2 ఆరోపాలు)

తక్కలి- తక్కలపల్లె

తాటి- తాటిమాకులపల్లె (2 ఆరోపాలు); తాడికొల్ల; తాళ్లపత్రి; తాళ్లపాక, తాళ్లప్రొద్దుటూరు

తుమ్మ- తుమ్మకొండ; తుమ్మలఅగ్రహారం; తుమ్మలపల్లె; తుమ్మలూరు

తూడు- తూడూరు

తొగరు- తొగరుపల్లె (2 ఆరోపాలు)

దిరస- దిరసపంచ

దొండ- దొండపాడు; దొండ్లవాగు

నానబాలు- నానబాలపల్లె

నువ్వు- నూలివీడు

నేరేడు- నేరేళ్లవంక

| | |
|---|---|
| పాల- | పాలగిరి |
| పూతి- | పూతికుంట |
| పొట్ల- | పోట్లదుర్తి |
| పొన్న- | పొన్నతోట |
| బండారు- | బండారువల్లె |
| బూరగ- | బూరగమానిపల్లె |
| మద్ది- | మద్దిమడుగు; మద్దిరాల; మద్దుల పాయ; మద్దూరు; మద్దులేటిగడ్డ |
| మర్రి- | మర్రిపల్లె, మర్రిమాకులపల్లె (2 ఆరోపాలు), మర్ల బయలు |
| మల్లె- | మల్లెమడుగు |
| మేడి- | మేడిదిన్నె, పొట్టిమేడిపల్లె |
| మొగిలి- | మైలపల్లె, మైలవరం, మొయిళ్లకాల్వ |
| మొయిలి- | మొయిళ్ల చెరువు |
| రాగి, ~ రావి- | రాగికుంట, రాగిమాకులపల్లె, రాగిమానువల్లె, రాగి మానుబిడం, రావులకొలను, రావులకొల్లు, రావులపల్లె |
| రేగు- | రేకలకుంట (2 ఆరోపాలు) |
| కాకిరేణి- | కాకిరేణిపల్లె |
| వద్ది- | వద్దిరాల |
| వావిలి-/ | నున్నవావిళ్లపల్లె, వాయిలచెట్లపల్లె |
| ~వాయిలి- | వాయిళ్లనుగాలిబిడం |
| వెదురు- | వెదురూరు |
| వెలగ- | వెలగచెర్ల |
| వేము- | వేంపల్లె, వేపరాల, వేమగుంట, వేమలూరు, వేముల |
| సారమాను- | సారమానిపాడు |
| సుంకేసుల- | సుంకేసుల (2 ఆరోపాలు) |
| సోమిమాకు- | సోమిమాకులపల్లె |

గ్రామనామ ద్వితీయావయవాల్లోని చెట్ల పేర్లు 213. అవి: -అపి ~ఏపె, -చింతల, -జాల, -జువ్వి, -వటం, -తాడు, -నెల్లి, -మద్ది, -మర్రి, -రావి, -వెలగ,

వేముల, -సుంకేసుల. తోట అనుబంధసహిత గ్రామనామం పొన్నతోట వన సంపదను వ్యక్తం చేస్తుంది.

(ఎ) జంతువులు; పక్షులు; సరీసృపాలు ;

కడపజిల్లాలో అటవీప్రాంతం మొత్తం వైశాల్యంలో 30 శాతం ఉన్నా వర్షాభావంవల్ల, మనుషులవల్లా అటవీ సంపద చాలా క్షీణించింది. ఈనాడు కడప జిల్లాలో దట్టమైన అడవులు కన్పించవు. కాని ఒకప్పుడు ఇది సాంద్రారణ్య ప్రాంతం.

"In the second half of the 17th century, the forests were rich enough to sustain even wild elephants (APDGC, 32).

1653 లో ఈ ప్రాంతంలో విహరించిన ఫ్రెంచి యాత్రికుడు ట్రావెర్నియర్ (Travernier) యాత్రానుభవాలను పురస్కరించుకొని, ఆ రోజుల్లో 'ఏనుగులు' ఉండేవని అభిప్రాయపడవచ్చు. (Ibid. 42). ఈ విషయాన్ని వ్యక్తం చేసే గ్రామం అనిమెల. కడపజిల్లా గ్రామనామాల్లోని ప్రాణివాచకాలు 15. అవి :

| | |
|---|---|
| అలవ- | అలవలపాడు |
| ఎద్దు- | ఎద్దులఏనె |
| ఎనుము- | ఎనుముల చింతల |
| ఏనుగు- | అనిమెల |
| కాకి- | కాకులవరం |
| కొంగ- | కొంగలవీడు |
| కోతి- | కోతులగుట్టపల్లె |
| గద్ద- | గద్దలరేవుపల్లె |
| చీమ- | చీమలపెంట |
| తేలు- | తేళ్లూరు; తేళ్లపాడు |
| తొండ- | తొండలదిన్నె |
| దువ్వ- | దువ్వూరు |
| నక్క- | నక్కల మొరం |
| నెమలి- | నెమళ్లగొంది; నెమళ్లదిన్నె |
| పంది- | పందికుంట; పందివీడు |

పాము- పాములూరు
మిడత- మిడతూరు

## 9.3 సామాజిక నాగరికత - సంస్కృతి :

కడపజిల్లాలోని గణ, కుల, జాతి, మతసూచకాలైన గ్రామాలు భారతదేశ సామాజిక చరిత్రలో సర్వత్రా కన్పించే ఆయా వ్యవస్థల స్వరూపాన్ని చాటుతాయి :

### 9.3.1 గణవ్యవస్థ :

కడప జిల్లాలో గణ వ్యవస్థను వ్యక్తం చేసే గణ సూచక గ్రామాలు కొన్ని కన్పిస్తాయి. అవి, ఎరికలబిడం, ఎరికల బిడారు; కురవపల్లె (12 అరోపాలు); కొరివివాండ్లపల్లె; సుగాలి తాండ (11 అరోపాలు): సుగాలిపల్లె, సుగాలిబిడికి (3 అరోపాలు), ఎరుకుల, కురవ తమిళమాండలికం పర్వతగణాలు (Hill tribes). 'ఎరుకల' వ్యవహర్తలైన ఎరుకలు 1961జనాభా లెక్కల ప్రకారం 3,069 మంది కడప జిల్లాలో ఉన్నారు. రాజస్థానీ లేదా పశ్చిమ హిందుస్థానీ మాండలికాన్ని మాట్లాడే సుగాలీలు రాయచోటి తాలూకాలో ఉన్నారు. 1961 జనాభా లెక్కల ప్రకారం 'లంబాడీ' భాషా వ్యవహర్తలు ఈ జిల్లాలో 5,393 మంది గ్రామనామ ద్వితీయావయవం -తాండ సైతం కడప జిల్లా సుగాలీ స్థావరాలను వ్యక్తం చేస్తోంది.

### 9.3.2 వర్ణవ్యవస్థ కులవ్యవస్థ:

1961 జనాభా లెక్కల ప్రకారం కడప జిల్లాలో వివిధ కులాలకు చెందిన 1,09,388 మంది హిందువు లున్నారు. హిందూమత శాఖలైన శైవ వైష్ణవ భేదాలకు చెందిన కులాలతో కూడుకొని కడపజిల్లాలో చాలా కులాలు కన్పిస్తాయి. భారతదేశంలో సర్వత్రా కన్పించే కులవ్యవస్థకు కడప ఒక అపవాదం కాదు.

"Cuddapah district is no exception to the others in peninsular India in the matter of caste pattern. About twenty five of the local castes account for ninety-five per cent of the Hindus in the district. But five among them, namely,

the Kapus, Balijas, Gollas, Malas and Madigas claim about sixty per cent of the total number involved. The caste returning more than a 100 persons from this district at the 1901, 1911 and 1921 census include the Balija, Banda (Mondikulam), Besta, Bhatraju, Bogam, Bondili, Brahmin, Chenchu, Dasari, Devanga, Dommara, Gandla (Telikula), Golla, Idiga, Jangam, Janappan, Jogi, Kamma, Kamsala, Kapu, Kshatriya, Kummara, Kuruvan, Kuruba, Lambadi, Lingayat, Madiga, Mala, Mangala, Maratha, Medara, Mochi (Mucchi), Muttaracha, Odde, Patra, Pichchigunta, Rajput, Rangaraju, Sālē, Sathani, Tamballa, Togata, Tsakala, Uppara, Vaisya, Velama, Yanadi, and Yerukula. A distinct feature of the Caste pattern prevailing in this district is that there is strikingly heavier proportion of Kapus (Reddis) and Balijas—among the major groups and of Togatas, Patras and Picchiguntas among the others (APDGC 148-149),

జిల్లా గెజిటీర్లో ఉల్లేఖింపబడిన అంశాలను గ్రామనామాలు సహితం వ్యక్తం చేస్తాయి.[1] కడప గ్రామనామాల్లో కన్పించే కులాల పేర్లు 48. అవి :

| | |
|---|---|
| ఆసాది- | ఆసాదివాండ్లపల్లె (6 ఆరోపాలు) |
| ఈడిగ- | ఈడిగపల్లె (17 ఆరోపాలు) |
| ఉప్పర- | ఉప్పరపల్లె (18 ఆరోపాలు) |
| ఏకరి- | ఏకర్ల పాలెం |
| ఒడ్డె- | ఒడ్డింద్లు, ఒడ్డింద్లమిట్ట (2 ఆరోపాలు), ఒడ్డె అగ్రహారం, ఒడ్డెపల్లె (57 ఆరోపాలు), ఒడ్డెపాలెం (2 ఆరోపాలు), ఒడ్డెవాండ్లపల్లె, ఒడ్డెవారిపల్లె. |
| కంసల- | కంసలపల్లె, కంసలవాండ్లపల్లె, కంసలవారిపల్లె. |
| (వర్గా. వడ్ల)- | వడ్లవాండ్లపల్లె (2 ఆరోపాలు). |
| కమ్మ- | కమ్మగుట్టపల్లె, కమ్మపల్లె (10 ఆరోపాలు), కమ్మపాలెం, కమ్మవారిపల్లె (8 ఆరోపాలు), కమ్మవారి బ్రాహ్మణ పల్లె. |

1. గ్రామనామపరంగా మాల, మాదిగ కులాల వారు నివసించే పహప్రాధికమైన వాడలను ఈ పరిశీలనలో చేర్చలేదు—గ్రామనామపరంగా వాటికి స్వతంత్ర ప్రతిపత్తి లేదు కాబట్టి.

| | |
|---|---|
| (పర్యా. నాయుళ్ళు) | నాయునిఎఱ్ఱప్పపల్లె. నాయునిపల్లె (2 ఆరోపాలు). నాయునివాండ్లపల్లె, నాయునివారిపల్లె (10 ఆరోపాలు). నాయునివారిసుగాలితొండ. |
| కాపు- | కాంబల్లె (2 ఆరోపాలు). కాపుపల్లె (2 ఆరోపాలు). |
| (పర్యా. రెడ్లు) | రెడ్డికొట్టాల, రెడ్డిగారిపల్లె (8 ఆరోపాలు). రెడ్డినగరం. రెడ్డిపల్లె (5 ఆరోపాలు). రెడ్డిపల్లెపేట. రెడ్డిమల్లివాండ్లపల్లె. రెడ్డివారిపల్లె (30 ఆరోపాలు). రెడ్లశాఖాభేదం కొడిదె ఒక గ్రామనామంలో ఉంది ; కొడిదెపల్లె. |
| కుమ్మర- | కుమ్మరపల్లె (23 ఆరోపాలు). కుమ్మరరావులపల్లె. కుమ్మరవాండ్లపల్లె. కుమ్మరవానిపల్లె. కుమ్మరవారిపల్లె (3 ఆరోపాలు). |
| కోమటి- | కోమటికుంట, కోమటిపల్లె, కోమటిపేట, కోమన్నూతల |
| (పర్యా. సెట్లు) | సెట్టిగుంట, సెట్టిపల్లె, సెట్టివాండ్లపల్లె (2 ఆరోపాలు), సెట్టివారిపల్లె (4 ఆరోపాలు). |
| గాండ్ల- | గాండ్లతిమ్మాయపల్లె, గాండ్లపల్లె (7 ఆరోపాలు). గాండ్లవాండ్లపల్లె, గాండ్లవారిపల్లె. |
| (పర్యా. తెలగ) | తెలగాపురం. |
| తెలికి | తెలికి. |
| గాజుల- | గాజులపల్లె (2 ఆరోపాలు) గాజులపేట (2 ఆరోపాలు) |
| గూడ- | గూడావాండ్లపల్లె. |
| గొరగ- | గొరిగెనూరు |
| గొల్ల- | గొల్లఓబాయపల్లె (33 ఆరోపాలు). గొల్లబాలసానివాండ్లపల్లె. గొల్లలఉప్పలపాడు, గొల్లలగూడూరు. గొల్లవాండ్లపల్లె (2 ఆరోపాలు). గొల్లవారిపల్లె (2 ఆరోపాలు). |
| (పర్యా. యాదవ) | యాదవకుంట, యాదవరాజపల్లె, యాదవాపురం (2 ఆరోపాలు) |
| (పర్యా. వ్రేడు) | రేపల్లె (4 ఆరోపాలు) |
| గౌడు | గౌనివాండ్లపల్లె |

చాకల- చాకలపల్లె, చాకలవాండ్లపల్లె, చాకిబండ

జంగం- జంగంపల్లె (8 ఆరోపాలు), జంగాలపల్లె (4 ఆరోపాలు)

జోగి- జోగాపురం

తంబళ్ల- తంబళ్లగొంది, తంబళ్లవారిపల్లె

తొగట- తొగటపల్లె (8 ఆరోపాలు)

దాసరి- దాసరిపల్లె (3 ఆరోపాలు), దాసరివాండ్లపల్లె

దూదేకుల- దూదేకులపల్లె (4 ఆరోపాలు), దూదేకులపాలెం

దొమ్మర- దొమ్మరనంద్యాల

మేదర- మేదరపల్లె

,, వేదర- వేదరపేట

పంబల- పంబలపల్లె

పిచ్చిగుంట్ల- పిచ్చిగుంట్ల (6 ఆరోపాలు), పిచ్చిగుంట్లవాండ్లపల్లె

పూసల- పూసలకొట్టాలు

పైడి- పైడిపాలెం

బలిజ- బలిజపల్లె (17 ఆరోపాలు)

బింగి- బింగివాండ్లపల్లె

బెస్త- బెస్తపల్లె (10 ఆరోపాలు), బెస్తవారిపల్లె, బెస్తవేముల

బేరి- బేరిపల్లె (3 ఆరోపాలు)

బైనేని- బైనేనివాండ్లపల్లె

బొందిలి- బొందలకుంట, బొందిల్లపల్లె

బోగం- బోగంపల్లె

బోయ- బోయపల్లె (5 ఆరోపాలు) బోయిళ్లవారిపల్లె, బోళ్ల గొందిచెరువు.

బ్రాహ్మణ- బ్రాహ్మణ ఎర్రగుడి, బ్రాహ్మణపల్లె (5 ఆరోపాలు)

(పర్యా. అయ్యవార్లు)- అయ్యవారికంబాలదిన్నె, అయ్యవారిపల్లె (8 ఆరోపాలు), అమ్మగారిపల్లె, అమ్మయగారిపల్లె (2 ఆరోపాలు)- [బ్రాహ్మణ స్త్రీ సూచనలైన వీటిని కూడా కులసూచి కిందనే చేర్చడమైంది.]

భట్రాజులు- భట్టువారిపల్లె, భట్రాజులపల్లె, బొట్లచెరువు, బొట్ల చెరువు, బట్లఒంటిపల్లె

| | |
|---|---|
| మంగల- | మంగలపల్లె (8 ఆరోపాలు), మంగలవాండ్లపల్లె, మంగలివారిగరుగుకొండ |
| మరాటి- | మరాటిపల్లె (2 ఆరోపాలు) |
| ముత్తరాచ- | ముత్తరాచపల్లె (3 ఆరోపాలు) |
| మొండి- | మొండిండ్లు |
| రాచ- (పర్యా. క్షత్రియ) | రాచగొల్లపల్లె, రాచపల్లె (21 ఆరోపాలు) రాచపాలెం రాచవారిపల్లె (2 ఆరోపాలు) రాజుకుంట, రాజుపల్లె (2 ఆరోపాలు) రాజుపాలెం (12 ఆరోపాలు) రాజుపేట (2 ఆరోపాలు), రాజువారిపల్లె (2 ఆరోపాలు) రాజువారిపేట |
| వెలం- | వెలమవారిపల్లె (2 ఆరోపాలు) |
| సాతాని- | సాతానిపల్లె |
| సాతు- | సాతపల్లె |
| సాలె- | సాలెవారిఉప్పలపాడు |
| సింగం- | సింగంవాండ్లపల్లె. |

కులాల పేర్లున్న నామబంధాలుండే గ్రామనామ ద్వితీయావయవాలపై విశేషణ సూచకాలు చేరిన మరికొన్ని గ్రామనామాలను ఇందులో చేర్చలేదు. ఎగువ ఒడ్డెపల్లె, దిగువ బ్రాహ్మణపల్లె, దిగువ బలిజపల్లె మొదలైనవి.

కడప గ్రామనామాల ప్రథమావయవాల్లో కన్పించే హిందూ వ్యక్తినామాల కుల సూచకానుబంధాలు (Caste markers) కొన్ని ఉన్నాయి. అవి :- నాయుడు, -భట్టు, -రాజు, -రావు, -రెడ్డి, -శాస్త్రి, సెట్టి -సోమయాజి .... వీటిని బట్టి కూడా కులాల వ్యాప్తి కొంత తెలుస్తుంది. కులసూచకానుబంధాలు కల వ్యక్తి నామాలతో ఏర్పడ్డ గ్రామాలు : -రెడ్డి 212, -రాజు 91, -రాయుడు 17, -రావు 3, -నాయుడు, ల-నేడు 7, -నాయక 1, -సెట్టి 11, -శాస్త్రి 1. రాజం పేట తాలూకాలోని రాజంపేట, మందపేట, మంగబాంబాసముద్రం మొదలైన గ్రామనామాలనుబట్టి మట్లరాజుల కాలంలోని పేర్లలో (1572-1807) రాణులు ప్రాధాన్యం వహించినట్లు అభిప్రాయ పడవచ్చు. (చూ. 9 3.8)

## 9.3.3 జాతి

భారతదేశంలోని జాతి వ్యవస్థ సంకీర్ణమైంది. ఆ సంకీర్ణత కడప గ్రామాల్లో కూడా వ్యక్త మవుతుంది. కడప గ్రామనామాల్లో కన్పించే జాతుల పేర్లు కీ,

అవి: అరవ, అరె, అరవలు తమిళ జాతి, అరెలు మహారాష్ట్రులు — ఈ రెండు జాతుల వారూ హిందూ మతస్థులు. కడప మండలంలో వీరి పేర్లతో ఏర్పడ్డ గ్రామాలు 4. అవి; అరవపల్లె (2 అరోపాలు), ఏరువపాలెం, అర వీడు, సగోత్రభాషను మాట్లాడే అరవజాతితో కడప మండలానికి సంపర్కం ఎపుడు కలిగిందో నిరూపించడం కష్టం కాని. 11-12 శతాబ్దులకు చెందిన చోళ దాన శాసనాలు రాజంపేట తాలూకాలో కన్పిస్తాయి. అదే కాలానికి చెందిన వైష్ణవ మత ప్రభావం కూడా తమిళదేశం నుంచే కడపకు ప్రసరించినట్లు అభిప్రాయ పడవచ్చు. చూ. మతం. 18-వ శతాబ్దిలో మరాటీ దండయాత్రలతో కడపకు మహారాష్ట్రుల సంపర్కం అధికంగా కలిగిందని చెప్పవచ్చు. మరాటీల ప్రభావం ఈ కింది గ్రామనామాల్లోనూ, వ్యక్తినామాల్లోనూ. వ్యక్త మవుతుంది.

గ్రామ నామాలు :

మరాటిపల్లె, సురభి, దళవాయిపల్లె, చావడిపల్లె.

వ్యక్తినామాలు.

| | |
|---|---|
| అప్పాజీ- | అప్పాజీపేట |
| ఆదిత్యరాం- | ఆదిత్యరాంపల్లె |
| ఏకో (జీ) | ఏకోపల్లె, కొత్త ఏకోపల్లె |
| గోవిందరావు- | గోవిందరావుపల్లె |
| జమ్మారావుబాయి- | జమ్మారావుబాయిపేట |
| నరసోజీ- | నరసోజీకొట్టాలు |
| మణేరాం- | మణేరాంపల్లె |
| బిందురావు- | బిందురావుపల్లె |
| రాయలవంతులు- | రాయలవంతులపల్లె |
| హీరోజి- | హీరోజి పురం. |

1961 జనాభా లెక్కల ప్రకారం మరాటీ భాషావ్యవహర్తలు కడపజిల్లాలో 2,833 మందిఉన్నారు. కడప మండలానికి ఇస్లాంమత సంపర్కం 14-వ శతాబ్దిలో

జరిగినట్లు ఆధారాలున్నాయి. (APDGC, 143). అప్పటినుంచీ మతవ్యాప్తి జాతివ్యాప్తికీ, భాషావ్యాప్తికీ దోహదకారి అయింది. కుతుబ్‌షాహీ, మొగల్, మయానా, అసఫ్‌జాహీ, హైదర్ అలీ, టిప్పు సుల్తాను ప్రభువుల పరిపాలనా కాలాల్లో, ఇస్లాం మతం జాతులవ్యాప్తి, ఉర్దూభాషా వ్యాప్తం జరిగినాయి. (కడప జిల్లా మహమ్మదీయ రాజ్య స్థాపన వివరాలకు చూ. Ibid 100-113) 1961 జనాభా లెక్కల ప్రకారం కడప జిల్లాలో మహమ్మదీయులు 1,87,945 మంది ఉన్నారు.—వీరు షియా, సున్నీ, వహాబ్ శాఖలకు చెందిన వాళ్ళు.

మహమ్మదీయుల ప్రభావం ఈ కింది గ్రామనామాలు, వ్యక్తినామాలు వ్యక్త పరుస్తాయి. కడప జిల్లాలో ఇస్లాం మతసూచక గ్రామాలు 20. అవి తురక పల్లె (20 ఆరోపాలు). గ్రామ నామాల్లోని మహమ్మదీయ వ్యక్తి నామాలు 38. అవి.

| | |
|---|---|
| అబ్బాసాహెబ్- | అబ్బాసాహెబ్‌పేట |
| అమీనా- | అమీనాబాదు |
| ఆదంఖాన్- | ఆదంఖాన్‌పల్లె |
| ఆలంఖాన్- | ఆలంఖాన్‌పల్లె |
| ఇబ్రహీం- | ఇబ్రహీంపురం, ఇబ్రహీంపేట |
| కుల్లాయి- | కుల్లాయిపల్లె |
| ఖాజీ- | ఖాజీపల్లె, ఖాజీపేట |
| ఖాదర్‌ఖాన్- | ఖాదరఖాన్‌కొట్టాలు |
| ఖాదర్- | ఖాదర్‌పల్లె |
| గోసాసాహెబ్- | గోసాసాహెబ్‌కొట్టాలు |
| జమాల్- | జమాలుపల్లె |
| జాఫర్ సాహెబ్ | జాఫర్‌సాహెబ్‌పల్లె |
| దాయంఖాన్- | దాయంఖాన్‌పల్లె |
| దౌలత్- | దౌలతాబాదు |
| నజర్‌బేగ్- | నజర్‌బేగ్‌పల్లె |
| నేక్‌నాం- | నేకనాంపేట, నేకనాపురం |
| పాపాసాహెబ్- | పాపాసాహెబ్ పేట |
| పీర్‌సాహెబ్- | పీరుసాహెబ్‌పల్లె |

ఐరంఖాన్- ఐరంఖాన్‌పల్లె
బాకర్- బాకరాపురం (2 ఆరోపాలు), బాకరాపేట
బిస్మిల్లా- బిస్మిల్లాబాదు
బీబీసాహెబ్ బీబీసాహెబ్‌పేట
మహమ్మద్- మహమ్మద్‌గుంటపల్లె
మహమ్మద్‌ఖాయ్- మహమ్మద్‌ఖాయ్‌పల్లె
మాసా - (<మహబుబ్‌సాహెబ్) - మాసాపేట, మాసాగారిపల్లె
మీర్- మీరాపురం
మీర్జాఖాన్- మీర్జాఖాన్‌పల్లె
మొహియుద్దీన్- మొహీదీన్‌పురం
మొహియుద్దీన్ సాహెబ్ మొహిదీన్‌సాహెబ్‌పల్లె
యాకుబ్‌ఖాన్- యాకుబ్‌ఖాన్‌పల్లె
రసూల్- రసూల్‌పల్లె
రహమత్ ఖాన్- రహమత్‌ఖాన్‌పల్లె
రాజాసాహెబ్- రాజాసాహెబ్‌పేట
సయ్యద్- సైదాపురం
సయ్యద్‌మీర్- సయ్యద్‌మిర్ కొట్టాలు
సర్వర్‌ఖాన్- సరంఖాన్ పేట
సవాజ్‌ఖాన్- సవాజ్‌ఖాన్‌పల్లె
సూరత్‌ఖాన్- సూరత్‌ఖాన్‌పల్లె
హసన్- హసనాపురం
ఫకీర్‌సాహెబ్- ఫకీర్‌సాహెబ్‌పల్లె
ఫాతిమా (స్త్రీవా) ఫాతిమాపురం

తెలుగుతనాన్ని సంతరించుకొన్న మరొక రెండుపేర్లు :

మస్తానయ్య- మస్తానయ్యపేట
మీరబ్దులయ్య- మీరబ్దుల్లాయపల్లె

హిందూమతస్థుల వ్యక్తినామాలపై మహమ్మదీయమతం ప్రభావం :

కరీంరెడ్డి- కరీంరెడ్డిగారిపల్లె
పక్కీరారెడ్డి- పక్కీరారెడ్డిపల్లె

బిరుద సూచక గ్రామాలు :

| | |
|---|---|
| నవాబు- | నవాబు పేట |
| ఫకీర్- | పక్కీరుపల్లె |
| హవల్దారు | హవల్దారుపేట |
| అమాని- | అమానిరామచంద్రాపురం |
| | అమానివిశ్వనాధపురం |

పూజ్యార్థక విశేషణం కిబిలే గల గ్రామాలు మూడు. అవి : కిబిలే బొమ్మేపల్లె, కిబిలే వెంకటాపురం, కిబిలేనుగుమంచిపల్లె.

-అబాదు, -చౌకు అనే గ్రామనామ ద్వితీయావయవాలు కూడా కడప మండలంతో మహమ్మదీయులకు గల సంపర్కాన్ని తెలియచేస్తాయి.

ఇవన్నీ మహమ్మదీయుల వ్యాప్తివల్ల కడప గ్రామనామాల్లో ప్రవేశించిన పదాలని చెప్పవచ్చు.

## 9.3.4 మతం :

7-వ శతాబ్దిలో కడప ప్రాంతంలో పయనించిన హుయాన్‌సాంగ్, అనాడే కడప మండలంలో హిందూ దేవాలయాలు, సంఘారామాలు (బౌద్ధారామాలు), జైన నిర్గ్రాంతాలు ఉన్నట్లు తెలియ చేసినాడు. ముఖ్యంగా కడపజిల్లాలో బౌద్ధ, జైన మతాల ప్రభావాలను తెల్పే దృష్టాంతాలు నందలూరులోనూ, దానవుల పాడులోనూ పురాతత్వ పరిశోధకులకు లభించినాయి.

"A remarkable feature about Nandalur is the fact that it appears to have once been a Buddhist Centre of some local importance. A Buddhist site was discovered in 1913 on the summit of a hill close by lying between the town and the village Adupur or Adapur to its east. The Hillock is locally called Lanja Kanama Gutta (APDGC. 774)."

"The discovery at Danavulapadu (Jammala madugu) in 1903 by two ryots, while digging for sand, of what proved later to be an ancient basti (locality) and temple of the Jains, with a colossal statue of Tirthankara (Jain Pontiff) establishes the fact that there were Jains in this district,

at least in its north-western portions upto the tenth or eleventh centuries (Ibid, 143).

కాలక్రమంలో బౌద్ధ, జైనాలు క్షీణించి హిందూమతమే నిలిచింది. హిందూ మతశాఖలు శైవ వైష్ణవాలు 11, 12 శతాబ్దుల్లో తెలుగు దేశాన్ని ఊపినాయి. ఆయా మతాల, మతశాఖల ముద్ర కడపజిల్లా గ్రామాల మీద కూడా ఉంది. కడప గ్రామనామాల్లోని దేవతాసూచి గ్రామనామాలను, హిందూ వ్యక్తినామాలను గణిస్తే, కడపజిల్లా హిందూమత ప్రాబల్యం వెల్లడవుతుంది. గురవయ్య, జీరెడ్డి, వెంకటరెడ్డి—మొదలైన పేర్లలో హిందూ మతశాఖల ప్రభావం కూడా వ్యక్తమవుతుంది. శైవమత సూచక గ్రామాలు: గౌరిగెనూరు, జంగాలపల్లె, తంబళ్ళపల్లె, వీరబల్లె, వీరూరు, వీర్లపల్లె; వైష్ణవ మత సూచక గ్రామాలు: చియ్యపాడు, చియ్యవరం, శంఖవరం; బౌద్ధసూచక గ్రామాలు: అడపూరు, బూదవాడ బౌద్ధసూచక వ్యక్తినామం: బొజ్జయ్య, చూ. అరో. బొజ్జాయపల్లె. జైనమత సూచక గ్రామాలు, జాండ్లమొరం, దానవులపాడు, 1961 జనాభా లెక్కల ప్రకారం కడపజిల్లాలో బౌద్ధుడొక్కడు మాత్రం మిగిలినాడు, జైనులు 167 మంది ఉన్నారు. కడపజిల్లాలో ఇస్లాం మత ప్రభావానికి చూ. 9.3.3.

క్రైస్తవమతం 18-వ శతాబ్ది పూర్వార్థంలో కర్ణాటక జెస్యూట్ మిషన్ (Jesuit Mission) ద్వారా కడపజిల్లాలో ప్రవేశించింది. (APDGC. 143). 1961 జనాభా లెక్కల ప్రకారం కడపజిల్లాలో 59,991 మంది క్రైస్తవులున్నారు. క్రైస్తవమత ప్రభావం కడపజిల్లా గ్రామనామాల మీద అత్యల్పం. సంఘటన సూచి కుంపిణీపురం ఒక్కటే ఆంగ్ల పరిపాలనా ప్రభావాన్ని తెలియచేసే గ్రామనామం, క్రీ. శ. 1800 లో దత్తమండలాలకు ప్రిన్సిపల్ కలెక్టరుగా థామస్ మన్రో (Thomas Munro) నియామకంతో కడపజిల్లా బ్రిటిష్ పరిపాలన మొదలైంది. ఈ పరిపాలన ముద్ర 1807 లో వెలసిన కుంపిణీపురంలో చూడవచ్చు.

### 9.3.5 వాస్తు విశేషాలు:

వాస్తు, దుర్గ సూచకాలైన గ్రామనామాలు, ద్వితీయాను బంధాలు కడపజిల్లాలోని వాస్తు విశేషాలను వ్యక్తపరుస్తాయి.

ఉదా: కొట్టాలపల్లె, మిద్దెపాడు, కోటపాడు, గండికోట, ఎర్రగుంట్లకోట, దేవగుడి, ఖురుజాపల్లె.

**9.3.6** దేశ విభాగసూచి నందిమండలం ఒకప్పటి రాజకీయ వ్యవస్థను చాటుతుంది.

**9.3.7** సంఘటన సూచక గ్రామాలు—మందలపల్లె, వలసపల్లె, వెలిదండ్ల, చిన్న దండ్లూరు, పెద్ద దండ్లూరు. సమూహ సూచక గ్రామనామ ద్వితీయావయవాలు- గుంపుల, -తాండ, -దండ్ల, -బిడం, బిడారు, బిడికి కడప జిల్లాలో గణాల, కులాల వలసలను చాటుతాయి.

## 9.3.8 గ్రామనామాల్లో చరిత్ర :

"దేశ చరిత్ర, పాలకుల జీవితములను బట్టియే రచింపబడుట యాచారమైనది. కాని గ్రామనామధేయములను బట్టి చూచినచో పాలకులుగాకుండా జనులలో పేరు పెంపులు గలిగియుండిన మహనీయులెందరో యుండిరనియు, పాలకుల పేరులవలె అట్టి నామములు గూడ గ్రామముల పేరిట నిలిచిపోయినవనియు తెలియగలదు. పురుషులకేకాక స్త్రీలకు కూడా ఆ కీర్తి యబ్బినది (నారాయణ రావు, చిలుకూరి, 1937, 661).

కడప గ్రామనామాల ప్రథమావయవాల్లో కల్పించే వ్యక్తినామ, కుటుంబ (వంశ) నామాలను పరీక్షించినా, కొన్ని గ్రామాలకు సంబంధించిన ఐతిహాసిక, చారిత్రక విశేషాలుండే శాసన గ్రంథస్థ సాక్ష్యాలను గమనించినా, స్థానిక చరిత్రలో ఆయా వ్యక్తులు, కుటుంబాలు నెరపిన ప్రభావం కొంత అర్థమవు తుంది. గ్రామ నిర్మాణానికి శ్రీకారం చుట్టిన వ్యక్తి పేరనో, కుటుంబం పేరనో కొన్ని గ్రామాలు వెలసినాయి. కీర్త్యాపేక్షకులైన పాలకులు సప్త సంతానాల్లో "ఖిలముగాకుండునట్టి"వి కాని, తటాక గ్రామ నిర్మాణాలు చేపట్టి తమ పేర నల్లిండ్లు, అగ్రహారాలు, చతుర్వేది మంగలాలను ఆశ్రితులైన బ్రాహ్మణులకో, కవులకో, పండితులకో, స్థానిక ప్రాబల్యంగల వ్యక్తులకో దానం చేయడంవల్ల కొన్ని వ్యక్తి స్తోత్ర గ్రామాలు (Commemorative Village-names) ఏర్పడినాయి. పునర్నామకరణాలు కూడా వ్యక్తి స్తోత్ర నామాలే (చూ. 9.3.10).

కడపగ్రామాలో వ్యక్తిసూచక గ్రామాలు 1055; కుటుంబ సూచకగ్రామాలు 623 ఉన్నాయి. ఈ గ్రామాలకు సంబంధించిన స్థానిక చరిత్ర మెకంజీ కైఫీయతులవల్ల కొంత లభ్యమవుతోంది. కానీ ఈ కింది అంశాలవల్ల నిజమైన చరిత్ర తెలుసుకోవడం కష్టసాధ్యంగా ఉంది.

1. లోకవిరుక్తి ప్రభావం.

2. చరిత్ర కవసరమైన కాల వంశ విశేషాదులు ఖచ్చితంగా లేకపోవడం. ఉన్నా శాసన సాక్ష్యాలకు అనుగుణంగా ఉండకపోవడం.

3. పొరపాట్లు.

గంగాదేవిపల్లె, చిన్న కుడాల, పెద్ద కుడాల, చిన్న కొమెర్ల, పెద్దకొమెర్ల లోకవిరుక్తికి ఉదాహరణలు: గంగిరెడ్డిపల్లె (అరో. 1022), గోపరాజుపల్లె, తిరుమలాయపల్లె, దేవరాయపల్లె, నారాయణరాజుపల్లె, బద్వేలు, బుక్కపట్నం, బసిరెడ్డిపల్లె (అరో. 2384). గ్రామాలను బట్టి కొన్ని వివరాలు తెలుస్తాయికానీ అవి నిర్దుష్టమైనవి కావు. పాపాసాహెబ్ పేట హలీంఖాన్ తోబుట్టువు పాపా సాహెబ్ అనే ఆయమపేరుతో వెలసినట్లు స్థానిక చరిత్ర. ఇది పొరపాటుకు నిదర్శన. -సాహెబ్ పుంలింగ సూచకం కానీ, స్త్రీలింగసూచకం కాదు. 30-9-1806 లో వెలసిన కుంపిణీపురమొక్కటే ఖచ్చితమైన చారిత్రక వివరాలున్న గ్రామం. మట్లి వంశపురాజుల, రాణుల పేర్ల వెలసిన గ్రామనామాలకు సంబంధించిన వివరాలు కూడా అరకొరగా ఉన్నాయి. ముఖ్యంగా స్థానిక చరిత్రలో పేర్కొనబడ్డ మట్లివంశపు స్త్రీల వివరాలు సంపూర్ణంగా తెలియవు. మట్లి వంశపు రాజుల, రాణుల పేర్లతో ఏర్పడిన గ్రామాలు :

అవంతరాజపురం (అరో. 65, 66), అప్పయరాజుపేట, ఆలివేలిమంగాపురం, ఎల్లంరాజుపల్లె, కిచ్చమ్మఅగ్రహారం, కీర్తిపల్లె, కోనసముద్రం, గోపమాంబాపురం, తిరువెంగళనాథపురం, మంగమాంబాపురం, పుల్లంపేట, రాజంపేట. (వివరాలకు చూ. నిఘంటువు).

ఏ రకమైన గ్రంథస్థ సాక్ష్యాలూ, శాసన సాక్ష్యాలూ లభించని గ్రామనామాల్లో వ్యక్తులు ఎప్పటి వారో, కుటుంబాలు ఎప్పటివో ఊహించడం సాధ్యంకాదు. పల్లవోలు, వల్లూరు గ్రామనామాలను బట్టి స్థూలంగా అవి పల్లవవంశం పేరుతో

ఏర్పడినాయని చెప్పవచ్చు. క్రీ. శ. 3 వ శతాబ్దినుండి 8 వ శతాబ్దివరకు కడపలో పల్లవ రాజుల పరిపాలన ఉన్నట్లు చరిత్ర (APDGC. 58 59). ఏమైనా కడప జిల్లాలో లభ్యమైన సహస్రాధిక శాసనాలు ముద్రణ నోచుకున్నపుడు, మెకంజీ కైఫీయతులలోని అసలు చరిత్ర శాసన సాక్ష్యాలకు అనుగుణంగా రూపొందించినపుడు, మెకంజీలో ఉదాహృతమైన పల్లె కట్టుకవిలెలు కూడా సేకరించినపుడు మాత్రమే నిర్దుష్టమైన చారిత్రక వివరాలు తెలుస్తాయి. కృష్ణరాయల వంశంలో సంబంధాలుండి, ఆంధ్రదేశ చరిత్రలోనూ, కడపమండల చరిత్రలోనూ ప్రముఖ పాత్ర వహించిన మట్లి పాలకుల చరిత్రనైనా విమర్శిస్తే గ్రామనామాలు కొన్ని ఎప్పుడు ఏర్పడినాయో గట్టిగా చెప్పవచ్చు. అప్పుడు మాత్రమే గ్రామ నామ పరిశోధకులు గ్రామనామాలకూ, చరిత్రకుగల సంబంధాన్ని శాస్త్రీయంగా ఋజువుపరచగలరు.

### 9.3.9 సంస్కృతీకరణం:

సంస్కృత భాషా ప్రభావం గ్రామనామాల విషయంలో గణనీయంగా లేక పోయినా, తగుమాత్రం ఉంది. గ్రామనామాలలోని తత్సమ, తద్భవ పదజాలం ఈ విషయాన్ని ఋజువు చేస్తుంది. సంస్కృత భాషకున్న సామాజిక ప్రభావాన్ని మరింతగా చాటే సంస్కృతీకరణ ప్రభావం కూడా దేశి నామాల విషయంలో కన్పిస్తుంది.

ఇది ఒక్క తెలుగుకుమాత్రమే సంబంధించినదే కాదు. ద్రావిడ భాషా గ్రామనామాల విషయంలో సామాన్యమైనది. ఉదా : కావేరి ఒడ్డునగల 'మయిల్-ఆడు' తురై మయూరపురంగా మార్చడం సంస్కృతీకరణ ప్రభావమే. (Sethu Pillai, 1953. 3).

తెలుగు స్థలనామాల విషయంలో సంస్కృతీకరణ ప్రభావం క్రీ. శ. 4-వ శతాబ్దినుండే కన్పిస్తుంది. ఉదాహరణకు షల్లిదేవరశర్మ క్రీ. శ. 339-340 లో రాయించిన దాన శాసనంలో ముడియూనూరును చూడా గ్రామమని సంస్కృతీకరించినారు. తెలుగు స్థలనామాలకు శాసనాల్లో కన్పించే మరి రెండు సంస్కృతీకరణ రూపాలు : కొలను - క్రీ. శ. 1115 సరసపురి, కమలాకరనగరి, నేంద్రోలు క్రీ. శ. 1213 - తామ్రపురి, తామ్రనగరి (సోమయాజి.

1968, 21) కడప గ్రామనామాల్లో సంస్కృతీకరణాలైన గ్రామనామాలు ఐదు మాత్రమే కన్పిస్తున్నాయి.

1. ఒంటిమిట్ట నామా. ఏకశిలా నగరం.
2. చెన్నూరు నామా. ఉదకశయగ్రామం
3. పులివెందుల నామా. వ్యాఘ్రపురి
4. ప్రొద్దుటూరు నామా. ప్రభాతపురి
5. వీరన్న ఘట్టుపల్లె నామా. హిరణ్యఘట్టం

శాసన సంస్కృతీకరణ రూపం ఒక్క చెన్నూరికు మాత్రమే ఉంది. మిగతా నాలుగు గ్రామాలకున్న సంస్కృతీకరణ రూపాలకు శాసన సాక్ష్యాలు లేవు. గ్రామనామాల విషయంలో సంస్కృతీకరణ ప్రభావం గ్రంథస్థ రూపాలకు మాత్రమే పరిమితమైంది. వాటికి వ్యవహార వ్యాప్తి లేదు.

### 9.3 10 పునర్నామకరణాలు (Re-naming)

గ్రామనామాలకు ఏర్పడే నామాంతరాలు లేదా మారుపేర్లు సాధారణంగా ఒక భాషా ప్రాంతం మీద అన్యభాషా ప్రభావాన్ని చాటుతాయి. ఒక సంస్కృతి మీద అన్య సంస్కృతి ఆధిక్యతను వెల్లడిస్తాయి. లేదా పాలక జాతి ప్రాధాన్యాన్ని నిరూపిస్తాయి. చాలా దేశాల్లో ఒకే జాతి ఉండదు ఒకే భాషను మాట్లాడే వారూ ఉండరు. భిన్నజాతుల సంపర్కమూ, భిన్న భాషల ప్రభావమూ కన్పిస్తుంది. ఇంగ్లండులో నార్మనుల లాగానో, ఐర్లండులో ఇంగ్లీషు వాళ్ల లాగానో, కొత్తగా వచ్చిన అన్యజాతీయులు లేదా అన్యభాషీయులు శక్తివంతమైన మైనారిటీ వర్గాలను ఏర్పడినపుడు వారి ప్రభావం స్థలనామాల మీద గణనీయంగా ఉండదు. కెల్టిక్ బ్రిటన్‌లో రోమన్ల ప్రభావం దాదాపు చాల తక్కువ. అన్య జాతుల లేదా అన్యభాషీయుల దాడిగానీ, వలస గానీ ముమ్మరంగా సాగినపుడు స్థలనామాలకు అధికంగా పునర్నామకరణాలు జరుగుతాయి. ఇంగ్లండులో ఇంగ్లీష్, డేన్‌లా, నార్వేజీలలోని కొన్ని ప్రాంతాల్లో వైకింగులూ, బ్రిటనీలో స్థిరపడిన కెల్టిక్ శరణార్థులూ ఆంగ్లస్థలనామాల మీద గణనీయమైన ప్రభావాన్ని నెరపినారు. (వివరాలకు చూ. Encyclopaedia Britannica, 1955, 989). ఆధునిక కాలంలో స్థానిక నామాలను (local names) ను పునరుద్ధరించు కొనే ప్రయత్నాలూ, ఉన్న పేర్లను మార్చకూడ

దనే అభిలాషా కన్పిస్తాయి. ఉదాహరణకు 1956 లో సోవియట్ ప్రభుత్వం గొప్పవాళ్ళ గౌరవార్థం స్థలనామాలు మార్చకూడదనే శాసనాన్ని కూడా చేసింది (Laxton Encyclopaedia, 1960, 462). తెలుగు గ్రామనామాల విషయంలో పునర్నామకరణ పరిశీలన ఆసక్తిజనకమైంది. మధ్యయుగ చరిత్ర కాలనుండే పునర్నామకరణాలు ఎక్కువగా జరిగినట్లు కన్పిస్తాయి. విభుంటు వులో వీటిని నామాంతరాలని, పర్యాయ నామాలని వ్యవహరించడ మైంది. విజయనగర ప్రభువులు తమ పేర్లకు తత్సమ గ్రామనామ ద్వితీయావయవాలైన -పురం; -సముద్రం చేర్చి, అగ్రహార దానాలు చేసి ఆ దానం చేసిన ఊర్ల పేర్లు మార్చి వేసినారు.

ఉదా : కొవ్వోలు నామా. కృష్ణరాయపురం
అగడూరు నామా. వెంకటరాయ సముద్రం.

1597 లో అమీన్ ఉల్‌ముల్క్ కొండవీడును ముర్తాజానగర్‌గా, కొండపల్లిని ముస్తాఫా నగర్‌గా మార్చివేసినాడు.

దేశీయ ప్రభువుల పునర్నామకరణంలో సంస్కృత భాషా ప్రాబల్యమూ, సార్వ భౌమత్వ ప్రతిష్ఠాపనా ప్రయత్నమూ, కీర్తికాంక్ష; మహమ్మదీయ పాలకుల పునర్నామకరణంలో పాలకమన స్తత్వమూ, ఉర్దూభాషా ప్రభావమూ గమనించ దగినవి. స్వాతంత్ర్యానంతరం నాయకుల పేర్లతో పేటలు, గ్రామాలు ఏర్పడు తున్నాయి, కానీ పునర్నామకరణాలు తక్కువే. అయితే పౌరపరిపాలన ఉన్న నగరాల్లో వీధులపేర్లు తరచుగా మారడం మాత్రం జరుగుతోంది.

కడప గ్రామనామాల్లో క్రీ. శ. 1200 ప్రాంతాలనుంచే పునర్నామకరణ ప్రభావం కన్పిస్తుంది. కడప జిల్లాలో గ్రంథస్థమైన నామాంతరాలలో పైన పేర్కొన్న అంశాల ప్రభావం కింద వివరింపబడింది.

1. దేశీయ పాలకుల కీర్త్యాపేక్ష, సంస్కృతభాషా ప్రాబల్యమూ.

ఉదా : నందలూరు నామా. శ్రీ కుళోత్తుంగ చోళ చతుర్వేది మంగలం c 1200.
అబ్బవరం నామా. త్రియంబకపురం c 1400 AR 1967-68 B 64.
కొవ్వోలు నామా. కృష్ణరాయపురం c1544 AR 1939, B 338.

కొపినేపల్లె నామా. హరిహరరాయపురం c1544 AR1940-41 B 492.

బెడుమూరు నామా. నరసింహాపురం 1549 AR 37-38 B 306; నృసింహపుర అగ్రహారం మెకం. 1169-86.

ఉప్పలూరు నామా. దేవరాయ సముద్రం 1553 AR 1937-38 B 244.

మేడిదిన్నె నామా. కృష్ణరాజ సముద్రం 1555 AR 40-41; B 346.

పెనగలూరు నామా. ఎల్లమరాజు సముద్రం 1571

కోగటం నామా. శతగోపపురం మెకం. 12,29-8 (అల్లసాని పెద్దన తనకు కృష్ణరాయ లొసగిన అగ్రహారాన్ని తన గురువునకు దానం చేసినట్లుంది.)

రాయల కుటుంబంతో, రాయల పరిపాలనా వ్యవస్థతో సంబంధమున్న మట్లి రాజులు అగ్రహార దానాల్లో పునర్నామ కరణంలో రాయల సంప్రదాయాన్నే పాటించడం ఒక గమనార్హమైన విశేషం.

2, మహమ్మదీయ ప్రభువుల నామాంతరాలూ - ఉర్దూ ప్రభావం:

ఉదా : కడప నామా, నేక్‌నామాబాదు

అయ్యవారిపల్లె నామా. మహమ్మదాబాదు మెకం. 1229-68

3, మరాఠీ పాలకుల పునర్నామకరణాలు ఒకటి రెండుకు మించి లేవు.

ఉదా : ఏలూరు నామా. బాపాజీ మహాదేవపురం మెకం. 1229-21

కోగటం నామా. కమలాజీపురం మెకం. 1229-7.

4, దేశినామాలు మొరటుగా ఉన్నాయనే భావంతో తత్సమ రూపాలతో ఇటీవలి కాలంలో చేసిన పునర్నామకరణాలు.

ఉదా : గుద్దులాటపల్లె నామా. సీతారాంపురం

కటారుముటుకు నామా. శివరాంపురం

5. దేశినామాలే నామాంతరాలుగా వ్యవహారంలో ఉండడం.

ఉదా : నడింపల్లె నామా. మొలకవాండ్లపల్లె

జంగాలపల్లె నామా. నక్కలపల్లె

కడప గ్రామనామాల్లో చారిత్రక నామాంతరాలు శాసనాల్లో, కైఫీయతుల్లో తప్ప వ్యవహారంలో లేవు. దేశినామాలు మొరటుగా ఉన్నాయనే భావంతో చేసిన పునర్నామకరణాలకు రెవెన్యూ రికార్డుల్లో మాత్రం ప్రాచుర్యముంది. దీన్నిబట్టి పునర్నామకరణాలపై గ్రామనామ స్థానిక వ్యవహారబలం తెలుస్తుంది. అయా చారిత్రక పరిస్థితుల ననుసరించి జనించే అన్యభాషా నామాలకైనా, సంకీర్ణ నామాల (Hybrids) కైనా అనూచాన వ్యవహార బలంవల్ల వ్యవహార ప్రాచుర్యం ఉంటుంది. కానీ, పునర్నామకరణాలకు ఉండదనే విషయం కడప గ్రామాల నామాంతరాలు కూడా స్పష్టపరుస్తాయి.

## సంచిత సమీక్ష:

ఇంతవరకు మొదటి భాగంలో ప్రతిపాదించబడిన పరిశీలనా సారాంశం: మొదటి అధ్యాయంలో గ్రామనామ పరిశీలన, తత్ప్రయోజనాన్ని గూర్చి సంగ్రహంగా వివరించడమైంది. సంజ్ఞానామ తత్త్వానికి సంబంధించిన సిద్ధాంత చర్చ తెలుగులో మృగ్యం. ఆ కారణంగా రెండవ అధ్యాయంలో సంజ్ఞానామతత్త్వాన్నీ, సంజ్ఞానామ వర్గీకరణనూ స్థూలంగా ప్రతిపాదించడమైంది.

పాశ్చాత్య భాషల్లోనూ, భారతీయ భాషల్లోనూ స్థలనామ పరిశోధనా రంగంలో ఇంతవరకు జరిగిన కృషి మూడవ అధ్యాయంలో సమీక్షింపబడింది.

తెలుగులో ఇది మొదటి సిద్ధాంతవ్యాసం కాబట్టి గ్రామనామ తత్త్వస్వరూపాన్ని, ప్రయోజనాన్ని ప్రదర్శించడానికి ఈ మూడు అధ్యాయాలలోనే విషయం ప్రధాన సమస్యతో సంబంధం లేకపోయినా, పూర్వీకరంగంగా ప్రతిపాదించబడింది.

నాల్గవ అధ్యాయంలో కడప గ్రామనామ వర్ణసమామ్నాయ పరిశీలన. ఈ అధ్యాయంలో తెలుగు వర్ణసమామ్నాయంతో కడప గ్రామనామ వర్ణాలను పోల్చి చూచినప్పుడు మహాప్రాణాలైన ఛ, థ, ఫ లకు ఏ పరిసరంలోనూ వ్యాప్తి లేదని తేలింది, ఇతర వర్ణాలకు సంబంధించిన వ్యాప్తి సోదాహరణంగానూ, పట్టికల రూపంలోనూ సూచింపబడింది.

కడప గ్రామనామాలలోని సంధి స్వరూపానికి సంబంధించిన అయిదవ అధ్యాయంలో వివిధ సంధికార్యాలు వివరింపబడినాయి. ఈ సంధి కార్యాలలో కొంత విలక్షణత కన్పిస్తుంది. ముఖ్యంగా టుగాగమ, కుగాగమాల విషయం. దీనికి గ్రామనామాల చారిత్రక స్థితి కారణం.

ఆరవ అధ్యాయంలో గ్రామనామ రూప నిర్మాణ పరిశీలన. కడప గ్రామనామాల్లో కన్పించే తత్సమ, తద్భవ, అన్యదేశ్య, దేశ్య పదజాలమూ, ఔప విభక్తిక రూపాలూ, విభక్త్యంగ సహిత రూపాలూ మొదలైనవి ఈ అధ్యాయంలో వివరింపబడినాయి. నేటివ్యవహారంలో అంతగాలేని పిచ్చి, పిట్టి, దొడ్డం, నిడు, పెను మొదలైన విశేషణ రూపాలు, పరస్థరూపాలు మొదలైనవి వివరింపబడినాయి. కడప మాండలిక విశిష్టతను -కాడ- అనే పరస్థరూపం చాటుతుంది.

ఏడవ అధ్యాయంలో కడప గ్రామనామ నిర్మాణ స్వరూపం చిత్రించబడింది. నిర్మాణ దృష్ట్యా కడప గ్రామనామాలను వర్గీకరించి, వాటిలోని వైవిధ్యాలను శాఖాచిత్రాల్లో ప్రదర్శించడమైంది. గ్రామనామబంధాల్లో కారకశ్లేష కన్పించడం ఒక విశేషం. సంబంధార్థక నామాల్లో నామ్నీకరించబడిన కుటుంబనామం ఒక్కటే కన్పిస్తుంది. ఉదా : పులికరిపినవాండ్లపల్లె.

ఎనిమిదవ అధ్యాయంలో గ్రామనామాలను అర్థ దృష్ట్యా వర్గీకరించడం జరిగింది. ఈ వర్గీకరణలో వ్యక్తినామాలు, కుటుంబనామాలు, కులనామాలు సగానికి పైగా ఉన్నట్లు తేలింది. వర్ణనాత్మక నామాలకంటే సంబంధార్థక నామాలు ఎక్కువ. ఈ అధ్యాయంలో ఆసక్తికరమైన మరొక అంశం గ్రామనామ లోకనిరుక్తులు ప్రజా సామాన్యలోక నిరుక్తులకంటే, పండితలోక నిరుక్తులే ఎక్కువ.

చివరి అధ్యాయంలో కడప గ్రామనామాల్లో ప్రతిబింబించే భాషేతరమైన నైసర్గిక సాంస్కృతిక చారిత్రకాది విశేషాలను స్థూలంగా చర్చించడం జరిగింది. ఈ విశేషాలను ఇతర ఆధారాలతో సమన్వయించి నిరూపించడమైంది.

ఈ సిద్ధాంత వ్యాసంలో అపరిష్కృతాలుగా నిలిచినవి ముఖ్యంగా అస్పష్టనామ బంధాలైన గ్రామనామాలు. ఇవి 84 ఉన్నాయి. అవయవ విభజన సాధ్యం కానివి కొన్ని. ప్రథమ లేదా ద్వితీయావయవాల అర్థనిర్ణయం క్లిష్టమైనవి కొన్ని. వీటి నిర్మాణ స్వరూప నిర్ణయానికీ, వ్యుత్పత్తి వివరణకూ తగిన చారిత్రక ప్రమాణాలు, భాషాధారాలు ప్రస్తుతం లభించలేదు. భావి పరిశోధనలో ఇవి పరిష్కృతాలు కావచ్చని ఆశించవచ్చు.

1. అంకంచెరువు రాయ. 26+

*సంబ. నామబం; వ్యక్తినామసూచి.*

అంక(...-గ్రామనా. ప్ర., స్త్రీనా., నామబం. (ద్రావిడ గ్రామ) దేవతా సూచి. (అంక + అం ఙ అంక + అమ < అంకమ్మ). అంక ఙ అంకము యుద్ధం. చూ. పో. వ. అంకకాడు. అంకా పొంకాలు, అంకమ్మశివాలు, అంకిణీ, అంకమ్మ సాంగెం. - అం వ్యక్తినా. అమ. (ఙ అమ < అమ్మ) అమ్మ తల్లి, ఒక ద్రావిడ దేవత, శక్తి. చూ. పో. వ. అమ్మవారు దేవత, అమ్మయ్య బ్రాహ్మణస్త్రీ. పోల్చి చూ. త. అమ్మన్ కోయిల్. సం. అంబా. ప్రా. అమ్మా శబ్దభవమని సూ. ని. (ద్రావిడభాషా పద మని నిర్ధారితం (CPDL) [మూ. ద్రా. *అమ్మ]/ సం. అంబా. ప్రా. అంబియా (CDIAL, 574) స్త్రీల పేర్లలోనూ, పురుషుల పేర్లలోనూ అమ్మ వ్యక్తి నామానుబంధంగా చేరుతుంది. కడపమాండలికంలో సాధారణంగా స్త్రీ నామా ల్లోనే ప్రయుక్తం. అయితే -రాజు, -రెడ్డి మొద లైన కులసూచకాలు చేరే నామబంధ వ్యక్తి నామాల్లో పురుషుల పేర్లలో కూడా అమ్మ చేరడం చూడవచ్చు. చూ. ఆరో. అన్నంరాజు గారిపల్లె. కడపగ్రామనామాల్లోని వ్యక్తినామాల్లో అమ్మకు రూపాంతరాలు -అం, -అమ్మ. గ్రామ నామాల్లో ప్రథమావయవంలో వచ్చే అమ్మ ద్రావిడ గ్రామ దేవతాసూచి. చూ. ఆరో. అమ్మవారిపల్లె. -అమ్మపై పూర్వపర్గ (Prefix) లు చేరడం చూడవచ్చు : అమ్మ-ణ్ణమ్మ, అంకాలమ్మ, చిన్నమ్మ, కన్యమ్మ, మరియమ్మ, ముత్యాలమ్మ, మల్లమ్మ, పోలేరమ్మ, ఎల్లమ్మ మొ. (MAMP, 26)? అంకమ్మ ద్రావిడుల యుద్ధదేవత, [అంకమ్మ, అంకాళమ్మ, అంకా లమ్మ విగ్రహాన్ని, ఆ దేవత పూజావిధానాన్ని, ఆమెకు సంబంధించిన కొన్ని ఐతిహ్యాలను బట్టి ఈ దేవత ఆర్యద్రావిడుల ఘర్షణకాలంలో ద్రావిడుల యుద్ధదేవత అయి ఉండవచ్చునని భావించవచ్చు. అంకమ్మ లేదా అంకాలమ్మ విగ్రహకల్పన : "She is represented by a stone or block of wood, but specially depicted. Her image has four arms and hands. Two of these she raises, holding in the right a weapon of wood leather, encircled by a snake and in the left a noose, called Pausham...In one of the other two hands she holds the skull of Brahma, the fourth being empty. The hair is erect...(MAMP 30).

పూజావిధానం : సాధారణంగా జంతుబలి ఇవ్వడం జరుగుతుంది. బ్రాహ్మణేతరులే ప్రధా నంగా ఆసాదులు, గొల్లలు పూజారులుగా వుంటారు. అంకమ్మసాంగెం కుమ్మర్లు వీరా వేశంతో వంబజోళ్ల వాయిస్తూ ఈతముక్కల బాలమ్మ తిర్నాలలో గ్రామదేవత అంకమ్మ కథను చెప్పే ఆచారం (మాం. వృ. కో. V ముద్రణలో). తమనూ, తమ పశువులనూ ఏ రోగాలూ రాకుండ కాపాడి శుభం కలుగచేసే దేవతగా ఈనాడు అంకమ్మను జానపదులు భావి స్తున్నారు ఆమెకు సంబంధించిన కొన్ని ఐతిహ్యా లున్నాయి : అంకాళమ్మ శివుని కొడుకైన వీర భద్రుని ఇల్లాలు (MAMP, 30) బ్రహ్మ విష్ణు మహేశ్వరుల జన్మకు కారకురాలై, వారు అవ మానించగా, వారి నగరాలను ధ్వంసం చేసి ప్రతీకారం తీర్చుకొన్న దేవత [చూ. Whitehead, 126-128]. చూ. ఆరో. అంకాలమ్మ గూడూరు. -చెరువు చూ. గ్రామనా. ద్వి.

**2. అంకంవాండ్లపల్లె రాయ. 101+.**

*సంబ. నామబం; కుటుంబనామసూచి.*

**అంకంవాండ్ల-** గ్రామనా. ప్ర., నామబం· అంకం వ్యక్తినా. చూ. ఆరో. 1. -వాండ్ల- (< వాండ్లు + అ < వాండు + లు + అ). వాండ్లు ప్రథమ పురుష పుంస్త్రీ బహువచన రూపం, నామబంధాల్లో రెండో అవయవంగా ఉన్నపుడు ఇది వ్యక్తిసమూహసూచి. వ్యుత్పత్తి వివరాలకు, పునర్నిర్మాణ చర్చకు చూ. DED-1. కడప మాండలికంలో ప్రామాణికేతరచ్చార ణలో వాన్లగానూ. వాల్ల గానూ విన్పిస్తుంది- ఊర్ల పేర్ల ఉచ్చారణలోకూడా.- పల్లె చూ: గ్రామనా. ద్వి.

**3. అంకనగౌడుగునూరు బద్వే. 70.**

*సంబ. నామబం; వ్యక్తినామసూచి.*

**అంకన-** గ్రామనా. ప్ర; పునా; నామబం; (ద్రావిడగ్రామ) దేవతాసూచి. (అంక + అన ల అంక + అన్న). అంక-చూ. ఆరో. 1. -అన పుం. నా. అను. (ల అన్న) సోదరుడు; తమ కంటే పెద్దవాళ్లనూ, కొత్తవాళ్లనూ ఉద్దేశించి వాడేమాట. అన్న దేశ్యపదమే (DED, 112). జనక శబ్దభవమని సూ. ని. వ్యక్తినామాల్లో అన్న ప్రథమాపయంగా కూడ ఉంది. ఉదా. అన్నప్ప, అన్నమ్మ. -గౌడుగునూరు గ్రామ నా. ద్వి, చూ. ఆరో. గౌడుగునూరు.

**4. అంకాయపల్లె కడ. 32/A**

[అంకయపల్లె మెకం. 1119-248].

*సంబ. నామబం; వ్యక్తినామసూచి.*

**అంకాయ-** [ల అంకయ] గ్రామనా. ప్ర; పు. నా; నామబం. (అంక + ఆయ < అంక + అయ < అంక + అయ్య) అంక- చూ. అంకం చెరువు. -ఆయ పు. నా. అను. (ల అయ ల అయ్య) అయ్య తండ్రి; దేవుడు; బ్రాహ్మణుడు, పూజారి; ఉపాధ్యాయుడు. అయ్య స్త్రీనామాను బంధం కూడా. క్షత్రియ స్త్రీలను అయ్యవార్లని పేర్కొనే ఆచారం విజయనగర ప్రాంతాల్లో ఉందని కుందూరి ఈశ్వరదత్తు. (శా. శ. కో). చూ. పో. ప. అయంగరు- అయ్యకులము. అయ్యనులు- అయ్యరు- అయ్యవారు (శా. శ. కో.). దాసరి, దేవాంగ, గొల్ల, ఈడిగ, జంగం, కొండదొర, కోమటి, కొప్పుల వెలమ, అంగ బలిజ, మంగల, మూకదొర, పైడి, సాతాని, తంబల మొదలైన కులాల వ్యక్తి నామాల్లో అయ్య వ్యక్తినామానుబంధంగా కన్పిస్తుంది. (CTSI. I, see Aiya or Ayya). విశ్వ బ్రాహ్మణుల వ్యక్తినామాలకు సాధారణంగా -అయ్య అనుబంధంగా ఉంటుంది. ఇటీవల దాని స్థానంలో -ఆచారి వచ్చి చేరింది. అయ్య వ్యక్తినామానుబంధంగానే కాకుండా పెట్టిన పేర్లలో (given names) ప్రథమావయంలో కూడా వస్తుంది. చూ. ఆరో. అయ్యపురెడ్డి పల్లె. అయ్య తద్భవమని సూ ని. (వ్యుత్పత్తి వివరాలకు చూ. DED, 163; CDIAL. 1347. కడప గ్రామనామాల్లోని వ్యక్తి నామాల్లో అయ్యకు రూపాంతరాలు : -అయ, -ఎ, -ఏ, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**5. అంకాలమ్మగూడూరు పులి 83.**

అనిర్దే. వ్యవ్య. గూడూరు. *సంబ. నామబం; వ్యక్తినామసూచి (దేవతా సూచి).*

**అంకాలమ్మ** ల అంకాళమ్మ -గ్రామనా. ప్ర; స్త్రీనా; నామబం (అంక + అళ్ + అమ్మ). పోల్చి చూ. అంకం-. అహంకాళి శబ్దభవమే అంకా ళమ్మ అని కొందరు, అం + కాళి + అమ్మ అని

చూ. ఆరో. 723. రెడ్డి చూ. ఆరో. 6; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**761. కొండ్రెడ్డిపల్లె పులి. 42+.**
[కొండ్రెడ్డిపల్లె మెకం. 1119-4]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

-కొండ్రెడ్డి గ్రామనా.ప్ర. చూ. ఆరో. 760; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**762. కొండ్రెడ్డివాండ్లపల్లె రాయ. 100+.**
సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొండ్రెడ్డివాండ్ల గ్రామనా.ప్ర; నామబం. కొండ్రెడ్డి- కు.నా; వ్యక్తినామసూచి. చూ. ఆరో. 760; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**763. కొండ్లోపల్లె రాజం. 51.**
[కొండ్లోపల్లె మెకం. 1223-16]
స్థలా. నామబం; దిక్సూచి.

కొండ్లో- గ్రామనా. ప్ర; (కొండ+లో) -పల్లె చూ. గ్రామనా. ద్వి.

కొండారెడ్డి తన పేర కొండవద్ద కట్టించి నట్లు స్థానిక చరిత్ర. (మెకం. 1223 - 16) ఇది లోక నిరుక్తికి ఉదాహరణ.

**764 కొండ్లోపల్లె రాజం. 91+.**
[కొండ్లోపల్లె మెకం. 1223 - 39]
చూ. ఆరో. 763.

"కొండవద్ద వున్నందుచేత కొండ్లోపల్లె" అని స్థానిక చరిత్ర (మెకం. 1223-39)

**765. కొక్కంటివాండ్లపల్లె రాయ. 47+.**
సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొక్కంటివాండ్ల గ్రామనా; ప్ర; నామబం. కొక్కంటి కు.నా. గ్రామనామసూచి అనంత పురం జిల్లా, కదిరి తాలూకాలోని గ్రామం. కొక్కు+కన్ను అని MAMP 113. పోల్చి చూ. కొక్కొండ. -వాండ్ల- చూ. ఆరో. 2; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

**766. కొక్కరాయపల్లె కడ. 31.**
[కుర్కుటేశ్వరపల్లె. కొక్కరాయపల్లె మెకం. 1240-9, 10]
సంబ. నామబం; ? వ్యక్తినామసూచి.

కొక్కరాయ- గ్రామనా. ప్ర. ? వ్యక్తినా; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

పినాకిని దక్షిణ తీరంలో బీడు భూమి ఉండే దనీ, ఆ స్థలంలో 'కుర్కుటేశ్వరుడు అనే లింగస్థాపనచేసి అగ్రహారాన్ని కట్టినారనీ" కుర్కుటేశ్వర పల్లెకు జనులయొక్క అవరి జ్ఞానంవల్ల కొక్కరాయపల్లె అని వాడుకునే వారని స్థానిక చరిత్ర (మెకం. 1240-9-10).

**767. కొటికెవాండ్లపల్లె రాయ 105+.**
సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొటికెవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. కొటికె- కు.నా. వృక్షసూచి. గొటికె చెట్టు గొట్టి, గొటిక, A bramble, Jujube, Rhamus xylocarpus Man., Zizyphus Xylo Pyrus, Willd. పోల్చిచూ. గొం. ఘోటిఅ, మటోల్ మఙా / సం. ఘోంటా DED. 1723).

**768. కొటికెవారిపల్లె సిద్ధ 51+.**
సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొటికెవారి- గ్రామనా. ప్ర; నామబం. కొటికె- చూ. ఆరో. 767; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

769. కొట్టాల కడ.1+.

ఆనమ స్తం. బహు. (< కొట్టాలు + అ) ఏక. కొట్టం మనుషుల నివాసంకోసం కట్టిన ఇండ్లు (రాయలసీమ మాండలికంలో). వల్లె, గుడిసె. పోల్చిచూ. తె కొట్టు, కొట్టిడి చిన్నగది (రాయలసీమ) కొటారము, కొట్టరపు క. కొట్టగె. తు. కొట్ట. త. కొట్టిగ, కొట్టగె మ. కొట్టిక [మూలద్రా. *కొట్-] / సం. కోష్ఠ-. వా.ప్రా. కొర్థ- (CDIAL. 3546). గ్రామనామ ద్వితీయావయవంగా కూడా కన్పి స్తుంది. పోల్చ చూ. ఆరో. గుంటూరు కొట్టాల, నెల్లూరు కొట్టాల, కేశవనాయుని కొట్టాల.

770. కొట్టాల బద్వే. 13+.

చూ. అరో. 769.

771. కొట్టాల ప్రొద్దు 23+. ,,

772. కొట్టాల ప్రొద్దు.31+ ,,

773. కొట్టాలపల్లె బద్వే.43+.

సంబ. నామబం; వాస్తుసూచి.

కొట్టాల- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 769. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

774. కొట్టాలపల్లె బద్వే.107+.

చూ. ఆరో. 773.

775. కొట్టాలపల్లె జమ్మ.45+.

[కొట్టాలపల్లె వురపు గురిగింజకోన మెకం. 1180-151] చూ. ఆరో. 773. గురిగింజకోన వ్యవహారంలో లేదు.

776. కొట్టాలపల్లె జమ్మ.66+.

చూ. ఆరో. 773.

777. కొట్టాలపల్లె జమ్మ.98.

[కొట్టాలపల్లె మెకం. 1204 - 181]. పర్యా. జంగాలపల్లె కొట్టాలపల్లె. చూ. ఆరో. 773.

జంగాలు కట్టించినందువల్ల జంగాలపల్లె కొట్టాలపల్లె అని పేరు వచ్చినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1204-181).

778. కొట్టాలపల్లె జమ్మ 104.

పర్యా. నెమళ్లదిన్నె కొట్టాలపల్లె. కొట్టాల పల్లె చూ. ఆరో. 773. పోల్చి చూ. ఆరో. 777. నిర్దిష్ట వ్యవహారంలో నెమళ్లదిన్నె కొట్టాలపల్లె అని ఉంది.

779. కొడిదెపల్లె రాయ.61+.

సంబ. నామబం; కులసూచి.

కొడిదె- గ్రామనా. ప్ర; రెడ్లల్లోని ఒక శాఖ, కొడిదె కాపులు. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

780. కొత్తఏకోపల్లె ప్రొద్దు. 17+.

వి. బం; పౌర్వాపర్యసూచి.

కొత్త- గ్రామనా. ప్ర; వి. పోల్చి చూ. కొఱంతు మొ. మ. కొఱున్న, కొఱుంతు, క. కొడ. మొ. / సం. కోరక- కొర; కుణిక (DED, 1787); -ఏకోపల్లె గ్రామనా. ద్వి; చూ. ఆరో. 388.

781. కొత్తఒద్దెపల్లె రాయ.51+.

వి. బం; పౌర్వాపర్యసూచి.

కొత్త- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780. -ఒద్దెపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. పోల్చి చూ. పాత ఒద్దె పల్లె రాయ.51+.

**782. కొత్తఒడ్డెపల్లె** రాయ.61+.
చూ. ఆరో. 781.

**783. కొత్తఒడ్డెపల్లె** రాయ.82+. ,,

**784. కొత్తఒడ్డెపల్లె** రాయ.81+. ,,

**785. కొత్తఒడ్డెపల్లె** రాయ 81+. ,,
పోల్చిచూ. పాతఒడ్డెపల్లె రాయ.81+.

**786. కొత్తఒడ్డెపల్లె** రాయ.94+.
చూ. ఆరో. 781. పోల్చిచూ. చిన్నకొత్త ఒడ్డెపల్లెరాయ. 74+.

**787. కొత్తఒడ్డెపల్లె** రాయ.100+.
చూ. ఆరో. 781.

**788. కొత్తఒడ్డెపల్లె** రాయ.105+. ,,

**789. కొత్తకుదుములూరు** సిద్ధ.58+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
**కొత్త-** గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780.
**-కుదుములూరు** గ్రామనా.ద్వి. చూ.ఆరో.650.

**790. కొత్తకొట్టాల** కడ.62+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
**కొత్త-** గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780;
**-కొట్టాల** చూ.గ్రామనా.ద్వి. చూ.ఆరో. 769.

**791. కొత్తకొట్టాల** ప్రొద్దు. 63+.
చూ. ఆరో. 790.

**792. కొత్తకోట** బద్వే. 5.
పర్యా. ఎగువ రామాపురం.
వి.బం; పౌర్వాపర్యసూచి.
**కొత్త-** గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780;
**-కోట** చూ. గ్రామనా. ద్వి.

కొత్తకోట బేచరాకు గ్రామం. పర్యా. ప్రభుత్వ రికార్డుల్లో ఎగువ రామాపురమనే వ్యవహారం. (APDGC. 765).

**793. కొత్తక్రిష్ణంపల్లె** బద్వే. 102+.
వి; బం; పౌర్వాపర్యసూచి.
**కొత్త-** గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780.
**-క్రిష్ణంపల్లె** గ్రామనా. ద్వి. చూ.ఆరో. క్రిష్ణంపల్లె బద్వే. 102+.

**794. కొత్తగడ్డపల్లె** రాయ. 101+.
వి.బం; పౌర్వాపర్యసూచి.
**కొత్త-** గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780.
**-గడ్డపల్లె** గ్రామనా. ద్వి. చూ.ఆరో. గడ్డమీద పల్లె, పోల్చిచూ.నూతన గడ్డపల్లె.

**795. కొత్తగిరియాంపల్లె** కడ. 87.
వి బం; పౌర్వాపర్యసూచి.
**కొత్త-** గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780.
**-గిరియాంపల్లె** గ్రామనా. ద్వి. చూ. ఆరో. పాతగిరియాంపల్లె.

**796. కొత్తగుంటపల్లె** జమ్మ. 118.
[కొత్తకుంటపల్లె మెకం. 1180-157;
కొత్తగుంటపల్లె 1119-245]
సంబ. నామబం; స్థలనామసూచి.
కొత్తగుంట. కొత్తకుంట గ్రామనా.ప్ర. స్థలనా, వి.బం; పౌర్వాపర్యసూచి.
**కొత్త-** స్థలనా. ప్ర; చూ. ఆరో. 780;
**-గుంట** ~ -కుంట స్థలనా. ద్వి. 644. **-పల్లె** చూ. గ్రామనా. ద్వి.

ఈ గ్రామ ప్రాంతంలో చిన్న చెఱువున్నట్లు స్థానిక చరిత్ర (మెకం. 1180-181).

797. కొత్తచెరువు బద్వే. 139+.
వి బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780;
-చెరువు గ్రామనా. ద్వి.

798. కొత్తతిరువెంగలాపురం బద్వే. 94+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780.
-తిరువెంగలాపురం గ్రామనా. ద్వి. చూ. ఆరో. తిరువెంగలాపురం.

799. కొత్తదిన్నెమీదపల్లె రాయ.35+.
వి.బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ద్వి. చూ. ఆరో. 780;
-దిన్నెమీదపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. దిన్నెమీదపల్లె.

800. కొత్తనరసన్నపల్లె కడ 80+.
వి.బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. చూ.ఆరో. 780;
-నరసన్నపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. నరసన్నపల్లె.

801. కొత్తనెల్లూరు కడ. 18+.
వి.బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ద్వి. చూ. ఆరో. 780;
-నెలూరు గ్రామనా. ద్వి చూ. ఆరో. నెల్లూరు.

802. కొత్తపల్లె కడ.1+.
వి.బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 780;
-పల్లె చూ. గ్రామనా. ద్వి.

803. కొత్తపల్లె కడ. 18+.
చూ. ఆరో. 802.

804. కొత్తపల్లె కడ.38+. ,,

805. కొత్తపల్లె కడ.52+. పర్యా. దిగువపల్లె కొత్తపల్లె చూ. ఆరో. 802.

806. కొత్తపల్లె కడ. 72+.
పర్యా; జమాల్‌పల్లె కొత్తపల్లె. చూ. ఆరో. 802.

807. కొత్తపల్లె కడ. 76.
చూ. ఆరో. 802.

808. కొత్తపల్లె కడ. 89+.
పర్యా. మమ్మసిద్దుపల్లె కొత్తపల్లె. చూ. ఆరో. 802.

809. కొత్తపల్లె కడ. 95+.
చూ. ఆరో. 802.

810. కొత్తపల్లె కడ.16+. ,,

811. కొత్తపల్లె రాయ.20+. ,,

812. కొత్తపల్లె రాయ.21+. ,,

813. కొత్తపల్లె రాయ. 24+. ,,

814. కొత్తపల్లె రాయ. 24+. ,,

815. కొత్తపల్లె రాయ.26+. ,,

816. కొత్తపల్లె రాయ. 31+. ,,

817. కొత్తపల్లె రాయ. 31+. ,,

818. కొత్తపల్లె రాయ. 33+; ,,

819. కొత్తపల్లె రాయ. 33+. ,,

820. కొత్తపల్లె రాయ. 37+. ..
చూ. ఆరో. 802.

821. కొత్తపల్లె రాయ. 53+. ..

822. కొత్తపల్లె రాయ. 58+. ..

823. కొత్తపల్లె రాయ. 61+. ..

824. కొత్తపల్లె రాయ. 62+. ..

825. కొత్తపల్లె రాయ. 64+. ..

826. కొత్తపల్లె రాయ. 66+; ..
పోల్చిచూ. దిగువ కొత్తపల్లె రాయ.66+.

827. కొత్తపల్లె రాయ. 73+.
చూ. ఆరో. 802.

828. కొత్తపల్లె రాయ. 83+. ..

829. కొత్తపల్లె రాయ. 86+. ..

830. కొత్తపల్లె రాయ. 94+. ..

831. కొత్తపల్లె రాయ. 95+. ..

832. కొత్తపల్లె రాయ. 96+. ..

833. కొత్తపల్లె రాయ. 100+. ..

834. కొత్తపల్లె రాయ. 100+. ..

835. కొత్తపల్లె రాయ. 101+. ..

836. కొత్తపల్లె రాయ. 103+. ..

837. కొత్తపల్లె రాయ. 104+; ..

838. కొత్తపల్లె రాయ. 111+. ..

839. కొత్తపల్లె రాయ. 113+. ..

840. కొత్తపల్లె రాజం. 14,+. ..
చూ. ఆరో. 802.

841. కొత్తపల్లె రాజం. 43+. ..

842. కొత్తపల్లె రాజం. 55+. ..

843. కొత్తపల్లె రాజం. 67 ..

844. కొత్తపల్లె రాజం. 119+. ..

845. కొత్తపల్లె రాజం 127+. ..

846. కొత్తపల్లె రాజం. 13.+. ..

847. కొత్తపల్లె రాజం. 132+. ..

848. కొత్తపల్లె రాజం. 137+. ..

849. కొత్తపల్లె రాజం. 142+. ..

850. కొత్తపల్లె సిద్ధ. 9+. ..

851. కొత్తపల్లె సిద్ధ. 33+. ..

852. కొత్తపల్లె సిద్ధ 52+. ..

853. కొత్తపల్లె బద్వే. 47+. ..

854. కొత్తపల్లె బద్వే. 48+. ..

855. కొత్తపల్లె బద్వే. 50+. ..

856. కొత్తపల్లె బద్వే. 69+. ..

857. కొత్తపల్లె బద్వే. 95+. ..

858. కొత్తపల్లె బద్వే. 127+. ..

859. కొత్తపల్లె బద్వే. 135+. ..

860. కొత్తపల్లె జమ్మ. 12+. ..

861. కొత్తపల్లె జమ్మ. 27+. ..
చూ. ఆరో. 802.

862. కొత్తపల్లె జమ్మ. 45+. ..

863. కొత్తపల్లె జమ్మ. 123+.
[కొత్తపల్లె మెకం. 1180-160] చూ. ఆరో. 802.

864. కొత్తపల్లె ప్రొద్దు. 9+.
చూ. ఆరో. 802.

865. కొత్తపల్లె ప్రొద్దు. 49. ..

866. కొత్తపల్లె ప్రొద్దు 78+. ..

867. కొత్తపల్లె ప్రొద్దు. 86+. ..

868. కొత్తపల్లె పులి. 12+. ..

869. కొత్తపల్లె పులి. 27+. ..
విర్దే. వ్య. వేముల కొత్తపల్లె.

870. కొత్తపల్లె పులి. 87+. ..

871. కొత్తపల్లె పులి. 96+.
వర్యా. భద్రంపల్లె కొత్తపల్లె.
చూ. ఆరో. 802.

872. కొత్తపల్లె. కమ. 21+. ..

873. కొత్తపల్లె కమ. 25+.
విర్దే. వ్య. జంబాపురం కొత్తపల్లె. చూ. ఆరో. 802.

874. కొత్తపల్లె కమ. 37+.
విర్దే. వ్య. వెలుదుర్తి కొత్తపల్లె. చూ. ఆరో. 802.

875. కొత్తపల్లె కమ. 52+.
విర్దే. వ్య. ఇందుకూరి కొత్తపల్లె. చూ. ఆరో. 802.

876. కొత్తపల్లె కమ. 58+.
చూ. ఆరో. 802.

877. కొత్తపల్లె కమ. 63+.
విర్దే. వ్య. పొదదుర్తి కొత్తపల్లె. చూ. ఆరో. 802.

878. కొత్తపల్లెఅగ్రహారం రాజం. 100.
పంబ. నామబం; గ్రామనామసూచి.
కొత్తపల్లె- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 802; -అగ్రహారం చూ. గ్రామనా. ద్వి.

879. కొత్తపాలెం ప్రొద్దు. 84+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 780, -పాలెం చూ. గ్రామనా. ద్వి.

880. కొత్తపేట కడ. 17.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780. -పేట చూ. గ్రామనా. ద్వి.

881. కొత్తపేట కడ. 88+.
చూ. ఆరో. 880.

882. కొత్తపేట కడ. 102. ..

883. కొత్తపేట రాయ. 61+. ..

884. కొత్తపేట రాయ. 80+. ..

885. కొత్తపేట రాయ. 81+. ..

886. కొత్తబిడారు రాయ. 118+.
వి. బం. పౌర్వాపర్యసూచి.
కొత్త గ్రామనా. ప్ర; చూ. ఆరో. 780;
-బిడారు చూ. గ్రామనా. ద్వి.

887. కొత్తబొట్టువాండ్లపల్లె రాయ. 44+.
వి. బం. పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 780;
-బొట్టువాండ్లపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. పాతబొట్టువాండ్లపల్లె.

888. కొత్తమామిళ్లపల్లె ప్రొద్దు 83+.
వి. బం. పౌర్వాపర్య నామసూచి
కొత్త- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780;
-మామిళ్లపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. పాతమామిళ్ళపల్లె.

889. కొత్తింద్లు రాయ 97+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర; రూ. ఆరో. 780:
-ఇంద్లు చూ. గ్రామనా. ద్వి.

890. కొత్తింద్లు రాయ. 118+.
చూ. ఆరో. 889.

891. కొత్తపట్టంవాండ్లపల్లె రాయ 61+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780;
-పట్టంవాండ్లపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. పట్టంవాండ్లపల్లె.

892. కొత్తవాండ్లపల్లె రాయ. 104+.
వంబ. నామబం; కుటుంబనామసూచి.
కొత్త- కు. వా. చూ. ఆరో. 780;
-వాండ్ల- చూ. ఆరో. 2; కొత్త కురుబల శాఖాభేదం (CTSI. IV. See Kotha). కమ్మ వాళ్ళల్లో ఇంటిపేరు కూడా. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

893. కొత్తవాకమడ పిద్ద. 75+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 780;
-వాకమడ గ్రామనా. ద్వి. చూ. ఆరో. వాకమడ.

894. కొత్తవెల్లాల ప్రొద్దు. 2+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర; చూ; ఆరో. 780;
వెల్లాల- గ్రామనా. ద్వి. చూ. ఆరో. వెల్లాల.

895. కొత్తసంగటిపల్లె కడ. 95+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 780;
సంగటిపల్లె- గ్రామనా. ద్వి. చూ. ఆరో. సంగటిపల్లె.

896. కొత్తసానివాండ్లపల్లె. రాయ. 31+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర; చూ; ఆరో. 780;
-సానివాండ్లపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. పాతసానివాండ్లపల్లె.

897. కొత్తసీతారాంపురం ప్రొద్దు. 8+.
వి. బం; పౌర్వాపర్యసూచి.
కొత్త- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 780;
-సీతారాం పురం గ్రామనా. ద్వి. చూ. ఆరో; సీతారాం పురం.

**898.** కొత్తూరు సిద్ధ 80.

వి.బం; పౌర్వాపర్యసూచి.

కొ త్త- గ్రామనా. ప్ర, చూ. ఆరో. 780; -ఊరు. చూ. గ్రామనా. ద్వి.

**899.** కొత్తూరు ప్రొద్దు.42+.

చూ. ఆరో. 898.

**900.** కొన్నేపల్లె కడ. 67+.

[కోనేపల్లి, కోనెపల్లె మెకం.1240-5].
సంబ. నామబం. వ్యక్తినామసూచి.

కొన్నే- [కోనె-, కోనె] గ్రామనా.- ప్ర.పు.నా; నామబం, (<కోనయ్య) పోల్చిచూ. ఆరో. అంకేవారి పల్లె;

**901.** కొప్పర్తి కడ. 85.

[కొప్పర్తి 1544 AR 1939 : B389; కొప్పతిజ మెకం. 1110-31] ?
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

కొప్ప- గ్రామనా. ప్ర; వ్యక్తినా. పోల్చి చూ. కొప్పడు, కొప్పులపతి. కొప్పులయ్య (అం.చ.భూ) -పర్తి చూ. గ్రామనా. ద్వి.

**902.** కొప్పోలు కడ. 46.

[కొప్పోలు మెకం. 1119 - 248; 1225-139]. నామా. కృష్ణరాయపురం 1544 AR 1938-39 : B 388; క్రిష్ణరాయపురం అగ్రహార 1666 AR 1945-46 : B 153.

? సంబ. నామబం. వ్యక్తినామసూచి.

కొప్ప- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 901; -వోలు చూ. గ్రామనా. ద్వి.

నామా. వాడుకలో లేదు. విజయనగర రాజుల కాలంలో విరివిగ జరిగిన పునర్నామ కరణానికిది ఒక ఉదాహరణ.

లోకనిరుక్తి: "పూర్వం ఈ గ్రామానికి ఈశాన్యం అరపరుగు దూరమున త్రైలోక్య వల్లభరాజు . అక్కడ వల్లూరు అనే గ్రామ మును తన పేరుతో వల్లభాపురి అనే పట్టణంగా మార్చి కట్టించెను. ఆరాజుకు అంతఃపురస్త్రీలు సైరంధ్రిత్వం చేసేవారు- కొప్పు ముడిచేవారు. వారికి యీ స్థలం యిచ్చిరి. వారిక్కడ గ్రామం కట్టుకొనిరి కనుక కొప్పోలు...." (మెకం. 1225-139) పోల్చిచూ. ఆరో. 903.

**903.** కొప్పోలు జమ్మ. 31.

[కొప్పోలు మెకం. 1112 - 69 - 70; 1121-19] చూ. ఆరో. 902.

"కొప్పరపువాడు అనే యింటినామధేయం కలిగిన గొల్లవాడుకొండ ఆపుచేసుకొని ఆవుల మేపుకుంటూవుంది కొట్టం వేసుకొనగా ఆ తర్వాత గ్రామమై కొప్పోలుగా ప్రసిద్ధ చెంది నట్లు స్థానిక చరిత్ర (మెకం 1112-69-70).

**904.** కొమంతరాజపురం రాజం. 38.

[కొమార అనంతరాజపురం. కొమంత రాజపురం మెకం. 1134-331, 335]
కురూపం (Stumped form).
సంబ; నామబం; వ్యక్తినామసూచి.

కొమంతరాజ- కొమార అనంతరాజ- గ్రామనా. ప్ర; పు.నా.నామబం. కురూపం.

**905.** కొమర్తిపల్లె రాయ. 31+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొమర్తి- గ్రామనా. ప్ర; కు.నా, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**906. కొమారకాల్వ రాయ. 5.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

కొమార- గ్రామనా.ప్ర వ్యక్తినా.కొడుకు, యువరాజు, కుమారస్వామి. [<సం. కుమారః]; -కాల్వ చూ. గ్రామనా. ద్వి.

**907. కొమారనాయునిపల్లె పిద్ద. 44+.**

సంబ; నామబం; వ్యక్తినామసూచి.

కొమారనాయుని- గ్రామనా. ప్ర;పు.నా, నామబం. కొమార- చూ. ఆరో. 906; -నాయుని చూ. ఆరో. 101, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**908. కొమారునిపల్లె రాజం. 13.**

[కొమారుణిపల్లె మెకం. 1134-77; కొమారునిపల్లె మెకం. 1134-193]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

కొమారుని- [లే.రూ. కొమారుణి-] గ్రామనా. ప్ర వ్యక్తినా. (కొమారుడు+ఇ) చూ. ఆరో. 906; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**909. కొమారునిపల్లె కడ. 37.**

చూ. ఆరో. 908.

**910. కొమారునిపల్లె పిద్ద. 26.**

చూ. ఆరో. 908.

**911. కొమ్మడిగారిపల్లె రాయ. 80+.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

కొమ్మడిగారి- గ్రామనా. ప్ర. నామబం. కొమ్మడి- వ్యక్తినా. ? < కొమ్మరెడ్డి; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**912. కొమ్మద్ది కమ. 41.**

[కోమవి. మెకం. 1110-39; కొమ్మది మెకం. 1110-12; కొమ్మద్ది, మెకం. 1229-38.]

అస్పష్టనామబంధం.

? (<కొత్త + మద్ది) / ? (కోన + మద్ది.)

**913. కొమ్మనవారిపల్లె రాజం. 99.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొమ్మన- గ్రామనా. ప్ర; పు.నా. కొమ్మ-స్త్రీ. యువతి. (DED 1787); -అన చూ. ఆరో. 8. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**914. కొమ్మలూరు కడ. 12.**

సంబ. నామబం; ? దేవతాసూచి.

కొమ్మలు- గ్రామనా. ప్ర; బహు. ? స్త్రీ దేవతలు. -ఊరు చూ. గ్రామనా. ద్వి. పోల్చి చూ. కన్నెలూరు.

**915. కొమ్మివారిపల్లె రాజం. 90+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొమ్మివారి- గ్రామనా. ప్ర; నామబం. కొమ్మి- కు. నా. (గోత్రనామం) వృక్షనామ సూచి. రూ. కొమ్ము. మైదానాల్లోని అడవుల్లో పొదగా పెరిగే ఒకచెట్టు. chomelia asiatica, O. kze; Styiocoryne Webera, W & A., Webera Corymbosa Wild (మాం. వృ. కో. IV); -వారి- చూ; ఆరో. 8; కొమ్మి గొల్లల్లో ఒక గోత్రం. కొమ్మి గోత్రం ఉన్న వాళ్ళు కొమ్మి కర్రలను వంట చెరుకుగా ఉపయోగింతురు. (CTSI III. see Kommi); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**916. కొమ్మూరు రాజం. 2.**

సంబ. నామబం; వృక్షనామసూచి.

కొమ్మ- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 915.
-ఊరు చూ. గ్రామనా. ద్వి.

917. కొమ్మూరివాండ్లపల్లె రాయ.77 +.
సం.బ నామబం; కుటుంబనామసూచి.

కొమ్మూరివాండ్ల - గ్రామనా. ప్ర; నామబం. కొమ్మూరి. కు.నా: గ్రామనామ సూచి; నామబం. (కొమ్మూరు + ఇ). చూ. ఆరో. 916; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గామనా. ద్వి.

918. కొరివివాండ్లపల్లె రాయ. 116+.
సంబ. నామబం; ? గణనామసూచి.

కొరివివాండ్ల - గ్రామనా. ప్ర; నామబం, కొరివి ? <కొరవ ఒక సంచారగణం. పర్యా. ఎరుకల (రాయలసీమ). పోల్చి చూ. కొఱవి గోపరాజు; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

919. కొరివివాండ్లపల్లె పిద్ధ. 19+.
చూ. ఆరో. 918.

920. కొర్రిపాడు జమ్మ. 63.
[కొఱ్ఱపాడు 1547 AR 1940 - 41 : B 425; 1551 AR 1940 - 41 : B 426; కొర్రపాడు మెకం. 1119-54]
సంబ. నామబం; సస్య నామసూచి.

కొర్ర- [కొఱ-] గ్రామనా. ప్ర; ఒక రకపు పైరు; ధాన్యం. పోల్చిచూ. క. కొఱవె, కొర్లె కో. కొర్లి. త. కురల్ కుయి. క్సురి. (DED. 1797). -పాడు చూ. గ్రామనా. ద్వి.

921. కొర్రపాడు ప్రొద్దు 36.
[కొఱపాటి, చెంనకేశవదేవర- 1527 SII-XVI - 81 - 17. కొఱ్ఱపాడు మెకం; 1126 - 60]. చూ. ఆరో. 920.

922. కొర్రపాడు పులి. 60.
చూ ఆరో. 920.

923. కొర్రపాటిపల్లె బద్వే. 91.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొర్రపాటి- గ్రామనా. ప్ర: కు.నా; నామబం; గ్రామనామసూచి. (కొర్రపాడు + ఇ) చూ. ఆరో. 920; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

924. కొర్రవాండ్లపల్లె కడ. 95+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొర్రవాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. కొర్ర- కు.నా. గూడలకులంలో ఇంటి పేరు. (CTSI. IV See Korra) చూ. ఆరో. 920; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

925. కొర్లకుంట రాయ. 15+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొర్ల- గ్రామనా. ప్ర. కు.నా. (<కొర్రలు + అ) చూ. ఆరో. 924; -కుంట చూ. గ్రామనా. ద్వి.

926. కొర్లకుంట రాజం. 131.
[కొర్లకుంట మెకం. 1223-145]
చూ. ఆరో. 925.

927. కొర్లకుంటవాండ్లపల్లె రాయ. 47.
సంబ. నామబం; కుటుంబనామసూచి;

కొర్లకుంట్లవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. కొర్లకుంట కు.నా. గ్రామనామసూచి. చూ. ఆరో. 925; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

928. కొలవలి కమ 39.

[కొలవెల్లి C 1000 AR 1935-36: B 319; కొలవలి మెకం. 1229-12; కొలవల్లి మెకం. 1110-120; కొలవలి మెకం. 1110-94].

సంబ. నామబం; సామాన్య నామసూచి. నైసర్గికనామసూచి. (జలసూచి).

కొల- [కొల-] గ్రామనా. ప్ర;(<కొలను) చెరువు, సరస్సు, పోల్చి చూ. త. కుళం. క. కొల. మొ; [మూల ద. ద్రా. *కుళ్-అ] చూ. DED. 1518. సం. కూలం శబ్దభవ మని మా. వి. -వలి [-వెల్లి, వల్లి-] చూ. గ్రామ నా. ద్వి.

లోకనిరుక్తి: "ఈ స్థళాన కొలిమెలు పెట్టుకొని కంచరులు రాగి కంచు మొదలగు పనులు చేస్తుండేవారు కాబట్టి కొలవలి అని పేరు కలిగినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1110-115).

929. కొలుములపల్లె కడ 71.

[కొలుములపల్లె మెకం. 1210-49; కొల్మలపల్లె మెకం. 1240-115] పర్యా. కొండపల్లె మెకం. 1210-71.

సంబ.నామబం; సంఘటనాత్మకనామసూచి.

కొలుముల- [కొలుముల- కొల్మల] గ్రామనా. ప్ర, బహు. (<కొలిమి+లు) ఏక. కొలిమి, కమ్మరి పనిముట్లు తయారీలో ఉప యోగించే పొయ్యి, పోల్చిచూ. త. కొల్, కొల్లన్. మ. కొల్లన్. క. కొలిమె, కొలుమె, కులమె, కులుమె, కుల్మె మొ. (DED 1774): -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"దిన్నెమీద ఇనప కొల్మలు చేస్తూఉండే కూలిజనం ఆ కొలుములవద్దనే దిన్నెమీద కొట్టాలు" వేసుకున్నారనీ, ఆతర్వాత కాపులు చేరేవేళకు పల్లె అయి కొలుముల పల్లె అని పేరు పొందిందనీ స్థానిక చరిత్ర. ఈ కొలుములపల్లె కొండ సమీపంలో ఉండడం వల్ల కొండపల్లె అని కూడా అంటారని స్థానిక చరిత్ర (మెకం. 1210-71).

930. కొల్లావాండ్లపల్లె రాయ. 65+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొల్లావాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. కొల్లా కు.నా. ? ధాన్యం నిలువచేసే పెద్ద మట్టి పాత్ర (మాం.వ్యృ.కో. IV) పోల్చిచూ. తె. కొల్లారము, కొల్లారు. త. కొల్. క. కొళగ; -వాండ్ల- చూ. ఆరో. 2; కొల్లా. కమ్మవాళ్లలో సెట్టి బలిజలలో ఇంటిపేరుగా కన్పిస్తుంది. చూ. ఆరో. 931.-పల్లె- చూ. గ్రామనా. ద్వి.

931. కొల్లావారిపల్లె రాజం. 90+.

[కొల్లావారిపల్లె మెకం. 1223-41]

సంబ. నామబం; కుటుంబనామసూచి.

కొల్లావారి- గ్రామనా. ప్ర; నామబం. (కొల్లావారు+ఇ) కొల్లా- చూ. ఆరో. 930; -వారి-చూ.ఆరో.8; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

"కమ్మకొల్లా వెంగమనాయుడు" ఈ గ్రామాన్ని కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1223-41).

932. కొల్లావారిపల్లె సిద్ధ. 9+.

చూ. ఆరో. 930.

933. కొసినేపల్లి జమ్మ. 123.

[కొసనేపల్లె 1554 SII-XVI 195-16; కొసనెపల్లె Ibid. 195-6; కొసినే పల్లి మెకం. 1119-64, కొసినే పల్లె మెకం. 1119-76; కొశినేపల్లె మెకం.

1119-66; కొశినవల్లె మెకం. 1119-249]
నామా. కొపనెవల్లెకు ప్రతినామమైన హరిహరరాయపురం సర్వమాన్య అగ్రహారం Ibid.
అస్పష్ట నామబంధం.

కొపినే- [కొసనే-కొసనె-కొశినే-కొశిన] గ్రామనా. ప్ర. వ్యుత్పత్తి అస్పష్టము.

కశినేయ అనే గొల్లబోయడు ఈ గ్రామాన్ని కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1119-249) ఉండడంవల్ల గ్రామనామ ప్రథమావయవం వ్యక్తినామసూచి అని భావించడానికి వీలుంది కాని ఈ వాదాన్ని బలపరచడానికి తగిన శాసన రూపాలు ఇప్పటికి లభించలేదు. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**934. కోగటం కమ. 11.**

[కోకటం 1518 SII. XVI. 65-7, 8; Ibid 66-32; కోకటానను Ibid 66-8. 1589 SII. XVI 300-11; కోకటము మెకం. 1119-246: కోకటం మెకం. 1229-7] నామా. శఠగోపపురం కమలాజీపురం మెకం. 1229-7, 8.
వ్యుత్పత్తి అస్పష్టము. అవయవ విభజన అస్పష్టం.

లోకనిరుక్తి: "కోకటం అనే నామం గ్రామానికి కలగడం యేమంటే ద్వాపరయుగమున యీ స్థళం దండకారణ్యముగా వుండెను గనుక మేరువుకు దక్షిణభాగం శ్రీశైల పర్వతమునకు దక్షిణం కృష్ణా కావేరి మధ్య ప్రదేశం యీ పుణ్య క్షేత్రమైన ప్రాగ్వాహిని అయిన పినాకిని తీరమున కణ్వాశ్రమము .... మహాయోగమైన క్షేత్రమని విశ్వామిత్రుడు మహాముని తప్పమ్ము" ప్రారంభించినట్లు మేనకవల్ల తపోభంగం జరిగి శకుంతల మేనకకు జన్మించగా, శకుంత పక్షులు శకుంతలను పెంచినాయట. "శకుంత చక్రవాకం మొదలుగా గల పక్షిజాతులు .... సంచరిస్తూవుండగా చూచినవాడై తన కుమార్తెకు పక్షి సమూహం పాకినందున పక్షి సముదాయం మీదను కేవలం అభిమానం కలిగినవాడై వినతముగా తన కేవల సమీపమందు చక్రవాకము నడుస్తూ వుండగా చూచినవాడై కణ్వమహాముని తన యొక్క శిష్యులకు కుటీరములు వేయించి కోకః చక్రవాకః అనే శబ్దానకు కోకః అంచే చక్రవాకములు- అట సంచారణే తస్మాద్కారణాత్- అకారణం వల్లనుంచి స్థలానకు కోకటం అనే పేరు కలిగింది" (మెకం. 1229-7-8).

నామా. పెద్దన వైష్ణవులకు ఈ గ్రామాన్ని దానంచేసి శఠగోపపురమనే ప్రతినామం చేసినట్లు, ఇందుకు సాక్ష్యంగా అక్కడి చెన్నకేశవ ఆలయం దిద్ది మార్గానగల విలువరాయి శాసనమని స్థానిక చరిత్ర. అదేవిధంగా జయసింగు మహారాజు (?) తన పేరుతో కమలాక్షీపురమని ప్రతినామం చేసినట్లు కూడా స్థానిక చరిత్ర (మెకం. 1229-7,8).

**935. కోటంగురాయుపల్లె కడ 3+.**

కురూపం. నంబ. నామబం; వ్యక్తినామసూచి.

కోటంగురాయు- గ్రామనా. ప్ర; నామబం. (< ? కోటగంగరాయ); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**936. కోటకాడపల్లె రాయ. 24+.**

స్థలా. నామబం. స్థలాసూచి.

కోటకాడ- గ్రామనా. ప్ర; కోట- దుర్గం, దుర్గనగరం. పోల్చిచూ. త. కోట్టై. మ. కోట్ట.

త. కోతె. (DED. 1831). సం. కోటః శబ్ద భవమని మా.ని. వైకృతవిశేష్యమని శ.ర. ఇండో-ఆర్యభాషల్లో ప్రవేశించిన ద్రావిడ భాషా పదమని భాషావేత్తల అభిప్రాయం. వివరాలకు చూ. Caldwell, 570, CPDL. 198 /సం.కోటః, కోట్ట- ప్రా. కొట్ట- బెం. కొట్, కుట్. ఒరి.కొట, కుట. హి. కొంట్. మరా. కొట్. కొళ్ మొ. చూ. CDIAL 3500. గ్రామనామ ప్రథమావయవంలోనే కాకుండా ద్వితీయావయవంగా కూడా గ్రామనామాల్లో కన్పిస్తుంది. చూ. ఆరో. ఎర్రగుంట్ల కోట; గండికోట. కోట బ్రాహ్మణుల్లో బలిజల్లో శాఖల భేదంగా, పద్మసాలె వాళ్లల్లో ఇంటి పేరుగా; కోటల- బోయల్లో ఇంటి పేరుగా కూడా ప్రయుక్తమవుతుంది. కాపీ కడప మండల గ్రామనామాల్లో కోట కుటుంబనామ సూచిగా కన్పించడంలేదు. -కాడ- చూ. ఆరో. 417. -పల్లె చూ. గ్రామనా- ద్వి.

937. కోటగడ్డపల్లె రాయ. 56.

సంబ. నామబం; స్థలనామసూచి.

కోటగడ్డ- గ్రామనా. ప్ర; స్థలనా; నామబం. కోట. చూ. ఆరో. 936. -గడ్డ చూ. ఆరో. 399; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

938. కోటపాడు సిద్ధ. 57.

సంబ. నామబం; సామాన్యనామసూచి. వాస్తునామసూచి.

కోట- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 936; -పాడు చూ. గ్రామనా. ద్వి.

వాత్తపి చోళరాజులు మల్లిదేవ, సోమేశ్వరులు (C 1200) ఈ కోటను మొదట కట్టించి నారు. (APDGC 764.)

939. కోటరాజుపల్లె రాయ. 79+.

సంబ. నామబం; సామాన్యనామసూచి. వాస్తునామసూచి.

కోట- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 936; -రాజుపల్లె చూ. గ్రామనా. ద్వి. ఆరో. రాజుపల్లె.

940. కోటవెంకటరామరాజపురం. రాజం. 121.

[కోట వెంకటరామరాజపురం / కోట వెంకట్రామరాజపురం మెకం. 1223-120]

సంబ; నామబం; సామాన్యనామసూచి. వాస్తునామసూచి.

కోట- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 935; -వెంకటరామరాజపురం గ్రామనా. ద్వి. -వెంకటరామరాజు పు.నా. చూ. ఆరో. వెంకటరామరాజుపేట. -పురం. చూ. గ్రామనా. ద్వి.

941. కోటాయపల్లె సిద్ధ 80+.

సంబ. నామబం. వ్యక్తినామసూచి.

కోటాయ- గ్రామనా. ప్ర; నామబం. (<కోటయ్య): -పల్లె చూ. గ్రామనా. ద్వి.

942. కోడికాండ్లపల్లె జమ్మ. 64+.

సంబ. నామబం; ? కుటుంబనామసూచి.

కోడికాండ్ల- గ్రామనా. ప్ర, ? < కోడి కండ్ల బోయల్లో ఇంటిపేరు. (CTSI. I See Boya) -పల్లె గ్రామనా. ద్వి.

943. కోడిగుడ్లపాడు బద్వే. 85+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

కోడిగుడ్ల - గ్రామనా. ప్ర; నామబం; కు.నా; (కోడిగుడ్లు + అ); -పాడు చూ. గ్రామనా. ద్వి.

**944. కోడిచిన్నాయపల్లె రాజం. 14+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

కోడి- గ్రామనా. ప్ర; కు.నా. పక్షి సూచి. ఒకపక్షి. Domestic fowl -చిన్నాయపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. చిన్నాయపల్లె.

**945. కోడూరు రాజం. 140.**

వర్యా. రైల్వే కోడూరు.

సంబ. నామబం; సామాన్యనామసూచి.

నైసర్గికనామసూచి (జలసూచి.)

కోడు- గ్రామనా. ప్ర; వాగు, నదిశాఖ. (DED, 1824) కోడు గ్రామమని ఆంధ్ర పద పారిజాతము; ఊరిదరి నీటి వల్లమని సూ.ని. కోడు; కల్, కొల్, కడల్, కలింగల్; కొరింగ; కొల్లు; కొలను, కులల్, కులం, కొలంకులు- ఈ పదాలన్నీ పరస్పర సంబంధం కలిగిన పదాలనీ- ఇవి ఒక మూల ధాతువు నుండి వచ్చిన వనీ- వీనికి సముద్రం. సరస్సు, నీరు అని అర్థాలనీ త్యాగరాజు. (IAHRS, 1945, 125). కోడు గ్రామనామ ప్రథమావయవంగానే కాకుండా, ద్వితీయావయవంగాకూడా ప్రయుక్త మవుతుంది. కడప గ్రామనామాల్లో - కోడు గ్రామనామ ద్వితీయావయవం కన్పించదు. తమిళ స్థలనామాల్లో ద్వితీయావయవంగా కని పించే కోడుకు కొండకొన అని అర్థమని పేతు పిళ్ళై. వివరాలకు చూ. విశ్వనాథరెడ్డి. 1966, 20. కోడూరు అని పేరు కలిగిన గ్రామనామ నైసర్గిక స్వరూప పరిశీలనను బట్టి కోడు జల సూచి అని తేలుతుంది. రాజంపేటకు చెందిన కోడూరు గుంజన వాగు ఒడ్డున వెలసింది. (APDGC, 762). చూ. ఆరో. 946-49. -ఊరు చూ. గ్రామనా. ద్వి.

**946. కోడూరు బద్వే. 74.**

[సకిలి పెదకోడూరు 1396, SII.XVI-16-7. పెదకోడూరు 1552 SII. XVI. 185-12. కోడూరు మెకం. 1170-47] చూ. ఆరో. 955.

ఈ గ్రామం సగిలేరు తీరానుంది:

**947. కోడూరు జమ్మ 25.**

[కోడూరు 1544 AR 1932-33 : B 365]. చూ. ఆరో. 945. ఈ గ్రామం పెన్న ఒడ్డున ఉంది.

**948. కోడూరు కమ. 31.**

చూ. ఆరో. 945. ఈ గ్రామం పాగేరు ఒడ్డునుంది.

**949. కోడూరువాండ్లపల్లె రాయ. 113+.**

సంబ. నామబం; కుటుంబనామ సూచి.

కోడూరువాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. కోడూరు- కు.నా; గ్రామనామసూచి. చూ. ఆరో. 945; -వాండ్ల- చూ. ఆరో. 9: -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**950. కోతులగుట్టపల్లె రాయ. 47+.**

సంబ. నామబం; స్థలనామసూచి.

కోతులగుట్ట- గ్రామనా. ప్ర; స్థలనా: జంతుసూచి కోతుల- స్థలనా. ప్ర. బహు. (<కోతి+లు) ఏక. కోతి ఒక జంతువు. Bonnet monkey, Macacaradiata పోల్చి చూ. తె. క్రోంతి, కోనంగి. త. కురంగు. మ. కురణ్ణన్. క. కొరంగి, కోతి (DED. 1473). -గుట్ట స్థలనా. ద్వి. ఎత్తయిన ప్రదేశం, చిన్న తిప్ప. చిన్నకొండ. సం. గోత్ర: శబ్దభవమని సూ.ని. పోల్చిచూ. క. గుడ్డ, గుడ్డు, గుడ్డె.

గుట్ట, గుద్దె. కొడ. గుడ్డె. తు. గుడ్డె. (DED. 1402). -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**951. కోదండరామాపురం కడ 47.**

[కోదండ రామాపుర మని - మెకం. 1229-16]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**కోదండరామా-** గ్రామనా. ప్ర; నామబం. పు. నా. దేవతాసూచి. [< సం. కోదండ + రామః] -పురం చూ. గ్రామనా. ద్వి.

**952. కోనంపేట రాయ. 34+.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**కోనం-** గ్రామనా. ప్ర; నామబం. స్త్రీ నా. కోన- కొండవాలులలో నీళ్లు ప్రవహించేచోటు పోల్చిచూ. తె. కుని. త. కోణు. మ. కోణ్. క. కోణ్. (DED 1894); -అం చూ. ఆరో. 1; -పేట చూ. గ్రామనా. ద్వి.

**953. కోనంకివాండ్లపల్లె రాయ. 116+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**కోనంకివాండ్ల-** గ్రామనా. ప్ర; నామబం; కోనంకి- కు. నా; పోల్చి చూ. తె; కోణంగి, కోడిగము, కోడిగీడు. త. కోట్టి, కోణంకి. మ. కోట్టి, గోష్ఠి క. కోటంకి మొ. (DED. 1830) -వాండ్ల- చూ. ఆరో. 2; దేవాంగుల్లో ఇంటిపేరు. (CTS1. 111. See Konangı); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**954. కోనయగారిపల్లె రాజం. 92+.**

సంబ; నామబం; వ్యక్తినామసూచి.

కోనయగారి- గ్రామనా. ప్ర; నామబం. కోనయ- పు. నా; నామబం. కోన. చూ. ఆరో. 952; -అయ చూ. ఆరో. 4; -గారి. చూ. ఆరో; 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి;

**955. కోనరాజుపల్లె పిద్ద 7+.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**కోనరాజు-** గ్రామనా- ప్ర; నామబం; పు.నా. కోన- చూ. ఆరో. 952. -రాజు చూ. ఆరో. 48; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**956. కోనరాజుపల్లె పిద్ద 56+.**

చూ. ఆరో. 955.

**957. కోనరాజుపల్లె బద్వే. 54+. ,,**

**958. కోనవారిపల్లె జమ్మ. 44.**

[కోనవారిపల్లె మెకం. 1169-84]

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**కోనవారి-** గ్రామనా. ప్ర; నామబం. కోన- కు. నా, వ్యక్తినామసూచి. చూ. ఆరో 952, 954. -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**959. కోన సముద్రం బద్వే. 140.**

[కోన సముద్రం మెకం. 1170 - 47]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**కోన-** గ్రామనా. ప్ర;వ్యక్తినా. చూ.ఆరో. 952, 954 -సముద్రం చూ. గ్రామనా. ద్వి.

సదాశివరాయల కాలంలో మండలేశ్వర కోన మహారాజుగారు గొప్ప చెరువు తవ్వించి నట్లు స్థానిక చరిత్ర. (మెకం. 1170-47).

**960. కోనా అనంతపురం జమ్మ. 17.**

[కోన అనంతపురం మెకం. 1118-117]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

కోనా- [< కోన-] గ్రామనా. ప్ర. కోన చూ. ఆరో. 954; -అనంతపురం గ్రామనా. ద్వి. చూ. ఆరో. అనంతపురం.

**961. కోనాపురం రాజం. 3.**

[కోనాపురం మెకం. 1134-341]
నంబ. నామబం; వ్యక్తినామసూచి.

కోనా- గ్రామనా. ప్ర; వ్యక్తినా: చూ. ఆరో. 959; -పురం చూ. గ్రామనా. ద్వి.

**962. కోనాపురం కమ. 40+.**

నామా. గోపాలపురం-[మెకం.1110-94.] చూ. ఆరో. 961. ఈ గ్రామం పేరు కోన పల్లె అని స్థానిక చరిత్ర. మెకం. 1110-94.

**963. కోనాయపల్లె కడ. 99.**

నంబ. నామబం. వ్యక్తినామసూచి.

కోనాయ- గ్రామనా. ప్ర; నామబం. కోన- చూ. 952, -అయ చూ. ఆరో. 4; -పేట చూ. గ్రామనా. ద్వి.

**964. కోనాయపల్లె ప్రొద్దు. 82+.**

[కోనయపల్లె మెకం. 1119 - 245]
చూ. ఆరో. 963.

**965. కోనేటిరాజుపల్లె రాజం. 141.**

నంబ. నామబం; వ్యక్తినామసూచి.

కోనేటిరాజు- గ్రామనా. ప్ర; నామబం: కోనేటి- (<కోనేరు+ఇ) పుష్కరిణి -రాజు చూ. ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**966. కోనేరువాండ్లపల్లె రాయ. 08+.**

నంబ. నామబం. కుటుంబనామసూచి.

కోనేరువాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. కోనేరు కు:నా. చూ. ఆరో. 965; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**967. కోమటికుంట కమ. 5+.**

నంబ. నామబం; కులనామసూచి.

కోమటి- గ్రామనా. ప్ర. ఒక కులం, వైశ్యులు. పోల్చిచూ. త. కొమట్టి. మ. కోమట్టి. క. కోమటి, కోమటిగె. తు. కోమటి. కోమటిగె. (DED. 1840) కోమటి శబ్ద వ్యుత్పత్తి చర్చల ధోరణలకూ వివరాలకూ చూ. (CTSI. III. See Komati). ప్రతాప రెడ్డి, రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక; 1950, 53-54, 121-122, 242, 322, 336-37; మూ.ని. -కుంట చూ. గ్రామనా. ద్వి.

**968. కోమటిపల్లె సిద్ధ. 54+.**

నంబ. నామబం; కులనామసూచి.

కోమటి- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 967; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**969. కోమటిపేట రాయ. 0+.**

నంబ. నామబం; కులనామసూచి.

కోమటి- గ్రామనా. ప్ర. చూ. 967; -పేట చూ. గ్రామనా. ద్వి.

**970. కోమన్నూతల పులి. 2.**

[కోమటి నూతల 1483 AR 1963-64; B 6]
నంబ. నామబం: కులసూచి.

కోమన్- గ్రామనా. ప్ర. (< కోమటి) చూ. ఆరో. 967; -నూతల చూ. గ్రామనా. ద్వి.

**971. కోరగుంటపల్లె పులి. 87+.**

నంబ. నామబం; స్థలనామసూచి.

కోరగుంట గ్రామనా. ప్ర: స్థలనా: సంబ నామబం. ? < కొరవగుంట; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

972. కోరవానిపల్లె పులి. 94+.
[కోరువానిపల్లె మెకం. 1180-155. కోరవారిపల్లె మెకం. 1119-10]
సంబ. నామబం; ? కులసూచి.

కోరవాని- గ్రామనా. ప్ర. నామబం. (కోరవాడు + ఇ) కోర- ? కొరవ ఌ కురవ ఆరో. 693; 918; 971; -వాని- చూ. ఆరో. 2. -పల్లె చూ; గ్రామనా. ద్వి.

973. కోలంకపల్లె రాయ. 16+.
అస్పష్టనామబంధం.

కోలంక- గ్రామనా. ప్ర. వ్యుత్పత్తి అస్పష్టము. ? కోనంకి-; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

974. కోలాడివాండ్లపల్లె రాయ. 84+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

కోలాడివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం; కోలాడి- కు; నా; -వాండ్ల- చూ. ఆరో. 2; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

975. కోవూరివాండ్లపల్లె రాజం. 78+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

కోవూరివాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. కోవూరి- కు. నా; నామబం. గ్రామనామసూచి. (కోవూరు + ఇ) కోవ్- క్రోవి, కోవి ఒకచెట్టు Gedupa indica . am Corallo carpus epigala Hook - Bryoma ep ae Rottler; cephalandra indica Nand=B grandis Linn Coccina indica W & A; glabra vent=G. indica Lam=G arborea Roxb.

పోల్చి చూ. త. కోవై, కొవ్వై, మ. కోవ. క. కోవె. సం. కురవకః శబ్దభవమని సూ.వి: -ఊరు గ్రామనా. ద్వి -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి. పోల్చి చూ- సంతకోవూరు.

976. కోవూరివాండ్లపల్లె రాయ. 78+.
చూ. ఆరో. 975.

977. క్రిష్ణంగారిపల్లె పులి. పులి+53.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

క్రిష్ణంగారి- గ్రామనా. ప్ర. నామబం. క్రిష్ణం- వ్యక్తినా; నామబం. దేవతాసూచి. క్రిష్ణ- [<సం. కృష్ణః] -అం చూ. ఆరో. 1; -గారి- చూ. ఆరో. 6; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

978. క్రిష్ణంపల్లె కడ 1+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
క్రిష్ణం- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 977;

979 క్రిష్ణంపల్లె రాజం. 80+.
చూ. ఆరో. 978.

980. క్రిష్ణంపల్లె రాజం. 104+.
[కృష్ణంపల్లె మెకం. 1223 - 138].
చూ. ఆరో. 978. కృష్ణారెడ్డి ఈ పల్లె కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1223-138).

981. క్రిష్ణంపల్లె బద్వే. 102+.
చూ. ఆరో. 978.

982. క్రిష్ణంపల్లె ప్రొద్దు 8+. ,,

983. క్రిష్ణంపల్లె ప్రొద్దు. 88+. ,,

984 క్రిష్ణనోమయాజు పల్లె కడ 45.
సంబ. నామబం. వ్యక్తినామసూచి.

క్రిష్ణసోమయాజులు- గ్రామనా. ప్ర పు.నా; నామబం. క్రిష్ణ- చూ. ఆరో; 977; సోమయాజులు- చూ. ఆరో. 485; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

985. క్రిష్ణమరాజుగారిపల్లె రాయ. 35.+
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

క్రిష్ణమరాజుగారి- గ్రామనా.ప్ర; నామబం. క్రిష్ణమరాజు పు.నా; నామబం; క్రిష్ణమ-క్రిష్ణం చూ. ఆరో; 977, -రాజు చూ. ఆరో. 49; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా.ద్వి.

986. క్రిష్ణయ్యగారిపల్లె రాయ 80+.
సంబ నామబం; వ్యక్తినామసూచి.

క్రిష్ణయ్యగారి- గ్రామనా. ప్ర; నామబం. క్రిష్ణయ్య- పు. నా; నామబం; దేవతా సూచి. క్రిష్ణ- చూ. ఆరో. 977; -అయ్య చూ. ఆరో. 4; గారి- చూ. ఆరో. 6, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

987. క్రిష్ణరాజుపల్లె రాయ 35+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

క్రిష్ణరాజు- గ్రామనా.ప్ర; పు.నా;నామబం. క్రిష్ణ- చూ. ఆరో. 977; -రాజు చూ. ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

988. క్రిష్టాపురం కడ. 55.
[కృష్ణాపురం మెకం, 1210 - 77, 1240-21.]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

క్రిష్టా [కృష్టా-] గ్రామనా: ప్ర; చూ. ఆరో. 977. -పురం చూ. గ్రామనా. ద్వి.

కృష్ణమ్మ అనేవాడు కట్టించినట్లు ఒకచోట (మెకం. 1210-77); వుప్పు కృష్ణప్ప అనే వాడు కట్టించినట్లు మరొకచోటా (మెకం. 1240-21) స్థానిక చరిత్రల్లో ఉంది.

989. క్రిష్టాపురం కడ. 71+.
చూ. ఆరో. 988.

990. క్రిష్టాపురం రాయ. 86+. ..

991. క్రిష్టాపురం ప్రొద్దు. 83+. ..

992. క్రిష్టారెడ్డికొట్టాల కడ. 7+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

క్రిష్టారెడ్డి- గ్రామనా. ప్ర; పు.నా; నామబం. క్రిష్టా- చూ; ఆరో. 988; -రెడ్డి చూ. ఆరో. 6; -కొట్టాల చూ. గ్రామనా. ద్వి.

993. ఖండ్రిక కమ. 64.
అసమస్తరూపం, జనపదసూచి. రూ. కండ్రిక. చిన్నపల్లె;

A large block of land granted as inam, less than a village but much larger than an ordinary inam (MAMP, 413).

పన్ను లేకుండా గుత్తకిచ్చిన భూఖండం. (శా. శ.) చూ. గ్రామనా. ద్వి.

994. ఖాజీపేట కడ. 7.
[ఖాజీపేట మెకం. 1240-92.]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

ఖాజీ- గ్రామనా. ప్ర. [ < ఉ. కాజీ] పోల్చిచూ. అర. కాజీ మేయరు, న్యాయకర్త. ఉ; కాజీ న్యాయకర్త, మునసబు. ప. కాజీ న్యాయవిర్ణేత. హిం. కాజీ ముస్లిం ధర్మాన్ని అనుసరించే న్యాయమూర్తి. -పేట చూ. గ్రామనా. ద్వి.

"The village of Khajipet is said to have been built by one Meerakhan, a captain in the army of one of the Nawabs of Cuddapah" (MDGC. 186).

**995. ఖాజీపల్లె సిద్ధ. 38+.**

సంబం. నామబం; వ్యక్తినామసూచి.

ఖాజీ- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 994; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**996. ఖాదర్‌ఖాన్‌కొట్టాల కడ. 60.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

ఖాదర్‌ఖాన్- గ్రామనా. ప్ర; పు. నా; నామబం. ఖాదర్. [ఉ.కాదిర్ శక్తిగలి, సర్వసమర్థుడు] పోల్చిచూ. ఉల్ కాదిర్. సర్వాంతర్యామి. ఖాన్- చూ. ఆరో. ఖాదార్ -కొట్టాల చూ. గ్రామనా. ద్వి.

**997. ఖాదర్‌పల్లె ప్రొద్దు. 66+.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

ఖాదర్- గామనా. ప్ర; చూ. ఆరో. 996; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**998. ఖాదరాబాదు జమ్మ. 79**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

ఖాదర్- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 996; -ఆబాదు చూ. గ్రామనా. ద్వి.

**999. గంగనపల్లె కడ. 87.**

[గంగనపల్లె 1606 AR 1938 : B 377; మెకం. 1210-48; 1240-29]
సంబ. నామబం. వ్యక్తినామసూచి.

గంగన- గ్రామనా. ప్ర. పు.నా; నామబం, దేవతాసూచి గంగ- గంగానది; జలసూచి గంగాదేవి [<సం.గంగా],-అన చూ.ఆరో. 3; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

గొల్లవారు గంగన కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1240-94).

**1000 గంగనపల్లె రాయ. 42+.**

చూ. ఆరో. 999.

**1001. గంగనపల్లె బద్వే. 29+.** ..

**1002. గంగనపల్లె పులి. 45+.** ..

**1003 గంగనబోయనపల్లె రాయ. 26+.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగన- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 999; -బోయనపల్లె చూ. గ్రామనా. ద్వి. చూ. ఆరో. బోయనపల్లె.

**1004. గంగన్నగారిపల్లె రాయ. 116+.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగన్నగారి గ్రామనా. ప్ర; నామబం; గంగన్న- పు నా. చూ. ఆరో. 999; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1005. గంగపేరూరు సిద్ధ. 49**

[గంగపేరూరు మెకం. 1170-55]
సంబ. నామబం; నైసర్గికనామసూచి (జలసూచి).

గంగ- చూ. ఆరో. 999. -పేరూరు. చూ. గ్రామనా. ద్వి. చూ. ఆరో. పెన్న పేరూరు.

భూమిలోంచి నీటిబుగ్గ ఉత్తర వాహినిగా ప్రవహిస్తున్నందువల్ల గంగ పేరూరు అని పేరొచ్చినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1170-55)

About a mile south of Pennar. In the name of the village some profess to trace the influence of the early-

Ganga dynasty in these parts; but it seems more probable that the names of Ganga Perur and its neighbour Penna Perur merely serve to mark the old association in the popular mind between Pennar and Ganges (Brackenbury, 19 , 240) "Some Scholars think that the name of the village reflects the association of the early Western Gangas of Talakad with these tracts The tanks within this village include Gangalacheruvu..." (APDGC, 751)

1006. గంగరాజపురం రాజం. 136.
[గంగరాజపురం మెకం. 1223-221; 1223 - 213]
సంబ నామబం; వ్యక్తినామసూచి.

గంగరాజ- గ్రామనా. ప్ర. పు.నా; నామబం. (గంగరాజు + అ) గంగ- [గఙ్గ- శే. రూ]. చూ. ఆరో. 999, -రాజ చూ. ఆరో. 49, -పురం చూ. గ్రామనా. ద్వి.

1007. గంగరాజుగారిపల్లె రాయ. 87+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగరాజుగారి- గ్రామనా. ప్ర; నామబం. గంగరాజు- చూ. ఆరో. 1006, -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1008. గంగరాజుపల్లె రాజం. 61+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగరాజు- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1006; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1009. గంగరాజుపోడు రాజం. 140+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగరాజు- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1006. -పోడు చూ. గ్రామనా. ద్వి.

1010. గంగవరం కమ. 20.
[గంగాపురం 1257 AR 1937-38 : B 23; 1541 SII. XVI. 123 - 10 గంగాపురం మెకం. 1229-33; గంగవరం మెకం 1229-12]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగ- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 999; -వరం [-పురం] చూ. గ్రామనా. ద్వి.

"గంగమ్మ అనే శక్తి ప్రాబల్యంగా వుండగా యీ గ్రామానికి గంగాపురం అనే నామం" కలిగినట్లు స్థానిక చరిత్ర (మెకం, 1229-33). ఒక పెదకంటిరెడ్డికి గంగాదేవి కలలో కన్పించి గ్రామ నిర్మాణం చేయమని చెప్పడంవల్ల కులదేవత అయిన గంగమ్మ పేరుతో ఆ రెడ్డి ఈ గ్రామాన్ని కట్టించినట్లు ఒక ఐతిహ్యం (గో. 36). పై రెండు ఐతిహ్యాలు లోక నిరుక్తికి నిదర్శనాలు. ఈశాన గురుదేవ ద్వారా గంగయ ఉప్పేశ్వర మహాదేవునికి ఇచ్చిన దానం కాబట్టి (1279 A. R 1937-38 B 23) ఇది వ్యక్తినామసూచిగా భావించాలి. లేదా పెన్నేరు ప్రక్కన ఈ గ్రామం ఉంది కాబట్టి నదిని గంగ అని వ్యవహరించడం సాధారణం గనుక జలసూచి అయినా అయి ఉండాలి.

1011. గంగవరంవాండ్లపల్లె రాయ. 13+.
[రూ. గంగారంవాండ్ల Topo. 1924: గంగారపువాండ్లపల్లె ము.వ.]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

గంగవరంవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. గంగవరం- కు.నా; గ్రామనామసూచి.

చూ. ఆరో. 1008; -వాండ్ల- చూ. ఆరో. 2 గంగవరం. పెడకంటి రెడ్లల్లో ఇంటిపేరు; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1012. గంగాదేవిపల్లె జమ్మ. 63+.
[గంగాదేవిపల్లె మెకం. 1119-59]

సంబ. నామబం; దేవతానామసూచి.

గంగాదేవి- గ్రామనా. ప్ర; దేవతానామం; స్త్రీనా; నామబం. గంగా- చూ. ఆరో. 999. -దేవి స్త్రీనా. అను దేవత [<సం. దేవీ]; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

గంగమ్మ దేవళం ఈ గ్రామంలో ఉండడం వల్ల గంగాదేవి పేర ఈ గ్రామం వెలసినట్లు స్థానిక చరిత్ర. మెకం. 1119-59.

1013. గంగాదేవిపల్లె పులి. 92+.
[గంగాదేవిపల్లె మెకం. 1119-284]

చూ. ఆరో. 1012. కురుముల నాగిరెడ్డి అనే పెడకంటి కాపు ఇంటి దేవత గంగమ్మ. అందువల్ల ఆయన గంగాదేవి పేర గ్రామ నిర్మాణం చేసినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1119-284)

1014. గంగాపురం జమ్మ. 34.
[గంగాపురం మెకం. 1180-162]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగా- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 999 -పురం చూ. గ్రామనా. ద్వి.

1015. గంగాయపల్లె కద. 35+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగాయ- గ్రామనా. ప్ర; పు.నా. నామబం. దేవతాసూచి. గంగ- చూ. ఆరో. 999; -అయ- చూ. ఆరో. 4, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1016. గంగాయపల్లె బద్వే 3.
చూ. ఆరో. 1015.

1017. గంగాయపల్లె ప్రొద్దు. 9+.
[గంగాయపల్లె మెకం. 1126-121]
చూ. ఆరో. 1015.

1018. గంగిరెడ్డిగారిపల్లె రాయ. 61+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగిరెడ్డిగారి- గ్రామనా. ప్ర; నామబం. గంగిరెడ్డి. పు.నా, నామబం. గంగి (గంగ + ఇ) చూ. ఆరో. 999 -ఇ. చూ. ఆరో. 22; -రెడ్డి చూ. ఆరో. 49, -గారి- చూ. ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1019. గంగిరెడ్డిగారిపల్లె రాయ. 115+.
చూ. ఆరో. 1018.

1020. గంగిరెడ్డిగారిపల్లే బద్వే. 49+. ..

1021. గంగిరెడ్డిగారిపల్లె బద్వే. 115+.
[గంగిరెడ్డిపల్లె మెకం. 1170-15]
చూ. ఆరో. 1018.

1022. గంగిరెడ్డిపల్లె కమ. 48+.
[గంగిరెడ్డిపల్లె మెకం. 1119-98]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

గంగిరెడ్డి- గ్రామనా. ప్ర; పు.నా. చూ. ఆరో. 1018; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

300 సంవత్సరాల క్రిందట కొడిదకాపు గంగిరెడ్డి అనే ఆయన ఈ గ్రామాన్ని కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1119-98)

1023. గంగులనారాయణపల్లె జమ్మ. 74+.
[గంగుల నారాయణపల్లె మెకం, 1118-55, గంగుల నారాయణపల్లె మెకం. 1180-56]

సంబ. నామబం; వ్య_క్తినామసూచి.

గంగుల- [గంగుల-] గ్రామనా. ప్ర, వ్య_క్తినా. బహు. (గంగుల + అ). -నారాయణపల్లె గ్రామనా. ద్వి. చూ. అరో. నారాయణపల్లె.

గంగడు, నారాయణ అనే గొల్లలు ఈ గ్రామాన్ని కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1118-55).

1024. గంగులయ్యగారిపల్లె కడ. 90+.
సంబ. నామబం; వ్య_క్తినామసూచి.

గంగులయ్యగారి- గ్రామనా.ప్ర;నామబం. గంగులయ్య- పు.నా; నామబం. (గంగుల+అయ్య) గంగుల- చూ.అరో. 1023; -అయ్య చూ.అరో. 4, -గారి- చూ. అరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1025 గంజికుంట ప్రొద్దు. 75+.
[గంజికుంట మెకం. 1126-87]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

గంజి- గ్రామనా. ప్ర. అన్నంవార్చిన పిళ్లు. పోల్చి చూ. త. కంజి క. గంజి / సం. కాంజికమ్, కాంజీ-, కాంచిక- (DED. 927) పద్మసాలెల్లో ఇంటిపేరు (CTSI. II. See Ganji) -కుంట చూ. గ్రామనా. ద్వి.

1026. గండికోట జమ్మ. 66.
[గండ్డికోట 1313 SII, X. 506-36. ఘండికోట 1514 SII IX 496, గండ్డికోట 1525 SII. XVI, 79-9, 10; 1526 Ibid 70-6; ఘండికోట సీమ 1525 ibid 78-9; ఘండికోట 1545 ibid 144-3; Ibid 163-11; 224-5, 6; ఘంటికోట 1547 ibid 163-7; గండికోట 1557 ibid 224-3; మెకం. 1121-12, 1169-21; 1180-1, గండికోట వరాహ. 1-30; రాయ. 30-35, రామరా; 280; మెకం. 1180-2. మె.]
సంబ. నామబం; సామాన్యనామసూచి. పర్వతసూచి.

గండి- [గండ్డి; ఘండ్డి; ఘండి; ఘంటి-] గ్రామనా. ప్ర; సందు, కొండలసందు, రంధ్రము, బిలము, కనుమ. పోల్చి చూ. తె. గంటు. గంటి. గంటిపడు. మ; కంటి, కోట. కండి. క. కండి, కిండ, గండి, కొడ, కండి. [మూలద్రా. *కణ్;ట్] వివరాలకు చూ.DED, 989. TVB, 361. శాసన రూపాలలోని గండ్డి; లే .రూ; ఘండ్డి; ఘండి; ఘంటి కృతకప్రామాణికరూపాలు- -కోట చూ. గ్రామనా. ద్వి.

"The gorge where the Pennar has cut it's way through sheer rugged cliffs of bedded sand stone some two or three hundred feet high is four miles long, and the height over looking the river on the South bank is crowned by extensive fortifications (MDGC., 191 )

భౌగోళికచారిత్రకవివరాలకుచూ. APDGC 749-71, MDGC. 191-194. F. F; 52-54; IG. IV. 393 - 94, MAMP, 334. ఈశ్వరదత్తు, 1963, 124; 126, శేషాద్రిశర్మ. 1930, 65.

1027. గండికోటపల్లె రాయ. 56+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

గండికోట- గ్రామనా. ప్ర; చూ. అరో. 1026. కమ్మవాళ్ళల్లో ఒకశాఖ; కాపుల్లో ఒక

కాళ (CTSI. II. See Gandikota). వైశ్యుల్లో ఇంటి పేరు. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1028. గండికోవూరు రాయ. 7.

[రూ. గండికొవ్వూరు. ముఖప.]
సంబ. నామబం; సామాన్యనామసూచి. పర్వతసూచి.

గండి- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 1026; -కోవూరు గ్రామనా. ద్వి. చూ. ఆరో. కోవూరు వాండ్లపల్లె.

1029. గండ్లూరు జమ్మ. 59.

[గండ్లూరు 1517 AR 1940-41 : B 428; గండూరు. మెకం. 1118-4; గండ్లూరు మెకం. 1169-84; 1180-162].
సంబ. నామబం. సామాన్యనామసూచి. పర్వతసూచి.

గండ్లు- [గండు-] గ్రామనా. ప్ర; బహు. (గండి+లు) చూ. ఆరో. 1026; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

Gandluru "is situated on the Madras-Bellary road about half a mile south of the confluence of Pennar and Chitravathi" (MDGC, 194). "Due to its Proximity to the confluence of the Chitravathi and the Penneru and the Gandikota hills with its narrow gorge, the village has suffered from floods on a number of occasions (APDGC 751).

1030. గంధంవారిపల్లె రాజం. 77+.

[గంధంవాండ్లపల్లె మెకం. 1223-144.]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

గంధంవారి- [గంధంవాండ్ల] గ్రామనా. ప్ర; నామబం. గంధం కు.నా. లేపన సువాసన ద్రవ్యం-[< సం. గంధః] -వారి- [-వాండ్ల-] చూ. ఆరో. 8; గంధం- బలిజల్లో ఇంటిపేరు. (CTSI. II, See Gandham) -పల్లె చూ. గ్రామనా. ద్వి. "గంధంవాండ్లు అనే కాపులు" ఈ గ్రామాన్ని కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1223-144.)

1031. గంధంవారిపల్లె రాజం. 137+.

[గంధంవారిపల్లె మెకం. 1223-95]
చూ. ఆరో. 1030. గంధంవాండ్లు అనే బలిజలు కట్టించినట్లు స్థానిక చరిత్ర.

1032. గజరాజువాండ్లపల్లె రాయ. 110+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

గజరాజువాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. గజరాజు- కు.నా; వ్యక్తినామసూచి. గజ- ఏనుగు [సం. గజః]; -రాజు- చూ. ఆరో. 49; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1033. గట్టుపల్లె సిద్ధ. 66+.

స్థలా. నామబం; స్థలాసూచి.

గట్టు- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 261; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1034. గట్టుమీదపల్లె రాజం. 112+.

[ఘట్టుమీదపల్లె రాజం. మెకం. 1134-338]
స్థలా. నామబం; స్థలాసూచి.

గట్టుమీద- [ఘట్టుమీద-] గ్రామనా. ప్ర; గట్టు- [ఘట్టు- కృ. ప్రా.] చూ. ఆరో. 261; -మీద, పైన పోల్చిచూ. తె. మింద (కడప మాండలికం); మీన్దు, మిన్ద (ప్రా.క.) వివరాలకు చూ. DED. 3966. పల్లె- చూ. గ్రామనా. ద్వి.

1035. గడికోట రాయ. 79.

స్థలా. నామబం; స్థలాసూచి.

గడి- గ్రామనా. ప్ర. పీమ, పొలిమేర, సరిహద్దు, మితి, మేర పోల్చు చూ. క. గడి; -కోట చూ. గ్రామనా ద్వి. పోల్చు చూ. గడి నాడు. (MAMP. 220).

"To the immediate north-west of the main village, on the left bank of the Mandavi are the ruins of a fort strategically located and is said to have been one of the strongholds of the Matli Chiefs" (APDGC. 749).

1036. గడియవాండ్లపల్లె రాయ.99+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

గడియవాండ్ల- గామనా. ప్ర; నామబం. గడియ కు. నా; వస్తుసూచి. రూ. గడె. గడి. గణె తలుపులు బంధించే కొయ్య లేక ఇనప కమ్మి (మాం. వృ. కో. IV), -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి..

1037. గడ్డంవాండ్లపల్లె రాయ. 6+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

గడ్డంవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం.

గడ్డం- కు.నా. పోల్చుచూ. త.కట్టు, కెట్టు, (<తె.) క. గడ్డ; గడ్డ. కొలా. గడ్డం. నాయి. గడ్డం. కొం. గడెంకు (బహు.) చూ. DBD. 970; -వాండ్ల- చూ. ఆరో. 2; గడ్డం- బోయ. పద్మసాలె, దేవాంగుల కులాలవాళ్ళల్లో ఇంటి పేరు (CTSI. II. See Geddam).

1038. గడ్డంవాండ్లపల్లె రాయ. 8+.

చూ. ఆరో. 1037.

1039. గడ్డంవారిపల్లె ప్రొద్దు. 88+.

[గడ్డంవానిపల్లె మెకం. 1126-120]

సంబ. నామబం; కుటుంబ నామసూచి.

గడ్డంవారి- [గడ్డంవాని- వర్యా]. గ్రామనా. ప్ర; నామబం. గడ్డం- చూ. ఆరో. 1037; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1040. గడ్డంవారిపల్లె కమ. 52+.

చూ. ఆరో. 1039.

1041. గడ్డమాయపల్లె ప్రొద్దు. 73.

సంబ. నామబం. వ్యక్తినామసూచి.

గడ్డమాయ- గ్రామనా. ప్ర; పు.నా. నామబం. గడ్డం. చూ. ఆరో. 1037. ఆయ. చూ. ఆరో. 4; బహుశా ఇది ఎగతాళి పేరేమో. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1042. గడ్డమీదపల్లె రాయ.117+.

స్థలా. నామబం; స్థలాసూచి.

గడ్డమీద- గ్రామనా. ప్ర; గడ్డ- చూ. ఆరో. 399; మీద చూ. ఆరో. 1034; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1043. గద్దలరేవుపల్లె రాజం. 118+.

సంబ. నామబం; స్థలనామసూచి.

గద్దలరేవు- గ్రామనా. ప్ర; స్తంబ. స్థలనామబం. జంతుసూచి. గద్దల- బహు. (<గద్దలు +అ) ఏక. గద్ద. పోల్చు చూ. తె. గ్రద్ద. కొలా. గద్ద. నాయి. గద్ద. పర్జి. గద్ద. గోం. గద / సం. గృధ్రమ్. పా. గద్ధ- ప్రా. గద్ధ- గిద్ధ- (DBIA. 83). -రేవు స్థలనా. ద్వి. చూ. గ్రామనా. ద్వి; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1044. గరిపెలూరు ఖమ్మ. 102.
[గరిశలూరు మెకం. 1180 - 165; 1204-123].
నంబ. నామబం; సామాన్యనామసూచి; వస్తుసూచి.

గరిపెలు- గ్రామనా. ప్ర; బహు. గాదెలు, కొణకలు. ఏక- గరిసె. పోల్చిచూ. త. కరచై, కరిచై (తె) క. గరసె, గెరసె/ ? పా. కరీసా- (DED. 1057). -ఊరు చూ. గ్రామనా. ద్వి.

1045. గరుగుపల్లె రాయ. 23+.
నంబ. నామబం; సామాన్యనామసూచి. భూసూచి.

గరుగు- గ్రామనా. ప్ర; గరుగు నేల. ఇసుక, సన్నగులక కలిసిననేల. చూ. ఆరో. 581; -పల్లె చూ. గ్రామనా. ద్వి:

1046. గరుగుపల్లె రాజం. 26+.
చూ. ఆరో. 1045.

1047. గల్లావాండ్లపల్లె ప్రొద్దు. 86+.
నంబ. నామబం; కుటుంబనామసూచి.

గల్లావాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. ? DBIA 4. క. గల్ల, గల్లె చెక్కిలి. కొడ. గల. తు. గల్ల. తె. గల్లము. పెం. గల. కుయి. గడ; కువి. గల మొ. గల్ల - CDIAL 4089. (JAOS 92.4. 478) గల్లా - కు.నా; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1048. గాండ్లతిమ్మాయపల్లె బద్వే. 113+.
నంబ. నామబం; కులనామసూచి.

గాండ్ల- గ్రామనా. ప్ర; ఒక కులం; గానుగాడి నూనెతీయడం, అమ్మడం వృత్తిగా గల ఒక కులం. గానుగ శబ్దభవ మని కొందరు. (MAMP, 304; CTSI,II. See Gandla) -తిమ్మాయపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. తిమ్మయపల్లె పోల్చి చూ. చలి. తిమ్మాయపల్లె.



1049 గాండ్లపల్లె రాయ. 27+.
నంబ. నామబం; కులనామసూచి.

గాండ్ల. గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1048. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1050. గాండ్లపల్లె రాయ. 63+.
చూ. ఆరో. 1049.

1051. గాండ్లపల్లె రాయ. 100+. ,,

1052. గాండ్లపల్లె రాయ. 106+. ,,

1053. గాండ్లపల్లె సిద్ధ. 15+. ,,

1054. గాండ్లపల్లె సిద్ధ. 54+. ,,

1055. గాండ్లపల్లె సిద్ధ 65+. ,,

1056. గాండ్లవాండ్లపల్లె రాయ. 104+.
నంబ. నామబం; కులనామసూచి.

గాండ్లవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. గాండ్ల- చూ. ఆరో. 1049; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1057. గాండ్లవారిపల్లె రాయ. 44+.
నంబ. నామబం. కులనామసూచి.

గాండ్లవారి- గ్రామనా. ప్ర; నామబం. గాండ్ల- చూ. ఆరో. 1049. -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1058. గాజులపల్లె రాయ. 103+.
నంబ. నామబం; కులనామసూచి.

గాజుల- గ్రామనా. ప్ర; ఒక కులం;

గాజులు తయారుచేయడం, అమ్మడం వృత్తిగా గల ఒక కులం. బలిజెలు, కాపులు, తొరె యల్లో ఒక శాఖ; గాజుల బలిజె (CTSI, I. See Balija; III, Gājula) [<సం. కాచః] -పల్లె గ్రామనా. ద్వి.

1059. గాజులపల్లె పిద్ధ. 71+.
చూ. ఆరో. 1058.

1060. గాజులపేట రాయ. 10+.
సంబ. నామబం; కులనామసూచి.

గాజుల- చూ. ఆరో. 1058; -పేట చూ. గ్రామనా. ద్వి.

1061. గాజులపేట రాయ. 37+.
చూ. ఆరో. 1060.

1062. గాదివాండ్లపల్లె రాజం. 131+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

గాదివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. గాది-కు.నా. వస్తుసూచి. గరిసె, తడికలతోగాని చువ్వలతోగాని అల్లి ధాన్యం నిలవ చేయడానికి వాడే నిర్మాణం. రూ. గాజ, గాదె (మాం. వృ. కో.,I V). పోల్చిచూ. తు. కదికె. పర్జి. కుని. గద్దె. హల్బి. గదిమె (DEDప 5151.); -వాండ్ల- చూ. ఆరో, 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1063. గాదెల రాజం. 132.
[గాదెల మెకం. 1223-121; గాదేలా మెకం. 1223-120].
అస్పష్టనామబంధం.
? <గాదె+అల. వ్యుత్పత్తి అస్పష్టం.

1064. గాదెగూడూరు ప్రొద్దు. 24+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

గాదె- గ్రామనా. ప్ర. కు. నా. చూ. ఆరో. 1062; గూడూరు- గ్రామనా. ద్వి పోల్చిచూ. అంకాలమ్మ గూడూరు. కాన గూడూరు.

1065. గానుగపెంట బద్వే. 107.
స్థలా. నామబం. వృక్షసూచి.

గానుగ- గ్రామనా. ప్ర, ల కానుగ Indian beech tree, Pongamia glabra, పోల్చిచూ. క. కానగు -పెంట చూ. గ్రామ నా. ద్వి. పెంట గ్రామనామ ద్వితీయావయ వంగా గల గ్రామనామాలు సాధారణంగా అడవి ప్రాంతాల్లో ఉంటాయి. వాటి ప్రథమావయవం వృక్షసూచిగానో జంతుసూచిగానో ఉండడం గమనించవచ్చు.

1066. గారాలమడుగు రాజం. 82.
[గారాల మడుగు మెకం. 1223-57; గారాల మడ్గు మెకం. 1223-56],
సంబ. నామబం; వృక్షసూచి.

గారాల- గ్రామనా. ప్ర.(<గారలు + అ) ఏక. గార ఒక రకం చెట్టు- రూ. కారు - నల్ల రేగడి నేలల్లో 20 అడుగులు ఎత్తు ఎదిగే కంచె మొక్క Balanites aegyptiaca (మాం.వృ. కో-I). -మడుగు చూ. గ్రామనా. ద్వి.

గారలగుట్ట అనే అనే శాసన రూపానికి వ్యుత్పత్తి చెపుతూ గార అంటే ఒక రకం చేప అని రాధాకృష్ణ (ప్రా. శా.) గారల వృక్ష సూచే కాని మత్స్యవాచకం కాదు. పోల్చి చూ. ఆరో. 1067

1067. గార్లమిట్టపల్లె కమ. 35+.
సంబ. నామబం; స్థలనామసూచి.

గార్లమిట్ట- గ్రామనా. ప్ర; సంబ. స్థలనా; వృక్షసూచి, బహు. గార్ల-(<గారలు + అ)

చూ. ఆరో. 1066; -మిట్ట. స్థలనా. ద్వి. చూ. గ్రామనా. ద్వి. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1068. గాలంగుండ్లపల్లె రాయ. 36+.**

సంబ. నామబం. కుటుంబనామసూచి.

**గాలం-** గ్రామనా. ప్ర; కు.నా; -**గుండ్లపల్లె** గ్రామనా. ద్వి. పోల్చి. చూ. ఆరో. 1088.

**1069. గాలావారిపల్లె రాజం. 91+.**

[గాలావారిపల్లె మెకం. 1223-17]

సంబ. నామబం; కుటుంబనామ సూచి.

**గాలావారి-** గ్రామనా. ప్ర; నామబం. గాలా- కు. నా; -వారి- చూ. ఆరో. 8; గాలా రెడ్లల్లో ఇంటిపేరు; -పల్లె చూ. గ్రామనా.

"గాలి యెల్లప్ప అనే బలిజవాడు పల్లె కట్టించి"నట్లు స్థానిక చరిత్ర (మెకం. 1223-17), గాలా నాగిరెడ్డి కట్టించినట్లు అదే కైఫీయతులో ఉంది. (మెకం. 1223-42).

**1070. గాలివారిపల్లె కడ. 14+.**

సంబ. నామబం. కుటుంబనామసూచి.

**గాలివారి-** గ్రామనా. ప్ర; నామబం. గాలి- కు.నా. -వారి- చూ. ఆరో. 8; గాలి కమ్మ, కురుబ మాలల్లో ఇంటిపేరు (CTSI II; See Gali). -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1071. గాలివీడు రాయ. 26.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**గాలి-** చూ. ఆరో. 1070, -**వీడు** చూ. గ్రామనా. ద్వి.

"Some traces of an old fort can still be seen to the south of the village, recalling the earlier association of the place with Palegars." (APDGC. 749)

**1072. గిద్దంకిపల్లె పులి. 29+.**

[రూ. గాదంకపల్లె TSM. 1953.]

అస్పష్టనామబంధం.

**గిద్దంకి-** వ్యుత్పత్తి అస్పష్టనామబం. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1073. గిరిజమాంబాపురం రాజం. 30.**

[గిరిజమాంబాపురం మెకం. 1223-217.]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**గిరిజమాంబా-** గ్రామనా. ప్ర; స్త్రీనా. నామబం. (గిరిజ+అమ+అంబా) గిరిజ- [<సం. గిరిజా పార్వతి] -అమ చూ. ఆరో. 1; -అంబా- చూ. ఆరో. 11; -పురం చూ. గ్రామనా. ద్వి.

"శివరాయని భార్య గిరియమ్మ" కట్టించినట్లు స్థానికచరిత్ర. (మెకం. 1223-217).

**1074. గుంటరాచపల్లె రాయ. 105+.**

సంబ. నామబం; స్థలాసూచి. జలసూచి.

**గుంట-** గ్రామనా. ప్ర; చూ. ఆరో. 644; -రాచపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రాచపల్లె.

**1075. గుంటరాచపల్లె రాయ. 110+.**

చూ. ఆరో. 1074.

**1076. గుంటకాడపల్లె సిద్ధ. 56+.**

స్థలా. నామబం; స్థలాసూచి.

**గుంటకాడ-** గ్రామనా. ప్ర; గుంట- చూ. ఆరో. 644 -కాడ. చూ. ఆరో. 417; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1077. గుంటిమడుగు రాయ. 48.**

సంబ. నామబం; సామాన్యనామసూచి.

**గుంటి-** గ్రామనా. ప్ర; దున్నడానికి వీటి

1357. చిన్నాయపల్లె బద్వే. 57
చూ. ఆరో. 1355.

1358. చిన్నవాండ్లపల్లె రాయ 76+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

చిన్నవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. చిన్న- కు.నా. చూ. ఆరో. 1295; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె గ్రామనా. ద్వి.

1359. చిన్నవారిపల్లె సిద్ధ. 65+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

చిన్నవారి- గ్రామనా. ప్ర; నామబం. చిన్న- కు.నా. చూ. ఆరో. 1358; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1360 చియ్యపాడు ప్రొద్దు. 66.
[చియ్యపాడు మెకం. 1119-244.]
? సంబ. నామబం: మతసూచి.

చియ్య- గ్రామనా. ప్ర; ? < జియ్య శైవసన్యాసి; శ్రీ వైష్ణవ సన్యాసి; వైష్ణవదేవాలయాధికారి; తంత్రి; దేవుడు; రాజు పోల్చిచూ. తె. జియ్యరు; జియ్య. త. జీయ<సం. దివ్యః లేదా జీవః (ప్రా.శా.); -పాడు చూ; గ్రామనా. ద్వి.

1361. చియ్యవరం రాజం. 141.
సంబ. నామబం; మతసూచి.

చియ్య- గ్రామనా. ప్ర; చూ. ఆరో.1360; -వరం చూ. గ్రామనా. ద్వి.

1362. చిర్రాజుపల్లె కమ. 6+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

చిర్రాజు- గ్రామనా. ప్ర. నామబం. పు.నా. (<చిన్న+రాజు) చిన్న చూ. ఆరో. 1295; -రాజు చూ. ఆరో. 49; వర్ణసమీకరణంవల్ల చిర్రాజు. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1363. చిలకపాటివాండ్లపల్లె రాయ.70+.
సంబ. నామబం. కుటుంబనామసూచి.

చిలకపాటివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. చిలకపాటి- కు. నా. నామబం. (చిలకపాడు+ఇ), చిలక- ల చిలుక- పోల్చి చూ. త. కిళి, కిళ్లై. మ. కిళి. క. గిళి, గిణి పర్జి. కిల్. మె. (DED. 1318). -పాటి (<పాడు +ఇ) చూ. గ్రామనా. ద్వి. -వాండ్ల- చూ. ఆరో. 2, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1364. చిలకపాటివాండ్లపల్లె రాయ.82+.
చూ. ఆరో. 1363.

1365. చిలమకూరు కమ. 6.

[చిఱుంబూరి 576 - 600 E I. 27 - 225-6; SII. X. 607. చిఱుంబూరు 700-25 E I. 27. 236-238-7. 8. సిఱుమూర 925 50, SII-X 10. 593-5; చిఱుమకూరు 1382 SII. XVI. 6-14, 15, 20 : 404; ముత్యాల చిల్మకూరి 1509 AR 1905: 462; చిలుమ అగ్రహార- 1623 APGRE 1965 ; B 81; చిరమకూరు మెకం. 1111 - 140; చిలమకూరు మెకం. 1111-146; 1229-100; చిల్మకూరు మెకం; 1119-246; ముత్యాల చిలమకూరి- మెకం. 1111-143; చెలమకూరు మెకం. 1119-1].

వి. బం; పరిమాణసూచి.

చిలమ- [చిఱుంబు-; సిఱుము-; చిఱుమ-; ముత్యాల చిల్మ; చిలుమ-, చిరమ-; చిలమ-]

గ్రామనా. ప్ర. వి. చిఱుంబు చిన్న. పోల్చిచూ. చిఱుత; చిఱుతుక మొ. త. చిఱు. క. కిఱు. తు. కిరి. కిరు; మొ.

మూలద. ద్రా కిఱు వివరాలకు చూ. DED. 1326; BSOAS 11.123. ఱ<ర<ల; సంధి గత కుగాగమం గమనార్హం; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

'ముత్యాల చిలమకూరు' అని పేరు వచ్చి నట్లు స్థానిక చరిత్ర- మెకం. 1111-143. లో. వి: చెలమకూరు.

**1366. చిలుమూరుకొత్తపల్లె కడ. 35+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**చిలుమూరు-** గ్రామనా. ప్ర. అస్పష్టనామ బంధం. కు.నా; చూ. -కొత్తపల్లెచూ. ఆరో; కొత్తపల్లె.

**1367. చిలేకాంపల్లె రాయ. 9.**

[చిలేకాంపల్లె మెకం. 1119-159]; అస్పష్టనామబంధం.

? చిలే- గ్రామనా.ప్ర. వ్యుత్పత్తి అస్పష్టం; -కాంపల్లె గ్రామనా.ద్వి. చూ.ఆరో. కాంబల్లె.

**1368. చిల్లావాండ్లపల్లె రాజం. 26+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**చిల్లా-** కు. నా. వృక్ష సూచి. చిల్లచెట్టు, Strychnos Potatorum Linn., పోల్చిచూ. త; ఇక, ఇల్లం. ఇల్లి, ఇలవు. చిల్లం. క. చిల్ల, చిల్లు, చిత్తు, చలి. (DED. 2108); -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామ నా. ద్వి.

**1369. చిల్లావాండ్లపల్లె బద్వే. 107+.**

చూ. ఆరో. 1368.

**1370. చీకటిపల్లె రాయ. 106+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**చీకటి-** గ్రామనా. ప్ర. కు. నా. పోల్చి చూ. కొలా, చీకటి పర్జి. చీకొడ్. గ. సీకట్. గోం. సికాటి కొం. సికటి. (DED. 2144); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1371. చీకటివాండ్లపల్లె రాయ. 84+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**చీకటివాండ్ల-** గ్రామనా. ప్ర; నామబం. చీకటి- కు.నా. చూ. ఆరో. 1370; చూ. ఆరో. 2; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

**1372. చీకటివారిపల్లె బద్వే. 51+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**చీకటివారి-** గ్రామనా. ప్ర; నామబం. చీకటి- కు.నా. చూ. ఆరో. 1370; -వారి- చూ; ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1373. చీనేవాండ్లపల్లె రాయ. 110+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**చీనేవాండ్ల-** గ్రామనా. ప్ర; నామబం. చీనే- కు;నా. వ్యుత్పత్తి అస్పష్టం. ? <శీనయ్య కృ. ప్రా. రూపం కావచ్చు; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1374. చీమలచెరువు రాయ. 31+.**

సంబ. నామబం; జంతుసూచి.

**చీమల-** గ్రామనా. ప్ర; బహు. (చీమలు + అ) ఏక. చీమ. పోల్చి చూ. కొలా. పిమె. నాయి. శిమ. కువి. పీమ / సం. సీమికా. -చెరువు చూ. గ్రామనా. ద్వి.

1375. చీమలచెరువుపల్లె రాయ. 31+.
సంబ. నామబం; గ్రామనామసూచి.
చీమలచెరువు- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 1374; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

1376. చీమలపెంట కడ. 105.
[చీమల పెంట 1530 AR 1938-39 : B 335].
సంబ. నామబం; జంతుసూచి.
చీమల- గ్రామనా. ప్ర; చూ. ఆరో.1374; -పెంట చూ. గ్రామనా. ద్వి.

1377. చుంచువారిపల్లె రాజం. 132+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
చుంచువారి- గ్రామనా. ప్ర; నామబం. చుంచు- కు.నా. చూ. చుంచురాయి, చూరు బండ (మాం. వృ. కో. IV) పోల్చి చూ. తె. చుంచుమిద్దె; క. చుంచు. (DED. 2179). -వారి- చూ. ఆరో. 8. -పల్లె చూ. గ్రామ నా. ద్వి.

1378. చుండుపల్లె రాయ. 106.
సంబ. నామబం. కుటుంబనామసూచి.
చుండు- గ్రామనా. ప్ర; కు. నా. ఉప్పు పరిచినట్లు నెత్తిన వచ్చే ఒక వ్యాధి. పోల్చి చూ. త. చుంటు. క. జొండు (DED. 2188) -పల్లె చూ. గ్రామనా. ద్వి. చుండు- ఎండి పోవు (to dry up) అని MAMP. 766.

1379. చుండువారిపల్లె రాజం. 90+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
చుండువారి- గ్రామనా. ప్ర; నామబం. చుండు- చూ. ఆరో. 1378; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ, గ్రామనా. ద్వి.

1380. చుక్కావాండ్లపల్లె రాయ.26+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
చుక్కావాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. చుక్కా- కు.నా; -వాండ్ల- చూ.ఆరో.2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1381. చెంగల్‌రాజుపల్లె రాజం.140+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెంగల్‌రాజు- గ్రామనా. ప్ర; పు.నా; నామబం; చెంగల్- ఌ చెంగలువ (చెన్+ కలువ) చెన్- చూ. ఆరో. 1388; వ్యక్తినామ ప్రథమావయంలో కన్పించే చెంగ, చెంగల్ రూపాలు చెంగలువ రూపానికి సంబంధించి నవే. -రాజు- చూ. ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1382. చెంచయ్యగారిపల్లె బద్వే. 45+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెంచయ్యగారి- గ్రామనా. ప్ర; నామబం. చెంచయ్య పు. నా. నామబం. (చెంచు + అయ్య) చెంచు- చెంచుడు, చెంచువాళ్లు కర్నూలు, నెల్లూరు, చిత్తూరు అడవుల్లో అటవీప్రాంతల్లో నివసించే ఒక గణం. చెంచుల దేవత ఓబలేశుడు (CTSI. II, See Chenchu) కాబట్టి వ్యక్తినామాలు అగణ సూచకాలుగా ఏర్పడినాయి. పోల్చిచూ. తె. చెంచెత; చెంచిత క. చంచ, చంచు (DED. 1889). -అయ్య చూ. ఆరో. 4; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1383. చెంచుగారిపల్లె పిద్ద. 52+.
[చెంచుగారిపల్లె మెకం. 1170-64]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెంచుగారి- గ్రామనా. ప్ర; నామబం.

చెంచు- పు.నా. చూ. ఆరో. 1382; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1384. చెంచుపల్లె ప్రొద్దు. 43+.
సంబ; నామబం; వ్యక్తినామసూచి.
చెంచు- గ్రామనా. ప్ర. చూ.ఆరో. 1383. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1385. చెంచురెడ్డిగారిపల్లె రాయ 51+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెంచురెడ్డిగారి- గ్రామనా. ప్ర; నామబం. చెంచురెడ్డి- పు.నా: నామబం; చెంచు- చూ. ఆరో. 1382; -రెడ్డి- -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1386. చెంచురెడ్డిగారిపల్లె రాయ. 95+.
చూ. ఆరో. 1385.

1387. చెండువాయి సిద్ధ. 26.
[చెందువాయి మెకం. 1170-80]
అస్పష్టనామబంధం.
చెండు- గ్రామనా. ప్ర. వ్యుత్పత్తి అస్పష్టం. ? <చంద్ర ।ఒకపాటి ఎత్తయిన ముళ్లచెట్టు; Acacia Sundra, D., Mimosa Sundra, Roxb. -వాయి చూ.గ్రామనా.ద్వి.

1388. చెన్నంపల్లె కమ. 17+.
[చెన్నంపల్లె మెకం. 1110-35]
నామా. గుండుగారిపల్లె.
సంబ. నామబం. వ్యక్తినామసూచి.
**చెన్నం-** గ్రామనా. ప్ర; నామబం. చెన్ను ఌ చె-, చెం- కెం- అందం. కాంతి; ఎర్రని. పోల్చిచూ. తె. చెన్నుఁడు, చెన్నారు. త. చె-, చెం-, చెయ్య, చెవ్వ మొ; మ. చె-, చెం-, చేయ. క. కె-, కెం-, మొ. [మూలద్రా. *కెన్- : *కే-] వివరాలకు చూ. DED. 1607. -అం- చూ.ఆరో.1; -పల్లె చూ.గ్రామనా.ద్వి.
"చెన్నగురప్ప అనేకావు కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1110-35) నామా: వాడుకలో వ్యాప్తి తక్కువ.

1389. చెన్నంపల్లె బద్వే. 135.
చూ. ఆరో. 1388.

1390. చెన్నకేశవాపురం బద్వే. 73.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెన్నకేశవా- గ్రామనా. ప్ర; వ్యక్తినా. చెన్న- చూ. ఆరో. 1388. -కేశవా- చూ. ఆరో. 716. -పురం చూ. గ్రామనా. ద్వి.

1391. చెన్నక్రిష్టాపురం బద్వే. 108+.
[చన్నకృష్ణాపురం మెకం. 1170-30]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెన్నక్రిష్టా- [చన్నకృష్ణా-] గ్రామనా. ప్ర; వ్యక్తినా. చెన్న- చూ. ఆరో. 1390; -క్రిష్టా- చూ. ఆరో. 988; -పురం చూ. గ్రామనా. ద్వి.

1392. చెన్నమనేనిపల్లె జమ్మ. 49.
[చన్నమనేనిపల్లె మెకం. 1169-84]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెన్నమనేని- [చన్నమనేని-] గ్రామనా. ప్ర; పు.నా; నామబం. చెన్నమ- (<చెన్నమ్మ) చూ. ఆరో. 1388; -నేని- చూ. ఆరో. 101; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1393. చెన్నమరాజుపల్లె కడ. 97.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెన్నమరాజు- గ్రామనా. ప్ర; పు.నా:

నామబం; చెన్నమ- చూ.ఆరో. 1392; -రాజు- చూ. ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1394.** చెన్నమరెడ్డిపల్లె కడ. 82+.
[చెన్నమరెడ్డిపల్లె మెకం. 1210-63]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

చెన్నమరెడ్డి- గ్రామనా. ప్ర; పు.నా; నామబం. చెన్నమ- చూ. ఆరో. 1392; -రెడ్డి చూ.ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1395.** చెన్నమసెట్టిపల్లె రాయ. 106+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

చెన్నమసెట్టి- గ్రామనా. ప్ర; పు.నా; నామబం. చెన్నమ- చూ.ఆరో. 1392; -సెట్టి చూ. ఆరో. 751; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1396.** చెన్నమాంబాపురం రాజం. 78
[చంన్నమాంబాపురం అగ్రహారం, చెన్నమాంబాపురం అగ్రహారం మెకం. 1223-120-121, చిన్నమాంబాపురం, చెన్నమాంబాపురం మెకం.1223-147]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

చెన్నమాంబా- [లే.రూ. చంన్నమాంబా- చిన్నమాంబా-] గ్రామనా. ప్ర; స్త్రీనా; నామబం; చెన్నమ- చూ. ఆరో. 1392; అంబా- చూ. ఆరో. 11. -పురం చూ. గ్రామనా. ద్వి.

**1397.** చెన్నముక్కపల్లె కడ. 18.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

చెన్నముక్క- గ్రామనా. ప్ర; నామబం. (<చెన్నమక్క-) చెన్నమ- చూ.ఆరో.1392; -అక్క చూ.ఆరో. 11; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1398.** చెన్నముక్కపల్లె రాయ. 91.
చూ. ఆరో. 1397.

**1399.** చెన్నయ్యగారిపల్లె రాజం. 47+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

చెన్నయ్యగారి- గ్రామనా. ప్ర; నామబం; చెన్నయ్య- పు.నా; నామబం. చెన్న- చూ. ఆరో. 1388; -అయ్య చూ. ఆరో. 4; -గారి- చూ. ఆరో. 6. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1400.** చెన్నయ్యగారిపల్లె రాజం. 92+.
చూ. ఆరో. 1399.

**1401.** చెన్నయ్యగారిపల్లె సిద్ధ. 61+.
చూ. ఆరో. 1400.

**1402.** చెన్నరాజుపోడు రాజం. 131+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

చెన్నరాజు- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. చెన్న- చూ. ఆరో. 1388; -రాజు- చూ. ఆరో. 49. -పోడు చూ. గ్రామనా. ద్వి.

**1403.** చెన్నరాయసముద్రం రాజం. 23.
పర్యా. చెన్నరాయసముద్ర అగ్రహారం; కొండూరు చెన్నరాయసముద్రం.
[చన్రాయసముద్రం అగ్రహారం శ్రోత్రియం మెకం. 1134-194]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

చెన్నరాయ- [చన్రాయ-] గ్రామనా. ప్ర; నామబం; పు.నా. చెన్న- చూ. ఆరో. 1388; -రాయ ‹ రాయడు ప్రభువు [సం. రాజన్]; -సముద్రం చూ. గ్రామనా. ద్వి.

**1404.** చెన్నరాయసముద్రం రాజం. 31.
[చెన్నరాయసముద్రం మెకం. 1223-214; చన్నరాయసముద్రం మెకం. 1223-215] చూ. ఆరో. 1403.

1405. చెన్నవరం బద్వే. 35+.
[చెంన్నవరాన- 1525 SII. XVI. 79-13]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెన్న- గ్రామనా. ప్ర; వ్యక్తినా. చూ. ఆరో. 1388; -వరం చూ. గ్రామనా. ద్వి.

1406. చెన్నవరం సిద్ధ. 70+.
చూ. ఆరో. 1405.

1407. చెన్నారెడ్డిపల్లె కమ. 56+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెన్నారెడ్డి- గ్రామనా. ప్ర; నామబం. పు.నా. చెన్నా ల చెన్న చూ. ఆరో. 1388. -రెడ్డి చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా.ద్వి.

1408. చెన్నారెడ్డిపల్లె కమ. 60+.
చూ. ఆరో. 1407.

1409. చెన్నారెడ్డిపల్లె జమ్మ. 124+.
[చెన్నారెడ్డిపల్లె మెకం. 1119-263]
చూ. ఆరో. 1408.

1410. చెన్నారెడ్డిపల్లె బద్వే. 23+;
చూ. ఆరో. 1409.

1411. చెన్నారెడ్డిపేట బద్వే. 80.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెన్నారెడ్డి- గ్రామనా, ప్ర; నామబం; పు, నా. చూ. ఆరో. 1407; -పేట చూ. గ్రామనా. ద్వి.

1412. చెన్నుపల్లె బద్వే. 1.
సంబ. నామబం. వ్యక్తినామసూచి.
చెన్ను- గ్రామనా. ప్ర; పు. నా. చూ. ఆరో. 1388. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1413. చెన్నూరు కడ. 30.
[చెనూరి సీమె. 1514 SII. II-2-495; చెఱునూరి అకపావి-1382 SII. XVI-6-29, 30. చెనూఁరినగర 1525 SII. XVI- 77-69; చెనూఁరి 1525 SII. XVI- 77-105, చెరునూరు సీమ 1540 AR 1940-41 ; B 325; చెనూఁరిసీమ 1554 SII. XVI- 195-6; చెంనూరి 1605 SII. XVI- 309 - 5. కురువ చెన్నూరికా- 1628 T.T.D.I. VI. 1. 25-15-15; చెన్నూరు మెకం. 1240-63. నామా. ఉదకశయ గ్రామ. 1259 AR 1905 : B 327].
సంబ. నామబం; సామాన్యనామసూచి. జలసూచి.
చెన్ను- [చెఱును;చెనున్;చెన్-;చేరును-; చెన్ను-] గ్రామనా. ప్ర. ? < చెరువు + ను -ఊరు చూ. గ్రామనా. ద్వి.

1414. చెన్నేపల్లె సిద్ధ. 23+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
చెన్నే- గ్రామనా. ప్ర; నామబం. పు, నా. (చెన్న+ఏ) చెన్న- వ్యక్తినా. ప్ర; చూ. ఆరో. 1388; -ఏ చూ. ఆరో.4. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1415. చెమర్తివాండ్లపల్లె రాయ. 81+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
చెమర్తివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం: చెమర్తి- కుటుంబనా. ( < చామర్రు + తి) -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1416.** చెముడూరు బద్వే. 135+.

సంబ. నామబం. వృక్షసూచి.

చెముడు- గ్రామనా. ప్ర; ల జెముడు. ఒక కంచెమొక్క; Opuntia dillenii How. తెం. సింహుండః శబ్దభవమని సూ. వి. పోల్చి చూ. విశాఖజిల్లాలోని చెముడు. milk hedge, euphorbia tirucalli, Linn (MAMP, 144). -ఊరు చూ. గ్రామనా. ద్వి.

**1417.** చెముళ్ళపల్లె కడ. 17.

సంబ. నామబం. వృక్షసూచి.

చెముళ్ళ- గ్రామనా. ప్ర; (<చెముడు + లు + అ) చూ. ఆరో. 1416. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1418.** చెమ్మూమియాపేట కడ. 77.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

చెమ్మూమియా- గ్రామనా. ప్ర; పు. నా. -పేట చూ. గ్రామనా. ద్వి.

**1419.** చెరుకువాండ్లపల్లె రాయ. 100+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

చెరుకువాండ్ల- గ్రామనా. ప్ర; నామబం; చెరుకు- కుటుంబనా. చెరకు, చెఱకు, బెల్లం చెరుకు Sugar cane. Saccharum officinarum, Linn. పోల్చి చూ. క. చెరుకు (DED 2297.) బోయ, జోగి, ఒడ్డె మొ. వాళ్ళ ఇంటిపేరు (CTSI: II. see Ceruku) -వాండ్ల- చూ. ఆరో. 2. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1420.** చెరుకువాండ్లపల్లె రాయ 111+.

చూ. ఆరో. 1419.

**1421.** చెరువుకాంపల్లె రాయ. 5+.

స్థలా. నామబం; స్థలాసూచి.

చెరువు- గ్రామనా; ప్ర; జలాశయం. వ్యుత్పత్తి వివరాలకు చూ. గ్రామనా. ద్వి; -కాంపల్లె గ్రామనా.ద్వి.చూ. ఆరో. కాంపల్లె.

**1422.** చెరువుకిందపల్లె కడ. 38+.

స్థలా. నామబం; స్థలాసూచి.

చెరువుకింద- గ్రామనా. ప్ర; నామబం. చెరువు- చూ. ఆరో. -కింద- క్రింద. పోల్చి చూ .ప. రూ. (DED. 1348.) -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1423.** చెరువుకిందపల్లె రాయ 54+.

చూ. ఆరో. 1422.

**1424.** చెరువుకిందపల్లె రాయ.95+. ,,

**1425.** చెరువుకిందపల్లె రాయ.108+. ,,

**1426.** చెరువుకిందపల్లె ప్రొద్దు.66+. ,,

**1427.** చెరువుముందరపల్లె రాయ.72+.

స్థలా. నామబం. స్థలాసూచి.

చెరువుముందర- గ్రామనా.ప్ర; నామబం. చెరువు చూ. ఆరో. 1421; -ముందర ఎదుట. చూ. ప్రా. వ. ముందు, మునుపు, ముంగల, మున్ను, మునుము మొ. పోల్చి చూ. క. ముందు; మున్. తు. ముందె, మున్నె. త. మును, మున్ను, ముందలై. మ. మున్. ముంద్ (DED, 4119) -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1428.** చెరువుముందరపల్లె రాయ. 76+.

చూ. ఆరో. 1427.

1429. చెరువుముందరపల్లె రాయ. 81+.
చూ. ఆరో. 1427.

1430. చెరువుముందరపల్లె
రాయ. 100+. ,,

1431. చెరువుముందరపల్లె
రాయ. 100+. ,,

1432. చెరువుముందరపల్లె
రాయ. 103+. ,,

1433. చెరువుముందరరాచపల్లె
రాజం. 123+.

స్థలా. నామబం. స్థలాసూచి.

**చెరువుముందర-** గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1427. -రాచపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రాచపల్లె.

1434. చెర్లోపల్లె కడ. 7+.

స్థలా. నామబం; స్థలాసూచి.

చెర్లో- గ్రామనా. ప్ర; (చెరు + లో) చెరు- < చెరువు చూ. ఆరో. 1421. -లో - లో (నన్) చూ. పో. వ, లోగడ,లోను,లోవు, లోపల మొ. పోల్చి చూ. త. ఉళ్, ఉళ్ళం. మ. ఉళ్ళు. క. ఉళ్, ఒళ్. తు ఉళ. మొ. [మూలద్రా. *ఉళ్- మూలద. ద్రా). ఉళ్/ఒళ్] చూ. ఆరో. 600. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1435. చెర్లోపల్లె కడ. 66+.
చూ. ఆరో. 1434.

1436. చెర్లోపల్లె కడ. 78.
[చర్లోపల్లె మెకం. 1210-70]
చూ. ఆరో. 1434.

1437. చెర్లోపల్లె కడ. 95+.
చూ. ఆరో. 1434.

1438. చెర్లోపల్లె రాయ. 65. ,,

1439. చెర్లోపల్లె రాజం. 89+. ,,

1440. చెర్లోపల్లె రాజం. 110. ,,

1441. చెర్లోపల్లె సిద్ధ. 19+. ,,

1442. చెర్లోపల్లె సిద్ధ. 52+ ,,

1443. చెర్లోపల్లె బద్వే. 94+. ,,

చెరువులోని గ్రామం. చూ. FF 92.

"Cherlopalli is situated in the foreshore of the Perumamilla tank" (APDGC. 733),

1444. చెర్లోపల్లె జమ్మ. 126+.
[చెర్లోపల్లె మెకం. 1119-65].
చూ. ఆరో. 1443.

1445. చెర్లోపల్లె ప్రొద్దు. 80+. ,,

1446. చెర్లోపల్లె పులి. 2+. ,,

1447. చెర్లోపల్లె పులి. 36+. ,,

1448. చెర్లోపల్లె పులి. 45.+.
[చెర్లోపల్లె 1537 AR 15-46; B 120]
చూ. ఆరో. 1434.

1449 చెర్లోపల్లె పులి. 56+.

వర్యా. నిర్దే. వ్య.వ. గురిజాలచెర్లోపల్లె, బిదినంచెర్లచెర్లోపల్లె. చూ. ఆరో. 1448.

1450. చెర్లోవాండ్లపల్లె రాయ. 51+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

చెర్లోవాండ్ల- గ్రామనా. ప్ర: నామబం. చెర్లో- కు.నా. చూ. ఆరో. 1434, - వాండ్ల - చూ. ఆరో. 2. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1451** చెర్లోవాండ్లపల్లె రాయ. 100+.
చూ. ఆరో. 1450.

**1452.** చేకుంటపల్లె రాజం 28+.
సంబ. నామబం; స్థలనామసూచి.

**చేకుంట**- గ్రామనా. ప్ర; నామబం. స్థలనా. చే- స్థలనా, ప్ర. వ్యుత్పత్తి అస్పష్టము. చే: < లేదా చేవి -కుంట. స్థలనా. ద్వి. చూ. ఆరో. 644. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1453.** చేవివారిపల్లె సిద్ధ. 54+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

**చేవివారి.** గ్రామనా. ప్ర; నామబం. చేవి- కు.నా. (చేను + ఇ) పొలము. పోల్చి చూ. త. చెయ్ మ. చెయి క. కయ్, కెయ్, కెయి, కెయ్యి తు. కెయి పర్జి. కేన్ మొ. [మూలద్రా.* కెయ్-/ *కే] చూ. DED. 1629. BSOAS- 11, 124, 133. కమ్మవాళ్లలో ఇంటిపేరు (CTSI, II, See Cenu) -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1454.** చొప్పావారిపల్లె రాజం 123+.
[సొప్పావారిపల్లె మెకం. 1134-150]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

చొప్పావారి- [< సొ ప్పా వా రి-] గ్రామనా. ప్ర; నామబం. చొప్పా- కు.నా. చొప్ప. జొన్న, సజ్జ, రాగి, మొక్కజొన్న మొ. వాటి గడ్డి. పశువులమేత. పోల్చి చూ. క. సొప్పె కొలా. చొప్ప (DED 2331). -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1455.** చౌటపల్లె కడ. 46+.
సంబ. నామబం; సామాన్యనామసూచి. భూసూచి.

చౌట- గ్రామనా. ప్ర. విశే. (< చవుడు, చౌడు + అ) మామూలుగా తెలుపురంగు కల ఉప్పునేల. పర్యా. ఉప్పునేల. పోల్చిచూ. క. చవుళు సవుళు. త. చవటు. (DED. 1972) -పల్లె. చూ. గ్రామనా. ద్వి.

**1456.** చౌటపల్లె కడ. 77+,
చూ. ఆరో. 1455.

**1457.** చౌటపల్లె కడ. 160+.
[చవుటపల్లె మెకం. 1225-23; 1240-91] చూ. ఆరో. 1455. పోల్చి చూ. పెద్దచౌటపల్లె.

**1458** చౌటపల్లె రాయ. 64+.
చూ. ఆరో. 1456.

**1459.** చౌటపల్లె రాయ. 71+. ,,

**1460.** చౌటపల్లె రాయ. 74+. ,,

**1461.** చౌటపల్లె సిద్ధ. 16+. ,,

**1462.** చౌటపల్లె బద్వే. 54+. ,,

**1463.** చౌటపల్లె జమ్మ. 63.
[చౌటపల్లె మెకం. 1112-1. 1180-150, చౌటిపల్లె మెకం. 1180-162; చపటిపల్లె మెకం. 1180-181; చవిటి పల్లె మెకం. 1180-184] చూ. ఆరో. 1455.

"యీ భూమి చౌటభూమిగానుండి వంత్తట కొందరు కాపులు చేరి ఇండ్లు కట్టుకొని వుండి నందున చౌటపల్లె అనే నామాభిదానము కలి

గిన''దని స్థానికచరిత్ర (మెకం. 1112-1.) ఈ గ్రామం చిత్రావతీనదీ తీరంలో ఉందని నదీ తీరంలోని చౌటభూమిలో వెలసిన గ్రామమనీ FF. P. 54.

1464. చౌటపల్లె ప్రొద్దు. 34+.
చూ. ఆరో. 1455.

1465. చౌటపల్లె ప్రొద్దు. 86+. ,,

1466. చౌటపాలెం బద్వే. 83+. ,,
నం. నామబం;

చౌట- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1455; -పాలెం చూ. గ్రామనా. ద్వి.

1467. చౌదూరు ప్రొద్దు. 80.
[చవుదూరు 15639 AR1906; B 476; మెకం. 1119-244; చౌదూరు మెకం. 1126-60; 1204-76]

నంబ. నామబం; సామాన్యనామసూచి;

చౌదు- < చవుదు చూ. ఆరో. 1455; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

1468. చౌదరివారిపల్లె బద్వే. 61.
నంబ. నామబం; కులనామసూచి.

చౌదరివారి- గ్రామనా. ప్ర; నామబం. చౌదరి- < చవుదరి కులనా. వరగణానికైనా, గ్రామానికైనా పెత్తనగాడుగా ఉండే కావు, అధికారి (సూ.ని) కమ్మ కులసూచి. తెలంగాణాలో రెడ్ల/ కులసూచి. మహమ్మదీయుల్లో ఒక వర్గంవారి బిరుదు. ? [< హిం. చౌద్రి] -వారి- చూ.ఆరో.8; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

1469. జంగంపల్లె కడ. 80.
నంబ. నామబం; కులసూచి.

జంగం- గ్రామనా. ప్ర; కులనా లింగాయతుల పూజారి; సాధారణంగా లింగధారియైన వీరశైవుడు, బసవ మతానుయాయి. (< సం. జంగమః) జంగం శివునిపేర్లలో నొకటి చూ. CTSI II. Jangam. ప్రాణ్యము. జంగము, జంగములు, జంగాలు. -పల్లె చూ.గ్రామనా.ద్వి.

1470. జంగంపల్లె కమ. 21+.
చూ. ఆరో. 1469.

1471. జంగంపల్లె రాయ.53+. ,,

1472. జంగంపల్లె రాయ.81+. ,,

1473. జంగంపల్లె రాయ.101+. ,,

1474. జంగంపల్లె రాయ.105+. ,,

1475. జంగంపల్లె రాయ.110+. ,,
వర్యా. పీబూదివారిపల్లె.

1476. జంగంపల్లె ప్రొద్దు.81+. ,,

1477. జంగంరాజుపల్లె కడ. 89+.
నంబ. నామబం; వ్యక్తినామసూచి.

జంగంరాజు- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. జంగం- చూ. ఆరో. 1469; -రాజు- చూ. ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1478. జంగంరాజుపల్లె బద్వే. 50.
చూ. ఆరో. 1477.

1479. జంగంరెడ్డిగారిపల్లె రాయ. 66+.
నంబ. నామబం; వ్యక్తినామసూచి.

జంగంరెడ్డిగారి- గ్రామనా. ప్ర; నామబం. జంగంరెడ్డి- నామబం; పు.నా. (< జంగమ రెడ్డి) జంగం- చూ. ఆరో. 1469; -రెడ్డి

చూ. ఆరో. 6; -గారి- చూ. ఆరో. 6. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1480. జంగంరెడ్డిపల్లె కడ. 29.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

జంగంరెడ్డి- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. చూ. ఆరో. 1479; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1481. జంగంరెడ్డిపల్లె పులి. 75.
చూ. ఆరో. 1480,

1482. జంగాలపల్లె రాజం. 9.
[జంగాలపల్లె మెకం. 1134-343]
పర్యా. నక్కలపల్లె.
సంబ. నామబం; కులనామసూచి.

జంగాల- గ్రామనా. ప్ర; బహు. (జంగాలు + అ < జంగములు + అ) ఏక; జంగము చూ. ఆరో. 1469; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

జంగాల కవీశ్వరులకు మట్ల అనంతరాజు పాలం యిచ్చినందున అక్కడ వెలసిన గ్రామం జంగాలపల్లె అయినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1134-343 జంగాలపల్లె కైఫీయతు).

1483. జంగాలపల్లె సిద్ధ. 28.
చూ. ఆరో. 1482.

1484. జంగాలపల్లె జమ్మ. 7+.
[జంగాలపల్లె మెకం. 1169 - 70]
చూ. ఆరో. 1482,

'లోగడ జంగాలు కట్టించిన గ్రామమని' స్థానిక చరిత్ర (మెకం. 1169-70).

1485. జంగాలపల్లె జమ్మ. 97.
[జంగాలపల్లె మెకం. 1204-4] చూ. ఆరో. 1482.

'గురుపాదయ్య జంగం మఠం కట్టినాడని తత్కారణంగా ఊరిపేరు జంగాలపల్లె అయిందని' స్థానిక చరిత్ర (మెకం. 1204-4).

1486. జంగిటివాండ్లపల్లె రాజం. 14 +.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

జంగిటివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. జంగిటి- కు.నా. వ్యుత్పత్తి చింత్యము. పోల్చి చూ. జంగిడి గుంపుజేసి ఒకటిగా మేపు చిల్లర రైతుల పశువులమంద; జంగిలి- జంగిడి పశువులు; పళ్లెములాగ అల్లిన సన్నవెదురు బద్దల అల్లకము; ఊరి పశువులు ఒకచోట గూడుచోటు. ఉమ్మడివంతు (మాం. వ). -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1487. జంబాపురం కమ. 25
[జంబాపురం మెకం. 1225-128]
అస్పష్టనామబంధం.

జంబా- గ్రామనా. ప్ర. వ్యుత్పత్తి చింత్యము. / సం. జంబాలము, అడుసు. -పురం చూ. గ్రామనా. ద్వి.

1488. జంషారాబాయిపేట బద్వే. 111+.
[ఝుంసరాబాయిపేట మెకం. 1170-35]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

జంషారాబాయి- [ఝుంసరాబాయి-] నామబం; స్త్రీ.నా. జంషారా- [ఝుంసరా] వ్యక్తినా. ప్ర. -బాయి- స్త్రీనా. మరాఠీ స్త్రీనామాల్లో అనుబంధం. -పేట చూ. గ్రామనా. ద్వి.

1489. జగడంపల్లె రాజం. 149+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

జగడం- గ్రామనా. ప్ర. కు. నా. పోరు, కలహము. యుద్ధం. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1490. జడవారిపల్లె రాజం. 37+

సంబ. నామబం. కుటుంబనామసూచి.

జడవారి గ్రామనా. ప్ర; నామబం; జడ- కు.నా. పోల్చిచూ. త. చడై మ. జట, చట, చెట, చిట. క. జడె, జడె, జడి, జెడి. కొడ. జడె / సం. జట (DED, 1897); -వారి- చూ. అరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1491. జమాలపల్లె కడ. 72.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

జమాలు గ్రామనా. ప్ర; పు.నా. (<అర, జమాల్) / అర. జమల సుందరమగు. Alam from Personal Peculiarity MAMP. -పల్లె చూ. గ్రామనా ద్వి.

1492. జమ్మలమడుగు జమ్మ. 86.

[జంబులమడుగు మెకం. 1121-12; 1169-1; 1204-46. జమ్ములమడుగు మెకం. 1204-63; జంబులమడ్గు మెకం. 1121-19, 1180-149; జంబుల మడుగు మెకం. 1169-5; జంబుల మడువు మెకం. 1204-5: జమ్మల మడుగు మెకం. 1121-167; జంమ్మల మడుగు మెకం. 1169-8; జమ్మల మడుగు మెకం. 1169-4; జమ్మల మడక మెకం. 1134-28: 1119-6]

సంబ. నామబం; వృక్షసూచి.

జమ్మల- [జంబుల-; జమ్ముల ; జంబల-; జంబుల ; జమ్ముల-; జమ్మల-] .గ్రామనా. ప్ర. బహు. (<జంబులు+అ) జమ్ము చెమ్మ నేలల్లో ఎక్కువ పెరిగే ఒక రకం గడ్డి. Typha angustata. B & Ch. abulrush. Sedge పోల్చి చూ. త. చంపు క. జంబు DED. 1939). -మడుగు [మడ్గు;- మడువు; -మడక] చూ. గ్రామనా. ద్వి.

1493. జయరాంపేట కడ. 4+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

జయరాం- గ్రామనా. ప్ర; నామబం. పు.నా. [ < సం.జయరామః] -పేట చూ. గ్రామనా. ద్వి.

1494. జల్లావాండ్లపల్లె రాయ. 66+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

జల్లావాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. జల్లా- కు.నా; జల్ల, జొల్ల, దొల్ల, దొల్ల. పర్యా. కుక్క- వాణక. మంకిరి. ఎరువు. ధాన్యం మొ. వి తోలటానికి బండిమీద వేసే (వెదురు, ఈత) పేళ్లతో అల్లిన గూడువంటి సాధనం, పెద్ద గంప. (కృష్ణమూర్తి. 1962, 156, 284, 388); -వాండ్ల- చూ. అరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1495 జవ్వాదివాండ్లపల్లె రాయ. 58+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

జవ్వాదివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. జవ్వాజి. కు. నా. వస్తుసూచి. జవాది, జవ్వాది ఒక సుగంధవస్తువు. తత్సమ మని సూ. ని. పోల్చిచూ. త. సవాదు. క. జవాదు; -వాండ్ల- చూ. అరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1496. జాంద్రపల్లె రాయ. 33+.

సంబ. నామబం; కులనామసూచి.

జాంద్ర- గ్రామనా. ప్ర. కులనా. జేంద్ర వాండ్లు, బట్టలునేసి జీవించే ఒకకులం; పోల్చి

చూ. త. సేంటియార్. క. జాడ, చేద. తు.జాడె, జాడ్యె (DED. 2307) -పల్లె చూ. గ్రా మ నా. ద్వి.

1497. జాంద్రపేట రాయ. 79+.

సంబ. నామబం; కులనామసూచి.

జాంద్ర- గ్రామనా. ప్ర. కుల. నా. చూ. ఆరో. 1495: -పేట చూ. గ్రామనా. ద్వి.

1498. జాండ్లమరం ప్రొద్దు. 9+.

[జైనులమరం మెకం. 1126 - 120; జానులమరం మెకం. 1126-84];

సంబ. నామబం; ? మతనామసూచి.

జాండ్ల - [జైనులా: జానుల-] గ్రామనా. ప్ర. బహు. (<జాండ్లు+అ) జాండ్లు-? జైనులు ఒక మతంవాండ్లు. జినదేవుని అనుయాయులు [<సం. జైనః] -మరం చూ. గ్రామనా.ద్వి.

1499. జాగురువారిపల్లె రాజం. 8?+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

జాగురువారి- గ్రా మ నా ప్ర; నామబం. జాగురు- కు.నా. ? <జాజార, జాదుర, జాజర, ఒకవిధమైన గీతంలో పాడే ఊత పదం. / సం. యాతు. జర్జరః. హిం. జాదు. -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1500. జాతివర్తిపల్లె బద్వే. 85+.

సంబ.; నామబం; కుటుంబనామసూచి.

జాతివర్తి- గ్రామనా.ప్ర.నామబం. కు.నా. వ్యుత్పత్తి అస్పష్టము. -పల్లె చూ. గ్రా మ నా. ద్వి.

1501. జానకమ్మపురం రాజం. 142+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

జానకమ్మ- గ్రామనా. ప్ర;నామబం. స్త్రీనా. (జానకి+అమ్మ) జానకి సీత [< సం; జానకీ] -అమ్మ- చూ. ఆరో. 1. -పురం గ్రామనా.ద్వి.

1502. జాలవర్తి పులి. 91.

[జాళవత్తి మెకం. 1119-242].

సంబ. నామబం; వృక్షసూచి.

జాల- [జాళ-] గ్రామనా. ప్ర. తుమ్మ. పొడుగాటి తెల్లటి ముళ్ళు గల చెట్టు Acacia arabica, willd. -వర్తి [వత్తి-] చూ. గ్రామనా. ద్వి.

1503. జాఫర్‌సాహెబ్‌పల్లె సిద్ద. 18+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

జాఫర్ సాహెబ్- గ్రామనా.ప్ర; నామబం; పు.నా. జాఫర్- ఆరవ ఇమాంపేరు. మహమ్మదీయుల్లో ఒక పేరు. అర. జాఫర్ పసుపు జాఫ్రాఁ కుంకుమపువ్వు .. సాహెబ్ చూ. ఆరో. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1504 జిల్లేళ్ల ప్రొద్దు. 18.

[జిల్లెళ్ళ 1549 AR 1906 B: 471]

అసమస్తం. వృక్షసూచి.

(జిల్లేడులు+అ) ఏక. జిల్లేడు జిల్లెడు ఇసుక నేలల్లో నల్లరేగడనేలల్లో ఏపుగా పెరిగే ఒక మొక్క Calotropis gigantea, R. Br.

1505. జిల్లేళ్ల బద్వే. 87+.

[జిల్లెళగ్రామమండలి 1549 SII. XVI. 173-12. జిల్లేళ్ళ- మెకం.1119-161].

చూ. ఆరో. 1504.

1506. జిల్లేళ్లమడక రాజం. 130.

[జిల్లెళ్లమడక మెకం. 1223 - 121.

129; నామా వోబిలవారిపల్లె మెకం. 1223-150.]

సంబ. నామబం. వృక్షసూచి.

జిల్లేళ్ల- [జిల్లెళ్ల-] గ్రామనా; ప్ర. చూ. ఆరో. 1504. మడక- చూ. గ్రామనా. ద్వి.

1507. జీరెడ్డికొత్తపల్లె జమ్మ. 110.

సంబ. నామబం, వ్యక్తినామసూచి.

జీరెడ్డి- గామనా. ప్ర. నామబం. జీ- వ్యక్తి నా. ప్ర. < జీయ, జియ్య, జియ్యరు, శైవ సన్యాసిని. విష్ణుదేవాలయాధికారి. తంత్రి గౌరవ వాచకం. శివాలయంలోని పూజారి. ఆ పూజారుల నామాంత్య ప్రత్యయం; జియ్యరు ప్రభువు (మాం. ప; కో.) జియ్య; జియ్యరు. పోల్చి చూ. త. క. జీయ, జీయర్ / ? సం. దివ్యః లేదా జీవః; -రెడ్డి చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1508. జీవంపేట కమ. 58+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

జీవం- గ్రామనా. ప్ర; నామబం. (<జీవమ్మ) జీవ [<సం. జీవః] -అం. చూ. ఆరో. 1; -పేట చూ. గ్రామనా. ద్వి.

1509. జూరుకువాండ్లపల్లె రాయ. 5 +.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

జూరుకువాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. జూరుకు- కు; నా; మామిడిచెట్లల్లో తెట్టెలుకట్టే గండు ఎఱ్ఱచీమ. -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1510. జువ్వలపల్లె సిద్ద 78.

సంబ. నామబం; వృక్షసూచి.

జువ్వల- గ్రామనా. ప్ర; బహు. (జువ్వలు+అ) జువ్వి- Ficustsiela. పోల్చి చూ. త. చువి. మ. చువన్నాల్, క. జువ్వి. మర. పర్జి. జూమెరి (OED 2222). -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1511. జెట్టివారిపల్లె రాజం. 45.

సంబ. నామబం; కులసూచి.

జెట్టివారి- గ్రామనా. ప్ర; నామబం, జెట్టి- ఒక తెలుగుకులం. కుస్తీపట్టే వృత్తిగలవాడు; ధైర్యవంతుడు. మాలీసు చేసేవాండ్లు (CTSI-II Jetti.) త. జెట్టి. క. జెట్టి. జెట్టిగ / < ప్రా. జెత్తి, జెట్టిగ ప్రా. జెదీఓ < సం. జ్యేష్ఠః -వారి- చూ. ఆరో. 8; పల్లె చూ. గ్రామనా. ద్వి.

1512. జెట్టివారిపల్లె రాజం. 114+.

[జట్టివారిపల్లె మెకం. 1134 - 332]

చూ. ఆరో. 1511.

1513. జొన్నవరం సిద్ధ. 18.

సంబ. నామబం; మంగళసూచి.

జొన్న- ఒక తెగ పైరు. గ్రామనా. (< ? సువర్ణ) -వరం చూ. గ్రామనా. ద్వి.

1514. జోగాపురం జమ్మ. 89.

[జోగాపురం మెకం. 1180-161].

సంబ. నామబం. కులనామసూచి.

జోగా- గ్రామనా. ప్ర; కులనా. (ల జోగి) యోగి; సన్యాసి, భిక్షకుడు. < ప్రా. జోఈ. <సం. యోగిన్. -పురం చూ; గ్రామనా. ద్వి.

1515. జోగిరెడ్డిగారిపల్లె రాయ. 6+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

జోగిరెడ్డిగారి- గ్రామనా. ప్ర. నామబం. జోగిరెడ్డి నామబం; పు.నా; మతసూచి. జోగి-

వ్యక్తినా. ప్ర- చూ. ఆరో. 1514; -రెడ్డి చూ. ఆరో. 6; -గారి- చూ- ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1516. జోగిరెడ్డిగారిపల్లె బద్వే. 140+. చూ. ఆరో. 1515.

1517. జొకులపల్లె బద్వే. 46.&48+. సంబ. నామబం; సామాన్య నామసూచి. భూసూచి.

జొకుల- గ్రామనా. ప్ర; బహు. (< జొకులు + అ) ఏక. జొకు, జవుకు, బురద; జవుకు (నేల) వాన కురిస్తే దిగబడేనేల; వాగు, వానలకు పొలంలో పారే నీటి వాగు (మాం. వృ. కో. 1.10, 47) నీటి ఊట. ఎక్కువ వానవలన నేలలో ఏర్పడిన జోడు (మాం. వ. 179) పోల్చి చూ. క. జవుగు, జోగు, జవళు, జవుళు తె. జవజవ, జోకు. (DED. 1983); పల్లె చూ. గ్రామనా. ద్వి.

1518. జొకులపల్లె సిద్ధ. సంబ. నామబం; పామాన్యనామసూచి. భూసూచి. చూ. ఆరో. 1517.

1519. జ్యోతి సిద్ధ. 32. [జోతినాథుని 1247 X. 312-16-17, 21-22; జోతి 127 (9) S 4. SII 448; జ్యోతి మెకం. 1126-25] [<సం. జ్యోతిః] అపమస్తం.

1520. టంగుటూరు రాజం. 10. [తంగుటూరి (శ్రీసిద్ధనాధదేవర). 1315, 519-13; తంగ్గటూరి 1433 SII. XVI. 31-15; తంగటూరు 1556 SII. XVI. 219-27; తంగటూరు మెకం. 1134-2, 1223-90; తుంగటూరు మెకం. 1134-9-10] అస్పష్టనామబంధం.

టంగు- [తుంగ, తంగు-, తంగ-] గ్రామనా. ప్ర; వ్యుత్పత్తి అస్పష్టం. -ఊరు చూ. గ్రామనా. ద్వి.

1521. టంగుటూరు ప్రొద్దు. 23. [తంగటూరు మెకం. 1126-87] చూ. ఆరో. 1520; MAMP, 721.

1522. టెంకాయచెట్లపల్లె రాయ. 77+. సంబ. నామబం. వృక్షసూచి.

టెంకాయచెట్లు- గ్రామనా. ప్ర;నామబం, (టెంకాయచెట్లు+అ) ఏక. టెంకాయచెట్టు- కొబ్బరిచెట్టు Cocus nucifera. Linn, పోల్చిచూ. త. తెంకు. తెంగం, తెఙ్, తెజ్ఞ. మ. తెఙ్ఞు క. తెంగు, టెంగు మొ. (DED. 2006); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1523. టేకూరుపేట బద్వే. 97+. సంబ. నామబం; గ్రామనామసూచి.

టేకూరు- గ్రామనా ప్ర; నామబం; గ్రామనా. టేకు- గ్రామనా. ప్ర. తేకు టేకు కలపకు పనికివచ్చే ఒక పెద్ద చెట్టు Tectona grandis. పోల్చిచూ. త. తేక్కు. మ. తేక్కు. క. తేగు, తేగి. తేంగు. పర్జి. టేక్మెరి (DED. 2842) -ఊరు చూ. గ్రామనా. ద్వి. -పేట చూ. గ్రామనా. ద్వి.

1524. టేగలవారిపల్లె రాజం. 92+. సంబ. నామబం; కుటుంబనామసూచి.

దేగలవారి- గ్రామనా. ప్ర; నామబం; దేగల- కుటు.నా. బహు. (<దేగలు+అ) ఏక. దేగ ఒక పక్షి hawk, Falcon. పోల్చి చూ. క. గిడగ, గిడిగ, గిడుగ, దేగె తు. గిడి. పర్జి. డెయ. కువి. దేగ (DED, 1280). -వారి- చూ.అరో.8; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

**1525. దేగలవారిపల్లె సిద్ద. 36+.**
చూ. అరో. 1524.

**1526. డొంకుపల్లె ఖమ్మ. 51.**
[డొంకిపల్లె మెకం. 1169-84; డొంకె పల్లె మెకం. 1180-175]
సంబ. నామబం; సామాన్యనామసూచి.

**డొంకు-** [డొంకి-, డొంకె-] గ్రామనా. ప్ర;డొంక, వంకరదారి; పొద; పల్లపు ప్రదేశం; నడవడంతో పల్లంగా ఏర్పడిన తోవ. ఉమ్మడి బాట. పోల్చిచూ. తె. డొంకు. వివరాలకు చూ. TVB 515,519: (DED. 804, 2416, 2417, 2418) ప్రా. అం. ఒటుంక్ -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1527. తంగేడుపల్లె కమ. 45.**
[తంగేడుపల్లె మెకం. 1119-122]
సంబ. నామబం; వృక్షసూచి.

**తంగేడు-** గ్రామనా. ప్ర. ు తంగెడు కొండకోనల్లోను నల్లరేగడి నేలల్లోను చిట్టడవుల లోను, చిట్టిపొదగా పెరిగే మొక్క, Cassia auriculata, Linn. -పల్లె చూ. గ్రామనా.ద్వి.

**1528. తంగేడుపల్లె బద్వే. 117.**
[తంగేడుపల్లె మెకం.1170-6;తంగెడు పల్లె మెకం. 1170-15] చూ. అరో. 1527.

**1529. తండాయిపల్లె రాజం. 64+.**
సంబ. నామబం; వృత్తిసూచి.

**తండాయి-** గ్రామనా. ప్ర; నామబం. A village Shroff (Brown Zilla Dictionary 1853, 115) "శిస్తుల రూపంగా వసూలయిన డబ్బును కరణం నుంచి తీసుకొని లెక్కలు పక్కలు చూచి ప్రభుత్వానికి జమ కట్టే సరాబువంటి ఉద్యోగి కావచ్చునని 'బంగోరె'(తాతాచార్ల కథలు, 1974,162-163). An inferior native revenue officer or Collector under the head farmer (Wilson, 1853). పోల్చిచూ. తె. తండుటు; దండుగ. త. తండల్, ; : తంటం మ. తెంటుక. తండకార (DED. 2482). -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1530. తంబళ్లగొంది సిద్ద. 8**
[తమ్మళగొంది, తమ్మళగుంది మెకం. 1170-44]
సంబ. నామబం; కులసూచి.

**తంబళ్ల-** [తమ్మళ-] గ్రామనా. ప్ర; <తంబళ్లు+అ) తంబళ్లు శివార్చనచేసి బ్రతికే ఒక కులం. పోల్చిచూ. తె. తంబళి క. తమ్మడి (DED. 2514) గొంది [-గుంది] చూ. గ్రామనా. ద్వి.

**1531. తంబళ్లవారిపల్లె రాజం. 134+.**
సంబ. నామబం; కులసూచి.

**తంబళ్లవారి-** గ్రామనా ప్ర; నామబం. తంబళ్ల- చూ. అరో. 1530; -వారి- చూ. అరో. 8; -పల్లె చూ. గ్రామనా, ద్వి.

**1532. తక్కలపల్లె రాయ. 6+.**
సంబ. నామబం; వృక్షసూచి.

**తక్కలి-** గ్రామనా. ప్ర. తక్కలి తక్క

-లాకు, Premna Integrifolia, Linn -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1533. తక్కోలు పిద్ద. 36.
[తక్కాన్ పుటోలు 650 E.I,XXVII, -42. F, 233-6; తకప్రోలు; 1247 SII-X. 312, 22-23]
అస్పష్టనామబంధం.

తక- తక్కాన్-; తక గ్రామ నా. ప్ర; ? తక్కాలి పదంతో సంబంధం వుండవచ్చు. పోల్చి చూ. ఆరో. 1532. -ఓలు [-పుటోల; -ప్రోలు] చూ. గ్రామనా. ద్వి.

1534. తడికెలబైలు రాజం. 131+.
సంబ. నామబం; సామాన్యనామసూచి సంఘటన నామసూచి.

తడికెల- గ్రామనా. ప్ర; బహు. (<తడి కెలు+అ) ఏక. తడికె ను తడక వెదురుబద్దలు మొదలైనవానితో చాపవలె అల్లి దడిగా ఉప యోగించుకొనే సాధనం. పోల్చిచూ. తె. దడి. త. తట్టి; తట్టు, తడుక్కు. మ. తట్టి; తటుక్కు క. తట్టి; తడకు; తడికె; దడ్డి; దడె, కుయి, తటి; ప్రా. టట్టీ (DED. 2464) -బైలు చూ. గ్రామనా. ద్వి.

1535. తప్పెటఓబాయపల్లె ప్రొద్దు. 43+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

తప్పెట- గ్రామనా. ప్ర;కు. నా. వస్తుసూచి. ఒక చర్మవాద్యం. ఏక.వ.తప్పెట్లు బహు. పోల్చి చూ. తె. తమ్మటము. త. తంపట్టం; తప్పట్టై, తప్పట్టం; మ. తప్పిట్ట; తమ్మిట్టం. క. తంబట, తంబటె, తపటె, తప్పటె, తబడె, తమటె, తమ్మట, తమ్మటె. మొ. (DED 2510); ఒడ్డెల ఇంటిపేరు. (CTSI, See VII, Tappeta) -ఓబాయపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. ఓబాయపల్లె. పోల్చిచూ. గొల్ల ఓబాయపల్లె.

1536. తప్పెటవారిపల్లె ప్రొద్దు. 38.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

తప్పెటవారి- గ్రామ నా. ప్ర; నామబం; తప్పెట- కు. నా; చూ. ఆరో. 1535. -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1537. తప్పెటవారిపల్లె పిద్ద. 48+.
చూ. ఆరో. 1535.

1538. తప్పెట్ల కడ. 38.
[తప్పిట మెకం. 1119-248]
అసమస్తం. కుటుంబనామసూచి, బహు. (< తప్పెట్లు + అ). చూ. ఆరో. 1535.

1539. తమటంవాండ్లపల్లె రాయ. 51+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

తమటంవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. తమటం- కు.నా. తమ్మటము.ఒక చర్మవాద్యం. చూ. ఆరో. 1535. -వాండ్ల- చూ. ఆరో 2. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1540. తమటంవారిపల్లె రాయ. 23+.
సంబ; నామబం; కుటుంబనామసూచి.

తమటంవారి- గ్రామనా. ప్ర; నామబం. తమటం- చూ. ఆరో. 1539; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1541. తమటంవారిపల్లె రాయ 28+.
చూ. ఆరో. 1540.

1542. తమటంవారిపల్లె బద్వే. 76+. ..

1543. తలకులవాండ్లపల్లె ప్రొద్దు 88+.

నంబ.నా మబం; కుటుంబనామసూచి.

తలకులవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. తలకుల- కు. నా; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1544. తలపనూరు కమ. 84.

[త ల్ప నూ రు 1357 AR 35-36 : B 326; తల్పునూరు 1357 AR 35-36; B 327; తల్పనూరు మెకం. 1110-2; 1229-20]. నామా. హరిహర రాయపురం [మెకం. 1229-90.]

? నంబ. నామబం; వ్యక్తినామ సూచి.

? తలపన- [తల్పన-, తల్పును-] గ్రామ నా. ప్ర; వ్యక్తినా. -ఊరు చూ. గ్రామనా. ద్వి.

1545. తలమంచిపట్నం జమ. 14.

[పట్టణం 1525 AR 32-32; B 386; తలమంచిపట్టం మెకం. 1204 - 160; తలమంచిపట్నం మెకం. 1118 - 23; 1110-154].

నంబ; నామబం; వ్యక్తినామసూచి.

తలమంచి- గ్రామనా. ప్ర. నామబం: వ్యక్తినా. తల- వ్యక్తినా. ప్ర. ? <తల్లి; -మంచి 'బ్రాహ్మణ నామాంతముల ప్రయుక్తమైన పదమ'ని కుందూరి ఈశ్వరదత్తు చూ. మారపోత మంచ్చింగారు 1255 SII. X. 351 (శా. శ); పోల్చిచూ. ఆరో. సుగుమంచి- (పట్నం): -పట్నం [-పట్టణం,-పట్టం] చూ. గ్రామనా. ద్వి.

1546. తలముడిపి రాయ. 15.

అస్పష్టనామబంధం; వ్యుత్పత్తి అస్పష్టం.

1547. తలాడివాండ్లపల్లె రాయ. 56+.

నంబ. నామబం; కుటుంబనామసూచి.

తలాడివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. తలాడి- కు. నా. వ్యుత్పత్తి అస్పష్టం;-వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1548. తలెంవారిపల్లె రాజం. 132+.

[తల్లవాండ్లపల్లె మెకం. 1223 - 146]

నంబ. నామబం; కుటుంబనామసూచి.

తల్లెంవారి- గ్రామనా.ప్ర.నామబం. తల్లెం- కు. నా. వ్యుత్పత్తి అస్పష్టం. కాపుల ఇంటి పేరు. -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి. "తలవాండ్లనే కాపులు" ఈ గ్రామాన్ని నెలకొల్పినట్లు స్థానికచరిత్ర. (మెకం. 1223-146).

1549. తవ్వారిపల్లె కడ. 13.

[తవ్వావారిపల్లె మెకం. 1240-80]

నంబ. నామబం; కుటుంబనామసూచి.

తవ్వ- [< తవ్వా-] గ్రామనా. ప్ర;కు.నా. వస్తుసూచి. వైశ్యులలో ఇంటిపేరు. ధాన్యపు కొలత. రెండు సోలల కొలదిగల మావ విశేషం (సూ.ని; శ. ర. (బ్రౌ. వా.) 2 సోలలు; $\frac{1}{2}$ శేరు; భూమికొలత $\frac{1}{8}$ ఎకరం (మాం. వ్యా. వ.) -ఆరి [< వారి-] చూ.ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1550. తాటిగిరిపల్లె బద్వే. 85+.

నంబ. నామబం; స్థలాసూచి.

తాటిగిరి గ్రామనా. ప్ర; నామబం; స్థలనా. తాటి- (<తాడు+ఇ) తాడు తాటిచెట్టు;తాళము. Bral tree; Palm tree, Palmyra Palm; Borasus Flasellifarmis, Walts, పోల్చి చూ. తా, తాన్ని, తాణ్ణి (ప్రా. శా) క. తాట్

తు.తారి, తాశ్. కొలా. తాటిమాక్ పర్జి. తాట్/ సం. తాల- ప్రా. తాల- తాడ- DED 2599; (CDIAL. 5801). సం.తాల-, ప్రా. తాల-, తాడ ద్రావిడ ప్రతిధ్వనాలని ఎం.బి. ఎమెనో, చూ. Kolami 3133; బరోగారి అభిప్రాయమూ అదే. (Collected Papers. 294) -గిరి కొండ [<సం. గిరిః]: -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1551. తాటిగుంటపల్లె** రాయ. 86+.

సంబ. నామబం; స్థలానూచి.

**తాటిగుంట-** గ్రామనా. ప్ర; నామబం; స్థలనా. తాటి- స్థలనా ప్ర. చూ. ఆరో. 1550; -గుంట స్థలనా. ద్వి. చూ. ఆరో. 412. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1552. తాటిగుట్టపల్లె** రాయ. 105+.

సంబ. నామబం. స్థలనామసూచి.

తాటిగుట్ట- గ్రామనా.ప్ర;నామబం; స్థలనా. తాటి- చూ. ఆరో. 1551; -గుట్ట స్థలనా.ద్వి. చూ. ఆరో. 412; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

**1553. తాటిమాకులపలె** కమ. 47+.

[తాటిమాకులపల్లె మెకం. 1240-116; 1119-294]

సంబ. నామబం; వృక్షసూచి.

తాటిమాకుల- గ్రామనా. ప్ర; బహు. (తాటిమాకులు+అ) తాటిచెట్లు తాటి- చూ. ఆరో. 1552; -మాకుల చూ. ఆరో. 1193. -పల్లె చూ. గ్రామనా. ద్వి;

**1554. తాటిమాకులపల్లె** రాయ.47+.

చూ. ఆరో. 1553.

K—20

**1555. తాటిమాకులపల్లె** పులి.37+.

చూ. ఆరో. 1553.

**1556. తాడిగొట్ల** కడ. 54.

[తాడిగొట్ల మెకం.1210-40;1240-99]

సంబ. నామబం. వృక్షసూచి.

**తాడి-** గ్రామనా. ప్ర; (తాడు+ఇ) చూ. ఆరో. 1550. గొట్ల చూ. గ్రామనా. ద్వి.

**1557. తాతయ్యగారిపల్లె** కడ. 68+

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**తాతయ్యగారి-** గ్రామనా. ప్ర; నామబం. తాతయ్య- నామబం; పు.నా. తాత- పెద్దవాడు. తండ్రి; పితామహుడు; మాతామహుడు, పోల్చి చూ. త. తాత. ?క. తాత.; తు. తాతె. పర్జి. తాత. / సం. తాతః; తాతగుహః, తాతి [మూలద. ద్రా. *తాత] చూ. DED, 2580. -అయ్య చూ.ఆరో. 4; -గారి- చూ.ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1558. తాతిరెడ్డిపల్లె** కమ. 18+.

[తాతిరెడ్డిపల్లె మెకం. 1110-36]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**తాతిరెడ్డి-** గ్రామనా. ప్ర; నామబం;పు.నా. తాతి- వ్యక్తినా. ప్ర. (తాత+ఇ), తాత. చూ. ఆరో. 1557; -ఇ చూ. ఆరో. 25. -రెడ్డి చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1559. తాతిరెడ్డిపల్లె** పులి.2+.

చూ. ఆరో. 1558.

**1560. తాతిరెడ్డివాండ్లపల్లె** రాయ.24+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**తాతిరెడ్డివాండ్ల-** గ్రామనా. ప్ర; నామబం.

తాతిరెడ్డి- కు. నా. వ్యక్తినామసూచి. చూ. అరో. 1558. -వాండ్ల- చూ.అరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1561. తాళ్లపల్లె** జమ్మ. 63+.

నంబ. నామబం. వృక్షనామసూచి.

**తాళ** - గ్రామనా.ప్ర.బహు.(<తాళ్లు+అ. తాటిచెట్లు చూ. అరో. 1550; -పల్లె చూ) చూ. గ్రామనా. ద్వి.

**1562. తాళ్లపల్లె** పులి. 26.

[తాళ్లపల్లె 1517 AR 40-41; B 428; మెకం. 1119-218] చూ.అరో. 1561.

**1563. తాళ్లపాక** రాజం. 53.

[తా(ళ్ల) పాక 1279 S.I.I,X 448-47; తాళపాక 1133 SII. XVI 31-5 తాళపాక 1514 T.T.D.I III. 68-3 తాళ్లపాక 1557 SII. XVI 220-18, మెకం. 1134-15; తాళ్లపాక 1532 T.T.D.I.IV. 20-3 మెకం. 1134-149].

నంబ; నామబం; వృక్షసూచి.

**తాళ్ల**- [తా(ళ్ల); తాళ-: తాళ్ల] గ్రామనా. ప్ర.చూ.అరో.1561. -పాక చూ.గ్రామనా.ద్వి. తాళ్ళపాక బ్రాంహల్లో యింటిపేరు.

నదీతీరంలో తాటివనం ఉండేదనీ. 'యాంద్రవాళ్లు' గ్రామం కట్టుకున్నారు కాబట్టి దానికి తాళ్లపాక అనే పేరు వచ్చిందనీ స్థానిక చరిత్ర. (మెకం. 1134-15).

**1564. తాళ్లప్రొద్దుటూరు** జమ్మ. 37.

[తాళపొదటూరు 1544 AR 40-41 B 437; తాడ్ల పొదటూరిసీమ 1551 AR 40-41 B 439; తాళ్ల ప్రొదటూరు మెకం. 1204-298. తాళ్ల పొద్దటూరు మెకం. 1180-161; తాళ్ల పొద్దటూరు మెకం. 1112-76 77]

నంబ. నామబం; వృక్షసూచి.

**తాళ్ల**- [తాళ-, తాడ్ల-] గ్రామనా. ప్ర; చూ. అరో. 1550. -ప్రొద్దుటూరు [పొదటూరి- ప్రొదటూరు; పొద్దటూరు, -పొద్దటూరు] చూ. అరో. 2317. పోల్చిచూ. ప్రొద్దుటూరు.

**లోకనిరుక్తి:** "తాటివనంలో నదితీరమున కొట్టాలు వేసుక వుండగాను తాటివనంలో సూర్యరశ్మి లేకుండా వుండినందుచేత వారు కొంన్ని తాటి వృక్షములు నరికించుటచేత సూర్యరశ్మి ప్రకాశతంగా అగపడినందుచేత యీ గ్రామాన్ని నామాభిధానము తాళ్ల ప్రొద్దటూరు అని కలిగినది అని జనులు వాడుతున్నారు. (మెకం. 1112-76-77). ఈ గ్రామ పరిసరాల్లో తాటిచెట్లు ఇప్పటికీ ఎక్కువే.

**1565. తాళ్లమాపురం** ప్రొద్దు. 54.

[తాళ్లమాపురం మెకం, 1111-22]

అస్పష్టనామబంధం.

**తాళ్ల**- గ్రామనా. ప్ర. చూ. అరో. 1550. -మాపురం వ్యవహారంలో ఈ గ్రామాన్ని 'తాళ్ల మోపూరు అని కూడా పిలుస్తారు కాబట్టి మోపూరు గ్రామ్య రూపమే మాపురం -మోపూరు. చూ. అరో. మోపూరు.

**1566. తావేటివాండ్లపల్లె** రాయ. 63+.

నంబ. నామబం; కుటుంబనామసూచి.

**తావేటివాండ్ల** గ్రామనా. ప్ర. నామబం. తావేటి- కు.నా. (<తావేలు + ఇ) తావేలు ఌ తాఁబేలు, తామేఌ. ఒకజలచరం. పోల్చిచూ. త. యామై, ఆమై. మ. ఆమ. క. ఆమె. ఆవె; తె.

-తాబేలు,'తాంబేలు. కవి. తాబెలి.'(DED. 4232) ఇయరకులు, గాజులకాపు, కొవ్వుల వెలమల్లో ఇంటిపేరు. (CTSI. VII) -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ; గ్రామనా. ద్వి.

**1567. తిప్పనపల్లె** సిద్ధ 1.

వం. నామబం; వ్యక్తినామసూచి.

**తిప్పన-** గ్రామనా. ప్ర; నామబం; పు.నా. తిప్ప- కన్నెరాళ్ళులేని బోడిగా ఉన్న ఎత్తయిన ప్రదేశం; దిబ్బ; రాశి, గుట్ట; చిన్నకొండ. పోల్చిచూ. తె. దిబ్బ. త. తిప్పై; క. తిప్పె. దిబ్బ, దిబ్బు. పర్జి. దిప్ప, దిబ్బ (DED. 2641). -అన చూ. ఆరో. 3. పోల్చి చూ. కొండన్న. -పల్లె చూ; గ్రామనా. ద్వి.

**1568. తిప్పరాజుపల్లె** కడ. 109+.

[తిప్పరాజుపల్లె మెకం. 1119-145]

సంబ. నామబం. వ్యక్తినామసూచి.

**తిప్పరాజు-** గ్రామనా.ప్ర. నామబం.పు.నా. తిప్ప- వ్యక్తినా. ప్ర. చూ.ఆరో. 1567.- రాజు- చూ.ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1569. తిప్పరాజుపల్లె** రాజం. 61+.

చూ. ఆరో. 1568.

**1570. తిప్పరాజుపల్లె** బద్వే. 114. ..

**1571. తిప్పలూరు** కమ. 28.

[తిర్పలూర.625 50E. I. XXVI. 42. 233. 7-8; తిప్పలూరి తెకవుకు 1518 SII XVI. 66-15; తి ప్ప లూ రు మెకం. 1119-244. 1210-31].

వంబ. నామబం. సామాన్యనామసూచి. ఉన్నతభూసూచి.

**తిప్పలు-** [తిర్ప-] గ్రామనా. ప్ర. బహు. చూ. ఆరో. 1567. తెలుప ఈ ఊరిపేరులోని ప్రథమావయవం తెర్ప 'పదసంబంధం అయి ఉండవచ్చునని రాధాకృష్ణ.' (ప్రా. శా. తిర్ప లూర). గ్రామనైసర్గిక స్వరూప పరిశీలనను బట్టి తిప్పపదమే అని నిర్ణయించవచ్చు. గ్రామం ఎత్తయిన ప్రదేశం మీద ఉంది. శాసన రూపం తిర్ప- లేఖన ప్రమాదం కావచ్చు. -ఊరు చూ. గ్రామనా. ద్వి.

**1572. తిప్పాయపల్లె** కడ. 1+.

[తిప్పయపల్లె మెకం. 1229-37]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**తిప్పాయ-** [తిప్పయ-] గ్రామనా. ప్ర. నామబం; పు.నా. తిప్ప- చూ. ఆరో. 1567. -అయ చూ. ఆరో. 4; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

**1573. తిప్పాయపల్లె** రాజం. 73.

చూ. ఆరో. 1572.

**1574. తిప్పారెడ్డిపల్లె** కడ. 27+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**తిప్పారెడ్డి-** గ్రామనా. ప్ర; నామబం; పు.నా. తిప్పా- వ్యక్తినా. ప్ర.తిప్ప ల తిప్పా చూ. ఆరో. 1567, -రెడ్డి చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1575. తిప్పిరెడ్డిపల్లె** కడ. 88.

[తిప్పిరెడ్డిపల్లె మెకం. 1240-96]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**తిప్పిరెడ్డి-** గ్రామనా.ప్ర.తిప్ప+ఇ ల తిప్పా రెడ్డి చూ.ఆరో.1574. -పల్లె చూ.గ్రామనా.ద్వి.

**1576. తిప్పిరెడ్డిపల్లె** ప్రొద్దు. 58+.

చూ. ఆరో. 1575.

**1577. తిప్పిరెడ్డిపల్లె** ప్రొద్దు. 78

[తిప్పిరెడ్డిపల్లె మెకం. 1126-80]

చూ. ఆరో. 1575.

1578. తిమ్మక్కగారిపల్లె రాయ. 100+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
తిమ్మక్కగారి- గ్రామనా. ప్ర; నామబం. తిమ్మక్క- నామబం; స్త్రీనా. తిమ్మ- తిమ్మఁడు, తిమ్మన్న కోతి పోల్చు చూ. త. తిమ్మన్. క. తిమ్మ. (DED. 2650). హనుమంతుని పేరు. దేవతాసూచి. తిరుమల + అక్క- అని కొందరు. చూ. ఆరో. 1605. -అక్క- చూ. ఆరో. 11; -గారి- చూ.ఆరో. 6. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1579. తిమ్మప్పగారిపల్లె సిద్ధ. 71+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి;
తిమ్మప్పగారి- గ్రామనా. ప్ర; నామబం; తిమ్మప్ప- నామబం; పు. నా. తిమ్మ- చూ. ఆరో. 1578; -అప్ప చూ. ఆరో. 78; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1580. తిమ్మమాంబాపురం రాజం. 18.
సంబ. నామబం. వ్యక్తినామసూచి.
తిమ్మమాంబా- గ్రామనా. ప్ర; నామబం. స్త్రీనా. తిమ్మ- చూ. ఆరో. 1578; -అమ చూ. ఆరో. 1; -అంబా ల అంబ చూ. ఆరో. 11. -పురం చూ. గ్రామనా. ద్వి.

1581. తిమ్మయ్యగారిపల్లె రాజం. 26+.
సంబ. నామబం. వ్యక్తినామసూచి.
తిమ్మయ్యగారి గ్రామనా. ప్ర; నామబం. తిమ్మయ్య- నామబం; పు. నా. తిమ్మ- చూ. ఆరో. 1578; -అయ్య చూ. ఆరో. 4; -గారి- చూ. ఆరో. 6. పల్లె- చూ. గ్రామనా. ద్వి.

1582. తిమ్మరాజుపల్లె రాజం. 5.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
తిమ్మరాజు- గ్రామనా. ప్ర. నామబం. తిమ్మ- చూ. ఆరో. 1578; -రాజు- చూ. ఆరో. 49; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

1583. తిమ్మరాజుపల్లె రాజం. 6+.
చూ. ఆరో. 1582.

1584. తిమ్మరాజువల్లె బద్వే 121+.
[తిమ్మరాజువల్లె మెకం. 1170-22]
చూ. ఆరో. 1582.

1585. తిమ్మసముద్రం రాయ. 118+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
తిమ్మ- వ్యక్తి. నా. చూ. ఆరో. 1582; -సముద్రం చూ. గ్రామనా. ద్వి.

1586. తిమ్మాడివాండ్లపల్లె రాయ. 117+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
తిమ్మాడివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. తిమ్మాడి- కుటు.నా. (< తిమ్మాడ్డి < తిమ్మారెడ్డి) చూ. ఆరో. 1594. కడపమాండలికంలో గ్రామీణ వ్యవహారంలో -రెడ్డి గల పదబంధాలలో 'రె' కు లోపం గమనార్హం. పోల్చుచూ. కొండారెడ్డి ల కొండాడ్డి, సుబ్బారెడ్డి ల సుబ్బాడ్డి, తిప్పారెడ్డి ల తిప్పాడ్డి ల తిప్పాడి, -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1587. తిమ్మాపురం కడ. 41+.
? సంబ. నామబం; వ్యక్తినామసూచి.
తిమ్మా- గ్రామనా. ప్ర; వ్యక్తినా, ల తిమ్మ చూ. ఆరో. 1582. -పురం చూ. గ్రామనా. ద్వి.

1588. తిమ్మాపురం జమ్మ. 55.
పర్యా. శ్రోత్రియం తిమ్మాపురం. చూ. ఆరో. 1587.

1589. తిమ్మాపురం జమ్మ. 134.
[తిమ్మాపురం మెకం. 1119 - 264; నామా. త్ర్యంబకపురం మెకం. 1180-151.] మెకంజీలోని నామాంతరం వ్యవహారంలో లేదు.

1590. తిమ్మాపురంపేట పులి. 49.
సంబ. నామబం; గ్రామనామసూచి.
తిమ్మాపురం- గ్రామనా. ప్ర; నామబం; చూ. ఆరో. 1587. _పేట చూ. గ్రామనా.ద్వి.

లోకనిరుక్తి: "Thimmayya originally built this village and hence was named after him as Thimmaya Palle. But soon it developed into a trade centre as commodities brought on bullock carts and donkeys were stored here and taken to the neighbouring villages as head loads. Afterwards, with the growth of its size, the name Thimmayapalle changed into Thimmapuram Pet." (F.F. 1961, 25)

1591. తిమ్మాయపల్లె ప్రొద్దు. 58+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
తిమ్మాయ- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. తిమ్మ- చూ. ఆరో. 1582; -అయ- 4; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1592. తిమ్మాయపల్లె ప్రొద్దు. 83+.
చూ. ఆరో. 1591.

1593. తిమ్మాయపాలెం రాజం. 111.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
తిమ్మాయ- గ్రామనా.ప్ర.చూ.ఆరో.1591; -పాలెం చూ. గ్రామనా. ద్వి.

1594. తిమ్మారెడ్డిగారిపల్లె రాయ.8+.
సంబ. నామబం. వ్యక్తినామసూచి.
తిమ్మారెడ్డిగారి- గ్రామనా. ప్ర; నామబం. తిమ్మారెడ్డి- నామబం; పు.నా. తిమ్మా- ~ తిమ్మ చూ. ఆరో. 1582; -రెడ్డి చూ. ఆరో. 6; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1595. తిమ్మారెడ్డిగారిపల్లె రాయ.61+.
చూ. ఆరో. 1594.

1596. తిమ్మారెడ్డిగారిపల్లె రాయ.118. ,,

1597. తిమ్మారెడ్డిపల్లె కడ. 8.+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
తిమ్మారెడ్డి- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 1594. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1598. తిమ్మారెడ్డిపల్లె రాజం. 76+.
[తిమ్మారెడ్డిగారిపల్లె మెకం.1223-135]
చూ. ఆరో. 1594.

1599. తిమ్మారెడ్డిపల్లె రాజం. 92+.
చూ. ఆరో. 1594.

1600. తిమ్మారెడ్డిపల్లె బద్వే.94+. ,,

1601. తిమ్మారెడ్డిపల్లె జమ్మ. 14+.
[తిమ్మారెడ్డిపల్లె మెకం. 1118-23; 1180-155] చూ. ఆరో. 1594.

1602. తిమ్మిపెట్టిపల్లె రాజం. 134+.
[తిమ్మిశెట్టివారిపల్లె మెకం. 1223-202]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
తిమ్మిపెట్టి- [తిమ్మిశెట్టివారి-] గ్రామనా. ప్ర; నామబం; పు.నా. తిమ్మి- (<తిమ్మ+ఇ)

తిమ్మ చూ. ఆరో. 1578. -ఇ చూ.ఆరో. 25 సెట్టి [-శెట్టి-] చూ. ఆరో. 751; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1603. తిరుణంపల్లె రాజం. 17.
[తిరుణంపల్లె మెకం. 1134-311; తిరణంపల్లె మెకం. 1223 19]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

తిరుణం- [తిరణం-] గ్రామనా. ప్ర. తిరుణాము కు.నా. వైష్ణవదేవతాలయాల్లో ఊదే ఒకరకం వాద్యం. -పల్లె చూ గ్రామనా.ద్వి.

లోకనిరుక్తి: తిరుమలమ్మ కట్టించి నందున దీనికి తిరుమలమ్మపల్లె అని స్థానిక చరిత్ర (మెకం. 1223-19)

1604. తిరునాయునిగారిపల్లె రాజం. 92+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

తిరునాయనిగారి- గ్రామనా.ప్ర;నామబం. తిరునాయని- నామబం, (తిరునాయడు+ఇ) తిరు- వ్యక్తినా. ప్ర. శుభకరము, పవిత్రము పోల్చిచూ. త. తిరు. క. తిరు. సం. శ్రీ నాయని- చూ. ఆరో. 101. -గారి- చూ. ఆరో. 6; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

1605. తిరుమలయ్యగారిపల్లె రాజం 76+.
[తిరుమలయగారిపల్లె మెకం. 1223-135]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

తిరుమలయ్యగారి- [తిరుమలయగారి-] గ్రామనా. ప్ర; నామబం. తిరుమలయ్య- నామబం; పు.నా. స్థలనామనిష్పన్నం. (తిరుమల+అయ్య) తిరుమల స్థలనా. తిరు- స్థలనా. ప్ర. -మల స్థలనా. ద్వి. కొండ, అడవి ఉండేకొండ. పోల్చి చూ. త. మలై. మ. మల క. మలె. పర్జి. మలంగ్ సం. మలయ- (DED. 3882); -అయ్య చూ.ఆరో. 4; -గారి- చూ. ఆరో. 6; పల్లె చూ. గ్రామనా. ద్వి.

1606 తిరుమలరాజుపేట రాజం. 36.
[తిరుమలరాజుపేట మెకం. 1134-328 నామా. నాగయపేట మెకం. 1134-328.]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

తిరుమలరాజు- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. తిరుమల- చూ. ఆరో. 1605;- రాజు చూ. ఆరో. 49; -పేట చూ. గ్రామనా. ద్వి.

1607. తిరుమలాయపల్లె జమ్మ. 31+.
[తిరుమలయపల్లె, తిర్మలయపల్లె, మెకం. 1118-19]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

తిరుమలాయ- [ల తిరుమలయ- తిర్మలయ-] గ్రామనా. ప్ర. చూ. ఆరో. 1605; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"క్రీ. శ. 1702 లో తిరుమలయ్య అనే వాడు ఈగ్రామాన్ని కట్టించినట్లు పల్లెకట్టు కవులు దృష్టాంతమున్నదని స్థానిక చరిత్ర. (మెకం. 1118-19)

1608. తిరువెంగళనాధరాజపురం రాజం. 87.
[తిరువేంగళనాధరాజుపురం అగ్రహారం మెకం. 1223-83; తిరువెంగళనాధపురం మెకం. 1134-337]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

తిరువెంగళనాధరాజ- [తిరువేంగళనాధరాజ-; తిరువెంగళనాధరాజు-] గ్రామనా. ప్ర. నామబం; పు.నా. తిరువెంగళనాధ- వ్యక్తినా.

ప్ర: తిరు- చూ: ఆరో. 1604; వెంగళనాథ- < వెంకటనాథ; -రాజ- చూ. ఆరో. 49; -పురం చూ. గ్రామనా. ద్వి.

క్రీ. శ. 1756 లో మట్ల వెంకట్రామరాజు తన తండ్రిపేర ఈ అగ్రహారాన్ని నిర్మించి నట్లు స్థానిక చరిత్ర (మెకం. 1223-83)

**1609. తిరువెంగళాపురం బద్వే. 94+.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

**తిరువెంగళా-** గ్రామనా. ప్ర; వ్యక్తినా. చూ. ఆరో. 1608. -పురం చూ. గ్రామనా. ద్వి.

**1610. తిరువెంగళాపురం బద్వే. 118+.**

[తిరువెంగళాపురం మెకం. 1170-20] చూ. ఆరో. 1609.

**1611. తుంగావారిపల్లె రాజం. 134+.**

[తుంగవారిపల్లె మెకం. 1119-99]

సంబ. నామబం; కుటుంబనామసూచి

**తుంగావారి-** [తుంగవారి-] గ్రామనా. ప్ర; నామబం. తుంగా- కు నా. < తుంగ- ఒక రకం కలుపు మొక్క, Cyperus genus cyperus rotundus పోల్చి చూ. క. తుంగె. తుంగ తు. తుంగాయి. పర్జి. తుంగ (DED 2690); కమ్మవారిలో ఇంటిపేరు. -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"తుంగా మల్లయ్య అనేవాడు" 17 వ శతాబ్ది ఉత్తరార్ధంలో కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1119-99)

**1612. తుడుములదిన్నె కడ. 8.**

[తుడుముల దిన్నె మెకం. 1210-23; 1240-77; తుడుముల దిన్న మెకం. 1240-73].

సబం. నామబం; సంఘటనాత్మకసూచి.

**తుడుముల-** గ్రామనా. ప్ర; బహు. (<తుడుములు + అ) తుడుము తుటుము ఒక రకం చర్మవాద్యం. పోల్చి చూ. త. తుడుం; తుడుమై, మ. తుటి. క. తుడుబు. కొడ. దుడి (DED. 1699). -దిన్నె [దిన్న-] చూ. గ్రామనా. ద్వి.

వల్లూరికి ఉత్తర భాగం పరువుదూరం దిన్నెపై వల్లూరి కోటలోవున్న ఠాణేదారు తుడుములు కొమ్ములతో కొంతమంది చౌకీ దార్లు కాచుక వుండేవారు. చౌకీదార్లు ఆ దిన్నెపై కాపురం వుండగా గ్రామమై, తుడుముల దిన్నె అనే పేరును పొందినట్లు స్థానిక చరిత్ర. (మెకం. 1240-77.)

**1613. తుమ్మకొండ రాజం. 118.**

వర్యా. తుమ్మకొండ అగ్రహారం.

సంబ. నామబం; వృక్షసూచి.

**తుమ్మ-** గ్రామనా. ప్ర. పొడుగాటి తెల్లటి ముళ్లుగల ఒక రకం చెట్టు; babool tree, Acacia arabica, Willd. పోల్చిచూ. త. తుంబమరం (DED. 526). -కొండ చూ. గ్రామనా. ద్వి.

**1614. తుమ్మగింజలవాండ్లపల్లె రాయ. 51+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

**తుమ్మగింజలవాండ్ల-** గ్రామనా. ప్ర: నామబం. తుమ్మగింజల- నామబం; కు.నా. బహు. (తుమ్మగింజలు+అ) తుమ్మ- చూ. ఆరో. 1613; -గింజ విత్తనం. పోల్చి చూ. క. గింజు (DED. 1276); -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1615. తుమ్మచెట్లపల్లె కడ. 88+.**

సంబ. నామబం; వృక్షసూచి.

**తుమ్మచెట్ల**- గ్రామనా. ప్రి; నామబం. బహు. (<తుమ్మచెట్టు+అ) తుమ్మ- చూ. ఆరో. 1613; -చెట్టు (<చెట్టు+అ) ఏక. చెట్టు. మాను; పోల్చి చూ. త. చెడి. మ. చెటి. క. గిడ, గిడు, చెట్టు. కొలా; కెట్ట్, చెట్ట్. (DED, 1613); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1616.** తుమ్మచెట్లపల్లె రాజం. 105+.
చూ. ఆరో. 1615.

**1617.** తుమ్మలఅగ్రహారం రాజం. 71+.
[తుంమ్మల అగ్రహారం మెకం. 1223-19].
సంబ. నామబం; వృత్తిసూచి.

తుమ్మల- [తుంమ్మల-] గ్రామనా. ప్రి; బహు. (<తుమ్మలు+అ) చూ. ఆరో. 1613; కొన్ని ఊర్లపేర్లలో తుమ్మల ఇంటి పేరుగా కన్పిస్తుంది. తుమ్మల రెడ్లల్లో, కమ్మవారిలో ఇంటిపేరు. చూ. ఆరో. 1621; -అగ్రహారం చూ. గ్రామనా. ద్వి.

**1618.** తుమ్మలపల్లె కమ. 88+.
[తుమ్మలపల్లె మెకం. 1229-47]
సంబ. నామబం. వృత్తిసూచి.

తుమ్మల- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1617; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

తుమ్మ అడవి నరికించి పల్లెకట్టినట్లు అందు వల్ల ఆ పేరు వచ్చినట్లు స్థానిక చరిత్ర. (మెకం. 1229-50).

**1619.** తుమ్మలపల్లె బద్వే. 115+.
చూ. ఆరో. 1617.

**1620** తుమ్మలపల్లె ప్రొద్దు. 80+. ..

**1621.** తుమ్మలపల్లె పులి. 23+; ..

**1622.** తుమ్మలపల్లె పులి. 54+. ..
చూ. ఆరో. 1617.

**1623.** తుమ్మలపల్లె పులి. 89+.
[తుమ్మలపల్లె మెకం. 1119-30]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

తుమ్మల అయ్యమరెడ్డి, కుంచెద్దుల నాగిరెడ్డి కట్టించినట్లు స్థానికచరిత్ర. (మెకం. 1119-30) ఈ గ్రామంలో తుమ్మల వంశీయు లున్నట్లు F. F. 1961, 28.

**1624.** తుమ్మలవారిపల్లె ప్రొద్దు. 85+.
సంబ. నామబం. కుటుంబ నామసూచి.

**తుమ్మలవారి**- గ్రామనా. ప్ర; నామబం. తుమ్మల- చూ. ఆరో. 1617; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1625.** తుమ్మలపాడు ప్రొద్దు. 57.
సంబ. నామబం; వృత్తిసూచి.

తుమ్మల- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1617; -పాడు చూ. గ్రామనా. ద్వి.

**1626.** తుమ్మలూరు కడ. 106.
[తుమ్మలూరు మెకం. 1225-3].
సంబ. నామబం; వృత్తిసూచి.

తుమ్మల- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 1617; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

**1627.** తురకకొట్టాలు కడ. 67+.
సంబ. నామబం; కులసూచి.

తురక- గ్రామనా. ప్ర. ఒక మతం, ఒక జాతి, ఒక కులం; టర్కీ-దేశస్థుడు, యోధుడు, సైనికుడు, మహమ్మదీయులకు దక్షిణ భారతంలో తురకలని పేరు. పోల్చి చూ; ఉ. తుర్క్-, తుర్కీ-, తుర్కిస్తాన్. మరా. తుర్క-. హిం.

తురక్, తుర్క్. ఉ. తుర్క్. -కొట్టారు చూ. గ్రామనా. ద్వి.

1628. తురకపల్లె కడ. 86.

సంబ. నామబం; కులసూచి.

తురక- గ్రామనా. ప్ర. చూ. ఆరో.1627; పల్లె- చూ. గ్రామనా. ద్వి. పోల్చి చూ. ఎగువ తురకపల్లె; దిగువ తురకపల్లె.

1629. తురకపల్లె కమ. 30.

[తురకపల్లె మెకం, 1110-14; 1119-247] చూ. ఆరో; 1628.

నలుగురు ముస్లిం సోదరులు ఈ గ్రామాన్ని కట్టించారనీ, అక్కడ మొగల్ కాలానికి చెందిన కోట శిథిలా లున్నాయని స్థానికచరిత్ర. (F. F. 1961. 38).

1630. తురకపల్లె రాయ. 33+.

చూ. ఆరో. 1628.

1631. తురకపల్లె రాయ. 44+. ..

1632. తురకపల్లె రాయ. 81+. ..

1633. తురకపల్లె రాయ. 101+. ..

1634. తురకపల్లె రాయ. 104+. ..

1635. తురకపల్లె రాయ. 105+. ..

1636. తురకపల్లె రాయ. 111+. ..

1637. తురకపల్లె రాయ. 116+. ..

1638. తురకపల్లె రాజం. 55+. ..

1639. తురకపల్లె రాజం. 56+. ..

1640. తురకపల్లె రాజం. 131+. ..

1641. తురకపల్లె రాజం. 134+.

[తుర్కపల్లె మెకం. 1223-202]

చూ. ఆరో. 1628.

1642. తురకపల్లె రాజం. 143. ..

[తుర్కపల్లె మెకం. 1223-74]

చూ. ఆరో. 1628.

1643. తురకపల్లె సిద్ధ. 87+. ..

1644. తురకపల్లె సిద్ధ. 66+. ..

1645. తురకపల్లె ప్రొద్దు. 85+. ..

1646. తురకవాండ్లపల్లె ప్రొద్దు. 88+.

సంబ. నామబం; కులసూచి.

తురకవాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. తురక- చూ. ఆరో. 1628; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1647. తువ్వపల్లె కడ. 109+.

[తువ్వపల్లె మెకం; 1119-145]

సంబ. నామబం; సామాన్యనామసూచి. భూసూచి.

తువ్వ- గ్రామనా. ప్ర; తువ-, [తూ]; ౹ దువ్వ ౹ దుబ్బ తవుడులాగా ఉండే మెత్తని ఇసక నేల. పోల్చిచూ. త. దూని. గోం. దుబా దుబ, దుము. కువి. దూంబ్రి (DED. 2736); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1648. తువ్వపల్లె రాయ. 40+.

చూ. ఆరో. 1647.

1649. తువ్వపల్లె బద్వే. 16+. ..

1650. తువ్వపల్లె ప్రొద్దు 9+. ..

[తువ్వపల్లె మెకం. 1126-121]

1651. తువ్వపల్లె పులి. 31+.

చూ. ఆరో. 1647.

1652. తూగుల్లపల్లె ఖమ్మం. 119.

[తువ్వగుట్టపల్లె మెకం. 1118-144;
తువ్వగుట్టలపల్లె మెకం. 1118-143;
తువ్వగుట్లపల్లె మెకం. 1118 - 144;
తూగుల్లపల్లె మెకం. 1119 - 244;
1180-177]

సంబ. నామబం; స్థలనామసూచి.

తూగట్ల- [తువ్వగుట్ట-; తువ్వగుట్టల-; తువ్వగుట్ల-] గ్రామనా. ప్ర; సంబ. నామబం; స్థలనా, బహు. తూ- స్థలనా. ప్ర. ల తువ్వ చూ. ఆరో. 1647. -గుట్ల- [గుట్టల-] ఏక. గుట్ట చూ.ఆరో.412; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

ఇసుక, మన్ను కలిసివుండే గుట్టలుండే చోట వెలసిన గ్రామమనీ, ఆ గ్రామ ప్రాంతం లోనే తువ్వగుట్ల కోన అనే స్థలనామం ఉందనీ స్థానిక చరిత్ర (మెకం. 1118-144).

1653. తూడూరు సిద్ధ.25.

సంబ. నామబం; వృక్షసూచి.

తూడు- గ్రామనా. ప్ర; తూఁడు తూఁడు తీగె, తూటి(కాడ) చెరువుల్లోను, చెమ్మనేల ల్లోనూ పెరిగే కలుపు మొక్క; Ipomae reptans, poir, Ipomae acquatica. Forsk పోల్చిచూ. తూఁడు- తామరకాడ. -ఊరు చూ. గ్రామనా. ద్వి.

1654. తూముకుంట రాయ. 21.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

తూము- గ్రామనా. ప్ర; కు.నా. నీళ్ల వెలుపలికి పొయ్యేదారి. ఒక ధాన్యపు కొలత; 4 కుంచాలు; 32 మానికలు, 80 సెంట్లు మొ. (మాం. వృ.కో. 1. 444). పోల్చి చూ. తె. తూము త. తూంవు. మ. తూంపు. క. తుంబు. పర్జి. తుంబొత్త, తుంబుక్క (DED. 2786) ముత్రాచ వాండ్లలో 'తూము' (కొలత) ఇంటి పేరు (CTSI. VII, Tumu) -కుంట చూ. గ్రామనా. ద్వి.

1655. తూర్పుఆనంతపురం ప్రొద్దు.58

వి; బం; దిక్సూచి.

తూర్పు- తూరుపు గ్రామనా. ప్ర; ఒక దిక్కు. పోల్చిచూ. క. తూఱు. మ. తూరుక మొ. (DED. 2795) -అనంతపురం గ్రామనా. ద్వి.

1656. తూర్పుపల్లె రాయ. 63+.

వి. బం; దిక్సూచి.

తూర్పు- గ్రామనా. ప్ర. చూ.ఆరో.1655.
-పల్లె చూ. గ్రామనా. ద్వి.

1657. తూర్పుపల్లె రాయ. 81+.

చూ. ఆరో. 1655.

1658. తూర్పుపల్లె రాజం. 25. ..

1659. తూర్పుపల్లె రాజం.131+. ..

1660. తూర్పుపోలివాండ్లపల్లె,

రాయ. 81+.

వి.బం; దిక్సూచి.

తూర్పు- గ్రామనా. ప్ర; చూ.ఆరో.1655.
-పోలివాండ్లపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. 2305.

1661. తెలగాపురం సిద్ధ. 1+.

సంబ. నామబం; కులసూచి.

తెలగా- గ్రామనా. ప్ర. కులనా. ఒక కులం. తెలికికాపులు; తెలగవారు. త్రిలింగ

శబ్దభవమని సూ.ని. తైలిక శబ్దభవమని కుందూరి ఈశ్వరదత్తు. (నా.శ.కో.) -పురం చూ. గ్రామనా. ద్వి.

1662. తెలికి పులి. 76.

అసమస్తం. కులసూచి.

[తెలిక + ఇ] తెలికవాడు గాండ్లవాడు (సూ.ని). పోల్చిచూ. పో.వ. తెలిక [< సం. తిలకః] నువ్వులమొక్క; నువ్వులు ఆడి నూనె, తెలికపిండి అమ్ముకొని జీవించే కులం. చూ. అరో. 1661.

1663. తేరరామయ్యపల్లె పులి. 62+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

తేరరామయ్య- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. తేర- కు.నా. ? < తేరు < తేఱు రథం. -రామయ్య రామ- [< సం. రామః] -అయ్య చూ. అరో. 4; పల్లె చూ; గ్రామనా. ద్వి.

1664. తేళ్లపాడు బద్వే. 18.

[తేళ్లపాడు 1550 AR 41-42; B 49]

సంబ. నామబం; జంతుసూచి.

తేళ్ల- గ్రామనా. ప్ర. బహు (< తేళ్ల+అ) ఏక. తేలు. పోల్చి చూ. త. తేళ్; మ. తేళ్. క. చేళ్, తేళ్. తు. చేళు తేలు (DED. 2855). -పాడు చూ. గ్రామనా. ద్వి.

1665. తేళ్లూరు పులి. 89.

[తేళ్లూరు మెకం. 1119-25]

సంబ. నామబం; జంతుసూచి.

తేళ్ల- గ్రామనా. ప్ర. చూ. అరో. 1664; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

ఈ గ్రామ స్థలంలో "విస్తారముగ వృశ్చిక దర్శనం" జరుగుతూ ఉండేది కాబట్టి, ఈ ఊరిపేరు తేళ్లూరు అయిందని స్థానిక చరిత్ర (మెకం. 1119-242)

1666. తొండలదిన్నె ప్రొద్దు. 22.

[తొండలదిన్నె మెకం. 1126-87]

సంబ. నామబం: జంతుసూచి.

తొండల- గ్రామనా. ప్ర; బహు. (తొండలు+అ) ఏక. తొండ A Chameleon. పోల్చి చూ. క. తొండె, తొణ్డె, దొణ్డె. (DED 2882); -దిన్నె చూ. గ్రామనా. ద్వి.

1667. తొండూరు పులి. 94.

[తొండూరు మెకం. 1119-2]

సంబ. నామబం; జంతుసూచి.

తొండ- గ్రామనా. ప్ర; చూ. అరో. 1666; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

1668. తొగటపల్లె రాయ. 82+.

సంబ. నామబం; కులసూచి.

తొగట- గ్రామనా. ప్ర; కులనా. తొగట వాళ్లు తొగటవీరులు. నేతపని చేసే వాళ్లలో ఒక తెగ; చౌడేశ్వరివరంవల్ల పుట్టినవాళ్లమని క్షత్రియులమని చెప్పి, జందెం వేసుకొనే ఒక కులం (మాండ. వృ.ప. IV. 1971) తెలుగు నేతపనివాళ్లు; పేదవాళ్లు ధరించే ముతకబట్టలు నేసేవాళ్లు. బట్టల అద్దకంపని మొదట తొగటలు చేసేవాళ్లని లక్ష్మీరంజనంగారు "ఆంధ్రుల సంస్కృతి చరిత్ర"లో వ్రాసియున్నారు. కడపజిల్లాలో తొగటవాళ్ల సంఖ్య ఎక్కువ. (CTSI, VII. Thogata) పోల్చి చూ. తె. తొగరు, తొగురు, ఎర్రరంగు, ఎర్రనూలు. తొగరు చెట్టు-ఒకరకం చెట్టు; దీని చెక్కతో ఒక రకం ఎరుపురంగు తయారుచేస్తారు. త. తుకిర్, తువర్, తువరి, క. తొగరు (DED, 2686); తొగరు మూసుకమ్మవాండ్లల్లో ఇంటిపేరు కూడా. (CTSI. VII.) -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1669. తొగటపల్లె రాయ. 86+.
చూ. ఆరో. 1668.

1670. తొగటపల్లె రాయ.116+. ..

1671. తొగరుపల్లె రాయ. 110+.
సంబ. నామబం; వృక్షసూచి.
తొగరు- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 1668; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1672. తొగరుపల్లె రాయ. 118+.
చూ. ఆరో. 1671.

1673 తొట్టికాడపల్లె రాయ. 9+.
స్థలా. నామబం; స్థలాసూచి.
తొట్టికాడ- గ్రామనా. ప్ర; తొట్టి నీళ్లుంచుకొనే పాత్ర; నీలిమందు మొదలైనవి తయారుచేసే నీలితొట్టి. పోల్చు చూ. త. తొట్టి. మ. తొట్టి. క. తొట్టి. తు. తొట్టి (DED. 2868) -కాడ- చూ. ఆరో. 417; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1674. తొట్టివారిపల్లె బద్వే. 135+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
తొట్టివారి- గ్రామనా. ప్ర; నామబం. తొట్టి- కు.నా. చూ. ఆరో. 1673; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1675. తొర్రివేముల అమ్మ. 75.
[తొఱవేముల 1543 AR 40-41 B 367; తొఱ్ఱివేముల మెకం. 1118-167; 1180-181; తొఱ్ఱెముల మెకం. 1180-153; తొర్రవేముల మెకం. 1118-172; 1169-60; తొర్రవేముల మెకం. 1118-24] నామా. వెంగళాబిసముద్రం. [మెకం. 1169-60.]
వి- బం; విశేషణసూచి.

తొర్రి- [తొఱ; తొఱ్ఱి-; తొర్ర-;] గ్రామనా ప్ర. ఱ తొర్ర ఱ తొఱ్ఱి బోదె మొదటిలో వుండే పెద్ద బొరక. పోల్చు చూ. త. తొఱ, తొఱ్ఱి తొఱట, క. తొఱలు, తొఱలె, తొతె, దొతె (DED 2912); -వేముల చూ. గ్రామనా. ద్వి.

1676. తోకలపల్లె బద్వే 84+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
తోకల- గ్రామనా. ప్ర; కు.నా. బహు. (తోకలు + అ) ఏక. తోక- ఱ తోఁక పోల్చి చూ. త.తోగై. మ.తోక. క. తోకె. నాయి. తోక. పర్జి. తోక (DED. 2916) తోక(ల) ఎరుకలవాళ్లలో ఇంటిపేరు. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1677. తోటపల్లె రాయ. 81+.
సంబ. నామబం. కుటుంబనామసూచి.
తోట- గ్రామనా. ప్ర. కు.నా. వనం. ఱ తోఁట; తోఁటె, తోంట (ప్రా.శా.) పోల్చిచూ. తె. తోఁపు. క. తోట;తు.తోదుని. త. తోప్పు, తోప్, తోట్టం. మ. తోంటుక;తోట్టం. (DED. 2927). తోట బలిజల్లో ఒక శాఖ. బోయ. చెంచు, వాడబలిజ, ముత్రాచ, కాపు, యానాదుల్లో ఇంటి పేరు. (CISI. VII. Thota) -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1678. తోటపల్లె రాయ. 111+.
చూ. ఆరో. 1677.

1679. తోటవాండ్లపల్లె రాయ. 40+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
తోటవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. తోట- చూ. ఆరో. 1677; -వాండ్ల- చూ. ఆరో. 1; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1680. తోట్లపల్లె బద్వే. 48.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

తోట్ల- గ్రామనా. ప్ర; కు. నా. బహు. చూ. ఆరో. 1677; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1681. తోపులోపల్లె రాజం. 114+.

స్థలా. నామబం. స్థలాసూచి.

తోపులో- గ్రామనా. ప్ర; తోపు- ల తోపు తోట పోల్చి. చూ. త. తోప్పు. మ. తోప్పు. క. తోపు. (DED. 2929, -లో- స్థలార్థకం, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1682. తోళ్ళగంగనపల్లె కడ. 51.

[తోళ్ళగంగన పల్లె మెకం. 1240-33]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

తోళ్ళగంగన- [తోళ్ళగంగవ-] గ్రామనా. ప్ర; నామబం. పు. నా. తోళ్ళ- కు.నా; బహు (<తోళ్ళు+అ) ఏక. తోలు-చర్మం. పోల్చిచూ. తె. తొక్క. త. తోల్, తొక్కు. మ. తోల్, తొలి; క. తోల్ (ఆ , తొగల్, తొవల్ నాయి. తోల్. పర్జి. తోల్ . కువి. తోలు/ ? త. తొక్కు మొ. సం. త్వక్ (DED 2937). -గంగన పు.నా; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1683. త్రిపురవరం కడ. 11.

[తి్రపురవరం మెకం. 1229-37]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

త్రిపుర- గ్రామనా. ప్ర; [<సం.త్రిపురః] వరం- చూ. గ్రామనా. ద్వి.

కుముద్వతి, పాపాగ్ని, పాగేరు నదుల సంగమ ప్రదేశాన త్రిపురేశ్వర దేవాలయం ఉన్నందున ఈ గ్రామానికి తి్రపురవరం అనే పేరు వచ్చినట్లు స్థానికచరిత్ర (మెకం. 1229-37).

1684. దండాలపల్లె సిద్ధ. 77+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

దండువాండ్ల పల్లె కురూపం. చూ. ఆరో. 1685; 1686.

1685. దండుపల్లె కమ. 6+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

దండు- గ్రామనా. ప్ర. కు. నా. గుంపు. సేన. పోల్చి చూ. త. తండం. మ. దండం. క, దండ / సం. దండః వివరాలకు చూ. DBIA 186. దండు ఈడిగల్లో ఒక శాఖ. బోయల్లో కాపులో ఇంటిపేరు; (CTSI. 11), -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1686. దండువాండ్లపల్లె రాయ. 49+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

దండువాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. దండు కు.నా. చూ. ఆరో. 1685; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1687. దండువాండ్లపల్లె రాయ. 61+.

చూ. ఆరో. 1686.

1688. దండువాండ్లపల్లె రాయ.

183+. ..

1689. దండుపిద్దుపల్లె సిద్ధ. 25+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

దండు- గ్రామనా. ప్ర; కు.నా. చూ. ఆరో. 1685; -పిద్దుపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. సిద్దుపల్లె.

1690. దండూరువాండ్లపల్లె రాయ.

100+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

దండూరువాండ్ల - గ్రామనా.ప్ర;నామబం.
దండూరు- కు.నా; గ్రామనా; ప్ర;
దండు- చూ. ఆరో. 1685; -ఊరు చూ.
గ్రామనా. ద్వి. చూ. పోల్చిచూ. ఆరో. చిన్న
దండ్లూరు, పెద్ద దండ్లూరు, -వాండ్ల- చూ.
ఆరో. 2. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1691.** దండూరువాండ్లపల్లె రాయ. 110+.

చూ. ఆరో. 1690.

**1692.** దంతెలపల్లె బద్వే. 76+.

సంబ. నామబం; కుటుంబ నామసూచి.

దంతెల- గ్రామనా. ప్ర. కు. నా; బహు;
(దంతెలు+అ) ఏక. దంతె శ్రేణి. దూలంమీద
అడ్డంగాగాని, దూలానికి బదులుగాగాని, గోడల
మీద కప్పుకు ఆధారంగా వేసే చెక్కనవాసం;
పండ్లపార (మాం. వృ. ప. IV); దంతె-
వృక్షవిశేషంకూడా. -పల్లె చూ.గ్రామనా.ద్వి.

**1693.** దత్తాపురం జమ్మ. 32+.

[దత్తాపురం మెకం. 1112 - 130, 1180-162, 1119-58].

సంబ. నామబం. వ్యక్తినామసూచి.

దత్తా- గ్రామనా. ప్ర; వ్యక్తినా. దేవతా
సూచి. [<సం. దత్తాః] -పురం చూ.గ్రామ
నా; ద్వి.

కొండూవత్తు అనే బ్రాహ్మణుడు తనపేర
ఈ గ్రామాన్ని కట్టించినట్లు స్థానిక చరిత్ర.
(మెకం. 1112-130) దత్తాత్రేయ స్వామిపేర
ఈ ఊరిపేరు వెలసినట్లు మరొక కథనం.
(FF, 1961, 48) దత్తం చేయబడిన గ్రామం
అనే వ్యుత్పత్తి చెప్పడానికి కూడా వీలుంది.

**1694.** దద్దనాల ప్రొద్దు. 4.

అస్పష్టనామబంధం.

దద్దన- గ్రామనా. ప్ర; ? < దద్దడము,
దద్దళము బోడిమిద్దె, అల్పశిలాకుటీరము, చిన్న
గుడి, దేవాలయము. అల-చూ. గ్రామనా.ద్వి.

**1695.** దప్పల్లె జమ్మ. 81.

[దప్పల్లి మెకం 1180-177].

అస్పష్టనామబంధం.

దప్ప- గ్రామనా.ప్ర. వ్యుత్పత్తి అస్పష్టం
-పల్లె [లు-పల్లి] చూ. గ్రామనా. ద్వి. పోల్చి
చూ. ఆరో. 1696.

**1696.** దప్పేపల్లె రాయ. 33.

సంబ; నామబం; సామాన్యనామసూచి.
వృత్తిసూచి.

దప్పే- గ్రామనా. ప్ర. ? <హిం. దఫే
దార్. చూ. ఆరో. 1695; -పల్లె చూ. గ్రామ
నా. ద్వి.

"During the period of Reddy Kings, the Village has been under the control of a Daphedar. Hence it acquired the name Dappepalle, in course of time (FF. 1961, 7)

**1697.** దబ్బుడుపల్లె జమ్మ. 25+.

[దబ్బుడుపల్లె మెకం. 1118-12]

అస్పష్టనామబంధం.

దబ్బుడు- గ్రామనా. ప్ర. వ్యుత్పత్తి అస్పష్టము. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1698.** దమ్మనపల్లె బద్వే. 83.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దమ్మన- గ్రామనా: ప్ర; నామబం; పు.నా:
దమ్మ- వ్యక్తినా. ప్ర. < ప్రా. దమ్మ

[<సం. ధర్మః-]-అన చూ. ఆరో. 3; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1699. దమ్మవపల్లె బద్వే. 102+.
చూ. ఆరో. 1698.

1700. దయ్యాలవారిపల్లె రాయ. 44+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

దయ్యాలవారి- గ్రామనా. ప్ర; నామబం; దయ్యాల- కు. నా. బహు. ఏక. దయ్యం [<సం. దైవమ్]; -వారి- చూ; ఆరో. 8.; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1701. దర్జీపల్లె పిద్ద. 41.
సంబ. నామబం; సామాన్యనామసూచి. వృత్తిసూచి.

దర్జీ- గ్రామనా. ప్ర. కుట్టుపనివాడు పోల్చిచూ. ఉ. దర్‌జీ- ప. దర్‌జీ. హిం. దర్‌జీ; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1702. దార్నాళిపల్లె రాజం. 119+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

దార్నాళి- గ్రామనా. ప్ర; కు. నా; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1703. దర్భావారిఅగ్రహారం బద్వే. 52.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

దర్భావారి- గ్రామనా. ప్ర; నామబం. దర్భ- కు. నా. తృణవిశేషం Poa cynosbroides పోల్చిచూ. త. దరుప్పై, దర్పై. క. దర్భ, దర్బె, దర్బె / సం. దర్భ- పాళి. దబ్భ- (DBIA. 193) -వారి- చూ; ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1704. దళవాయిపల్లె రాజం. 86.
[దళ్వాయిపల్లె మెకం. 1223-43]
సంబ. నామబం; సామాన్య నామసూచి. వృత్తిసూచి.

దళవాయి- [దళ్వాయి]- గ్రామనా. ప్ర సైన్యాధిపతి. సుంకరికి సహాయుడైన ఉద్యోగి. పోల్చిచూ. తె. దళము, దడము. త. దళం. మ. తళం, దళం, దళవాయి. క. దళ, దళవాయి. తు. దళవాయి / సం. దల- హిం. దల్. మరా. దళ్. (DBIA. 196); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1705. దవంతరంపల్లె పిద్ద. 48.
అస్పష్టనామబంధం.

దవంతరం- గ్రామనా. ప్ర. కురూపం; -పల్లె చూ. గ్రామనా. ద్వి. (?< దౌలత్‌రాంపల్లె < దౌలత్‌రావుపల్లె కురూపం కావచ్చునేమో).

1706. దాదిరెడ్డిపల్లె కమ. 61.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దాదిరెడ్డి- గ్రామనా. ప్ర; నామబం;పు.నా. దాది- వ్యక్తినా. ప్ర; పెంచిన తల్లి పోల్చిచూ. త.తాది. క. దాది / సం. ధాత్రీ. ప్రా. ధాఈ, ధత్తీ; -రెడ్డి చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1707. దానంరెడ్డిగారిపల్లె రాయ.26+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దానంరెడ్డిగారి- గ్రామనా. ప్ర; నామబం. దానంరెడ్డి- నామబం;పు నా. దానం- [<సం. దానమ్] -రెడ్డి చూ. ఆరో. 6; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1708. దానవులపాడు జమ్మ. 113.
[దాన వులపాటి] 1406 SII. XVI. 21-12, 13. దానవులపాడు మెకం. 1118 - 134; 1180-150; 1204-5 దానువుఁపాడు మెకం. 1119-242]
సంబ. నామబం. మతసూచి.

దానవుల- [దానువుల-] గ్రామనా. ప్ర; (<దానవులు + అ) ఏక. దానవుడు [<సం. దానవః] -పాడు చూ. గ్రామనా. ద్వి.

లోకనిరుక్తి: "రాక్షసుల నివాసస్థలమనీ, అది జైనుల స్థావరమనీ" స్థానిక చరిత్ర (మెకం. 1204-13) చూ. ఆరో. 1370. కడప జిల్లా జైనమత ప్రభావం వివరాలకు చూ. APDGC. 143, 742.

1709. దామనచెర్ల రాజం. 22.
[దామనచర్ల మెకం. 1134 - 287; 1134-193]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దామన- గ్రామనా. ప్ర; నామబం; వ్యక్తినామసూచి. పు.నా. దామ- [<సం. ధర్మ-] -అన చూ. ఆరో. 3; -చెర్ల [~ -చర్ల] చూ. గ్రామనా. ద్వి.

1710. దాయంఖాన్‌పల్లె కడ. 6.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దాయంఖాన్- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. దాయం- వ్యక్తినా. ప్ర. ఖాన్. చూ. ఆరో. 152. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1711. దాసరిపల్లె రాజం 77+.
[దాసరిపల్లె మెకం. 1223-135]
సంబ. నామబం; కులసూచి.

దాసరి- గ్రామనా. ప్ర. కులనా. బ్రాహ్మణేతర వైష్ణవభక్తుడు; ఒక కులం, దాసరివాండ్లు. బలిజ, పల్లి, వల్లువ, గంగెద్దుల, గొల్ల దాసర్లున్నారు. (CTSI. II.) పోల్చి చూ. క. దాచరి, దాసన్, క దాస, దాసర, దాసరి; దాసహాపు, దాసరహాపు, దాసరిహాపు / సం. దాసః- (DBIA. 201): -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1712. దాసరిపల్లె ప్రొద్దు. 9.
చూ. ఆరో. 1711.

1713. దాసరిపల్లె బద్వే. 92+. ..

1714. దాసరివాండ్లపల్లె రాయ. 26+.
సంబ. నామబం; కులసూచి.

దాసరివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. దాసరి- చూ. ఆరో. 1711, -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1715. దాసుపల్లె జమ్మ. 69+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దాసు- గ్రామనా. ప్ర; పు. నా. సేవకుడు. వైష్ణవ భిక్షకకులంవాడు. పోల్చి చూ. ఆరో. 1711; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1716. దిగువఒడ్డెపల్లె రాయ 31+.
స్థలా. నామబం. స్థలాసూచి.

దిగువ- గ్రామనా. ప్ర. కిందిభాగం. పో. వ. దిగు; దిగ్గు; దిగ్గ, దిగు, దిగ, దిగియ, దిగ్గియ; దింకు; దించు, దించు; దింపు, దింపు, దిగుచు; దిందు వ్యుత్పత్తి విశేషాలకు చూ. DED. 426. -ఒడ్డెపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. ఒడ్డెపల్లె.

1717. దిగువఒడ్డెపల్లె రాయ. +46
చూ. ఆరో. 1716.

1718. దిగువఒడ్డెపల్లె రాజం. 75+. ..

1719. దిగువఒడ్డెపల్లె రాజం 128+.
చూ. ఆరో. 1716.

1720. దిగువకంచరపల్లె రాయ. 61+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; -కంచరపల్లె గ్రామనా. ద్వి. నామబం; కుల సూచి. కంచర- కంచరి కంచువని చేసే ఒక కులం. పోల్చిచూ. తె.కంచు. త. కంచం; కంచకారన్. క. కంచు. కంచ; కంచగార. తు. కంచి, కంచు/సం. కంసమ్; కాంస్యకారః (DBIA. 67); -పల్లె చూ. గ్రామనా. ద్వి. పోల్చిచూ. ఎగువ కంచరపల్లె.

1721. దిగువకల్వటాల జమ్మ.3.
[కలవటాల మెకం 1204-188; దిగువ కలవటాల మెకం. 1204-183]
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర;చూ. ఆరో. 1716; కల్వటాల [-కలవటాల] గ్రామనా. ద్వి; గ్రామనా; అస్పష్టనామబంధం. ? <కలవ ఉ కలువ-+ట్-+అల.

1722. దిగువకొత్తపల్లె రాయ.66+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; -కొత్తపల్లె గ్రామనా.ద్వి; గ్రామనా. నామబం. చూ. ఆరో. కొత్తపల్లె. పోల్చి చూ. ఆరో. కొత్తపల్లె రాయ. 66.

1723. దిగువకొత్తూరు పిద్ద. 80+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; -కొత్తూరు గ్రామనా. ద్వి; గ్రామనా; నామబం. పోల్చి చూ. ఆరో. కొత్తూరు పిద్ద 80+.

1724. దిగువగొట్టిపీడు రాయ. 53+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; గొట్టిపీడు- గ్రామనా.ద్వి; గ్రామనా; నామబం వృక్షసూచి. గొట్టి- గొట్టె; వర్యా. గొటికె. పొదగా పెరిగే ఒక ముళ్లచెట్టు; Zizyphus xylopyrus. willd., ? Rhamnus xylophyrus పోల్చిచూ. గోం, ఘోటిఅ, ఘటోల్ మటి / సం.ఘోంట (DED. 1723); -పీడు చూ. గ్రామనా. ద్వి.

1725. దిగువచెందువాయి పిద్ద. 26+.
స్థలా. నామబం. స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716. -చెందువాయి గ్రామనా. ప్ర; గ్రామనా. నామబం; పోల్చిచూ. చెందువాయి.

1726. దిగువతంబళ్ళపల్లె బద్వే. 7.
స్థలా. నామబం; కులసూచి.
దిగువ- గ్రామనా. ప్ర. చూ. ఆరో.1716. -తంబళ్ళపల్లె గ్రామనా.ద్వి. చూ.ఆరో.1531. పోల్చిచూ. ఎగువ తంబళ్ళపల్లె.

1727. దిగువతాటిగుంట్లపల్లె రాయ. 106+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర.చూ. ఆరో. 1716. -తాటిగుంట్లపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. తాటిగుంటపల్లె. పోల్చిచూ. ఎగువతాటి గుంట్ల పల్లె.

1728. దిగువతూర్పుపల్లె రాయ. 15+.
స్థలా. నామబం; స్థలాసూచి;
దిగువ- గ్రామనా. ప్ర. చూ. ఆరో.1716;
తూర్పుపల్లె- గ్రామనా. ద్వి. చూ. ఆరో. తూర్పుపల్లె. పోల్చి చూ. ఎగువతూర్పుపల్లె. రాయ. 15+.

1729. దిగువనల్లగుట్టపల్లె రాయ. 98+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా.ప్ర; చూ. ఆరో. 1716;
నల్లగుట్టపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. నల్లగుట్టపల్లె. పోల్చి చూ. ఎగువనల్లగుట్టపల్లె. రాయ. 98+.

1730. దిగువనాయునిపల్లె రాయ. 108+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా.ప్ర; చూ. ఆరో. 1716;
-నాయునిపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. నాయునిపల్లె; పోల్చి చూ. ఎగువ నాయునిపల్లె. రాయ. 108+.

1731. దిగువనారాయణనెల్లూరు రాజం 41+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 1716:
-నారాయణనెల్లూరు గ్రామనా. ద్వి. చూ. నారాయణనెల్లూరు.

1732. దిగువనేలటూరు బద్వే. 58.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా.ప్ర; చూ. ఆరో. 1716;
నేలటూరు- గ్రామనా. ద్వి. చూ. ఆరో. నేలటూరు; పోల్చి చూ. ఎగువ నేలటూరు.

1733. దిగువపట్నం జమ్మ. 80.
[దిగువపట్నం మెకం. 1180-151]
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1716;
-పట్నం చూ. గ్రామనా. ద్వి.

1734. దిగువపత్రపల్లె సిద్ద. 54+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా.ప్ర; చూ. ఆరో. 1716;
-పత్రపల్లె గ్రామనా. ద్వి. పత్ర- కడప కర్నూలు జిల్లాలో ప్రధానంగా కన్పించే ఒక కులం. వేట, వ్యవసాయం వృత్తిగా గల ఒక కులం; ఒక ఒరియా కులం (TSI I. VI);
-పల్లె గ్రామనా. ద్వి. పోల్చి చూ. ఎగువపత్ర పల్లె.

1735. దిగువపల్లె కడ. 52+.
స్థలా. నామబం; స్థలాసూచి.
దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716;
-పల్లె చూ. గ్రామనా. ద్వి. పోల్చి చూ. ఎగువపల్లె.

1736. దిగువపల్లె రాజం. 28+.
చూ. ఆరో. 1735.

1737. దిగువపల్లె రాజం. 62+. ,,

1738. దిగువపల్లె రాజం. 129+. ,,

1739. దిగువపల్లె జమ్మ. 79+. ,,
[దిగువపల్లె మెకం. 1180-151]

1740. దిగువపల్లె పులి. 3+. ,,

1741. దిగువపాలెం రాయ. 77+.
స్థలా. నామబం; స్థలాసూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1716; -పాలెం చూ. గ్రామనా. ద్వి. పోల్చి చూ. ఎగువపాలెం రాయ. 77+.

1742. దిగువపేట రాజం. 64+.

స్థలా. నామబం; స్థలానూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; -పేట చూ. గ్రామనా. ద్వి. పోల్చిచూ. ఎగువ పేట రాయ. 64+.

1743. దిగువబలిజపల్లె రాయ. 53+.

స్థలా. నామబం; స్థలానూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1716; -బలిజపల్లె గ్రామనా. ద్వి; చూ. ఆరో. బలిజ పల్లె.

1744. దిగువబసినాయుడుగారిపల్లె రాజం. 71+.

స్థలా. నామబం; స్థలానూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; -బసినాయుడుగారిపల్లె గ్రామనా. ద్వి. బసి నాయుడు- నామబం; పు.నా. 101; బసి<బసవ చూ. ఆరో. 2382; నాయుడు చూ. ఆరో. -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా.ద్వి. పోల్చిచూ. ఎగువ బసినాయుడుగారిపల్లె.

1745. దిగువబోయపల్లె రాయ. 59+.

స్థలా. నామబం; స్థలానూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1716; -బోయపల్లె గ్రామనా.ద్వి. చూ.ఆరో. బోయ పల్లె; పోల్చి చూ. ఆరో. ఎగువ బోయపల్లె రాయ. 59+.

1746. దిగువబ్రాహ్మణపల్లె జమ్మ. 60.

[దిగువ బ్రాహ్మణపల్లె మెకం. 1180-162]

స్థలా. నామబం; స్థలానూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1716; -బ్రాహ్మణపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. గ్రామనా. ద్వి. చూ. ఆరో. బ్రాహ్మణపల్లె.

1747. దిగువమాచవాండ్లపల్లె రాయ. 28+.

స్థలా. నామబం; స్థలానూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; -మాచవాండ్లపల్లె గ్రామనా. ద్వి.

1748. దిగువమూల రాయ 21+.

స్థలా. నామబం; స్థలానూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1716; -మూల చూ.గ్రామనా.ద్వి. పోల్చి చూ.ఆరో. ఎగువమూల రాయ. 21+.

1749. దిగువరాచపల్లె రాయ. 77+.

స్థలా. నామబం; స్థలానూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1716; -రాచపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రాచ పల్లె. పోల్చిచూ. ఎగువరాచపల్లె రాయ.77+.

1750. దిగువరాచపల్లె రాయ. 103+.

చూ. ఆరో. 1749. పోల్చి చూ. ఆరో. ఎగువరాచపల్లె రాయ. 103+.

1751. దిగువరాజువారిపల్లె రాయ.108+.

స్థలా. నామబం; స్థలానూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; -రాజువారిపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రాజువారిపల్లె.

**1752.** దిగువరామక్కపల్లె రాజం. 83+.

స్థలా. నామబం: స్థలాసూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; -రామక్కపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రామక్కపల్లె. పోల్చిచూ. ఎగువరామక్కపల్లె రాజం. 98+.

**1753.** దిగువసూరపరాజుపల్లె రాజం. 140+.

స్థలా. నామబం; స్థలాసూచి.

దిగువ- గ్రామనా. ప్ర; చూ.ఆరో. 1716; -సూరపరాజుపల్లె గ్రామనా. ద్వి. సూరప రాజు- నామబం; పు.నా. సూరప- సూర- [<సం. సూర్యః] చూ. ఆరో. 3363; -అప చూ. ఆరో. 78; రాజు- చూ. ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి. పోల్చిచూ. ఎగువ సూరపరాజుపల్లె.

**1754.** దిన్నెపాడు రాయ. 85.

సంబ. నామబం; సామాన్యనామసూచి. పర్వతసూచి.

దిన్నె- గ్రామనా. ప్ర. గుట్ట, ఉన్నత ప్రదేశం. పోల్చిచూ. తె. తిన్నియ, తిన్నె, దిన్నియ, త. తిణ్ణై. మ. తిణ్ణ, తిణ. క. దిణ్ణె, దిన్నె. కోట. తిణ్ (DED, 2639); -పాడు చూ. గ్రామనా. దిన్నె.

**1755.** దిన్నెమీదపల్లె రాయ. 53+.

స్థలా. నామబం; స్థలాసూచి.

దిన్నెమీద- గ్రామనా. ప్ర; నామబం. దిన్నె- చూ. ఆరో. 1754; -మీద చూ. ఆరో. 1034; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1756.** దిన్నెమీదపల్లె రాయ. 59+.

చూ. ఆరో. 1755.

**1757.** దిన్నెమీదపల్లె రాయ. 61+. ,,

**1758.** దిన్నెమీదపల్లె రాయ. 81+. ,,

**1759.** దిన్నెమీదపల్లె రాయ. 100.+. ,,

**1760.** దిన్నెమీదపల్లె రాయ. 116+. ,,

**1761.** దిన్నెలపల్లె రాయ. 118+. ,,

సంబ. నామబం; సామాన్యనామసూచి. పర్వతసూచి.

దిన్నెల- గ్రామనా. ప్ర; బహు. (<దిన్నెలు+అ) ఏక. దిన్నె. చూ.ఆరో. 1754. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1762.** దిమ్మెబాలిరెడ్డిగారిపల్లె రాయ. 108+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దిమ్మెబాలిరెడ్డిగారి- గ్రామనా. ప్ర; నామబం. దిమ్మె- కు.నా. దిమ్మ రాతిదిమ్మె; రాతితో కట్టిన స్తంభం; తిప్ప పోల్చిచూ. క. దిమ్ము. పర్జి. దెమ్మ; సీర్‌దెమ్మ (DED. 2650) -బాలిరెడ్డి- నామబం; పు.నా. బాలి- వ్యక్తి.నా. ప్ర; (బాల+ఇ) చూ. ఆరో. 2415. -రెడ్డి- చూ. ఆరో. 6; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1763.** దిరసవంచ బద్వే. 54.

[? తిగవెంచ 1393 SII. XVI- 13.]

సంబ. నామబం; వృక్షసూచి.

దిరస- గ్రామనా. ప్ర. (దిరిసెము) 30-40 అడుగుల ఎత్తు పెరిగే పెద్దచెట్టు; Albizzia

Lebbek, Benth. [<సం. శిరీషః; ప్రా. సిరిసో]; -వంచ చూ. గ్రామనా. ద్వి.

1764. దీక్షితులపల్లె కడ. 92+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దీక్షితుల- గ్రామనా. ప్ర; పు.నా. (<దీక్షితులు + అ). దీక్షిత- వ్యక్తినా. ప్ర; వివాహోపనయనాది విహిత కర్మల్లో దీక్ష వహించినవాడు; తలచినపని నిర్వహించడానికి గట్టిపట్టుపట్టినవాడు; పట్టాభిషిక్తుడు; హావిద్యాగాలుమున్నగు శ్రౌతకర్మల్ని ఆచరించినవాడు [<సం. దీక్షితః] -అ (<లు+అ) వ్యక్తినా. అను; గౌరవవాచకం. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1765. దీనదారుపల్లె కడ. 60+.

[దీన్‌దారుపల్లె మెకం. 12-77]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దీనదారు- [దీన్‌దారు-] గ్రామనా. ప్ర; వ్యక్తినా. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"దీందారుఖాను" కట్టించినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1210-77)

1766. దుంపలగట్టు కడ. 16.

[దుంపలగటు 1547 SII.XVI-163-9]
సంబ. నామబం; సామాన్యనామసూచి. వృక్షసూచి.

దుంపల- గ్రామనా. ప్ర; బహు. (దుంపలు+అ) ఏక. దుంప గడ్డదినుసు, పోల్చు చూ. క. దుంప (DED. 2729) దుంపల- కుటుంబ నామం కూడా. చూ. ఆరో. 1768; -గట్టు ఏ -గట్టుల చూ. గ్రామనా. ద్వి.

1767. దుంపలగట్టుకొట్టాలు కడ. 16+.

సంబ. నామబం; గ్రామనామసూచి.

దుంపలగట్టు- గ్రామనా. ప్ర; గ్రామనా. చూ. ఆరో. 1766; -కొట్టాలు చూ. గ్రామనా. ద్వి.

1768. దుంపలవాండ్లపల్లె బద్వే. 113+.

[దుంపలవాండ్లపల్లె మెకం. 1170-29]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

దుంపలవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. దుంపల- కు.నా. చూ. ఆరో. 1766; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"దుంపల ఓబయ అనే రయితు" పేర ఈ ఊరు వెలిసినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1170-29).

1769. దుంపలవారిపల్లె సిద్ధ. 7+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

దుంపలవారి- గ్రామనా. ప్ర; నామబం; దుంపల- చూ. ఆరో. 1768; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1770. దుగ్గన్నగారిపల్లె పులి. 38+.

వర్యా. దుగ్గనపల్లె.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దుగ్గన్నగారి- గ్రామనా. ప్ర; నామబం. దుగ్గన్న- నామబం; పు. నా; దేవతాసూచి. (దుగ్గ + అన్న <దుర్గ+అన్న) దుగ్గ- పార్వతి [<ప్రా. దుగ్గా<సం. దుర్గా] -అన్న ఏ అన చూ. ఆరో. 3; -పల్లె. చూ. గ్రామనా. ద్వి.

1771. దుగ్గనపల్లె కడ. 50.

[దుగ్గనపల్లె 1525 SII. XVI. 77-147]

సంబ. నామబం. వ్యక్తినామసూచి.

దగ్గవ- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 1770; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1772.** దుగ్గవపల్లె జమ్మ. 13.
[దుగ్గనపల్లె మెకం. 1118-24; 1204-5; 1180-154] చూ. ఆరో. 1771.

పెదకంటికావు పాతకోట దుగ్గిరెడ్డి పేర వెలసినట్లు స్థానికచరిత్ర. (మెకం. 1204-5)

**1773.** దుగ్గనపల్లె రాయ. 30+.
చూ. ఆరో. 1771.

**1774.** దుగ్గన్నవారిపల్లె రాయ. 31+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దుగ్గన్నవారి- గ్రామనా. ప్ర; నామబం; దుగ్గన- చూ. ఆరో. 1770; -వారి- చూ. ఆరో. 8; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

**1775.** దుగ్గాయపల్లె కడ. 89+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దుగ్గాయి- గ్రామనా. ప్ర. నామబం. పు. నా. దుగ్గ- చూ. ఆరో. 1770; -అయ- చూ. ఆరో. 4; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

**1776.** దుద్దెకుంట పులి. 80.
[దుద్దికుంట మెకం. 1119-158]
అస్పష్టనామబంధం.

దుద్దె- [దుద్ది-] గ్రామనా. ప్ర. వ్యుత్పత్తి అస్పష్టం. పోల్చి చూ. దుద్యాల; -కుంట చూ. గ్రామనా. ద్వి. లో. వి: రుద్రకుంట.

**1777.** దుద్యాల రాయ. 101.
అస్పష్టనామబంధం.

దుద్దె- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1776; -ఆల చూ. గ్రామనా. ద్వి.

**1778.** దుద్యాలవాండ్లపల్లె రాయ. 106+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

దుద్యాలవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. దుద్యాల- కు. నా; గ్రామనామసూచి. చూ. ఆరో. 1777. -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1779.** దువ్వూరు ప్రొద్దు. 17.
[దువ్వూరు 1609 AR 1906, B470; దువ్వరు 1628 T. T. D. I, VI-I. 25-11-12; దువ్వూరు మెకం. 1126-60.]
సంబ. నామబం; జంతుసూచి.

దువ్వ- గ్రామనా. ప్ర; చిరుతపులి. పోల్చి చూ. త. చిఱుత్తై. కొలా. దువ. దూ. వర్జి. దూ. (DED, 596) -ఊరు చూ. గ్రామనా. ద్వి. (MAMP, 721).

**1780.** దూదేకులనారాయణపల్లె
జమ్మ. 124+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దూదేకులనారాయణ- గ్రామనా ప్ర; నామబం. పు. నా. దూదేకుల- కులనా. దూది ఏకేవాళ్లు; దూదిని ఏకే వృత్తి గల మహమ్మదీయులు. పింజరవాండ్లు. దూది + ఏకుల అవి CTSI, II. -నారాయణ- పు. నా. విష్ణువు [<సం. నారాయణః]; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1781.** దూదేకులపల్లె రాయ. 35+.
సంబ. నామబం; కులసూచి.

దూదేకుల- గ్రామనా. ప్ర; కులనా. చూ. ఆరో. 1780: -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1782. దూదేకులపల్లె రాయ. 40+.
చూ. ఆరో. 1781.

1783. దూదేకులపల్లె రాయ. 66+. ,,

1784. దూదేకులపల్లె రాయ. 71+. ,,

1785. దూదేకులపాలెం బద్వే. 119+.
సంబ. నామబం; కులసూచి.

దూదేకుల- గ్రామనా. ప్ర; చూ; 1781; పాలెం- చూ. గ్రామనా. ద్వి.

1786. దూలంవారిపల్లె బద్వే. 19.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

దూలంవారి- గ్రామనా. ప్ర; నామబం; దూలం- కు. నా. వస్తుసూచి. పోల్చి చూ. త. తులై, తులా. మ. తుల, తులాం. క. తుల, తులె, తొలె, దూల. తు. తొలె, తులె, కుయి. తూలి / సం. తులా- (DBIA, 214) ? <ప్రా. థూలం<స్థూలమ్ -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1787. దూళ్ళవారిపల్లె రాయ. 93.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

దూళ్ళవారి- గ్రామనా ప్ర; నామబం. దూళ్ళ- కు. నా. (దూళ్ళు + అ) ఏక. దూడ; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1788. దేనేపల్లె జమ్మ. 127.
[దేవినాయనిపల్లె మెకం. 1119 - 65; దేనేపల్లె మెకం. 1119-7].
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దేనే- [దేవినాయని-] గ్రామనా. ప్ర; నామబం; పు. నా. కురూపం. (దే+నే<దేవి+నేని < దేవి+నాయని) దే- [ < దేవి]- నే [<నాయుని] చూ. ఆరో. 101; -పల్లె చూ. చూ. గ్రామనా. ద్వి.

1789. దేవగుడి జమ్మ 112.
[దేవిగుడి 1518 SII. XVI. 55 . 4; 1518 ibid 64-4; మెకం. 1118 - 145, 1204-30; దేవగుడి మెకం. 1119-244; 1180-150; 1204-5].
సంబ; నామబం; సామాన్యనామసూచి. (దేవతాసూచి)

దేవ- [దేవి-] <సం. దేవి; -గుడి చూ. గ్రామనా. ద్వి.

తలకంతీశ్వరి (తల్లికంటె దేవి, తల్లి కంతీశ్వరి) అమ్మవారు వెలసినందున దేవగుడి అనే పేరు వచ్చినట్లు స్థానికచరిత్ర. (మెకం. 1204-30; FF. 1961, 61).

1790. దేవగుడిపల్లె రాయ. 60.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

దేవగుడి- గ్రామనా. ప్ర; కు. నా; గ్రామనామసూచి. చూ. ఆరో. 1789; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1791. దేవపట్ల రాయ. 97.
సంబ. నామబం; సామాన్యనామ సూచి. (దేవతాసూచి)

దేవ- గ్రామనా. ప్ర; దేవుడు. పోల్చి చూ. తె. దేవర. దేవుడు. త. దేవు. దేవన; దేవర్; దెయ్వం, దైవం. మ. తేవమ్. క. దేవ, దెవ్వ- దెవ్వు. తు. దేవ; దైవ, దెవ్వ / సం.

దేవ-; దైవ- దైన్య. ప్రా. దెవ, దెవ్వ (DBIA. 219) -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1792. దేవమాచుపల్లె రాజం. 106.**

సంబ. నామబం; సామాన్యనామసూచి. (దేవతాసూచి)

దేవ- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1791; -మాచుపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. మాచుపల్లె.

**1793. దేవతాపురం పులి. 74.**

సంబ. నామబం; సామాన్యనామసూచి. (దేవతాసూచి)

దేవతా- గ్రామనా. ప్ర; దేవత [< సం. దేవతా] -పురం చూ. గ్రామనా. ద్వి.

**1794. దేవరగుట్టపల్లె రాయ. 11+.**

సంబ. నామబం; స్థలనామసూచి.

దేవరగుట్ట- గ్రామనా. ప్ర. నామబం; దేవతా సూచి. దేవ- స్థలనా. ప్ర. దేవుడు; దేవర [< సం. దేవః] -గుట్ట స్థలనా. ద్వి. చూ. ఆరో. 412; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1795. దేవరపల్లె రాయ. 22+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

దేవర- గ్రామనా. ప్ర. కు. నా; చూ. ఆరో. 1796; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

**1796. దేవరవాండ్లపల్లె రాయ. 22+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

దేవరవాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. దేవర- కు. నా. చూ. ఆరో. 1794;- వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1797. దేవరవాండ్లపల్లె రాయ. 110.**

కురూపం. దేవేండ్లపల్లె. చూ. ఆరో. 1796.

**1798. దేవరాజాపల్లె కమ. 58+.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దేవరాజా- గ్రామనా. ప్ర; నామబం. పు. నా; దేవతాసూచి. దేవ- చూ. ఆరో. 1791; -రాజా చూ. ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1799. దేవరాయపల్లె రాజం. 123+.**

[దేవరాయపల్లె మెకం. 1223-105]

సంబ. నామబం. వ్యక్తినామసూచి.

దేవరాయ- గ్రామనా. ప్ర. నామబం; పు.నా. దేవ- చూ. ఆరో. 1791; -రాయ చూ. ఆరో. 49; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"దేవరాయపల్లె అనే పల్లెను విజయనగర సింహాసనాధీశ్వరుడైన హరిహర దేవరాయలు కట్టించినట్లు స్థానిక చరిత్ర. (మెకం. 1223 - 105).

**1800. దేవలంపల్లె కడ. 76+.**

సంబ. నామబం; సామాన్యనామసూచి. వాస్తుసూచి.

దేవలం- గ్రామనా. ప్ర; [< సం. దేవాలయః]; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1801. దేవలంపల్లె రాయ. 40+.**

చూ. ఆరో. 1800.

**1802. దేవలంపల్లె రాయ. 44+. ,,**

**1803. దేవలంపేట రాయ. 98+.**

సంబ. నామబం; సామాన్యనామసూచి. వాస్తుసూచి.

దేవలం- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1800, -పేట గ్రా మనా. ద్వి.

1804. దేవసముద్రం రాజం. 74.
[దేవసముద్రం. మెకం. 1223-153, దేవరాయసముద్రం: దేవ సముద్రం. మెకం. 1223-129].
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దేవ- [దేవరాయ-] చూ. ఆరో. 1791. 1799 -సముద్రం. చూ. గ్రామనా. ద్వి.

1805. దేవునికడప కడ. 25+.
సంబ; నామబం; సామాన్యనామసూచి. (దేవతాసూచి.)

దేవుని- గ్రామనా. ప్ర; (దేవుడు + ఇ) చూ. ఆరో. 1791. -కడప గ్రామనా. ద్వి. చూ. ఆరో. కడప. పోల్చి చూ. కడప. పాత కడప. ఇక్కడ వెంకటేశ్వరుని దేవాలయం వున్నందున దేవుని కడప. తిరుపతి యాత్రికులు, ముఖ్యంగా రాయలసీమకు చెందినవారు తిరుపతి కొండకెళ్ళి తిరుగు యాత్రలో తప్పని సరిగా దేవుని కడప దర్శించే ఆచారం ఇటీవల వరకు ఉండేది.

1806. దేపెట్టిపల్లె రాజం. 140+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

దేపెట్టి- గ్రామనా. ప్ర; నామబం. పు. నా. దే- ల దేవి చూ. ఆరో. 1789; -పెట్టి చూ. ఆరో. 751; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1807 దొంగలసాని సిద్ధ. 61+.
[దొంగలసాని మెకం. 1126 9]
సంబ. నామబం; సంఘటన సూచి. సామాన్యనామసూచి.

దొంగల- గ్రా మ నా. ప్ర. బ హు. (<దొంగలు+అ) ఏక. దొంగ. పోల్చి చూ. తె. తొంగు, దొంగు, దొంగిలించు, త. తొంకవ తొంకి. మ. తొణ్ణన్, నాయి, దొంగ వర్షి. దొంగ్- (DED. 2417). -సాని చూ. గ్రామనా. ద్వి.

1808. దొంగవాండ్లపల్లె రాయ. 8 +.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

దొంగవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. దొంగ- కు.నా. చూ. ఆరో. 1807; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1809. దొండపాడు కమ. 3+
[దొండపాడు మెకం. 1119 - 247; దొండపాడు మెకం.1229-96] నామా. శ్రీనృశింహపురానకు- [మెకం. 1229-98].
సంబ. నామబం; వృక్షసూచి.

దొండ- గ్రామనా. ప్ర. ఒకరకం తీగెచెట్టు, Coccinia indica, (B) Bryonia, M. Monadelpha పోల్చి చూ. త. తొండై, మ. తొంటి / సం. తుండికా, తుండికెరీ, తుండికేశీ; తుండీ. మరా. తొడ్లీ, తెడ్లీ (DED. 2880); త. తొండై; అ తొండై. తె. అరుదొండ, ఆరెదొండ, ఆదొండ, దొండ (DED. 2881); -పాడు చూ. గ్రామనా. ద్వి.

లోకనిరుక్తి: దొండకు అనే కాపు కట్టించగా దొండూరుపాడయింది కాబట్టి దొండపాడు అనే పేరువచ్చినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1229-96).

1810. దొండ్లవాగు పులి. 61.
[? దొంగలవాగు మెకం. 1119-12]

నంబ. నామబం; వృక్షసూచి.

దొంగ్ల- [లో. వి. దొంగల-] గ్రామనా. ప్ర; బహు (< దొంగలు + అ) చూ. అరో. 1809; -వాగు చూ. గ్రామనా. ద్వి.

1811. దొంగ్లోపల్లె కడ. 97.

[దొంగ్లోపల్లె మెకం. 1213-1]

స్థలా. నామబం; స్థలాసూచి.

దొంగ్లో- గ్రామనా. ప్ర. (దొన+లో) దొన- కొండపై జలాశయం పోల్చి చూ. త. చునై, దనైవు. క. దొణె, దొణె. (DED. 2239). -లో- స్థలార్థకం. ల్ల సంయుక్తం 'ంగ్ల' సంయుక్తంగా లేఖన రూపంలోనూ, వ్యవహారంలోను కన్పిస్తుంది, విన్పిస్తుంది. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1812. దొడియం ఖమ్మ. 22.

[దొడవేముల దొడివేముల మెకం. 1118-1; దోడవేముల మెకం. 1118-4; దోడివేముల మెకం. 1118-3; దొడియం మెకం. 1118-9; దొడియం మెకం. 1118-1; 1121-14, 1204-160; ధొడియం. 1118-172]

వి.బం; విశేషణసూచి, పరిమాణసూచి.

దొడి- [దొడ-; దొడి-; దోడ-, దోడి-; దొడి-; ధొడి-; ధొడి-] గ్రామనా. ప్ర. వి. <దొడ్డ పెద్ద పోల్చిచూ. త. తొట్ట. కో. దొడ్- క. దొడ్డ. తు. దొడ్డ. కొలా. దూ, దూద్ మొ. (DED. 2875); -యం. [<-వేముల]. చూ. గ్రామనా. ద్వి. ధొడి-, ధొడి- కృతకప్రామాణిక రూపాలు. ధడి క. పరిహద్దు అవి MAMP. ధొడియం కృతకప్రామాణికం. -వేముల చూ. గ్రామనా. ద్వి.

"ఈ దొడవేముల గ్రామానకు నామము కలగడానకు కారణం యేమంటే స్థళీకులు వాడుకొనేది యిది. యెర్రమల కొండలైన కొంత చదురపాటి భూమిన్ని కొండ జవుకుల నీరున్ను ప్రవహిస్తూ వుండేది. ఈ స్థళముల పీడారంభం కాడారంభం పసపు మొదలైన కూరగాయల తోటలు వేయడానకున్ను జల సమృద్ధి అని గొప్పగా వేపవృక్షములు వుండి నందువల్ల జనులు కొందరుచేరి యిండ్లు కట్టుక వుండగా వేపవృక్షాల మూలంచేత దొడివేముల అని గ్రామాన్కి నామం ప్రశస్తం అయినది. కొన్ని దినములకు ఆ గ్రామం వ్యాధులచేత పాడై వుండెను. మరికొన్ని దినములకు ఆ గ్రామానికి వుత్తరంగా గ్రామం కట్టుక వుండిరి గనుక అందుకు దొడవేముల అనే నామం కలిగినది." (మెకం. 1121-8, 9)

1813. దొడ్డిపల్లె రాజం. 130+.

నంబ; నామబం; కుటుంబనామసూచి.

దొడ్డి- గ్రామనా. ప్ర; కు. నా. పెరడు, పశువులదొడ్డి; పూరింటినట్టిల్లు; మధ్యభాగం; నిట్టాడిలేని ఇంటి మధ్యగది. పోల్చిచూ. త. తొట్టి. మ. తొట్టి. దొడ్డి, కొడ. తొడియ (DED. 2869) దేవాంగ, కొప్పులవెలమ, కర్నసాలె, మాల, యానాది వాళ్లల్లో దొడ్డి ఇంటి పేరు. (CTSI, II.), -పల్లె చూ. గ్రామనా. ద్వి. చూ. అరో. 1814.

1814. దొడ్డిపిద్దాయపల్లె రాయ. 100+.

నంబ. నామబం; వ్యక్తినామసూచి.

దొడ్డిపిద్దాయ- గ్రామనా. ప్ర; నామబం; పు.నా; దొడ్డి- కు.నా. చూ. అరో. 1813; -పిద్దాయ పు.నా; చూ. అరో. పిద్దాయపల్లె. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1815. దొమ్మరనంద్యాల జమ్మ. 70.**

[నందేల 1521 AR 19:5, B 353, దొంబర నంద్యాల మెకం. 1204-5; దొమ్మర నంద్యాల మెకం. 1204-272, దొమ్మరనందియాల మెకం. 1204-65, దొమ్మర నంద్యాల మెకం. 1180-180]

నంబ. నామబం; కులసూచి.

దొమ్మర- [దొంబర-దొమ్మర-] కులనా. ఒక కులం. గడకట్టి ఆడే వృత్తిగల జాతి, దొమ్మర పనులు చేసే ఒక సంచారగణం. ఉత్తరహిందూస్థానానికి చెందిన తోమ్ గణంతో సంబంధం ఉండవచ్చు. తెలుగు, మరాఠీ, హిందీ మాట్లాడే గణం (CTSI II.) పోల్చిచూ. తు. దొంబె, దొమ్మరె. గోం. డొమర్ డోంబా- CDIAL. 5570. -నంద్యాల- [-నందేల;- నందియాల-] అస్పష్టనామబంధం. ? నంది+ఆల నంది-చూ. ఆరో. 1829; -ఆల చూ. గ్రామనా. ద్వి.

**1816. దొమ్మరాజుపల్లె రాజం. 69+.**

[దొమ్మరాజుపల్లె మెకం. 1134-153]

వర్యా దొమ్మర రాజుపల్లె.

నంబ. నామబం; కులసూచి.

దొమ్మ- గ్రామనా. ప్ర. ల దొమ్మర చూ. ఆరో. 1815. -రాజుపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రాజుపల్లె.

**1817. దొరసానిపల్లె ప్రొద్దు. 32.**

[దొరసానిపల్లె మెకం. 1111-22]

నంబ. నామబం; సామాన్యనామసూచి. బిరుదసూచి.

దొరసాని- గ్రామనా. ప్ర. రాణి, పాశ్చాత్య వనిత; యజమానురాలు పోల్చిచూ. తె. దొర దొరతనము. త. దురై; దురైచ్చి దురైసాణి; మ. తుర, త్వర. క. దొరె, దొరెసాని. కొడ. దొరె. పర్జి. దొర / సం. ధుర్య- ధౌరెయ- పా. ధొరెయ్య-, ప్రా. ధొరెయ-, ధొజ్జ (DBIA 213) తమిళవ్యక్తినామాల్లో అనుబంధం. పోల్చిచూ. అణ్ణాదురై, అప్పాదురై; ప్రథమావయవాల్లో కూడా కన్పిస్తుంది. పోల్చిచూ. దొరస్వామి (MAMP. 282). దొరబాబు -సాని చూ. ఆరో. 140. పోల్చిచూ. త. దురైసాని, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1818. దొరువుపల్లె జమ్మ. 42+.**

నంబ. నామబం; సామాన్య నామసూచి. జలసూచి.

-దొరువు గ్రామనా. ప్ర. దొర్వు, దొరవి. నడబావి ఒకరకం చెలమ; చెఱువు, కొలను. పోల్చిచూ. త. తురవు. మ. తురవు (DED 2745); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1819. దోనంవారిపల్లె రాయ. 110+.**

నంబ. నామబం; కుటుంబనామసూచి.

దోనంవారి- గ్రామనా. ప్ర; నామబం, దోనం- కు.నా. ? <ద్రోణం; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గామనా. ద్వి.

**1820. దౌలతాపురం కడ. 19.**

నంబ. నామబం. వ్యక్తినామసూచి.

దౌలతా- గ్రా మ నా ప్ర; వ్య క్తి నా. < హిం. దౌలత్ < అర. దౌలహ్ రాజ్యం; సంపద; అబ్బాసిద్ కాలిఫులకింద సైన్యాధ్యక్షుల నామానుబంధం, ఇతి బర్బాద్ దౌలహ్ (MAMP. 282); -పురం చూ. గ్రామనా. ద్వి. పోల్చిచూ. దౌలతాబాదు.

**1821.** దౌలతాపురం కడ. 82+.
[దవులతుపురం మెకం. 1210-62]
చూ. అరో. 1821.

**1822.** ద్వారకానగరం కడ. 1+.
సంబ. నామబం; గ్రామనామసూచి.

ద్వారకా- గ్రామనా. ప్ర. [< సం. ద్వారకా]: -నగరం చూ. గ్రామనా. ద్వి.

**1823.** ధన్నవాడ జమ్మ. 21.
[ధన్నవాడ మెకం. 1118-1; 1180-155]
సంబ. నామబం; సామాన్యనామసూచి. వస్తుసూచి.

ధన్న- గ్రామనా. ప్ర. ? [< సం. ధాన్యమ్] -వాడ చూ. గ్రామనా. ద్వి.

**1824.** ధర్మాపురం జమ్మ. 114.
[ధర్మాపురం మెకం. 1119-244: 1180-170]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

ధర్మా- గ్రామనా. ప్ర. ధర్మ [<సం. ధర్మః], -పురం చూ. గ్రామనా. ద్వి.

**1825.** నంగనూరుపల్లె ప్రొద్దు. 50.
[నంగనూరుపల్లె మెకం. 1112-22]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

నంగనూరు- గ్రామనా. ప్ర; కు.నా. అస్పష్టనామబంధం. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1826.** నందనాయకబిడం రాయ. 110+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నందనాయక- గ్రామనా. ప్ర; నామబం, పు. నా. (మగాలీ పేరు) నంద- వ్యక్తినా. ప్ర; -నాయక [<సం. నాయకః] మగాలి వ్యక్తి నామానుబంధం. చూ. అరో. 101: -బిడం చూ. గ్రామనా. ద్వి.

**1827.** నందలూరు రాజం. 54.
[నిరందలూరు. రాజకేశరికులోత్తుంగ I yr 27 AR 1907, B 60, నిరంద నూరు త్రిభువనచక్రవర్తి కులోత్తుంగ చోళదేవ రక్షాచ; 33rd yr. AR 1907, B 578; నెలందలూరి (మహాజనాల)- నెలందనూరూ 1309 SII-X. 496; నెలదలూరి శ్రీ చొక్కనాథ 1433 SII, XVI- 31-11-12; నెందలూరి చొక్కనాథదేవునికి 1501 ibid 40-24; నెలందలురు 1556 Ibid 219-16 నెలందలూరి (స్వామివిలయు) 1628 T.T.D E.S. VI. I 25-7. నెలందలూరు మెకం. 1134-6-9; 1223-34 నెలదలూరు అన్నమాచార్య 1424-1503 : సం,16. సంకీ. 20.]

నామా. శ్రీకులోత్తుంగచోళ చతుర్వేది మంగలం; అగరబ్రహ్మదేయ శ్రీకులోత్తుంగ చోళ చతుర్వేది మంగలం నిరంతపుర- 1619 AR 1907 B 589; నిరంతపురమనే నామాభిధానం- మెకం. 1134-5.

అస్పష్టనామబంధం.

? నందలు- [నిరందలు-: నిరందను-; నెలదలు; నెందలు; నెలందలు] నెలంతలు స్త్రీలు, అక్క దేవతలు. పోల్చిచూ. కన్నెలూరు; బొలతుల -ఊరు చూ. గ్రామనా. ద్వి.

లోకనిరుక్తి: "దుష్టద్యుమ్నుని కుమారుడు నిరంతర మహారాజు నిరంతరపురమనే అగ్రహారా"న్ని కట్టించినట్లు, "ఈ నిరంతర

పురమనే అగ్రహారం బాహూనదీ వెల్లువచేత కొట్టుకొనిపోయినందున నెలంద అనే వేశ్యస్త్రీ ప్రభుత్వంచేసి- రాజువుంచుకొన్నది. ఆయమె యీ స్థలానకు వచ్చి తనపేరుతో లోగడ నదీవల్ల కొట్టుకపోబడిన స్థలానకు వుత్తరం నెలందలూరు అనే నామము విధియించి బ్రాహ్మణులకు సర్వాగ్రహారంగా యిచ్చి''నట్లు స్థానిక చరిత్ర (మెకం. 1134-5,6) నామా. వాడుకలో లేవు. పోల్చిచూ. పొందలూరు.

1828. నందలూరువాండ్లపల్లె రాయ. 71+.

నంబ. నామబం; కుటుంబనామసూచి.

నందలూరువాండ్ల - గ్రామనా. ప్ర. నామబం: నందలూరు- కు. నా; గ్రామనామసూచి. చూ. ఆరో. 1827; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1829. నందిపల్లె బద్వే. 187+.

నంబ. నామబం; సామాన్య నామసూచి; దేవతాసూచి.

నంది- గ్రామనా. ప్ర; శివుడి వాహనం. [<సం. నందీ]. పల్లె చూ. గ్రామనా. ద్వి.

1830. నందిపల్లె పులి. 37+.

చూ. ఆరో. 1829.

1831. నందిపాడు కడ. 7+.

గ్రామనా. ప్ర; సామాన్య నామ సూచి. దేవతాసూచి.

నంది- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 1829; -పాడు చూ. గ్రామనా. ద్వి.

1832. నందిమండలం కడ. 109.

నంబ. నామబం; సామాన్యనామసూచి. దేవతాసూచి.

నంది- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1829. -మండలం చూ. గ్రామనా. ద్వి.

"It is said that there are 40 Nandis around this village. Generally the number 40 is known as mandalam" (F.F 1961, 7.

లోకనిరుక్తి: "పరానంది తపస్సు చేస్తూ ఉండగా, ఆ ప్రదేశంలో కుందేలు కుక్కల మీద యెదురు తిరిగిందట. ఆ మండలం మంచి దనీ "మంధలి నందయోగి యొక్క మండలి" అనీ పరానంది చెప్పగా నందిమండలి" అని పేరు వచ్చినట్లు స్థానికచరిత్ర (మెకం. 1119-141).

1833. నంద్యాలపల్లె పులి. 72.

[నందెలపల్లె మెకం. 1119-13]

నంబ. నామబం; కుటుంబనామసూచి.

నంద్యాల- కు. నా. చూ. ఆరో. 1815; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

1834. నంద్యాలంపేట ప్రొద్దు. 89.

[నందేలమ్మ పేట మెకం. 1111-153; నందెలమ్మ పేట మెకం. 1126-87].

నంబ. నామబం; వ్యక్తినామసూచి.

నంద్యాలం- [నందేలమ్మ-; నందెలమ్మ] గ్రామనా. ప్ర. నామబం. స్త్రీ నా; గ్రామనామ సూచి. నంద్యాల- చూ. ఆరో. 1833; -అం; చూ. ఆరో. 1; పేట- చూ. గ్రామనా. ద్వి.

"ముక్కొండ చేరువున గ్రామావకు పురము వోపి గ్రామం కట్టించిరి. నందెలమంచి యల్లమ్మ అనే దేవత యీ స్థలానకు వచ్చి

వెలిసినది అని ప్రజలు చెప్పుకొని ఆ దేవత పేరు గ్రామానికి వచ్చిందని'' స్థానిక చరిత్ర. (మెకం. 1126-87.)

The Village derives its name from Nandyalamma, a Padmasale woman who is said to have founded it (APDGC. 776).

**1835. నక్కలదిన్నె ప్రొద్దు. 45+.**
సంబ. నామబం; జంతుసూచి.

నక్కల- గ్రా మ నా. ప్ర; బ హు. (నక్కలు+అ) ఏక. నక్క ఒక జంతువు canis aurens పోల్చి చూ. తె. న రి యఁ డు; త. నరి; నక్కన్. (<తె) మ. నరి. క. నరి. కొలా. నక్క. కువి. నక్క. (DED. 2981). నక్కల- బోయ, గుడాల, ముత్రాచ గొల్లవాండ్లలో ఇంటిపేరు. ము త్రా చు ల కులదేవత అంకమ్మ వాహనం నక్క. (CTSI-V) చూ. అరో. 1837-1846: -దిన్నె చూ.గ్రామనా.ద్వి.

**1836. నక్కలదిన్నెపల్లె రాయ. 18+.**
సంబ. నామబం; గ్రామనామసూచి.

నక్కలదిన్నె- గ్రామనా. ప్ర; గ్రామనా. చూ. అరో. 1835; -పల్లె చూ.గ్రామనా. ద్వి.

**1837. నక్కలపల్లె రాజం. 28+.**
సంబ. నామబం; కుటుంబనామసూచి.

నక్కల- గ్రామనా. ప్ర; కు. నా; జంతుసూచి. చూ. అరో. 1835; -పల్లె చూ.గ్రామనా. ద్వి.

**1838. నక్కలపల్లె పులి. 77+.**
చూ. అరో. 1837.

**1839. నక్కలపల్లె పులి. 87+. ,,**

**1840. నక్కలమొరం రాయ. 104+.**
సంబ. నామబం; కుటుంబనామసూచి.

నక్కల- గ్రామనా. ప్ర; చూ.అరో.1835; -మొరం చూ. గ్రామనా. ద్వి.

**1841. నక్కలవాండ్లపల్లె రాయ. 23+.**
సంబ. నామబం. కుటుంబనామసూచి.

నక్కలవాండ్ల - గ్రామనా. ప్ర; నామబం. నక్కల- కు.నా; చూ. అరో. 1835; -వాండ్ల- చూ. అరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1842. నక్కలవాండ్లపల్లె రాయ. 29+.**
చూ. అరో. 1841.

**1843. నక్కలవాండ్లపల్లె రాయ. 31+. ,,**

**1844. నక్కవానిపల్లె జమ్మ. 22+.**
[నక్కవానిపల్లె మెకం. 1180-18].
సంబ. నామబం; కుటుంబనామసూచి.

నక్కవాని- గ్రామనా. ప్ర; నామబం. కు. నా; చూ. అరో. 1835; -వాని- (వాడు+ఇ) చూ. అరో. 1; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

నక్కవాడు అనే గొల్లవాడు ఈ ఊరును కట్టించినట్లు స్థానికచరిత్ర. (మెకం. 1180-18).

**1845. నక్కవానిపల్లె జమ్మ. 23.**
[నక్కవానిపల్లె మెకం. 1121-14]
చూ. అరో. 1844.

**1846. నక్కావాండ్లపల్లె రాయ. 89+.**
సంబ.నామబం; కుటుంబనామసూచి.

నక్కావాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. నక్కా- కు. నా. చూ. అరో. 1835; -వాండ్ల- చూ. అరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1847. నగిరి రాయ. 81+.**

అసమస్తం.

నగిరి పట్టణం. పోల్చి చూ. తె; నగరు. త. నగర్. మ. నకర్. తు. నగఱు / సం. నగర- (DED. 53) సంస్కృతంలోకి ప్రవేశించిన ద్రావిడపదమని సిద్ధాంతం. వివరాలకు చూ. T. Burrow, Colleted Papers. 270-271. పోల్చి చూ. గ్రామనా. ద్వి. ల నగరం.

**1848. నగిరి రాయ 105+.**

చూ. ఆరో. 1847.

**1849. నగిరి రాయ. 118+.** ,,

**1850. నగిరిపాడు రాజం. 114.**

సంబ. నామబం; గ్రామనామసూచి.

నగిరి- గ్రామనా.ప్ర; గ్రామనా: అసమస్తం. -చూ. ఆరో. 1847; -పాడు చూ. గ్రామనా. ద్వి.

**1851. నగిరిమడుగువాండ్లపల్లె రాయ. 60+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

నగిరిమడుగు- కు. నా; స్థలనామసూచి. నగిరి- చూ. ఆరో. 1847; -మడుగు- చూ. గ్రామనా. ద్వి. -వాండ్ల- చూ. ఆరో.2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1852. నగిరివాండ్లపల్లె రాయ. 58+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి,

నగిరివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. నగిరి- గ్రామనా- చూ. ఆరో. 1847; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1853. నగిరివాండ్లపల్లె రాయ. 102+.**

చూ. ఆరో; 1852.

**1854. నజర్‌బేగ్‌పల్లె కడ. 22.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నజర్‌బేగ్- గ్రామనా. ప్ర; నామబం. పు.నా. నజర్- వ్యక్తినా. ప్ర; దృష్టి పోల్చి చూ. హిం. నజర్ దృష్టి, కానుక. < అర. నజర్ దృష్టి, కానుక. నజిర్ దృష్టి, ధ్యానము -బేగ్ వ్యక్తినా: అను. యువరాజు, ప్రభువు, మొగల్ బిరుదు పోల్చిచూ. బేగం స్త్రీనా. అను. యువరాణి < హిం. బేగ్<ట. బేగ్. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1855. నడింపల్లె కడ. 17+.**

నామా. మొలకవాండ్లపల్లె

స్థలా. నామబం. స్థలాసూచి.

నడిం- గ్రామనా. ప్ర; ల నడిమి, నడుమ మధ్య నందున పోల్చిచూ. తె. నడి. త. నడ, నడువు; నడువణ్; నట్టనడు. మ. నటు, క.నడు. నడువు, నడ; నడువె, నడవె, నడివె. నట్టునడు, కొడ, నడు. తు. నడు. నాయి. నఱుం, గోం. నడ్డుం. (DED. 2959); -పల్లె చూ. గ్రామనా. ద్వి. రెండు పేర్లూ వ్యవహారంలో వున్నాయి.

**1856. నడింపల్లె కడ. 66+.**

చూ. ఆరో. 1855.

**1857. నడింపల్లె రాయ. 26+.** ,,

**1858. నడింపల్లె రాయ. 27+.** ,,

**1859. నడింపల్లె రాయ. 68+.** ,,

**1860. నడింపల్లె రాయ 76+.** ,,

**1861. నడింపల్లె రాయ 108+.** ,,

**1862. నడింపల్లె రాజం. 40+.** ,,

1863. నడింపల్లె రాజం. 69+.
చూ. ఆరో. 1855

1864. నడింపల్లె రాజం. 90+. ..

1865. నడింపల్లె రాజం. 109+.
[నడిమిపల్లె మెకం. 1223 - 171]
చూ. ఆరో. 1855.
"మైలపల్లె, భట్టువారిపల్లె నందున కట్టినది. దానిపేరు నడిమిపల్లె అనేది వకటి కంమ్మ వారు కట్టుకొన్నది" (మెకం. 1223 - 171).

1866. నడింపల్లె రాజం. 129+.
చూ. ఆరో. 1855.

1867. నడింపల్లె రాజం. 141+. ..

1868. నడింపల్లె సిద్ధ. 52+. ..

1869. నడింపల్లె ప్రొద్దు. 86+. ..

1870. నడింపల్లె ప్రొద్దు. 89+.
[నడింపల్లె మెకం. 1126-121]
చూ. ఆరో. 1855.

1871. నడిగడ్డపల్లె రాయ. 56+.
సంబ. నామబం; స్థలాసూచి.
నడిగడ్డ- గ్రామనా. ప్ర. స్థలా. నామబం. స్థలనా; నడి- స్థలనా. ప్ర. చూ. ఆరో. 1855; -గడ్డ- స్థలనా. ద్వి. చూ. ఆరో. 399; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1872. నడిగడ్డపల్లె రాయ. 71+.
చూ. ఆరో. 1871.

1873. నడిపిరాళ్ళపల్లె రాయ. 100+.
స్థలా. నామబం; స్థలాసూచి.
నడిపి- గ్రామనా. ప్ర; వి. నడిమి చూ. ఆరో. 1855; -రాళ్ళపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రాళ్ళపల్లె.

1874. నడిమిరాజుపల్లె రాయ. 97+.
స్థలా. నామబం. స్థలాసూచి.
నడిమి- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1855. -రాజుపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రాజుపల్లె; పోల్చిచూ. ఎగువరాజుపల్లె.

1875. నత్తివాండ్లపల్లె రాయ. 55+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
నత్తివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. నత్తి- కు.నా. పోల్చిచూ. మ. నత్తుక; క. నత్తు, నెత్తు. తు. నత్తింగె (DED. 2967); -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1876. నబీకోట కడ. 69+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
నబీ- గ్రామనా. ప్ర. <అర. నబీ మార్గం. మహమ్మద్‌ప్రవక్త పేరు. పోల్చిచూ. నబీ ఖాన్ (MAMP. 539); -కోట చూ. గ్రామనా. ద్వి.

1877. నరవకాటిపల్లె సిద్ధ. 52+.
[నరవకాటిపల్లె మెకం. 1170-64]
స్థలా. నామబం; స్థలాసూచి.
నరవకాటి- గ్రామనా. ప్ర; నామబం. నరవ ఌ నారవ కొండస్రోవః వానకురిసి పొలంలోపారే నీటివాగు; రెండుమిట్టల నడుమ ఏర్పడ్డ పల్లపు ప్రదేశం; కాటి- (< కాడ + ఇ) చూ. ఆరో. 417; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1878. నరసన్నగారిపల్లె సిద్ధ. 48+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరసన్నగారి- గ్రామనా. ప్ర; నామబం. నరసన్న- నామబం; పు.నా. దేవతాసూచి. (నరస + అన్న) నరస- వ్యక్తినా. ప్ర. [<సం. నృసింహః] వ్యక్తినామ అనుచిత విభాగం. -అన్న- చూ. ఆరో. 3; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1879. నరసన్నపల్లె** కడ. 82+.

[నరసన్నపల్లె మెకం. 1210-65]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరసన్న- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. దేవతాసూచి చూ. ఆరో. 1878; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

''గాజులపల్లె నరసన్న'' అనేవాడు కట్టించి నట్లు స్థానిక చరిత్ర (మెకం. 1210-65)

**1880. నరసన్నపల్లె** బద్వే. 49.+.

చూ. ఆరో. 1879.

**1881. నరసన్నపల్లె** బద్వే. 116+. ..

**1882. నరసరాంపల్లె** కడ. 55+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరసరాం- గ్రామనా. ప్ర; నామబం; పు.నా; దేవతాసూచి. నరస- చూ.ఆరో.1870; -రాం [< సం. రామః]; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1883. నరసాపురం** బద్వే. 32.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరసా- గ్రామనా. ప్ర; వ్యక్తినా. నరస చూ.ఆరో. 1878; -పురం చూ.గ్రామనా.ద్వి.

**1884. నరసారెడ్డిపల్లె** కడ. 50+.

సంబ; నామబం; వ్యక్తినామసూచి.



నరసారెడ్డి- గ్రామనా. ప్ర; నామబం పు.నా; దేవతాసూచి. నరసా- వ్యక్తినా. ప్ర; చూ.ఆరో. 1883; -పురం చూ.గ్రామనా.ద్వి.

**1885. నరసింగరాజపురం** రాజం. 16.

[నరశింగరాజపురం మెకం. 1134 330].

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరసింగరాజ- [నరశింగరాజ-] గ్రామనా. ప్ర; నామబం; పు.నా; దేవతాసూచి; నరసింగ- వ్యక్తినా. ప్ర. [< సం. నృసింహః] -రాజ- చూ. ఆరో. 49; -పురం చూ. గ్రామనా. ద్వి.

**1886. నరసింగరావుపల్లె** పులి. 8.

సంబ. నామబం. వ్యక్తినామసూచి.

నరసింగరావు- గ్రామనా. ప్ర; నామబం; పు.నా; దేవతాసూచి. నరసింగ- చూ. ఆరో. 1885. -రావు -చూ. ఆరో. 97; -పల్లె చూ; గ్రామనా. ద్వి.

**1887. నరసింగుపల్లె** బద్వే. 81+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరసింగు- గ్రామనా. ప్ర; నామబం; పు.నా; దేవతాసూచి (<నరసింగ + ఉ) నరసింగ- చూ. ఆరో. 1885; -ఉ- చూ. ఆరో. 25; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1888. నరసింహాపురం** బద్వే. 55.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరసింహా- గ్రామనా. ప్ర; నామబం; పు.నా; దేవతాసూచి [< సం. నృసింహః] -పురం చూ. గ్రామనా. ద్వి.

1889. నరసింహాపురం బద్వే. 60.
చూ. ఆరో. 1888.

1890. నరసింహాపురం బద్వే. 65. ,,

1891. నరసింహాపురం ప్రొద్దు. 81+. ,,

1892. నరసింహస్వామిపల్లె రాయ 35+.
సంబ నామబం; వ్యక్తినామసూచి.

నరసింహస్వామి- గ్రామనా. ప్ర; నామబం; పు.నా; దేవతాసూచి. నరసింహ- చూ. ఆరో. 1888; -స్వామి పు.నా. అను. యజమాని, దేవుడు, గురువు, ప్రభువు పురుష నామాల్లో అనుబంధం. సంబోధనావాచకం. పోల్చిచూ. త. చామి; చువామి. మ. సామి, స్వామి. క. సామి, సాయి, సావి, సోమి, సోయి, స్వామి. తు. సామి, స్వామి < సం. స్వామిన్. ప్రా. సామి- (DBIA. 162); -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1893 నరసోజీకొట్టాలు జమ్మ. 82+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరసోజీ- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. మరాఠీ పురుషనామం. నరసో- మరాఠీ వ్యక్తినా. ప్ర. [< సం. నృసింహః-] -జీ పు.నా. అను. చూ. ఆరో. 94. -కొట్టాలు చూ. గ్రామనా. ద్వి.

1894 నరహరిబొట్లపల్లె రాయ 46.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరహరిబొట్ల- గ్రామనా. ప్ర; నామబం; పు.నా; దేవతాసూచి. నరహరి- వ్యక్తినా. ప్ర. (సం. < నరః + హరిః) బొట్ల- పు నా. అను; బహు. పూజ్యార్థకం. (<బొట్లు + అ) ఏక. బొట్టు భట్టు పండితుడు [<సం. భట్టః]; లు- (<లు+అ) చూ; ఆరో. 1764; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1895. నరహరిపురం కమ. 18+.
[నరహరిపురం మెకం. 1229-31-32] రూ. నరాపురం (ముప.)
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నరహరి- (రూ. నరా) గ్రామనా. ప్ర; చూ. ఆరో. 1894; -పురం చూ. గ్రామనా. ద్వి.

1896. నర్రెడ్డివాండ్లపల్లె రాయ. 105+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

నర్రెడ్డివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. నర్రెడ్డి- (< నరి + రెడ్డి) కు.నా; నామబం; వ్యక్తినామసూచి. చిన్నకొడిదెకాపుల్లో ఇంటిపేరు; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1897. నరోతివాండ్లపల్లె రాయ. 31+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

నరోతివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం; (నరోతివాండ్లు+అ) నరోతి- కు. నా. వ్యుత్పత్తి అస్పష్టం. -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1898. నర్సిరెడ్డిపల్లె బద్వే. 48+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

నర్సిరెడ్డి- గ్రామనా. ప్ర; నామబం. పు.నా. దేవతాసూచి. నర్సి- లు నరిసి. నరసి, నరసా. చూ. ఆరో. 1835. అనుచిత విభాగం వల్ల ఏర్పడ్డ రూపాలు; -రెడ్డి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

1899. నలసానివారిపల్లె రాయ. 27+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

**నలసానివారి-** గ్రామనా. ప్ర; నామబం; నలసాని- కు.నా. నామబం, వర్ణసూచి. కమ్మ వాళ్ళల్లో కొప్పులవెలమల్లో ఇంటిపేరు. నల- ల నల్ల చూ. ఆరో. 1900; -సాని-చూ. ఆరో. 140; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1900. నల్లకట్టవతురకపల్లె** రాయ. 105+.
సంబ. నామబం; స్థలనామసూచి.

**నల్లకట్టవ-** గ్రామనా. ప్ర; నామబం; స్థల నా. వర్ణసూచి. నల్ల- స్థలనా. ప్ర; వి. నలుపు రంగుగల; చూ; వో. వ. నలుపు, పోల్చి చూ. త. నల్లం, అల్, అల్కాల్. మ. అల్, అల్లు. [మూలద. ద్రా. *నల్-]; మంచి. చూ. పో. వ. నలవు, పోల్చి చూ. క. నల్, నల్ల. మ. నల్. (అం)- నల్మ, నల్ల మొ. [మూలద. ద్రా. *నల్-అ] చూ. ఆరో. 2986; కొప్పుల వెల మల్లో 'నల్ల' ఇంటిపేరు కూడా ఉంది.- కట్టవ ల కట్ట చూ. ఆరో. 522, -తురకపల్లె గ్రామ నా. ద్వి. చూ. ఆరో.

**1901. నల్లకట్టవపల్లె** రాయ. 86+.
సంబ. నామబం; స్థలనామసూచి.

**నల్లకట్టవ-** గ్రామనా. ప్ర; స్థలనా. చూ. ఆరో. 1900; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1902. నల్లకట్టవపల్లె** రాయ. 193+.
చూ. ఆరో. 1901.

**1903. నల్లగుండ్లపల్లె** రాయ. 47+.
సంబ. నామబం; స్థలనామసూచి.

**నల్లగుండ్ల-** గ్రామనా. ప్ర. నామబం; వర్ణసూచి; నల్ల- స్థలనా. ప్ర; వి. చూ. ఆరో. 1900; -గుండ్ల- స్థలనా. ద్వి. బహు. (<గుండు+అ) ఏక. గుండు గుండ్రటిరాయి. చూ. పో. వ. గుండ్రము, గుండ్రించు. పోల్చి చూ. త. కుంటు. క. గుండు. తు. గుండు. కొలా. గుండ్. నాయి. ఘుండ్ మొ. సంస్కృత గండః శబ్దభవం అయివుండ వచ్చునని సూ.వి. వివరాలకు చూ. DED, 1414: Kolami 286; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1904. నల్లగుండ్లపల్లె** ప్రొద్దు. 83+.
చూ. ఆరో. 1903.

**1905. నల్లగొండుపల్లె** బద్వే. 85+.
సంబ. నామబం; కుటుంబ నామసూచి.

**నల్లగొండు-** గ్రామనా. ప్ర; నామబం. కు. నా. ? వ్యక్తినామసూచి. (నల్ల + కొండు) కొడిదకాపుల్లో ఇంటిపేరు; -పల్లె చూ. గ్రామ నా. ద్వి.

**1906. నల్లగొండువారిపల్లె** రాయ. 48+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

**నల్లగొండువారి-** గ్రామనా. ప్ర; నామబం. నల్లగొండు- కు.నా. చూ.ఆరో. 1905; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1907. నల్లగొండువారిపల్లె** సిద్ధ. 13+.
చూ. ఆరో. 1906.

**1908. నల్లగొండువారిపల్లె** సిద్ధ. 18+. ,,

**1909 నల్లగొండువారిపల్లె** పులి. 12+. ,,

**1910. నల్లగుట్టపల్లె** రాయ. 74.
సంబ. నామబం; స్థలనామసూచి.

**నల్లగుట్ట-** గ్రామనా. ప్ర. నామబం; స్థల నా; నల్ల- స్థలనా. ప్ర; చూ. ఆరో. 1900; -గుట్ట-స్థలనా. ద్వి. చూ. ఆరో. 412; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**1911. నల్లగుట్టపల్లె** రాజం. 127+.
చూ. ఆరో. 1910.

**2164.** పుల్లారెడ్డిపేట కడ. 38+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పుల్లారెడ్డి- గ్రామ నా. ప్ర; చూ. ఆరో. 2162; -పేట చూ. గ్రామనా. ద్వి.

**2165.** పుల్లివీడు ఐద్వే. 78.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పుల్లి- గ్రామ నా. ప్ర; వ్యక్తి నా. (<పుల్ల+ఇ) పుల్ల- చూ. ఆరో. 2160; -ఇ చూ. ఆరో. 25; -వీడు చూ. గ్రామనా. ద్వి.

**2166.** పుల్లూరు కడ. 3.

[పుల్లూరు మెకం. 1240-52]

? సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పుల్లి- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 2165; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

"వడ్లవాండ్ల చిన్నది పుల్లి" పేర ఈ ఊరి పేరు వెలసినట్లు స్థానికచరిత్ర (మెకం. 1240-52-55)

**2167.** పుష్పగిరి కడ. 14+.

[శ్రీ పుష్పగిరియ 1300 E.I. XXX. 8.32-9 పుష్పగిరి అగ్రహార- 1540 SII. XVI. 122-6, 11, 21]

వి. బం; సాదృశ్యబోధకసూచి.

పుష్ప- గ్రామనా. ప్ర. [<సం. పుష్పః] -గిరి చూ. గ్రామనా. ద్వి; పోల్చిచూ. కుంభగిరి.

లోకనిరుక్తి: ఒకప్పుడు ఈ ప్రాంతంలో 'కాంపల్లె' అనే గ్రామం వుండేది. చుట్టూ అడవులు మధ్య వ్యవసాయ భూము లున్నా, పెన్నానదికి తూర్పుగా ఒక కొలను ఉండెడిదట. ఒకనాడు కాంపల్లె ముసలి కాపు ఒకడు తన ముసలి ఎద్దులను గట్టుకొని సేద్యం చేయడానికి వెళ్లాడట. మధ్యాహ్నం ఎండ తీవ్రంగా ఉంది. దగ్గరలోని కొలనులో నీళ్లు తాగటానికి వెళ్లి కాలుజారి సరస్సులో పడి ఉక్కిరి బిక్కిరయి మునకలు వేసి నీటినుండి గట్టు చేరేసరికి ఆ ముసలిరైతు అమాంతం యువకుడుగా మారిపోయినాడు. పట్టరాని ఆనందంతో గంతులు వేశినాడు. గట్టున ఉన్న ముసలి ఎద్దుల్ని లాగుకుంటూ వెళ్ళి సరస్సులో ముంచినాడు. అవి లేచే సరికి కోడెలుగా మారినాయి. ఎంతసేపైనను భర్త రాకపోయే వేళకు ఆందోళంపడి రైతుభార్య అన్నం తీసుకొని పొలము చేరింది. యువకుడైన తన భర్తను గుర్తించలేదు. రైతు యువకుడు మాత్రం తన భార్యను గుర్తించి, ఆమె చెయ్యి పట్టుకొని లాగుతూ కొలనులో ముంచాడు. లేచేసరికి ఆమెకూడా యువతిగా మారింది, ఆనందంతో గంతులువేస్తూ దంపతులు తమ ఎడ్ల జతతోబాటు ఇల్లు చేరుకొన్నారు. ఈ వార్త త్వరలోనే పొక్కడంతో జనం గుంపులు గుంపులుగా వెళ్ళి కొలనులో మునకలాడి నవయౌవనులై తిరిగి వచ్చేవారు.

ఈ కథను విన్న నారదుడు కాంపల్లె కాసార మహిమకు కారణాలు కనుకున్నాడు. ఒకప్పుడు గరుత్మంతుడు తన తల్లి దాస్యవిముక్తికోసం దేవతలతో యుద్ధముచేసి అమృతభాండంతో తన తల్లివద్దకు వెళుతుండగా దారిలో ఇంద్రుడు అడ్డువచ్చి అతనిపై వజ్రాయుధం ప్రయోగించగా ఆ ఆయుధం గరుత్మంతుని ఏమీ చేయజాలకపోయింది. గరుడుడు ఇంద్రుని జూచి, తన రెక్కలోని ఒక ఈకను తీసుకొమ్మన్నాడు. ఈకను లాగుచుండగా గరుడుని ముక్కుపై ఉన్న అమృతభాండం నుండి కొన్ని బిందువులు ఒలికి కొలనులో పడినవట. నాటినుండి అది అమరత్వాన్ని ప్రసాదించ సాగెనట. నారదుడు ఈవింత సంగతిని వెంటనే

బ్రహ్మదేవునికి నివేదించాడట.ఇద్దరూ వెళ్ళివిష్ణు మూర్తికి తెలిపారట. ఆయనకూ ఏమీ తోచక అందరూ శివుని ఆశ్రయించారట. శివుడు వాయుదేవుని పిలిచి కైలాస పర్వత పాద మొకదానిని కాంపల్లె సరస్సున వేయమనెనట. వాయుదేవు డట్లే అని పెద్దగుట్ట నొకదానిని కొలనులోనికి వేసెనట. కాని, ఆ గుట్ట ఒక పుష్పంవలె తేలెనట. హరిహరులు తమ పాద ములతో తేలియాడుచున్న ఆ గిరిని అణగ దొక్కిరట. కాని ఆ గిరి నీట తేలుతూనే ఉండినదట. గిరి పుష్పమువలె తేలియాడి నందుకే దానికి 'పుష్పగిరి' అను పేరు ఈ విధంగా వచ్చిందట ।

2168. పూండ్లచెన్నుపల్లె బద్వే. 62+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పూండ్లచెన్ను- గ్రామనా. ప్ర; పు.నా; నామబం. పూండ్ల- కు.నా । <పూండి ల పూండి. చిన్నపల్లె, కుగ్రామం. పోల్చిచూ. త. పూండి. క. హూండి; హూడె (DED. 709). -చెన్ను పు.నా: (<చెన్న+ఉ) చూ.ఆరో.1388; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2169. పూజారివాండ్లపల్లె రాయ. 23+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పూజారివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. పూజారి- కు.నా. దేవాలయంలో పూజలు చేసే వాడు(పూజ+అరి) -అరి- అను. కంచరిలోవలె; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2170. పూజారివాండ్లపల్లె రాయ. 29+.

చూ. ఆరో. 2169.

2171. పూజారివాండ్లపల్లె రాయ. 101+.

చూ. ఆరో. 2169.

2172. పూజారివాండ్లపల్లె

రాయ. 105+. ,,

2173 పూర్ణంపల్లె సిద్ధ. 80+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పూర్ణం- గ్రామనా. ప్ర; నామబం; స్త్రీనా. పూర్ణ- వ్యక్తినా. ప్ర. [<సం. పూర్ణమ్]- -అం-చూ. ఆరో. 1; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

2174. పూర్వబొమ్మేపల్లె జమ్మ. 83.

[బొమ్మేపల్లె మెకం. 1112-10]

వి. బం; పౌర్వాపర్యసూచి.

పూర్వ- గ్రామనా. ప్ర; మునుపటి [<సం. పూర్వః-] -బొమ్మేపల్లె గ్రామనా. ద్వి. బొమ్మే- నామబం; పు.నా. (<బొమ్మ + ఏ), బొమ్మ- చూ. ఆరో. 2509; -ఏ చూ. ఆరో. 4; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"బొమ్మయ అనే కాపు తన పేరుతో పల్లె కట్టించి' నట్లు స్థానికచరిత్ర. (మెకం. 111-2-10). వర్యా. బొమ్మేపల్లె. పోల్చి చూ. కిబితే బొమ్మేపల్లె; బొమ్మేపల్లె కొట్టాల.

2175. పూర్వసుగుమంచిపల్లె జమ్మ. 111.

[సుకమంచి వల్లె 1518 SII-XVI. 64-11, [సు]కమంచివల్లి పొలిమేర 1516 SII. XVI. 55-10. సుగుమంచి పల్లె మెకం; 1119-244: 1180-150; 1204-5].

వి. బం; పౌర్వాపర్యసూచి.

పూర్వ- గ్రామనా. ప్ర. చూ.ఆరో. 2174. -సుగుమంచిపల్లె గ్రామనా. ద్వి. సుగుమంచి- నామబం; వ్యక్తినా. సుగు- వ్యక్తినా. ప్ర.

వ్యుత్పత్తి అస్పష్టం; -మంచి చూ. ఆరో. 1545, పోల్చి చూ. ఆరో. కిబిలే సుగుమంచిపల్లె.

2176. పూలికుంట రాయ. 32.

సంబ. నామబం; వృక్షసూచి.

పూలి- గ్రామనా. ప్ర; < పులివె; ఒక రకం కంచెమొక్క, కలుపు మొక్క కూడా; Crinum Pratense, (Lush). పోల్చి చూ. త. పూల్, పూల. క. హూలి. (DED. 710); -కుంట చూ. గ్రామనా. ద్వి.

2177. పూసలకొట్టాలు కడ. 3+.

సంబ. నామబం; కులసూచి.

పూసల- గ్రామనా. ప్ర; కుల. నా. పూస లమ్ముకొనేవాండ్లు, పూసల బలిజెలు. పోల్చి చూ. నాయి. పూస, కొలా. పుస (DED. 3567) -కొట్టాలు చూ. గ్రామనా. ద్వి.

2178. పెండ్లిమర్రి కడ. 95.

[పెండ్లిమర్రి మెకం. 1119-245; 1210-134; 1240-124].

సంబ. నామబం; సామాన్యనామసూచి. సంఘటనసూచి.

పెండ్లి- వ్యుత్పత్తివివరాలకు చూ. DED. 3608; -మర్రి చూ. గ్రామనా. ద్వి.

లోకనిరుక్తి : "బుక్కరాయలు, దారిద్ర్య రోగంవల్ల వయస్సు వానప్రస్థాశ్రమునకు తగి వుండియు బ్రహ్మచర్యం అవలంబిస్తున్న వారిని (బ్రాహ్మణులను) కరుణించి దీర్ఘ శాఖలు కలిగిన వటవృక్షం క్రింద అందరికి వివాహం చేయించినందున ఈగ్రామనామంవచ్చి నట్లు స్థానికచరిత్ర. (మెకం. 1240-124-125). "The name is a composition of the, Telugu words Pendli marriage and Marri, a banyan tree, and a story has been invented to account for its origin' but there is no large bunyan tree near. the village at the present day." (Brackenbury, 1915. 185).

2179. పెండ్లిమర్రి బద్వే. 23.

చూ. ఆరో. 2178.

2180. పెండ్లూరు పులి. 41.

[? పెళ్లూరు మెకం. 1119-218].

అస్పష్టనామబంధం.

పెండ్లు- గ్రామనా. ప్ర; వ్యుత్పత్తిఅస్పష్టం; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

2181. పెదుళ్ళపల్లె బద్వే. 64.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పెదుళ్ళ- గ్రామనా. ప్ర. కు. నా. బహు. (<పెదుళ్ళ+అ) ఏక. పెదవి; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2182. పెద్దఎరసాల బద్వే. 95+.

వి. బం. పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; వి. గొప్ప మొ. వ్యుత్పత్తి వివరాలకు చూ. DED. 3613. వ్యక్తినామాల్లో ప్రథమావయవాల్లో కూడా ప్రయుక్తమౌతుంది. పెద్దకావు -ఎరసాల ఎర ఆహారము -సాల ఇల్లు.

2183. పెద్దఎల్లపల్లె బద్వే. 103+.

వి. బం. పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182. -ఎల్లపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. పోల్చి చూ. ఎల్లపల్లె.

2184. పెద్దఓరంపాడు రాజం. 104.

[పెద్ద వోరంపాడు మెకం. 1131-32;
పెద వోరంపాడు మెకం. 1223-30.]

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- [పెద-] గ్రామనా. ప్ర. చూ. ఆరో. 2182; -ఓరంపాడు [-వోరంపాడు] అస్పష్ట నామబంధం; పోల్చిచూ. చిన్నఓరంపాడు.

2185. పెద్దకప్పలపల్లె బద్వే. 94+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 2182; -కప్పలపల్లె గ్రామనా. ద్వి. నామబం. కప్పల. కు.నా. బహు (కప్పలు+అ) మాదిగల్లో ఇంటి పేరు; యానాదుల్లో శాఖాభేదం. యానాదులు కప్పలు తింటారంటారు. జపప్పన్న గోత్రంపేరు- (CTSI. II.) -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2186. పెద్దకాంపల్లె కడ. 70.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; -కాంపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. కాంపల్లె పోల్చి చూ. చిన్న కాంపల్లె.

2187. పెద్దకారంపల్లె రాజం. 69+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; -కారంపల్లె గ్రామనా. ద్వి. -కారం- కు. నా. చూ. ప్రో. ద. కారు. పోల్చి చూ. త. కార్; కారం, కార్పు, కరి. మ. కారం. క. కార. తు. కార / సం. క్షార- ప్రోభావంవుండవచ్చు/ (DED. 1227) -పల్లె చూ. గ్రామనా. ద్వి. పోల్చి చూ. చిన్నకారంపల్లె.



2188. పెద్దకాలవపల్లె రాయ. 67.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; కాలవపల్లె- గ్రామనా. ద్వి. చూ. కాలవపల్లె.

2189. పెద్దకుడాల పులి. 62.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 2182. -కుడాల చూ. గ్రామనా. ద్వి.

"It is said that this village and the neighbouring Chinna Kudala are named after two brothers Pedda Kudalappa and Chinna Kudalappa who were shepherds (APDGC. 785).

2190. పెద్దకొమెర్ల జమ్మ. 12+.

[కొమెర్ల 1533 AR 32-33 B 357; 1544 AR 32-33 B 378; పెద కొమెర్ల 1545 AR 32-33 B 376; 1553 AR 32-33 B 376; పెద కొమెఱ 1557 SII. XVI. 224-6, 12; పెద్దకొమెరల మెకం. 1118-69; పెద్దకొమెర్ల మెకం. 1118-166; పెద్ద కొమ్మెర్ల మెకం. 1180-172; పెద్ద కొమ్మర్ల మెకం, 1180-154; పెద కొమఱ మెకం. 1118-1; పెదకొమె రల మెకం. 1118-69; పెద కొమెర్ల మెకం. 1118-4].

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- [పెద-] గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182. -కొమెర్ల [-కొమెరల; -కొమ్మెర్ల; -కొమెఱ; -కొమెర్ల] చూ. గ్రామనా. ద్వి. పోల్చి చూ. చిన్నకొమెర్ల.

"చెరువు రెండుకొమ్ములను రెండుగ్రామాలా

నిర్మించె గనుక తూర్పుగ్రామానకు పెద్దకొమెర్ల అని, పశ్చిమభాగం కొమ్మునవుండే గ్రామానకు చినకొమెర్ల అని గ్రామాలు రెంటికి పెదకొమెరల చినకొమెరల అని గ్రామనామధేయాలు.''....

లో. ని. రామయ దేవర పాడుకు చెందిన మోటాటి కాపు పెమ్మిరెడ్డి వంకకు అడ్డంగా చెరువు వేయించాలనుకున్నప్పుడు చెరువుకట్ట నిలబడలేదట. గంగాభవాని స్వప్నంలో కన్పించి పెమ్మిరెడ్డి కూతుళ్ళయిన చిన అంకమ్మ పెద అంకమ్మలను బలి కోరిందట. తలిదండ్రులు ఈ విషయమై బాధతో ఉండగా ఆయన కూతుళ్లిద్దరు గుర్రాలమీద చెరువు వద్దకు వెళ్లారట. పశ్చిమభాగం చెరువు కొమ్మొతూమువద్దకు చిన అంకమ్మ పోయేవేళకు అదృశ్యంకాగా, తూర్పు భాగం తూమువద్దకు పెద్దఅంకమ్మ పోయేవేళకు అదృశ్యం అయిందంట. వారి జ్ఞాపకార్థం రెండు గ్రామాలు చెరువు రెండు కొమ్ముల నిర్మాణం అయ్యాయని స్థానికచరిత్ర. (మెకం. 1118-156).

2191. పెద్దకోడివాండ్లపల్లె రాయ. 101+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. అరో. 2182. -కోడివాండ్లపల్లె గ్రామనా. ద్వి.- కోడివాండ్ల- కోడి- కు.నా. వ్యుత్పత్తి వివరాలకు చూ.DED. 1862; -వాండ్ల- చూ. అరో. 2, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2192. పెద్దగురువలూరు ప్రొద్దు. 61.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. అరో. 2182; -గురువలూరు గ్రామనా. ద్వి. గురువలు ~ గురువులు మతగురువులు [<సం. గురు] -ఊరు చూ. గ్రామనా. ద్వి. పోల్చి చూ. చిన్న గురువలూరు.

2193. పెద్దగొల్లపల్లె రాయ. 105+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. అరో. 2182; -గొల్లపల్లె గ్రామనా. ద్వి. చూ.అరో; పోల్చి చూ. గొల్లపల్లె.

2194. పెద్దచియ్యపాడు ప్రొద్దు. 60+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా- ప్ర; చూ. అరో. 2182; -చియ్యపాడు నామబం; -చియ్య- ~ జియ్య చూ. అరో. 1507; -పాడు చూ. గ్రామనా.ద్వి. పోల్చిచూ. అరో. చియ్యపాడు, చాపాడు.

2195. పెద్దచెప్పలి కమ. 68.

[పెద్దచెప్పల్లె 1553 AR 1937-38 B 240; చప్పలి 1628 T.T.D.I. 25-3; పెద్దచెప్పల్లె,పెద్దచెప్పల్లి మెకం. 1225-89]

నామా. కృష్ణరాయపురం 1553 AR 37-38 B 240.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. అరో. 2182; -చెప్పలి [చెప్పల్లె- చప్పలి-; చెప్పల్లి-] గ్రామనా. ద్వి. ? <చెరువు+పల్లి / పల్లె వర్ణ సమీకరణంవల్ల చెప్పల్లి / చెప్పలి / చెప్పల్లె పోల్చిచూ. చిన్న చెప్పలి.

లోకనిరుక్తి : చెప్పలి అనే పేరుగలవాని పేర ఈ ఊరు వెలసినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1225-89). నామా. వ్యాప్తిలో లేదు.

2196. పెద్దజూటూరు పులి. 21.
వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; -జూటూరు గ్రామనా. ద్వి. అస్పష్టనామ బంధం. పోల్చిచూ; చింతలజూటూరు.

2197. పెద్దజొన్నవరం ప్రొద్దు. 19.
వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్రి; చూ. ఆరో. 2182; -జొన్నవరం గ్రామనా. ద్వి. చూ. ఆరో. జొన్నవరం; పోల్చిచూ. చిన్న జొన్నవరం.

2198. పెద్దచౌటపల్లె కడ. 77+.
వి. బం: పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్రి; చూ. ఆరో. 2182; -చౌటపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. చౌట పల్లె.

2199. పెద్దదండ్లూరు జమ్మ. 121.
[పెద్దదండ్లూరు మెకం. 1180 - 180; పెదదండ్లూరు మెకం. 1180 - 150; పెద్దండ్లూరు మెకం. 1119-159]
వి. బం; పరిమాణసూచి.

పెద్ద- [ల పెద-] గ్రామనా. ప్రి; చూ. ఆరో. 2182; -దండ్లూరు గ్రామనా. ద్వి. దండ్లు- (దండు + లు) ఏక దండు. సేన, గుంపు. పోల్చిచూ. క. దండు / సం. దండః; -ఊరు చూ. గ్రామనా. ద్వి. "When Gandikota was ruled by Hindu Kings, a large army was kept in this village Peddadanluru. Pedda means big and dandu means army and in Chinnadandluru, which is 3 miles from here, a small army was kept. The name Peddadanluru was given to this village apparently because it was the army head quarters" (F.F. 1961, 62).

2200. పెద్దదాసరిపల్లె కడ. 93.
వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్రి; చూ. ఆరో. 2182; -దాసరిపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. దాసరి పల్లె; పోల్చిచూ. చిన్నదాసరిపల్లె.

2201. పెద్దదుద్యాల కమ్మ. 131.
దుద్యాల 1544 AR 40-41 B 406; వరదరాజుల దుద్యాల 1546 AR 40-41 B 403; పెదదుద్దెల మెకం. 1119-70; దుద్దాల మెకం. 1119-70. బడా దుద్యాల మెకం. 1119-65]
వి. బం; పరిమాణసూచి.

పెద్ద- [ల పెద- పర్యా. ఉ. బడా-] గ్రామనా. ప్రి; చూ. ఆరో. 2182; -దుద్యాల [దుద్దెల-; దుద్దాల-]; చూ. ఆరో. దుద్యాల; చారిత్రక రూపం: వరరాజుల దుద్యాల పర్యాయ రూపం. దుద్యాలలో వరదరాజస్వామిగుడి ఉంది కాబట్టి ఆ పేరుతో శాసన కర్తలు వ్యవహరించారు. నేడు వ్యవహారంలో లేదు. మెకంజీలో పెద్ద అనే తెలుగుపదం స్థానంలో ఉర్దూ బడా కన్పించడం ఒక భాషా విశేషం.

లోకనిరుక్తి: యాకర్లు అమ్మవారు గుడి కొండపై కట్టించి అందులో దుర్గిదేవిని నిల్పినారనీ, దుర్గిదేవిపల్లె కాల క్రమంలో దుద్దెల అయిందట; (మెకం. 1119-70-71)

2202. పెద్దనపాడు కమ. 33.
[పెద్దనపాడు మెకం. 1229-38]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పెద్దన- గ్రామనా. ప్రః నామబం; పు.నా. పెద్ద- వ్యక్తినా. ప్రః చూ.ఆరో. 2182; -అన చూ. ఆరో. 3; -పాడు చూ. గ్రామనా. ద్వి.

2203. పెద్దనూతిపపల్లె రాజం. 57+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; నూయి - నూతి. -నూతిపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. పోల్చిచూ. నూతిపల్లె.

2204. పెద్దపల్లె రాయ. 23+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2205. పెద్దపల్లె రాయ. 26+.

చూ. ఆరో. 2204.

2206. పెద్దపల్లె రాయ. 31+. ,,

2207. పెద్దపల్లె రాయ. 33+. ,,

2208. పెద్దపల్లె రాయ. 83+. ,,

2209. పెద్దపల్లె రాయ. 105+. ,,

2210. పెద్దపల్లె రాయ. 106+. ,,

2211. పెద్దపల్లె రాయ. 118+. ,,

2212. పెద్దపల్లె సిద్ధ. 44. ,,

2213. పెద్దపల్లెవాండ్లపల్లె రాయ. 84+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పెద్దపల్లెవాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. పెద్దపల్లె- కు. నా: నామబం. గ్రామనామసూచి. చూ. ఆరో. 2204, -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2214. పెద్దపసుపుల జమ్మ. 108.

[హిరియ పసుపుల 1382 AR 40-4 B 341, పెదపసుపుల 1732 AR 45-46 B 154, పెదపసుపుల మెకం. 1169 17; 1204-75]

వి. బం; పరిమాణసూచి;

పెద్ద- [పర్యా. హిరియ-, పెద-] గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; -పసుపుల చూ. గ్రామనా. ద్వి.

క్రీ. శ. 1382 శాసనంలో పెద్దకు పర్యాయంగా కన్నడ హిరియ కన్పించడం ఒక భాషావిశేషం.

2215. పెద్దపాడు రాజం. 143+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర. చూ. ఆరో. 2182; -పాడు చూ. గ్రామనా. ద్వి.

2216. పెద్దపుత్త కడ. 40

[పెద్దపుత్త మెకం. 1225-166, పెదపుత్త మెకం; 1119-218].

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- [పెద-] గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182. -పుత్త చూ. గ్రామనా. ద్వి. కు. నా. పాపాఘ్నికితూర్పున "పుత్తవారు" కట్టించినట్లు స్థానికచరిత్ర. (మెకం. 1225-166).

2217. పెద్దబిడెం రాయ. 110+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; -బిడెం చూ. గ్రామనా. ద్వి.

2218. పెద్దబిడికి రాయ. 100+.

వి. బం; పరిమాణసూచి,

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. అరో. 2182. -విడికి చూ. గ్రామనా. ద్వి.

2219. పెద్దముడియం జమ్మ. 95.

[ముడివి(యం)బు C 800 E I-XXX. 4-16-27, ముడివేము / ముడివేము 1121 SII.IX. . .207; త్రిలో[చ]న పురాన్కు ప్రతి నామమైన బ్రా[ం]హ్మల ముడియ్యం 1551 SII XVI. 179-9, 10. త్రిలోచనపుర ప్రతి గ్రహ ల[బ్ద]మైన బ్రా[ం]హ్మల ముడియ్యాం అనేటి సర్వమాన్య అగ్రహారి[ర]* బ్రాంహ్మల ముడియ్యం గ్రామమందు *Ibid* 25. 26; ముడియ్యం *Ibid* 27; ముడివేముల మెకం. 1204-128; పెద్ద ముడియం మెకం. 1204-5; 1180-164. పెదముడియం మెకం.1204-114 నామా. త్రిలోచనపురం మెకం. 1204-128.]

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- పెద- వర్యా. బ్రాహ్మల గ్రామనా. ప్ర; చూ. అరో. 2182; -ముడియం చూ. గ్రామనా. ద్వి.

[ముడివి (యం)బు; -ముడివేము -ముదివేము-; -ముడియ్యం; -ముడివేముల-,. -ముడియం] ముడి ల ముది ముసలి పోల్చి చూ. తె. ముదిమి. ముతుక, ముదుక, ముదుర, ముత్త, ముదుసలి, ముసలి; మొదలు- మొ. త. మూ, ముదిర్, ముదు. మ. ముతు. క. ముదు, ముత్తు. తు. ముది. (DED. 4057 & BSOAS 10-2-95). -యం [-వియం; -వేము, -య్యం]. శాసన రూపం త్రిలోచన పురం, బ్రాహ్మల ముడియం వాడుకలో లేవు.

2220. పెద్దముత్తరాచపల్లె పిద్ద 77+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. అరో. 2182; -ముత్తరాచపల్లె గ్రామనా. ద్వి. చూ. అరో. ముత్తరాచపల్లె. పోల్చి చూ. చిన్న ముత్త రాచపల్లె.

2221. పెద్దముసల్‌రెడ్డిపల్లె కడ. 67+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. అరో. 2182; -ముసల్‌రెడ్డిపల్లె గ్రామనా. ద్వి. చూ; అరో. ముసల్‌రెడ్డి పల్లె, పోల్చి చూ. చిన్న ముసల్ రెడ్డిపల్లె.

2222. పెద్దయ్యగారిపల్లె కమ. 42+.

సంబ; నామబం; వ్యక్తినామసూచి.

పెద్దయ్యగారి- గ్రామనా. ప్ర. నామబం. పెద్దయ్య- వి. బం; పు. నా; పరిమాణ సూచి. పెద్ద- చూ.అరో. 2182; -అయ్య-చూ. అరో.4. -గారి- చూ.అరో. 6; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

2223. పెద్దరంగాపురం పులి. 57.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. అరో. 2182; -రంగాపురం గ్రామనా. ద్వి. చూ. అరో. రంగాపురం. పోల్చిచూ. చిన్న రంగాపురం.

2224. పెద్దరామిరెడ్డిగారిపల్లె రాయ.66+.

వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. అరో. 2182; -రామిరెడ్డిగారిపల్లె గ్రామనా. ద్వి. చూ.అరో. రామిరెడ్డిగారిపల్లె. పోల్చిచూ. చిన్నరామిరెడ్డి గారిపల్లె.

2225. పెద్దరెడ్డిగారిపల్లె రాయ. 15+.
వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; - రెడ్డిగారిపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రెడ్డిగారిపల్లె.

2226. పెద్దరెడ్డివారిపల్లె రాయ. 57+.
వి. బం; పరిమాణసూచి.

పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; -రెడ్డివారిపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. రెడ్డివారిపల్లె. పోల్చిచూ. చిన్నరెడ్డివారిపల్లె.

2227. పెద్దరెడ్డివారిపపల్లె రాయ. 79+.
చూ. ఆరో. 2226.

2228. పెద్దపింగనపల్లె ప్రొద్దు. 12+.
వి. బం; పరిమాణసూచి.
పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో; 2182; -పింగనపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. 3278. పోల్చిచూ. చిన్నిపింగనపల్లె.

2229. పెద్దపెట్టిపల్లె ప్రొద్దు. 81.
వి. బం; పరిమాణసూచి.
పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; - పెట్టిపల్లె గ్రామనా. ద్వి.చూ.ఆరో. పెట్టిపల్లె,

2230. పెద్దపెట్టిపల్లె ప్రొద్దు 89+.
[పెద్దశెట్టిపల్లె మెకం. 1126-121; పెదపెట్టిపల్లె మెకం. 1119-244] చూ. ఆరో. 2229.

2231. పెద్దాయపల్లె సిద్ధ 80+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
పెద్దాయ- గ్రామనా. ప్ర; వి, బం; పు. నా. పెద్ద- చూ.ఆరో. 2182; -ఆయ- చూ.ఆరో. 4; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2232. పెద్దినేనికాల్వ రాయ. 111.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
పెద్దినేని- గ్రామనా. ప్ర; వి. బం. పు.నా. పెద్ది- (<పెద్ద+ఇ) పెద్ద- చూ. ఆరో. 2182; -ఇ చూ. ఆరో. 25. -నేని- చూ. ఆరో. 181; -కాల్వ చూ. గ్రామనా. ద్వి.

2233. పెద్దిరాజుపల్లె బద్వే. 54+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
పెద్దిరాజు- గ్రామనా. ప్ర; వి.బం ; పు.నా. పెద్ది- చూ. ఆరో. 2232; -రాజు- చూ. ఆరో. 49; పల్లె చూ. గ్రామనా. ద్వి.

2234. పెద్దిరెడ్డివారిపల్లె రాయ. 104+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
పెద్దిరెడ్డివారి- గ్రామనా. ప్ర; నామబం. పెద్దిరెడ్డి- వి.బం; కు.నా; వ్యక్తినామసూచి. పెద్ది- చూ.ఆరో. 2232; -రెడ్డి చూ. ఆరో. 6; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2235. పెద్దిపీడు రాయ. 83.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
పెద్ది- గ్రామనా. ప్ర; వ్యక్తినా. చూ. ఆరో. 2232; -పీడు చూ. గ్రామనా. ద్వి.

2236. పెద్దూరు రాజం. 69+.
వి. బం; పరిమాణసూచి.
పెద్ద- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2182; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

**2237.** పెద్దూరు రాజం. 114+.

చూ. అరో. 2236.

**2238.** పెద్దూరు రాజం. 127+. ..

**2239.** పెద్దూరు రాజం. 161+. ..

**2240.** పెనంవారిపల్లె బద్వే. 107+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పెనంవారి- గ్రామనా. ప్ర; నామబం. పెనం- కు.నా; వస్తుసూచి. బాణలి; -వారి- చూ. అరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి;

**2241.** పెనగలూరు రాజం. 14.

[పెనగలూరు అగ్రహారం మెకం. 1134-321-22]

నామా. ఎల్లమరాజు సముద్రం. 1571

? సంబ. నామబం; స్థలనామసూచి.

(లేదా) వి. బం; పరిమాణసూచి.

(అ) ? పెనగలు- < పెనుగల్లు స్థలనా: వి. బం. పెను- స్థలనా. ప్రి. పెద్ద. పోల్చిచూ. తె. పెనువు, పెనుచు, పెనువు, పెంపు మొ. త. పెరియ, పెరుం. మ. పెరు. క. పెర్ మొ. వివరాలకు చూ. DED. 3615 & BSOAS. 12-249. -గలు<కల్లు -బండ స్థలనా. ద్వి. చూ. అరో. 587; -ఊరు చూ. గ్రామనా. ద్వి.

"పూర్వం బాహుదా నదీతీరమున గొప్ప బండ వుండగా అందుకు తెనుగుతో పెనుగల్లు అని వాడుకొనేవారు. అక్కడ కొందరు కాపులుచేరి వుండినందున పెనగలూరు అని గ్రామనామధేయం" కలిగింది (మెకం. 1134-322). (ఆ) ? పెన+గలూరు పెన- <పెను; కలూరు <కల్లూరు. పోల్చిచూ. ఇనగలూరు, నామా. వాడుకలోలేదు.

**2242.** పెవికెలపాడు జమ్మ. 137.

[పెనుకలపాడు 155 (3) AR 40-41 B 397; పెవికెలపాడు మెకం. 1119-64]

అస్పష్టనామబంధం.

పెవికెల- ? <పెనుకల్లు; -పాడు చూ. గ్రామనా. ద్వి.

లోకనిరుక్తి: "నామికొండ కుత్తరం నచ్చార్లవంక పూర్వభాగమందు పెరికెలు దిగేబాటన ప్రథమశాఖ వెంకటప్ప అనే ఆయన అనుముకొండ రాజ్యాన్నుంచి ఆ స్థలమందు కొంకన నీళ్లు వుండెను గనుక ఆ వంకనీళ్లు ఆదరవు చేసికొని అక్కడ గ్రామం కట్టిరి. పెరికెలబాటనగ్రామం కట్టించినందుచేత పెవికెలపాడు" అని పేరు పొందిందని స్థానిక చరిత్ర (మెకం. 1119-79)

**2243.** పెమజావ్వి జమ్మ. 53.

వి. బం; పరిమాణసూచి.

పెమ- గ్రామనా. ప్ర; వి. చూ. అరో. 2241; -జావ్వి చూ. గ్రామనా. ద్వి.

**2244.** పెన్నపేరూరు సిద్ధ. 48.

సంబ. నామబం; స్థలనామసూచి.

(నదీనామసూచి)

పెన్న- గ్రామనా. ప్ర; స్థలనా. అనమ స్తం. రాయలసీమ నెల్లూరు జిల్లాల్లోపారే ఒకనది పేరు; పి నా కి ని. పెన్- ల పెను చూ. అరో. 2241; -పేరూరు గ్రామనా. ద్వి. వి. బం; పరిమాణసూచి. పేరు- వి. ల పెర్- చూ. అరో. 2241; వ్యక్తినామ ప్రథమావయమాల్లో కూడా 'పేరు' చూడవచ్చు: పేరయ్య, పేరమ్మ, పేరారెడ్డి మొ. వ్యక్తినామ ప్రథ

మావయనాల్లోని పేరు పరిణామసూచి. -ఊరు చూ. గ్రామనా. ద్వి. పోల్చి చూ. గంగ పేరూరు.

ఈ గ్రామం పెన్న ఒడ్డున ఉంది.

**2245. పెన్నబడివాండ్లపల్లె రాయ. 19+.**

సంబ. నామబం; స్థలనామసూచి.
కుటుంబనామసూచి.

పెన్న- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2244; -బడివాండ్లపల్లె గ్రామనా. ద్వి. -బడి- కు.నా. రెడ్లల్లో ఇంటిపేరు; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2246. పెమ్మాడపల్లె రాయ. 94.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పెమ్మాడ- గ్రామనా. ప్ర; కు.నా. అస్పష్ట నామబంధం ? < పెమ+మడ -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2247. పెరియవరం రాజం. 83.**

[పెరియవరం మెకం. 1223-84-85]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పెరియ- గ్రామనా. ప్ర, పు.నా. త. పెరియ పెద్ద మొ. పెర్- ఌ పేర్; -ఇయ ఌ అయ పురుషనామానుబంధం. పోల్చి చూ. పెరియ (ప్రా. శా.); పోల్చిచూ. పేరయ్య- -వరం గ్రామనా. ద్వి.

**2248. పెరుమాళ్లయ్యగారిపల్లె రాయ. 109.**

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పెరుమాళ్లయ్యగారి- గ్రామనా. ప్ర; నామబం. పెరుమాళ్లయ్య- నామబం; పు.నా. దేవతాసూచి (పెరుమాళ్ల+అయ్య) పెరుమాళ్ల- వ్యక్తినా. ప్ర. విష్ణువు వైష్ణవ బిరుదు. త. పెరుమాల్ (పెరుం+అల్) పెద్దమనిషి; ప్రాచీన ద్రావిడ రాజవంశానికి చెందిన నాయకుడు. చేరదేశ అధిపతికి పెరుమాల్ అని కేరళలో వాడతారు. హిందూ వ్యక్తినామద్వితీయావయవాల్లో ప్రయుక్తం. పోల్చి చూ. నంబెరుమాల్, తేప్పెరుమాల్, వరాహ పెరుమాల్, గోవిందరాజ పెరుమాల్; -అయ్య-చూ. ఆరో. 4; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2249. పెర్నపాడు పులి. 39.**

[పెరనిపాడు మెకం. 1126-87; పెన్నపాడు మెకం. 1119-218].
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పెర్న- [పెరని-. పెన్న-] గ్రామనా. ప్ర. కురూపం; పు. నా. < పేరన్న. పేరు- చూ. ఆరో. 2247; -అన్న-చూ. ఆరో. 8. -పాడు చూ. గ్రామనా. ద్వి. మెకంజీ రూపం పెన్న పెరని- వర్ణసమీకరణ రూపం;

“పేరయ్య లోకయ్య అనే గొల్లలు కట్టించినట్లు స్థానిక చరిత్ర. (మెకం. 1119-218).

**2250. పెయ్యలవాండ్లపల్లె రాయ. 51+.**

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పెయ్యలవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం; పెయ్యల- కు నా; బహు. (పెయ్యలు+అ) ఏక. పెయ్య పాలువిడిచిన ఆడుదూడ. (అ) (అరుదుగా) ఈనకారుకు వచ్చిన గేదె చూ. పో.వ. పైద, పైదలి, పేయ. పెయ్యదూడ. పోల్చి చూ. త. పయుర్, పైయల్, పైదల్, పదల్, పైచల్; పైయన్. మ. పైతల్, పళకన్. క. పసుళ, మను౯ె. కొడ. పజ్జ. తు. పసి;

పైయ్య, పైయ్యే. మొ. (DED. 3218); -వాండ్ల- చూ. ఆరో. 2. -పల్లె చూ. గ్రామ నా. ద్వి.

**2251.** పెయ్యలవాండ్లపల్లె రాయ. 62+.
చూ. ఆరో. 2252.

**2252.** పెసలవాండ్లపల్లె కడ. 87+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

పెసలవాండ్ల- గ్రామనా. ప్ర. నామబం; పెసల- కు నా; బహు వస్తుసూచి. (పెసలు+ అ) ఒక రకం పప్పు దినుసు (Green gram) Phaseolus mungo, Linn. పో ల్చి చూ. త. పయఱు. మ. పయర్. క. పెసర్. కొలా. పెసల్. నాయి. పెసళ్ మొ. (DED. 3350), -వాండ్ల- చూ. ఆరో. 2. -పల్లె చూ. గ్రామ నా. ద్వి.

**2253.** పేరంపల్లె రాయ. 24.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పేరం- గ్రామనా. ప్ర; వి. బం. పేరు. చూ. ఆరో. 2247: -అం- చూ. ఆరో. 1. -పల్లె చూ. గ్రామనా. ద్వి. రెవెన్యూ రికార్డుల్లో లే. రూ. ప్యారంపల్లె.

**2254.** పేరంవాండ్లపల్లె రాయ. 73+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

పేరంవాండ్ల గ్రామనా. ప్ర; నామబం, పేరం- కు.నా. వ్యక్తినామసూచి. చూ. ఆరో. 2253, -వాండ్ల- చూ. ఆరో. 2, -పల్లె చూ. గ్రామనా. ద్వి. రెవెన్యూ రికార్డుల్లో లే. రూ; ప్యారంవాండ్లపల్లె.

**2255.** పేరంవారిపల్లె రాజం. 28+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

పేరంవారి- గ్రామనా. ప్ర. నామబం. పేరం- చూ. ఆరో. 2254, -వారి- చూ; ఆరో. 8, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2256.** పేరన్నపల్లె కడ. 87+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పేరన్న- గ్రామనా. ప్ర. వి. బం, పు.నా. పేరు- చూ. ఆరో. 2253; -అన్న- చూ. ఆరో. 3, -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2257.** పేరమ్మగారిపల్లె బద్వే. 77.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పేరమ్మగారి- గ్రామనా. ప్ర. నామబం. పేరమ్మ వి. బం. స్త్రీ.నా. పేరు- చూ. ఆరో. 2253, -అమ్మ- చూ. ఆరో. 1, -గారి- చూ. ఆరో. 6. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2258** పేరయ్యగారిపల్లె సిద్ధ. 44+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పేరయ్యగారి- గ్రామనా. ప్ర; నామబం. పేరయ్య- వి. బం. పు.నా. పేరు- చూ. ఆరో. 2253, -అయ్య చూ. ఆరో. 4, -గారి- చూ. ఆరో. 6 -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2259.** పేర్లకుంట సిద్ధ. 80+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

పేర్ల- గ్రామనా. ప్ర, కు. నా. పెసకంటి కాపుల్లో ఇంటి పేరు. -కుంట చూ. గ్రామ నా. ద్వి.

**2260.** పైడికాలవ కడ. 43.

[పయిండి కాలువ మెకం. 1229-49, పైండి కాలువ మెకం. 1110-12, 1225-174, పయిడికాల్వ మెకం.

1119-245. పైడికాలువ మెకం. 1110-
12; 1225-174.]
వంబ. నామబం; కులనామసూచి.

పైడి- [వయిండి-, పైండి, వయిడి-]
ఒరియా మాండలికాన్ని మాట్లాడే వ్యవసాయ
కూలీ వర్గానికి చెందిన ఒక కులం; నేతగాళ్ల
కూడా.విశాఖమండలంలోఎక్కువ (CTSI V);
పైడ- మాలల్లో ఇంటిపేరు; పైడం- దేవాం
గుల్లో ఇంటిపేరు (CTSI. V); పైడి- ఇంటి
పేరుగా కూడా కన్పిస్తుంది. వ్యుత్పత్తి వివరా
లకు చూ. DED. 3161. -కాలవ [కాలువ,
కాల్వ] చూ. గ్రామనా. ద్వి.

"నది శిల విలిపి పైడమ్మ అనే పేరు"
గల దేవత పేరుతో పాపాఘ్నికి కాలువ
తవ్వించి తమ పల్లెకు పొలాలకు కాలువనీరు
ఏర్పరచినందున "పైడమ్మ" దేవత పేర పైడి
కాలవ అనే పేరు వచ్చినట్లు స్థానిక చరిత్ర.

2261. పైడిపాలెం పులి. 73.
[పైడిపాళ్యము మెకం. 1119-13].
నంబ. నామబం; కులసూచి.

పైడి- గ్రామనా. ప్ర; చూ. అరో. 2260;
-పాలెం [-పాళ్యము] చూ. గ్రామనా. ద్వి.

2262. పైడేల ప్రొద్దు. 3.
[వసిండికూఱు C 800 E I. XXVII,
44-11-20; వగిడెల మెకం. 1126-60;
వయిదేరా మెకం. 1111-22]
అస్పష్టనామబంధం.

? పైడి- గ్రామనా.ప్ర; చూ.అరో. 2260;
-ఆల చూ; గ్రామనా. ద్వి.

2263. పొందలూరు రాజం. 28.
[పొళదులూరు 1557 SII. XVI
220-17,18. పొందలూరు మెకం.
1223-177; 1/31-9; పురందలూరికి
వాడికె నామమైన పొందలూరి- మెకం.
1223-178].
అస్పష్టనామబంధం.

పొందలు- [పొళదలు పురందలు-] గ్రామ
నా. ప్ర; వ్యుత్పత్తి అస్పష్టం; ? < పొలతి;
పోల్చిచూ. నందలూరు. -ఊరు గ్రామనా.ద్వి.

2264. పొట్టిగారిపల్లె బద్వే. 118+.
[పొట్టిగారిపల్లె మెకం. 1170-22]
నంబ. నామబం; వ్యక్తినామసూచి.

పొట్టిగారి- గ్రామనా. ప్ర; నామబం;
పొట్టి- వ్యక్తినా. విశేషణసూచి. చిన్న, ఎత్తు
తక్కువ పోల్చిచూ. క. పుట్ట, పుట్టి. పుట.
తు. పుట్టి. పర్జి. పిటిత్. బ్రా. పటక్ / నం.
పుట్ట- (DED. 3498.) -గారి- చూ. అరో. 6;
-పల్లె చూ. గ్రామనా. ద్వి.

"వేల్పులపొట్టి అనే గొల్లడు" ఈ గ్రామ
నిర్మాణకారకుడైనట్లు స్థానికచరిత్ర (మెకం.
1170-22).

2265. పొట్టిగారిల్లె ప్రొద్దు. 9+.
చూ. అరో. 2264.

2266. పొట్టిపాడు ప్రొద్దు. 35.
వి. బం; పరిమాణసూచి.

పొట్టి- గ్రామనా ప్ర; చూ. అరో. 2264.
-పాడు చూ. గ్రామనా. ద్వి.

2267. పొట్టిపాడు జమ్మ. 62.
[పొట్టిపాడు మెకం. 1180-24]
చూ. అరో. 2266.

**2268. పొట్టిమేడిపల్లె ప్రొద్దు. 80+.**
సంబ. నామబం; స్థలనామసూచి.

పొట్టిమేడి- గ్రామనా. ప్ర; వి. బం. పొట్టి- చూ. ఆరో. 2264; -మేడి అత్తి. ఒకరకం చిన్నపండ్లచెట్టు (fig tree) Ficus glometra, Roxb., -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2269. పొట్టిరాజుగారిపల్లె రాజం 140+.**
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పొట్టిరాజుగారి గ్రామనా. ప్ర; నామబం. పొట్టిరాజు- వి. బం; పు.నా. పొట్టి- చూ. ఆరో. 2264; -రాజు- చూ.ఆరో. 49; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ గ్రామనా. ద్వి.

**2270. పొట్టివాండ్లపల్లె రాయ. 106+.**
సంబ; నామబం; కుటుంబనామసూచి.

పొట్టివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. పొట్టి- పు. నా. చూ. ఆరో. 2264; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2271. పొట్టివారిపల్లె రాయ. 48+.**
సంబ. నామబం. కుటుంబనామసూచి.

పొట్టివారి- గ్రా మ నా. ప్ర; నామబం. పొట్టి- చూ. ఆరో. 2269; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2272. పొట్రెడ్డిగారిపల్లె రాయ. 95+.**
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పొట్రెడ్డిగారి- గ్రామనా. ప్ర; నామబం. పొట్రెడ్డి- వి. బం; పు.నా. (పొట్టి + రెడ్డి) పొట్టి- చూ. ఆరో. 2264; -రెడ్డి-చూ. 6; గారి- చూ.ఆరో. 6; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

**2273. పొట్రెడ్డిగారిపల్లె రాయ. 101+.**
చూ. ఆరో. 2272.

**2274. పొట్రెడ్డిగారిపల్లె రాయ. 104+.**
చూ. ఆరో. 2272.

**2275. పొదదుర్తి కమ. 63.**

[పొడుతుర్తి / పొదదుర్తి. మెకం. 1225-27, 1119-247, 1225-27;. పొదతుర్తి మెకం. 1225-32]
వి. బం; వర్ణసూచి.

పొద- తెలుపు; -దుర్తి [ల తుర్తి] చూ. గ్రామనా. ద్వి. పొదదుర్తి పాపాఘ్ని నదికి పశ్చిమానగల చిన్నకొండ దగ్గరుంది.

**2276. పొత్తపి రాజం. 7.**

[పొత్తెపి విట 971 E. I. XXVIII-12-70-3; పొత్తపి 1125 AR 1907 B 579; పొత్తపినాడు 1272 AR 1911 B 404; పొతపినాంటిసీమ 1514 T. T. D. I III. 68-3]

అస్పష్టనామబంధం.

? పొత్త్+అపి<పొత్త్ - ఎపి<పొత్తు+ ఏపి. పొత్తు- గ్రామనా. ప్ర. ఒకదానితో ఒకటి కలియు, చెలిమి; కూడిఉండు; కలయిక; ఉమ్మడి; సంబంధం కలది. పోల్చిచూ. త. పొదు. మ. పొతు; క. పుదు, పుదువు. (DED. 3684) -అపి [ల -ఎపి] చూ. గ్రామనా. ద్వి. ? ఏపెచెట్లతో సంబంధంగల నాడు పొత్తపినాడు. పోల్చిచూ. కొండేపి; కందుకూరు తాలూకా ఒంగోలుజిల్లా. చారిత్రక వివరాలకు చూ. ఈశ్వరదత్తు, 1963. 228-229.

2277. పొత్తుకూరుపల్లె రాయ. 85.
సంబ. నామబం; కుటుంబనామసూచి.

* పొత్తు + కు + ఊరు గ్రామనా. ప్ర; కు.నా. -ఊరు చూ. గ్రామనా. ద్వి.; కుగాగమం; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2278. పొదలపల్లె రాయ. 68+.
సంబ. నామబం; సామాన్యనామసూచి. వృక్షసస్యసూచి.

పొదల- గ్రామనా. ప్ర; బహు. (పొదలు+ అ) ఏక. పొద- పొద(రు) పెద్ద తుప్ప; బోదె లేని చిన్నచెట్లు, తీగెలు గుబురుగా అల్లుకొన్న వాని గుంపు పోల్చిచూ. త. పుదర్, పుదల్, పొదుంపు. క. పొదల్ [ద.ద్రా. *పుత్-/ *పొత్-, *అర్; *అల్ అనుబంధాలతో] వివరాలకు చూ. DED. 3686; BSOAS. 12-384; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2279. పొదలోపల్లె రాజం. 77+.
[పొదలోపల్లె మెకం. 1233-144]
స్థలా. నామబం; స్థలాసూచి.

పొదలో- గ్రామనా. ప్ర; పొద- చూ. ఆరో. 2278; -లో- స్థలార్థకం; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2280. పొదిలివారిపల్లె సిద్ధ. 66+.
[పొదిలివారిపల్లె మెకం. 1126-157]
సంబ. నామబం; కులనామసూచి.

పొదిలివారి- గ్రామనా. ప్ర; నామబం. పొదిలి- అసమస్తం; గ్రామనా. ప్రకాశం జిల్లా లోని తాలూకా కేంద్రం. -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

పొదిలిసీమ గొల్లలు ఈ గ్రామనిర్మాణానికి కారకులైనట్లు స్థానిక చరిత్ర (మెకం. 1126-157).

2281. పొన్నంపల్లె జమ్మ. 74.
[పొన్నంపల్లె మెకం. 1118-53]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పొన్నం- గ్రామనా. ప్ర; నామబం; * వృక్షసూచి. పొన్న- వ్యక్తినా. ప్ర; పొన్నచెట్టు; Alexandrian Laurel; Calaphyllum inophyllum. పోల్చిచూ. త. పున్నాయిచ్ పిణ్ణై; పుంకు. మ. పున్న. క. పున్నికె, పొన్నె. హొన్నె [మూలద్రా. *పున్-అ *పొన్-అ] వివరాలకు చూ. DED. 3562; IPS. 1946, 10; -అం- చూ. ఆరో. 1; -పొన్ను బంగారు; పోల్చిచూ. బంగారమ్మ, త. పొన్నెమ్మ. పొన్నయ్య -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"పొన్నమ్మ అనే భాగ్యశాలి" పేర ఈ గ్రామం వెలసినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1118-53)

2282. పొన్నతోట కమ్మ. 82.
[పొన్నతోట మెకం. 1169-33; 1180-150; 1204-65].
సంబ. నామబం; వృక్షసూచి.

పొన్న- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2281; -తోట చూ. గ్రామనా. ద్వి.

2283. పొన్నవోలు సిద్ధ. 33.
సంబ. నామబం; వృక్షసూచి.

పొన్న- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2281; -వోలు చూ. గ్రామనా. ద్వి.

2284. పొన్నావల్లె సిద్ధ. 59.
[పొన్నావల్లె మెకం. 1126-146].
సంబ. నామబం; వృక్షసూచి.

పొన్నా- ∞ పొన్న గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2281; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2285. పొన్నావారిపల్లె సిద్ధ. 66+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పొన్నావారి- గ్రామనా. ప్ర; నామబం; పొన్నా- కు.నా. -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2286. పొన్నేరువాండ్లపల్లె రాయ. 62+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పొన్నేరువాండ్ల- గ్రామనా. ప్ర; నామబం; పొన్నేరు. కు. నా. సంబ. నామబం; గ్రామనామసూచి. పొన్న- చూ. ఆరో. 2281; -ఏరు చూ. ఆరో. 392. -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2287. పొలతులయ్యపల్లె కడ. 6+.

[పొత్తులయ్యపల్లె మెకం. 1240-61]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పొలతులయ్య- [పొత్తులయ్య-] గ్రామనా. ప్ర; నామబం; పు.నా. దేవతాసూచి. (పొలతులు+అయ్య) పొలతులు స్త్రీలు, అక్క- దేవతలు. ఏక. పొలతి ∞ పొలంతి, పొలంతుక. పోల్చి చూ. తె. పొలుచు, పొలుపు. త. పొలి, పొలివు; పొలం; క. పొల్, (DED. 3717 cf. 3531 and 3732) -అయ్య- చూ. ఆరో. 4; -పల్లె. చూ. గ్రామనా. ద్వి.

2288. పొలిమేరపల్లె రాయ. 55+.

స్థలా. నామబం; దిక్సూచి.

పొలిమేర- గ్రామనా. ప్ర; ఎల్ల ఊరి సరిహద్దు; పల్లె చూ. గ్రామనా. ద్వి.

2289. పొలిమేరపల్లె రాయ. 67+.
చూ. ఆరో. 2288.

2290. పొలిమేరపల్లె రాయ. 76+ ..

2291. పొలిమేరపల్లె రాయ. 77+. ..

2292. పొలిమేరపల్లె రాయ.105+. ..

2293. పొల్లాలవాండ్లపల్లె రాయ. 80+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పొల్లాలవాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. పొల్లాల- కు.నా; అస్పష్టనామబం. ? <పొల్ల + అల. పోల్చి చూ. వెల్లాల; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2294. పోచంపల్లె రాయ. 106+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.
(దేవతాసూచి)

పోచం- గ్రామనా. ప్ర. నామబం. స్త్రీనా. (పోచు+అం) పోచు- ? < ప్రోచు రక్షించు (TVB. 902); -అం- చూ. ఆరో. 1; పోచెమ్మ ఒక గ్రామదేవత. పల్లె -చూ. గ్రామనా. ద్వి.

2295. పోచంరెడ్డిపల్లె కమ. 43+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పోచంరెడ్డి- గ్రామనా. ప్ర; పు. నా; నామబం; పోచం- చూ. ఆరో. 2294; -రెడ్డి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2296. పోట్లదుర్తి కమ. 8.

[పొట్ల[దు]తిజ 1525 SII. XVI. 77 105, 106. పోట్లదుతిజ మెకం. 1110-22; పోట్లదురితి మెకం. 1229-113; పోట్లదుర్తి మెకం. 1119-247.

పొట్లదురితి మెకం. 1229-117; పొట్ల దుర్తి మెకం. 1111-153, 1229-108; పోట్లదుర్తి మెకం, 1119-244.]

సంబ. నామబం; వృత్తిసూచి. సంఘటన నామ సూచి.

పోట్ల- <పొట్లకాయ తోటల్లోను, పెరళ్ల లోను పెంచే కాయగూరలమొక్క (Snake-gourd); Tricho santhus anguinu, Linn, -దుర్తి [దుతిఞ, -దురితి -దుర్తి, -గుర్తి] చూ. గ్రామనా. ద్వి.

లోకనిరుక్తి: (1) "సాసమహారాజు (?) కుందేళ్ళపయిన కునకాన్ని విడువగా కుందేళ్లు కుక్కపై తిరగబడి" నాయట. ఆ స్థలం శౌర్యం కలిగినదని గ్రామం కట్టించగా, పోట్లదుర్తి అనే పేరు పొందిందని స్థానికచరిత్ర (మెకం.1229-108) (2) ముస్లిములతో వెలమలు పోట్లాడి ఆ స్థలాన్ని స్వాధీనం[1] చేసుకొన్నందున ఆ స్థలానికి పోట్లదుర్తి అనే పేరు కలిగిందట. (F.F. 1961, 33).

"The Village" is situated near the confluence of the Penneru and Kalamalla Vanka" (APDGC ,790)

2297. పోతిరెడ్డిపల్లె ప్రొద్దు. 81+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పోతిరెడ్డి- గ్రామనా ప్ర; నామబం; పు.నా. పోతి- (<పోతు+ఇ) పోతు. పెద్ద మగపశువు; దున్నపోతు, మేకపోతు. మొ. పోల్చి చూ. తె. పోతరము, పోనగము. త. పోత్తు, పోతళం. మ. పోత్తు, క. పోత, హోత,హోతు, (DED. 3747) పోల్చిచూ. పోతన, పోతయ్య- -రెడ్డి చూ. ఆరో. పల్లె చూ. గ్రామనా. ద్వి.

2298. పోతులవారిపల్లె రాజం. 119.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పోతులవారి- గ్రామనా. ప్ర; నామబం; పోతుల- కు.నా; బహు; జంతుసూచి (పోతులు +అ) ఏక. పోతు చూ. ఆరో. 2297; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2299. పోతులవారిపల్లె సిద్ధ. 66+.

చూ. ఆరో. 2298.

2300. పోతువాండ్లపల్లె రాయ 96+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పోతువాండ్ల- గ్రామనా. ప్ర; నామబం; పోతు. కు. నా. చూ. ఆరో. 2298; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2301. పోతువారిపల్లె రాయ. 59+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పోతువారి- గ్రామనా. ప్ర; నామబం; పోతు-చూ. ఆరో.2300; -వారి- చూ. ఆరో.8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2302. పోరుమామిళ్ళ బద్వే. 82.

[పోరుమామిళ్ళ 1369 E I. XIV-4-108-52; పోరుమామిళ 1525 SII XVI, 79-29; పోమాన్‌మిళ్ళ 1628 T T. D: I. VI-1. 25-12. నామా. గోపీనాథ పట్టణం 1555 AR 41-42 B. 36.]

అస్పష్టనామబంధం.

1 <పోరిమామిళ్ళ పోరు- 1 పోరి- 8, 9 శతాబ్దాల్లో రాయలసీమ దక్షిణ ప్రాంతాల నేలిన రాజవంశస్థుల బిరుదు. చూ. కూచ పోతి-; వసంతపోతి మహాదేవుల (పా.9 శా.)

-మామిళ్ళ చూ. గ్రామనా. ద్వి. పోరు యుద్ధం +మామిడి అవి MAMP. 108.

లోకనిరుక్తి: (1) భీమ బకాసురుల పోరు నలిపిన మామిళ్ల కాబట్టి పోరుమామిళ్ళ అట।

(2) Once the Place was ruled by some Poligars, but Vijayanagara Kings defeated them and seized the fort, since that time many a battle was fought hence the name .. (F,F,1961, 91).

**2303. పోలి** రాజం. 41.

[పోృలి 1279 S.I I. X. 448-34; పోృలినాడు 1433 AR 1907 B 606; పోలి మెకం. 1223 7-15; పోలి మెకం. 1134-167].

అసమస్తం. జనపదసూచి.

పోలి- [పోృలి-పాలి] పట్టణం. సపవాం శాలు -వేలు; -వోలు చూ. గ్రామనా. ద్వి. వివ రాలకు చూ. DED. 3721. 3723.

లోకనిరుక్తి: "కొండూరిలో వున్న కాటమరెడ్డి వద్దవున్న బోనకత్తె పోలి.... పోలి అనే బోనకత్తెను పిలిచి నీకు యేమి కావలెను? అని అడుగగా నాకు ద్రవ్యాపేక్ష లేదు. నాపేరు పెట్టి వూరు కట్టించి చెరువును తవ్వించమని చెప్పినందున ఆ పర్వతమునకు వుత్తరం అర పరవున పోతుకొండ శిద్దేశ్వరుని కొండకు పశ్చిమం అక్కడి విష్ణుదేవాలయములు వుండ గాను అష్టదిగ్బంధనగా దేవతల ప్రతిష్ఠ చేసి పోలి అనే బోనకత్తె పేరు పెట్టి పోలి అనే గ్రామం కట్టించి దేవతల ప్రతిష్ఠ చేయించిన వివరము. (మెకం. 1223-8.)

**2304. పోలిరెడ్డిపేట** సిద్ధ. 19+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పోలిరెడ్డి- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. పోలి- చూ. అరో. 2303; -రెడ్డి- చూ. అరో. 6. -పేట చూ.గ్రామనా.ద్వి.

**2305. పోలివాండ్లపల్లె** రాజం. 127+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పోలివాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. పోలి- కు.నా; గ్రామనామసూచి. చూ. అరో. 2303; -వాండ్ల- చూ. అరో.2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2306. పోలిపెట్టిపల్లె** రాయ. 10+.

[పోలిశెట్టిపల్లె మెకం. 1210-112]

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పోలిపెట్టి- [పోలిశెట్టి-] గ్రామనా. ప్ర; నామబం; పు నా. పోలి- చూ. అరో. 2304; -పెట్టి- [-శెట్టి] చూ. అరో. 751; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2307. పోలుగారిపల్లె** కద. 76+.

సంబ; నామబం; వ్యక్తినామసూచి.

పోలుగారి- గ్రామనా. ప్ర. నామబం. పోలు- పు.నా. చూ. అరో. 2303; -గారి- చూ. అరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2308. పోలుగారిపల్లె** బద్వే. 118+.

చూ. అరో. 2307.

**2309. పోలుబుచ్చయ్యగారిపల్లె** సిద్ధ. 53+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పోలుబుచ్చయ్యగారి- గ్రామనా. ప్ర; నామబం. పోలుబుచ్చయ్య- నామబం; బుచ్చి- చిన్న. పు.నా. పోలు- కు.నా. చూ.అరో.2303;

-బుచ్చయ్య (బుచ్చి + అయ్య) బుచ్చి- ల బుజ్జి చిన్న; -అయ్య చూ. ఆరో. 4; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2310. పోలువాండ్లపల్లె రాయ. 66+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

పోలువాండ్ల గ్రామ నా. ప్ర; నామబం. పోలు- కు.నా. చూ. ఆరో. 2309; -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ; గ్రామనా. ద్వి.

2311. పోలువాండ్లపల్లె రాయ. 74+.
చూ. ఆరో. 2310.

2312. పోలువాండ్లపల్లె
రాయ. 77+. ..

2313. పోలూరుగంగన్నగారిపల్లె
రాజం. 92+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పోలూరుగంగన్నగారి- గ్రామనా. ప్ర. నామబం. పోలూరుగంగన్న- నామబం; పు.నా. పోలూరు- కు.నా; కమ్మవాళ్లల్లో ఇంటి పేరు. -గంగన్న చూ. ఆరో. 1004; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2314. పోలేపల్లె పులి. 20.

[పోలేపల్లె 1482 AR 32.33 B 356].

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

పోలే- గ్రామనా. ప్ర; నామబం; పు.నా. (పోలు+ఏ) పోలు- చూ. ఆరో. -ఏ చూ. ఆరో. -పల్లె గ్రామనా. ద్వి.

2315. పోల్లోపల్లె రాజం. 26+.

స్థలా. నామబం; స్థలాసూచి.

పోల్లో- గ్రామనా. ప్ర; నామబం. (పోలి+లో) పోలి- చూ. ఆరో; 2303; -లో చూ. ఆరో. 551; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2316. ప్రభలవీడు ఐద్వే. 115.

నామా. పాతప్రభలవీడు [ప్రభువుల వీడు 1537 AR 41-42 B 41; ప్రభువుల వీటి మెకం. 1170-10; ప్రభువుల విడు మెకం. 1170-5-10; ప్రభువు వీడు మెకం. 1170-1; ప్రభువు విడు మెకం. 1170 - 4; ప్రభుల విడు మెకం. 1170-5; పాత ప్రభుల విడు మెకం. 1170-15]

సంబ. నామబం; సామాన్య నామసూచి.

ప్రభల- [ప్రభువుల-; ప్రభువు- ప్రభుల-] గ్రామనా. ప్ర; (< ప్రభువుల < ప్రభుల < ప్రభల) ఏక. ప్రభువు [< సం. ప్రభుః]; -వీడు [-విడు -వీడు] చూ. గ్రామనా. ద్వి.

2317. ప్రొద్దుటూరు ప్రొద్దు. 47.

[రామేశ్వరం పొదుటూరను 1490 SII. XVI 39-8; రామేశ్వరం ప్రొద టూరు 1533 Ibid. 105-15; రామేశ్వరం పొదుటూరి 1542 SII; XVI. 127-14, పొదటూరి- 1425 - 1503 శ్రం. సం. 13-537. పొద్దుటూరు మెకం. 1111-1-2; ప్రొద్ద టూరు మెకం. 1111-22]; నామా. పొదలపల్లె (మెకం. 1111-1), నామా. బంగారు పొద్దుటూరు.

పరిజాతపురి. సంబ. నామబం; సామాన్యనామసూచి.

ప్రొద్దు- (పొద-, ప్రొద పొద్ద-) గ్రామనా. ప్ర;

: పొదరు; -ఊరు చూ. గ్రా మ నా. ద్వి. ఉగాగమం. ప్రొద్దు సూర్యుడు + ఊరు అవి. MAMP. 721.

లోకవిరుక్తి: రామిరెడ్డి, రంగారెడ్డి అను పాకనాటి కాపులు స్వదేశంలో క్షామం సంభవించడంవల్ల అక్కడినుండి వలసవచ్చి పొదలపల్లె చేరారట. పొదలపల్లెలో ఉదయకాలంలో శంఖుస్థాపన చేసి గృహాలు కట్టుకొన్నారట. ఉదయకాలము గ్రామానికి శంఖుస్థాపనచేసి కట్టినందువల్ల ఆ పొదలపల్లె ప్రొద్దుటూరు అయిందట. (మెకం. 1111-1-2).

"According to local tradition, Proddatur is named as such because Sri Rama fashioned the 'Sivalingam' at the suburban village of Rameswaram and installed it at sunrise-Proddu means the sun in Telugu (APDGC. 791).

2318. బంకచిన్నాయపల్లె ప్రొద్దు. 55+,
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

బంకచిన్నాయ- గ్రామనా. ప్ర; నామబం. పు.నా; బంక- కు. నా; జిగురు, పిపినిగొట్టుతనము. పోల్చిచూ. క. బంకె, బొంక, బొంకె, కొలా. బంక, నాయి. బక్కా, పర్జి. బాక్, బాకర్ : 3166 త. వస్తై. (DED. 4159) మొటాటి కాపుల్లో ఇంటి పేరు, (CTSI. VI) -చిన్నాయ- పు.నా. చూ. ఆరో. 1333. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2319. బండకాడపల్లె రాయ. 9+.
స్థలా. నామబం: స్థలాసూచి.

బండకాడ- గ్రామనా. ప్ర. నామబం; బండ- చూ. ఆరో. 2058; -కాడ- చూ. ఆరో. 417; -పల్లె చూ. గ్రామనా. ద్వి.



2320. బండకాడపల్లె రాయ. 80+.
చూ. ఆరో. 2319.

2321. బండకాడపల్లె రాయ.67 +. ,,

2322. బండకాడరాజువారిపల్లె
రాయ. 109+.
స్థలా. నామబం; స్థలాసూచి.

బండకాడ- గ్రా మ నా. ప్ర; చూ. ఆరో. 2319; -రాజువారిపల్లె గ్రామనా. ద్వి. చూ. ఆరో. 2908.

2323. బండకిందపల్లె రాయ.27+.
స్థలా. నామబం; స్థలాసూచి.

బండకింద- గ్రామనా. ప్ర; నామబం; బండ- చూ. ఆరో. 2058; -కింద- చూ. ఆరో. 547; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2324. బండమీదపల్లె రాయ. 32+.
స్థలా. నామబం; స్థలాసూచి.

బండమీద- గ్రామనా. ప్ర; నామబం; బండ- చూ. ఆరో. 2058; -మీద- చూ. ఆరో. 1034; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2325. బండిమామవారిపల్లె రాయ. 28+.
సంబ; నామబం; కుటుంబనామసూచి.

బండిమామపల్లె- గ్రామనా.ప్ర;నామబం; కు.నా; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2326. బండివాండ్లపల్లె రాయ. 101+.
సంబ. నామబం. కుటుంబనామసూచి.

బండివాండ్ల- గ్రామనా: ప్ర; నామబం. బండి- కు.నా; వస్తుసూచి, ప్ర యా ణా ది వాహనం. పోల్చిచూ. త. వణ్డి; బణ్డి; వణ్డిల్ మ. వంటి, వంటిల్. క. బండి,

కోలా. బండి / సం. భండి- ప్రా. భండీ, భండి అ. మరా. బాడి (DED. 3219) కాపు, కవరై, కొరవ, కుంబర, కుర్నీ, కురబ, మాల, ఒడ్డె, స్థానిక, యానాది కులాల్లో ఒక ఇంటి పేరు; కొరవలకు పర్యాయనామం. పోల్చిచూ. త. వణ్డిక్కారన్ కట్టెల బండ్లు లాగేవాళ్లు CTSI-I) -వాండ్ల-బహు.''బండ్ల'' కూడా ఇంటి పేరుగా కనిపిస్తోంది. చూ. ఆరో. 2329 -వాండ్ల- చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2327. బండివాండ్లపల్లె రాయ. 110+.
చూ. ఆరో. 2326.

2328. బండ్లపల్లె రాయ. 71+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
బండ్ల- గ్రామనా. ప్ర; బహు. (బండ్లు + అ) చూ. ఆరో. 2326; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2329. బండ్లవారిపల్లె రాజం. 92+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
బండ్లవారి- గ్రామనా. ప్ర; నామబం; బండ్ల దేవాంగుల్లో ఇంటి పేరు. బండ్ల- చూ. ఆరో. 2328; -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2330. బందారుపల్లె పిద్ద 58+.
సంబ. నామబం. వృక్షసూచి.
బందారు- గ్రామనా. ప్ర; పబంజేరు, బందేరి, బందెడి ఒక కంచెమొక్క; Adina cordifolia, HK., Nauclea Cordifolia, Willd., -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2331. బక్కన్నగారిపల్లె పులి. 29+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
బక్కన్నగారి- గ్రామనా. ప్ర; నామబం. బక్కన- నామబం; పు.నా; పరిమాణసూచి. బక్క- వి. సన్నటి. -అన- చూ. ఆరో. 3; -గారి- చూ.ఆరో.6; -పల్లె చూ.గ్రామనా.ద్వి.

2332. బక్కాయపల్లె కడ. 1+.
[బక్కయపల్లె మెకం. 1240-70]
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
బక్కాయ- [బక్కయ-] గ్రామనా. ప్ర; నామబం; పు.నా; పరిమాణసూచి. బక్క- చూ. ఆరో. 2331; -అయ- చూ. ఆరో. 4; -పల్లె చూ. గ్రామనా. ద్వి.
''మునపత్తి బక్కయ్య అనేవాడు'' కట్టించి నట్లు స్థానిక చరిత్ర (మెకం. 1240-70) పోల్చిచూ. ఆరో. చిన్నబక్కాయపల్లె.

2333. బక్కిరెడ్డిపల్లె కడ 29+
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
బక్కిరెడ్డి- గ్రామనా.ప్ర. నామబం; పు.నా; పరిమాణసూచి, బక్కి- (<బక్క+ఇ) బక్క- చూ. ఆరో. 2331; -ఇ-చూ.ఆరో. 25. -రెడ్డి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2334. బచ్చయ్యగారిపల్లె పులి. 24.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
బచ్చయ్యగారి- గ్రామనా. ప్ర. నామబం. బచ్చయ్య- నామబం; పు. నా. ; కులసూచి. బచ్చు- వ్యక్తినా. ప్ర; వ్యాపారి, షరాబు; సెట్టి. కోమట్లలో దేవాంగుల్లో ఇంటిపేరుకూడా.వం. వైశ్యశబ్దభవమని సూ.ని. పరిణామంలో మధ్య రూపాలులేవు. -అయ్య- చూ.ఆరో. 4; -గారి- చూ.ఆరో.6; -పల్లె చూ.గ్రామనా.ద్వి.భచ్చయ్య గారిపల్లె అనే కృతక ప్రామాణిక రూపం రెవెన్యూ రికార్డుల్లో ఉంది.

2335. బచ్చుపల్లె కడ. 60+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

బచ్చు- గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2334; పల్లె- చూ. గ్రామనా. ద్వి.

2336. బట్లఒంటిపల్లె రాయ. 5 +.

సంబ. నామబం; కులసూచి.

బట్ల - గ్రామనా. ప్ర; బహు. (బట్లు+అ) ఏక. బట్టు. [<సం. భట్టః] -ఒంటిపల్లె గ్రామనా. ద్వి. -ఒంటి- చూ. ఆరో. 410; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2337. బడుగువారిపల్లె జమ్మ. 129+.

[బడుగువారిపల్లె మెకం. 1119-256]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

బడుగువారి- గ్రామనా. ప్ర. నామబం; బడుగు- కు.నా. సన్నటి మనిషి. పోల్చి చూ. త. వటి. మ. వటు. క. బడ, బడవు, బడవ; బడహ (DED. 4270) -వారి- చూ. ఆరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"బడుగు బచ్చెన అనే గొల్ల" పేర ఈ ఊరిపేరు వెలసినట్లు స్థానిక చరిత్ర. (మెకం. 1119-256.)

2338. బత్తివిగారిపల్లె రాయ. 21+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

బత్తివిగారి- గ్రామనా.ప్ర;నామబం;కు.నా; (బత్తుడు+ఇ) బత్తుడు గ్రామకారుడు; కమసాలె వర్ణపుపేరు, కంసలిబత్తుడు.త. బత్తర్ [<సం. భక్తః] -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2339. బత్తువివాండ్లపల్లె రాయ. 22+.

సంబ. నామబం; కుటుంబనామసూచి.

బత్తువివాండ్ల- గ్రామనా. ప్ర. నామబం. బత్తువి- చూ. ఆరో. 2338; -వాండ్ల -చూ. ఆరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2340. బత్తువివాండ్లపల్లె రాయ. 86+.

చూ. ఆరో. 2339.

2341. బత్తువివాండ్లపల్లె రాయ. 99+. ,,

2342. బద్వేలు బద్వే. 120.

[బద్దవోలు మెకం. 1170-6; బద్దెవోలు మెకం. 1170-10, బద్దవేలు మెకం. 1170-5].

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

బద్దె- [~బద్ద] గ్రామనా. ప్ర; వ్యక్తినా. (? సం. భద్ర-) -వేలు [-వోలు] చూ. గ్రామనా. ద్వి.

భద్రిపల్లె అనే గ్రామాన్కి బద్దెవోలు అనే నామము కలిగినట్లు స్థానిక చరిత్ర (మెకం. 1170-10)

"According to the Kaifiyat of Badvel, a village known as Bhadripalli in ancient days, was founded by a Muttarasi called Jagam. The Matli Chief, Tiruvengalanatha, during his hunting expedition was attracted by the place. He therefore excavated a tank and founded a fortified village and also named it Baddevolu (Badde SK., Bhadra+volu prolu) on the representation of the Muttarasas of Bhadripalle to continue the name of their old village" (APDGC. 729). బద్వేలు (పెద్దప్రోలు) చూ. శేషాద్రిశర్మ, 1930, 66-67.

**2343. బవగావిగుంపులు** పిద్ద. 54+.
అస్పష్టనామబంధం.
**బవగావి-** గ్రామనా. ప్ర; < ? క. బెనకవ < సం. వినాయక- పోల్చి చూ. బంగనపల్లె కర్నూలు జిల్లా (MAMP. 110); **-గుంపులు** చూ. గ్రామనా. ద్వి.

**2344. బయక్కగారిపల్లె** పిద్ద. 25+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
**బయక్కగారి-** గ్రామనా. ప్ర; నామబం. బయక్క- నామబం; స్త్రీనా. (బయ+అక్క); -గారి- చూ. ఆరో. 6. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2345. బయటిపాలెం** రాజం. 53+.
స్థలా. నామబం; స్థలాసూచి.
**బయటి-** బయిటి బయలునున్న. చూ. (DED.) 3429 & 4298. -పాలెం చూ. గ్రామనా. ద్వి.

**2346. బయనపల్లె** కడ. 20.
[బయన్నపల్లె మెకం. 1240-79].
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
**బయన-** [బయ్య(న్న)] పు. నా; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2347. బయనపల్లె** కడ. 76+.
చూ. ఆరో. 2346.

**2348. బయనపల్లె** కమ. 56+.
[బయ్యనపల్లె మెకం. 1225-128.]
చూ. ఆరో. 2346.

**2349. బయనపల్లె** రాజం. 137+.
చూ. ఆరో. 2346.

**2350. బయనపల్లె** పిద్ద. 60+.
చూ. ఆరో. 2346.

**2351. బయనపల్లె** బద్వే. 128. ..

**2352. బయనపల్లె** ప్రొద్దు. 6+. ..

**2353. బయనపల్లె** ప్రొద్దు. 72+. ..

**2354. బయమ్మగారిపల్లె** రాయ. 9+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
**బయమ్మగారి-** గ్రామనా. ప్ర; నామబం. బయమ్మ- నామబం; స్త్రీనా; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2355. బయారెడ్డిగారిపల్లె** రాయ. 15+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
**బయారెడ్డిగారి-** గ్రామనా. ప్ర: నామబం. బయారెడ్డి- నామబం; పు. నా; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ; గ్రామనా. ద్వి.

**2356. బయారెడ్డిగారిపల్లె** రాయ. 20+.
చూ. ఆరో. 2355.

**2357. బయారెడ్డిగారిపల్లె**
రాయ. 40+.

**2358. బరాంఖాన్‌పల్లె** కడ. 74+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
**బరాంఖాన్.** గ్రామనా. ప్ర. నామబం. వ్యక్తినా; ప్ర; -ఖాన్- చూ. ఆరో. 152; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2359. బలపనగూడూరు** జమ్మ. 100
[బలపనగూడూరు మెకం. 1180-165; 1204-133; బల్పవ గూడూరు మెకం. 1204-114]

సంబ. నామబం; వ్యక్తినామసూచి;

బలపన- గ్రామనా. ప్ర; నామబం; ?
(< బలప+అన ~ బలపు+అన < బలము + అన్న): -గూడూరు గ్రామనా. ద్వి. చూ. ఆరో. గూడూరు; పోల్చి చూ. అంకాలమ్మగూడూరు; గాదెగూడూరు.

2360. బలపనూరు పులి. 87.

[బలపనూరు 1531 APGRE 1965 B 41; మెకం. 1119-12]. నామా. బసవదీక్షితులు అగ్రహారం.

? పంబ. నామబం; వ్యక్తినామసూచి.

బలపన- గ్రామనా. ప్ర; చూ. ఆరో.2359 -ఊరు చూ. గ్రామనా. ద్వి. నామా. వాడుకలో లేదు.

2361. బలిజపల్లె కడ. 67+.

సంబ. నామబం; కులసూచి.

బలిజ- ~ బలిజె గ్రామనా. ప్ర; కులనా. ఒక కులం; బలిజ నాయుళ్లు. "The name Balija is said to be derived from the Sanskrit Bali (a sacrifice) and Ja (born) signifying that the Balijas owe their origin to the performance of Yagam (CTSI, I). ఈ వ్యుత్పత్తి లోకనిరుక్తి; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2362. బలిజపల్లె రాయ. 21+.

చూ. ఆరో. 2361.

2363. బలిజపల్లె రాయ. 26+. ,,

2364. బలిజపల్లె రాయ. 56+. ,,

2365. బలిజపల్లె రాయ. 57+. ,,

2366. బలిజపల్లె రాయ. 77+. ,,

2367. బలిజపల్లె రాయ. 100+.

చూ. ఆరో. 2361.

2368. బలిజపల్లె రాయ. 104+. ,,

2369. బలిజపల్లె రాయ. 106+. ,,

2370. బలిజపల్లె రాయ. 115+. ,,

2371. బలిజపల్లె రాజం. 43+. ,,

2372. బలిజపల్లె రాజం. 80+. ,,

2373. బలిజపల్లె రాజం. 92+. ,,

2374. బలిజపల్లె రాజం. 128+. ,,

2375. బలిజపల్లె సిద్ధ. 54+. ,,

2376. బలిజపల్లె బద్వే. 85+. ,,

2377. బలిజపల్లె పులి. 45+. ,,

2378. బసవపల్లె బద్వే. 35+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

బసవ- గ్రామనా. ప్ర. నామబం; దేవతా (బస+అన) బస- వ్యక్తినా. ప్ర. ~ బసవ- [<సం. వృషభః] శివుని వాహనం నంది; లింగాయత శాఖాధ్యక్షుడు బసవేశ్వరుడు; బసవ- లింగాయతులలో, మరాఠా వాళ్ళల్లో వ్యక్తినామం (MAMP. 74) -అన- చూ. ఆరో. 3; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2379. బసవాపురం బద్వే. 43+.

సంబ. నామబం; వ్యక్తినామసూచి.

బసవా- గ్రామనా. ప్ర; ~ బసవ చూ. ఆరో. 2378; -పురం చూ. గ్రామనా. ద్వి.

**2380.** బసవాపురం బస్వే. 51+.
చూ. ఆరో. 2379.

**2381.** బసవాపురం ప్రొద్దు. 9+. ,,

**2382.** బసినాయుడుపల్లె రాజ. 9!+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

బసినాయుడు- గ్రామనా. ప్ర; నామబం; పు.నా; దేవతాసూచి. బసి- (<బస+ఇ) బసవ చూ.ఆరో. 2378; -నాయుడు చూ.ఆరో. 101; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2383.** బసిరెడ్డిగారిపల్లె రాయ. 71+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

బసిరెడ్డిగారి- గ్రామనా. ప్ర; నామబం. బసిరెడ్డి- నామబం; పు.నా; దేవతాసూచి. బసి రెడ్డి రెడ్లల్లో ఇంటిపేరుకూడా. బసి- చూ. ఆరో. 2382; -రెడ్డి- చూ. ఆరో. 6; -గారి- చూ. ఆరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2384.** బసిరెడ్డిపల్లె కమ. 41+.
[బసిరెడ్డిపల్లె మెకం. 1119-118]
సంబ. నామబం; కుటుంబనామసూచి.

బసిరెడ్డి- చూ. ఆరో. 2383; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

"బసిరెడ్డి చెన్ను అనేవాడు" మెకంజీ కైఫీయతుల రచనాకాలంనాటికి పూర్వం 600 సంవత్సరాల కిందట ఈ గ్రామాన్ని కట్టించి నట్లు స్థానిక చరిత్ర (మెకం. 1119-118)

**2385.** బసిరెడ్డిపల్లె పులి. 20+.
చూ. ఆరో. 2384.

**2386.** బసిరెడ్డిపల్లె ప్రొద్దు. 66+. ,,

**2387.** బహిరాజుపల్లె రాజం. 66.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

బహిరాజు- గ్రామనా. ప్ర; నామబం; పు.నా; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

**2388.** బాకరాపురం కడ. 14+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.

బాకరా- గ్రామనా. ప్ర; పు.నా; హిం. బాకిర్ విద్వాంసుడు <హిం. బాకిర్<అర. బఖర -పురం చూ. గ్రామనా. ద్వి.

బాకరాపు:మనే కృతప్రామాణిక రూపం రెవెన్యూ రికార్డుల్లో సర్వత్రా కన్పిస్తుంది: మెకంజీలో కూడా చూడవచ్చు. చూ. ఆరో. 2391.

**2389.** బాకరాపురం ప్రొద్దు. 18+.
చూ. ఆరో. 2388.

**2390.** బాకరాపురం పులి. 18. ,,

**2391.** బాకరాపురం రాజం. 112.
[బాకరాపురం మెకం. 1223 - 174]
చూ. ఆరో. 2388.

**2392.** బాకరాపేట కడ. 85+.
[భాకరాపేట మెకం. 1210-44]
సం. నామబం; వ్యక్తినామసూచి.

బాకరా- [కృ. ప్రా. భాకరా-] గ్రామనా. ప్ర; చూ. ఆరో. 2388; -పేట చూ. గ్రామనా. ద్వి.

"భాకరా పంతులు (?)" కట్టించినట్లు, స్థానిక చరిత్ర (మెకం. 1210-44) It derives its name from Bhakara Pantulu, a subordinate of the Sultan of Golkonda, known for his acts of charity and piety (APDGC, 731).

2393. బాకరాపేట సిద్ధ. 44+.
చూ. అరో. 2392.

2394. బాకరాపేట జమ్మ. 70+. ,,

2395. బాకరాపేట బద్వే. 48+. ,,

2396. బాకరాపేట బద్వే. 135+. ,,

2397. బాగాదిపల్లె బద్వే. 51+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
బాగాది- గ్రామనా. ప్ర; కు.నా. వ్యుత్పత్తి అస్పష్టము. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2398. బాటకిందపల్లె రాయ. 27+.
స్థలా. నామబం; స్థలాసూచి.
బాటకింద- గ్రామనా. ప్ర; నామబం; బాట- దారి, బండిబాట పోల్చిచూ. త. వాట్టం; వాశై; మ. వాట; వాటం; వాటి. క. బాటె / సం. వాటః. ప్రా. వాడ- వాడగ-, వాడీ (DBIA. 326); -కింద- చూ. అరో. 547; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2399. బాటలోపల్లె రాయ. 13+.
స్థలా. నామబం; స్థలాసూచి.
బాటలో- గ్రామనా. ప్ర; బాట- చూ. అరో. 2398; -లో- స్థలార్థకం. -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2400. బాటవాండ్లపల్లె రాయ. 26+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
బాటవాండ్ల- గ్రామనా. ప్ర; నామబం. బాట- కు.నా. చూ. అరో. 2398; -వాండ్ల- చూ. అరో. 2; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2401. బాటవారిపల్లె రాయ. 59+.
సంబ. నామబం; కుటుంబనామసూచి.
బాటవారి- గ్రామనా. ప్ర; నామబం. బాట- చూ. అరో. 2400; -వారి- చూ. అరో. 8; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2402. బాటవారిపల్లె రాయ. 95+.
చూ. అరో. 2401.

2403. బాపనపల్లె సిద్ధ. 47+.
సంబ. నామబం. కులనామసూచి.
బాపన- గ్రామనా. ప్ర; నామం; కులసూచి. [<సం. బ్రాహ్మణః]; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2404. బాపరాజుగారిపల్లె రాయ. 105+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
బాపరాజుగారి- గ్రామనా. ప్ర; నామబం. బాపరాజు- నామబం; పు.నా. బాప- ∽ బాపన చూ. అరో. 2403; -రాజు- చూ; అరో. 49; -గారి- చూ. అరో 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2405. బాలక్కగారిపల్లె రాయ. 81+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
బాలక్కగారి- . గ్రామనా. ప్ర; నామబం. బాలక్క- నామబం; స్త్రీనా. బాల- చిన్నపిల్ల బాలిక, దేవి మొ. [<సం. బాలా]; -అక్క- చూ. అరో. 11; -గారి- చూ. అరో. 6; -పల్లె చూ. గ్రామనా. ద్వి.

2406. బాలతిమ్మయ్యగారిపల్లె
రాయ. 13+.
సంబ. నామబం; వ్యక్తినామసూచి.
బాలతిమ్మయ్యగారి- గ్రామనా. ప్ర; నామబం. బాలతిమ్మయ్య- నామబం; పు. నా; వయోసూచి. బాల- వ్యక్తినా. పూ; చూ. అరో. 2405; తిమ్మయ్య చూ అరో. 1581; ఒక

